# శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రము

సంస్కృత మూలము :

శ్రీ సత్యసంధ తీర్థస్వామి

( ఉత్తరాది మఠము )

ఆంధ్రానువాదము :

జి. వి. యస్. సుబ్రహ్మణ్య శర్మ, ఎం. ఏ.

సంస్కృతశాఖాధ్యక్షుడు

మిసెస్. ఏ. వి. యన్. కళాశాల, విశాఖపట్టణము – 530 001.

శ్రీ శ్రీకృష్ణ ప్రచురణలు

శ్రీకృష్ణ నగర్, విశాఖపట్టణము – 530 002.

ప్రతులు : వేయి

సర్వహక్కులు ఆంధ్రానువాధకునివి.

Acc no 120

ప్రథమ ముద్రణము :

క్రోధన. వైశాఖ శుద్ధ తదియ — 23-4-85

294.592
SAT

ప్రాప్తిస్థానము :

శ్రీమతి జి. కస్తూరి ప్రసాద్
శ్రీ శ్రీకృష్ణ ప్రచురణలు
14-37-41. శ్రీకృష్ణ భవనము
శ్రీకృష్ణనగర్, విశాఖపట్టణము-530 002.

వెల : [redacted]
మేలు ప్రతి రూ. 50-00

ముద్రణ :

ఎక్వేరియన్ ప్రింటింగ్ స్కూల్, విశాఖపట్టణము - 530 016.



ఈ గ్రంథ ప్రచురణమునకు తిరుమల - తిరుపతి దేవస్థానము
వారు 5,000 రూపాయలు, ద్రవ్యసహాయము చేసిరి. వారికి
మా కృ త జ్ఞ త లు.



ఈ గ్రంథ ప్రచురణమునకు తిరుమల - తిరుపతి దేవస్థానము వారు 5,000 రూపాయలు, ద్రవ్యసహాయము చేసిరి. వారికి మా కృతజ్ఞతలు.

# సమర్పణము



శార్ఙ్గిణే శ్రీనివాసాయ శ్రీవత్సాంకిత వక్షసే ।
శ్రీ విష్ణునామ భాష్యోఽయం సాదరేణ సమర్పితః ॥

# మనవి

"మనవి" లోని ఈ మాటలు మనవి! మనకే ఉద్దేశింప బడినవి. మనమనగా జీవులము. జీవోద్ధరణకై వాసుదేవ సేవయే కర్తవ్యమని ఎందరో మహానుభావులు ఉపదేశించినారు.

## శ్రీ విష్ణు సహస్రనామ వైశిష్ట్యము

**"హరిః పరతరః"** అని శ్రీ మధ్వాచార్యులు పేర్కొనిరి. ఆ **హరి**యొక్క నామములను జపించుతే జీవోద్ధరణకు కలియుగములో సులభమైన మార్గము. "శ్రీ రామః సతతం జపేత్" అను శ్రీసూక్త వాక్యము మనకందరకు తెలిసినదే! శ్రీ శంకర భగవత్పాదులు కూడ లోకకళ్యాణార్థమై ముముక్షు లోకమునకు "గేయం గీతా — నామ సహస్రం" అని సందేశము నిచ్చినారు. జీవోద్ధరణకై పాడదగిన గ్రంథములు 1. భగవద్గీత 2. శ్రీ విష్ణు సహస్రనామము అని ఈ వాక్యమునకర్థము. గీత భగవంతుని బోధరూపమగు తత్త్వము కాగా, శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రము భగవంతుని స్వరూపము. మరొక మాటలో చెప్పవలెనన్న గీత—"వాచ్యము"; సహస్రనామము—"వాచకము" "వాచ్య వాచకయోః అభేదః" అను న్యాయమును బట్టి గీతయును, సహస్రనామమును ఒక్కటియే అని తేలినది. భగవన్నామ కీర్తనమునకు కాలపు కట్టుబాటు లేదనియు, అది సర్వదుఃఖ ప్రణాశకమనియు, ఆ నామమునందు భగవంతుని శక్తి అంతయు నిక్షిప్తమై ఉన్నదనియు, కలియుగమున దానికి మించిన గతి మరియొకటి ఏదియు లేదనియు అభిజ్ఞోక్తి. అట్టి శక్తి సంతములైన భగవన్నామములను మాలా రూపమున సంకలించినదే శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రము.

## స్తోత్రమనగా

"నమస్కార, స్తథాశీశ్చ, సిద్ధాంతోక్తిః, పరాక్రమః, ।
విభూతిః, ప్రార్థనా, చేతి షడ్విధం స్తోత్ర లక్షణమ్॥

అని శంకరాచార్యులు నిర్వచించినారు. స్తోత్రము :-

1. దేవునకు నమస్కారమును తెలుపును.

2. ఆ దేవుడిచ్చు ఆశీర్వచనమును ప్రకటించును.

3. ఆయా మతముల యొక్క సిద్ధాంతోక్తులను (దృఢాభిప్రాయములను) నిర్ణయించును.

4. దేవుని పరాక్రమమును,

5. భగవంతుని విభూతిని వివరించును.

6. భగవంతుని ఎట్లు, ఏమని, ఎందుకు ప్రార్థింప వలెనో తెలియజేయును. ఈ ఆరు లక్షణములు కలదే స్తోత్రమని పై శ్లోకమున కర్థము.

ప్రస్తుతము మనము చదువబోవు స్తోత్రము శ్రీ మహావిష్ణువును గూర్చి వ్రాయబడినది. "విష్ణువు" అనగా—

" జ్యోతీంషి విష్ణు ర్భువనాని విష్ణు
ర్వనాని విష్ణు ర్గిరయో దిశశ్చ ।
నద్య స్సముద్రాశ్చ స ఏవ సర్వం
............................"

అని అగ్ని పురాణము, తెలుపుచున్నది. జ్యోతిస్సులన్నియును' భువనములును, వనములును, గిరులును, దిక్కులును, నదులును, సముద్రములును, మొత్తముమీద జగత్తంతయును ఆ విష్ణువే అని ఈ శ్లోకము యొక్క భావము. కనుక అన్ని పేరులును విష్ణువునే సూచించును. విష్ణువును గూర్చి పురుష సూకము— "సహ. స

శీర్షాపురుషః సహస్రాక్షః సహస్రపాత్" అని చెప్పినది. భగవద్గీతలోని విశ్వరూప సందర్శన యోగములో కూడ "అనేక వక్త్రనయనం అనేక బాహూదర వక్త్ర నేత్రమ్" అను శ్లోకము లున్నవి. అట్టి విరాట్ పురుషుని సహస్ర నామములను మాలగా గుచ్చి సమర్పించునదే ఈ విష్ణు సహస్రనామ స్తోత్రము. ఒక్కనికి ఇన్ని పేర్లెట్లు వచ్చినవి? అను ప్రశ్నకు ఈ క్రింది శ్లోకము సమాధాన మిచ్చుచున్నది.

" యాని నామాని గౌణాని విఖ్యాతాని మహాత్మనః।
ఋషిభిః పరిగీతాని తాని వక్ష్యామి భూతయే ॥"

అనంత గుణసంపన్నుడైన విష్ణువును ఆతని యందలి ఒక్కొక్క గుణమును సూచింప జేయుచు, ఒక్కొక్క నామముతో ఋషీశ్వరులు కీర్తించిరట! ఋషులు ప్రవచించిన నామములు కనుక వానికి వేద ప్రామాణ్యము, పావిత్ర్యము, మంగళములనిచ్చు శక్తి, ఆపదలను పోద్రోలు మహిమలును కలిగినవి.

## శ్లోకసంఖ్యా వైశిష్ట్యము :

విష్ణు సహస్రనామ స్తోత్రములో మొత్తము 108 శ్లోకము లున్నవి. ఒక్కొక్క శ్లోకము ఒక్కొక్క మణిపూస అయి, మొత్తము స్తోత్రము 108 పూసల జపమాల అగును. కనుక ఇది జపింపదగిన మంత్రము. మధ్వ సంప్రదాయమునకు సంబంధము లేకున్నను, భక్తులకును జిజ్ఞాసువులకును ఉపయోగించునను తలంపుతో నామననిగా ఈ సంఖ్యలకు గల సాంకేతికార్థమును ఇట వివరించుచున్నాను. 108 లోని ప్రతి అంకెకు ఒక సంకేతమున్నది. 1 = "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" అను బ్రహ్మవాచకము; 0 = "జగన్మిథ్య"ను సూచించు చున్నది.; 8 = అష్ట ప్రకృతి; బ్రహ్మ ప్రకృతితో కలిసినప్పుడు మధ్యనున్న మిథ్యా జగత్తు ఆవిర్భవించును. ప్రకృతిని, జగత్తునువదలి, బ్రహ్మను చేరవలెననిన ఈ స్తోత్రము పారాయణము చేయవలెనని భావము. 108 లోని

అంకెలను కూడినచో 1+0+8 = 9 అగును. తొమ్మిదిని ఏ అంకెతో హెచ్చించినను, భాగించినను వచ్చు సంఖ్య యొక్క అడ్డపు మొత్తము 9 యే అగును.

ఉదా:– $9 \times 2 = 18 = 1+8 = 9$

$9 \times 5 = 45 = 4+5 = 9$

కనుక 9 సంఖ్య అవ్యయ పరమాత్మకు సంకేతము. ఈ 108 శ్లోకముల పారాయణము అవ్యయ పరమాత్మను చేర్చునని సిద్ధాంతము.

## నామ సంకీర్తనము–దాని మహిమ:–

1. నామ సంకీర్తనము చేతనే కలియుగములో మానవులు జన్మ సాఫల్యము నొందగలరని విష్ణుపురాణము పేర్కొన్నది.

2. "జప్యేనైవత్ సంసిద్ధ్యేత్ । బ్రాహ్మణో నహి సంశయః"
( మనుస్మృతి–97 )

3. అందువలననే విష్ణుసహస్ర నామారంభములో ధర్మరాజు భీష్మునితో "కిం జపన్ ముచ్యతే జంతుః మృత్యు సంసార సాగరత్" అని ప్రశ్నించినపుడు – భీష్ముడు "స్తువన్నామ సహస్రేణ" అనియు,

"ఏష మే సర్వ ధర్మాణాం ధర్మోధికతమో మతః ।
యద్భక్త్యా పుండరీకాక్షం స్తవైరర్చేన్నరస్సదా ॥

అనియు, సమాధాన మిచ్చినాడు. అనగా విష్ణు సహస్రనామము లను సాధనముగాగొని, భక్తి శ్రద్ధలతో విష్ణువు నర్చింపవలెను. ఆ నామములను జపించుటే జనధర్మము అని స్పష్టపరచినాడు.

4. మహాభారతముకూడా—

"జపస్తు సర్వ ధర్మేభ్యః పరమోధర్మ............ఉచ్యతే।
అహింసయాచ భూతానాం జపయజ్ఞః ప్రవర్తతే॥" అన్నది హింసలేకుండుట వలన జపయజ్ఞమే అన్నిటికంటెను ఉత్తమమైనది

అని దీని భావము. కనుకనే గీతలో "యజ్ఞానాం జపయజ్ఞోస్మి" ( గీత – 10–25 ) అని శ్రీకృష్ణుడు ప్రకటించినాడు.

5. నామ సంకీర్తనము అను అగ్ని, పాపములు అనులోహము లను దహించి, శుద్ధి పరచునది అనియు.

6. సింహమునకు భయపడిన మృగములవలె భగవన్నామ సంకీర్తనము చేసినచో పాపము లన్నియు పారిపోవుననియు విష్ణుపురాణము ( 6–8–20, 6–8–11 ) పేర్కొనుచున్నది.

7. "హరిర్హరతి పాపాని దుష్టచిత్తైరపి స్మృతః।
అనిచ్ఛయాపి సంస్పృష్టో దహత్యేవహిపావకః॥"
( బృహన్నారదీయము 1–10–100 )

తెలియక తాకినను అగ్ని ఎట్లు కాల్చునో అట్లే తెలియక చేసినను హరిస్మరణము పాపహారి కాగలదు. వాసుదేవ కీర్తనము వలన నీటిలో ఉప్పు కరిగిపోయినట్లు పాపములు లయించును.

8. "హరేర్నామ హరేర్నామ హరేర్నామైవ కేవలమ్।
కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతిరన్యథా॥"
( బృహన్నారదీయము–1–41–15 )

అనియును ;

9. నీటిచే నిప్పును, సూర్యోదయముచే చీకటియు నశించునట్లు కలియుగములో నామ సంకీర్తనముచేత పాపరాశి నశించును–అనియును బృహన్నారదీయము పేర్కొన్నది.

10. వేయి గంగా స్నానముల చేతను, కోటి పుష్కర స్నానముల చేతను నశింపని పాపములు కూడ హరినామ స్మరణచే నశించుననియును;

11. మధుసూదన స్మరణముచే జన్మ మృత్యు జరలు అను

మొసళ్ళతో భయంకరమైన సంసార సాగరమును మానవుడు సులభముగా తరింప గలడు అనియును పెద్దలు చెప్పుదురు.

12, భారతము కూడ కృష్ణునకొక్క నమస్కారము చేసినచో అది దశాశ్వమేధయాజి కంటె అధిక ఫలమును ఇచ్చునని శాంతి పర్వము ( 47-91 ) లోను,

13. కృష్ణ సేవకునకు భయముండదని శాంతిపర్వము (47-99) లోను ప్రకటించు చున్నది.

14. భగవద్గీతలో ( 8-14 ) "నా అనన్య భక్తునకు నేను సులభుడననియు;

15. "నిరంతరము నన్నే స్మరింపు"మనియు (గీత-8-7 శ్లోకము) శ్రీకృష్ణుడు చెప్పినాడు

16. ఈ విషయమునే "భజగోవిందం భజగోవిందం" అని ఆది శంకరులు పేర్కొనినారు. భక్తి మార్గము యొక్క ప్రాశస్త్యమును పై వాక్యములు నిరూపించుచున్నవి. ఆ భక్తిని సాధించు మార్గమిది.

"సర్వోపాధి వినిర్ముక్తం తత్పరత్వేన నిర్మలమ్ ।
హృషీకేణ హృషీకేశ సేవనం భక్తిరుచ్యతే ॥
అన్యాభిలాషితా శూన్యం జ్ఞానకర్మాద్యనావృతమ్ ।
ఆనుకూల్యేన కృష్ణానుశీలనం భక్తి రుత్తమా ॥

ఇట్టి భక్తికి భగవదనుగ్రహమే ఫలము. కనుక ఈ భక్తిమార్గముననే భీష్ముడు తన జీవితమును తరింప జేసికొన్నాడు. ఈ విషయమునే "పురుషః సతతోత్థితః – భక్తిమాన్ యః సదోత్థాయ" అను పదముల ద్వారా వ్యాసుడు సూచించినాడు.

17. రామనామమును 96 కోట్ల మారులు జపించి త్యాగయ్య తరించినాడు.

18. తులసీదాసు రామమంత్రోచ్చారణతో కష్టవ్యాధులను హరింప జేసినాడు.

19. సూరదాసును, మీరాబాయియును, నారాయణ తీర్థులును కృష్ణనామ స్మరణముతో భగవదనుగ్రహ పాత్రులైనారు.

20. నిన్న మొన్నటి గాంధీజీ కూడా " రఘుపతి రాఘవ రాజారాం " అనుచు నామస్మరణము చేసి అమరుడైనాడు. అట్టి అమరత్వమును భక్తులకందించుటకై శ్రీకృష్ణుడే స్వయముగా భీష్ముని నోట ఈ విష్ణు సహస్రనామ స్తోత్రమును ధర్మరాజు ద్వారా అందించినాడు.

## సహస్రనామ అవతార ఘట్టము :

మహాభారతములోని అనుశాసనిక పర్వములో భీష్ముడు ధర్మరాజునకు చెప్పిన ఘట్టమిది. ( 149 వ అధ్యాయము ) ఈ సహస్రనామ ఘట్టమున్న అధ్యాయ సంఖ్యా విషయమున అభిప్రాయ భేదమున్నట్లు కనబడుచున్నది. కొందరు ఏకోన పంచాశదధిక ద్విశతతమోఽధ్యాయః (249) అన్నారు. కాని ఏకోన పంచాశదధిక శతతమోఽధ్యాయః(149) అన్నదే సరియైనదని నాభావన.

భీష్ముడు జన్మించినది మొదలు శరీరమును త్యజించువరకు దుఃఖమయమైన జీవితమునే గడిపెను. సంచిత కర్మమే ఆతనికిట్టి దుఃఖమును కలిగించినది. అష్టవసువులలో " ద్రోణు "డను చివరి వసువు వసిష్ఠ ధేనువు నపహరించుటచే కేవలదుఃఖానుభవమునకే దీర్ఘకాలము జీవించుటకై భీష్ముడుగా జన్మించినాడు. తదనుగుణముగనే వివాహమాడకపోవుట, వార్ధక్యమున దుష్ట దుర్యోధనుని శాసనమునకు కట్టుబడి యుండుట జరిగినవి. కనుక ఆతడనుభవించిన కష్టములే నిశ్చల భక్తిని సాధింప నతనికి వీలుకలిగించినవి. జీవితములో ప్రారంభమునుండి త్యాగపురుషుడుగ నిరూపింపడి, ఎట్టి సుఖమునకు నోచుకొనక జీవితపు చివరి ఘడియలలో కూడ అంపశయ్యపై పడి దుఃఖము ననుభవించుచున్న భీష్ముడు

పురుషుడును, మహాత్ముడును, మహాదుఃఖము ననుభవించిన వాడును, అగు భీష్మునకు శ్రీ కృష్ణుడు దర్శన మీయ గోరినాడు. కాని తనంత తానుగ పోకూడదనుకున్నాడు! అందువలన ధర్మజుని మనస్సులో "భగవత్తత్త్వము తెలిసికొనవలె"నను తలపును ప్రేరేపించినాడు. ఆ జిజ్ఞాసతో ధర్మజుడు శ్రీకృష్ణుని యడుగగా భీష్మ ధర్మజుల అభీష్టములను ఒకేసారి తీర్చదలచిన, భగవంతుడైన శ్రీకృష్ణుడు ధర్మజుని వెంటబెట్టుకొని భీష్ముని సమీపించినాడు. తన మాహాత్మ్యమును తెలియజేయు శక్తిని భీష్మునకు ప్రసాదించిన వాడును శ్రీకృష్ణుడే! తెలిసికొనవలెనను ప్రశ్న వేయించిన వాడును కృష్ణుడే! ఈ విధముగా భగవంతుడే కథకుడు, పృచ్ఛకుడును, తానే శ్రోతకూడ అయి, నిజ తత్త్వమును ప్రకటించిన దివ్య విషయమే విష్ణు సహస్రనామ స్తోత్రమునకు విషయము. ధర్మరాజు భీష్మునడిగిన ప్రశ్నలు ఆరున్నవి.

1. లోకములో ఒకే ఒక్కదైవమేది?
2. పరాయణమైనదేది?
3. ఎవనిని స్తోత్రము చేయుటవలనను,
4. ఎవనిని అర్చించుట వలనను మానవులు శుభమును పొందుదురు?
5. "సర్వ ధర్మములకును ఉత్తమమైన ధర్మమేది?
6. ప్రాణి దేనిని జపించుచు జన్మము, సంసారము అను బంధనముల నుండి విడివడును?

ఈ ప్రశ్నలకు అన్నింటికిని సమాధానము "విష్ణువే" అని భీష్ముడు చెప్పినాడు. ధర్మరాజు అడిగిన ప్రశ్నలకు భీష్ముడు అదే వరుసలో సమాధానము చెప్పలేదు.

## సమాధానముల క్రమమును మార్చి చెప్పుటలోని ఆంతర్యము :

1. ధర్మజుడు అడిగిన ప్రశ్నల క్రమము సక్రమము కాదనియు,

నిదర్శనము ఏదియు కానరాదు. పృచ్ఛకుడు తనకు నచ్చిన రీతిగా స్వతంత్రించి ప్రశ్నింపవచ్చును. అయినను భీష్ముడు ధర్మజుని ప్రశ్నలకు సమాధానమును అదేవరుసలో చెప్పలేదు.

2. ప్రశ్నల ప్రాధాన్యమును బట్టి భీష్ముడు సమాధానము చెప్పినాడనుకొనుటకును వీలుకాదు. "అందరిలో నద్వితీయుడగు దేవుడెవరు?" అను ప్రశ్నకంటె అధికప్రాధాన్యము కల ప్రశ్నము ఇంకొకటి ఉండదు. కాని భీష్ముడు ఈ ప్రశ్నమునకు సమాధానము చిట్టచివర చెప్పినాడు. ప్రాధాన్య పురస్సరముగా చూచినచో ధర్మరాజు ప్రశ్నించిన క్రమమే సరియైనది. ఆ వరుస ఇది :–

1. మోక్షము నిచ్చు, అద్వితీయుడైన దేవుడెవరు?
2. మానవునకు పొందదగిన స్థానమేది?
3. ఆ స్థానము నందుటకు ఏ స్తోత్రము చేయవలెను?
4. ఏ అర్చనము చేయవలెను?
5. పై నాలుగు జీవధర్మములలో ఏది ఉత్తమమని నీ అభిప్రాయము?
6. జన్మ సంసార బంధన ముక్తికి ఏమి జపింపవలెను? అని సక్రమ ప్రశ్నావళి ఇది!

ధర్మజుని ప్రశ్నలు సక్రమముగనే ఉన్నచో భీష్ముడు వాని వరుసను మార్చి సమాధానము ఏల చెప్పవలసి వచ్చెనో ఇక విచారింతము. భీష్ముడు సర్వ ధర్మజ్ఞుడే కాదు. సూక్ష్మ ధర్మజ్ఞుడు కూడా! ఈ స్తోత్రమును చెప్పుటకు ముందు ఎన్నియో ధర్మములను భీష్ముడు ధర్మరాజునకు విపులముగా వివరించి చెప్పెను. ఆ ధర్మముల నన్నింటిని విని అర్థమైనదని తలయూచినాడు ధర్మజుడు. తరువాత "యుధిష్ఠరః శాన్తనవం పునరేవాభ్య భాషత" అని ఉన్నది. ధర్మరాజు భీష్ముని పైన పేర్కొన్న ఆరు ప్రశ్నలను మరల అడిగెను. అర్థమైనదన్న వాడు మరల ప్రశ్నించినాడన్నచో ఆ ధర్మజునకు ఇప్పుడు

ధర్మములలోని రహస్యములు అనగా ధర్మసూక్ష్మములు కావలెననియు అది కూడ అల్ప ప్రయాసముతో అధికార్థ సాధక మార్గములు కావలెననియు భీష్ముడు గ్రహించినాడు. కనుక ఆ ఆరు ప్రశ్నలకు తగిన ఏకైక సమాధానమును ముందుగా చెప్పదలచినాడు.

"సర్వం పదం హస్తిపదే నిమగ్నం";
"ఆమ్రాశ్చ సిక్తాః పితరశ్చ ప్రీణితాః"

( "అన్ని అడుగులు ఏనుగు పాదములో కలిసి పోయినవి; మామిడి చెట్లకు నీరు పోయుట జరిగినది. దాని తోడనే పితృదేవతలకు తర్పణము లభించుటచే వారును సంతోషము నందిరి." అని ఈ వాక్యములకు భావము" ) అను న్యాయములనుబట్టి ఈ సమాధానమే అన్ని ప్రశ్నలకు ఉత్తరము నిచ్చినది. అందువలన ధర్మజుని ప్రశ్నలలో ఆరవదియును చివరిదియును అగు "జన్మ సంసార బంధన ముక్తికి ఏమి జపింపవలెను?" అను ప్రశ్నకు భీష్ముడు మొట్టమొదటగా సమాధానము చెప్పెను. ఆ సమాధాన మిది. సంసార బంధవిముక్తిని కోరుట సర్వజంతువులకు సాధారణమే. ఈ బంధముక్తికి మార్గమును చెప్పినచో చరాచర నర పశు పక్ష్యాదు లన్నిటికి ఉపయోగించునను ఉద్దేశ్యముతో భీష్ముడు ఆరవ ప్రశ్నకు ముందుగా సమాధానము నిచ్చినాడు. ఆ సమాధానము, "జగత్ ప్రభువగు విష్ణువును సహస్రనామములతో జాగరూకుడై స్తుతింపవలెను" అని. ఇచ్చట మోక్షమునకు మార్గము భీష్ముడు సూచించినాడు. మోక్షమనగా—

"అహంకారాది దేహాంతాన్ బంధా నజ్ఞాన కల్పితాన్ ।
స్వస్వరూపావ బోధేన మోక్తు మిచ్ఛా ముముక్షుతా ॥ (శంకరుడు)

స్తుతికిని, అర్చనకును సన్నిహిత సంబంధ ముండుటవలన ధర్మరాజు అడిగిన నాల్గవ ప్రశ్న అగు "ఏ అర్చనము చేయవలెను?" అను ప్రశ్నకు సమాధానము రెండవ స్థానములో భీష్ముడు చెప్పినాడు.

ఆ సమాధానము– "అతనిని (విష్ణువును) అర్చించుట వలన మానవులు శుభమును పొందుదురు"–అనునది. ఆ తరువాత మూడవ స్థానములో ధర్మజుని మూడవ ప్రశ్న అగు "మానవుడు పొందదగిన స్థానమును పొందుటకు ఏ స్తోత్రమును చేయవలెను?" అను దానికి సమాధాన మీయబడినది. "అర్చనతో బాటు స్తుతింపదగినవాడు కూడ విష్ణువే" అనియు, "ఆ స్తుతి వలననే సర్వదుఃఖములను జీవులు అతిక్రమింప గలరు" అనునదే ఆ సమాధానము.

"అర్చన గొప్పదా? స్తవము గొప్పదా?" అను అనుమానము కలిగి ధర్మజుడు "తాతా! నీ దృష్టిలో ఉత్తమ ధర్మమేది?" అని అడిగిన 5వ ప్రశ్నకు భీష్ముడు నాల్గవ స్థానమున ఇట్లు సమాధానము చెప్పినాడు. భక్తితో పుండరీకాక్షుని అర్చించుటే ఉత్తమ ధర్మము అని. ధర్మమును తెలిసికొనిన తరువాత పరాయణము (పొందదగిన స్థానము) నెరుంగవలెనని ధర్మరాజు అడిగిన రెండవ ప్రశ్నకు 5వ స్థానమునందు ఇట్లు సమాధానము చెప్పినాడు——

"మహాతేజః స్వరూపమగు పరబ్రహ్మమే పరాయణము" అని. ఇంతకు "ముఖ్య దైవమెవరు?" అను ధర్మజుని మొదటి ప్రశ్నకు భీష్ముడు చిట్టచివరగా సమాధానము చెప్పినాడు. "సర్వ పవిత్రుడును, సర్వ మంగళుడును, భూతముల కన్నింటికి అవ్యయుడైన తండ్రియును అగు విష్ణువే ప్రధాన దైవము" అనునది ఆ సమాధానము.

ప్రశ్నలకు సమాధానమునిచ్చు క్రమమును ఈ విధముగా మార్చుట యందలి ఉద్దేశ్యము ధర్మజునకు ధర్మసూక్ష్మమును తెలిపి, సంపూర్ణముగా సందేహ నివృత్తి చేయుటకేగాని, అతనిని కంగారు పెట్టుటకు మాత్రము కాదు.

## ప్రశ్నలు - సమాధానములు :

1) ప్రశ్న : కిం జపన్ ముచ్యతే జంతుః ? (ఆరవ ప్రశ్న)

సమాధానము : "జగత్ప్రభుం దేవదేవ మనంతం పురుషోత్తమమ్।
స్తువన్నామ సహస్రేణ పురుషః సతతోత్థితః॥"

2) ప్రశ్న : "కం అర్చంతః ప్రాప్నుయుః మానవాః శుభం?"
(నాల్గవ ప్రశ్న)

సమాధానము : "తమేవ చార్చయన్ నిత్యం భక్త్యా పురుష మవ్యయమ్
ధ్యాయన్ స్తువన్ నమస్యంశ్చ యజమాన స్తమేవచ॥"

3) ప్రశ్న : "స్తువంతః కం ప్రాప్నుయు ర్మానవా శ్శుభం?"
(మూడవ ప్రశ్న)

సమాధానము : "అనాది నిధనం విష్ణుం సర్వ లోక మహేశ్వరమ్
లోకాధ్యక్షం స్తువన్నిత్యం సర్వ దుఃఖాతిగో భవేత్॥"

4) ప్రశ్న : "కోధర్మః సర్వ ధర్మాణాం భవతః పరమోమతః॥?"
(5వ ప్రశ్న)

సమాధానము : "బ్రహ్మణ్యం సర్వ ధర్మజ్ఞం లోకానాం కీర్తివర్ధనమ్
లోకనాథం మహద్భూతం సర్వ భూత భవోద్భవమ్॥"
"ఏష మే సర్వ ధర్మాణాం ధర్మోధిక తమోమతః।
యద్భక్త్యా పుండరీకాక్షం స్తవైరర్చే న్నరః సదా॥"
(శ్లో॥ 7, 8)

5) ప్రశ్న : "కిం వాప్యేకం పరాయణమ్?" (రెండవ ప్రశ్న)

సమాధానము : "పరమం యో మహత్తేజః పరమం యో మహత్తపః।
పరమం యో మహత్ బ్రహ్మ పరమంయః
పరాయణమ్॥" [శ్లో॥ 9]

6) ప్రశ్న : "కి మేకం దైవతం లోకే?" [ఒకటవ ప్రశ్న]

సమాధానము : "పవిత్రాణాం పవిత్రం యో మంగళానాం చ
మంగళమ్।
దైవతం దేవతానాం చ భూతానాం యోఽవ్యయః
పితా॥"

ఈ విధముగా ధర్మజుని ప్రశ్నలకు తానొక క్రమము ఏర్పరుచుకొని, సమాధానము చెప్పి, చివరకు భీష్ముడు విష్ణు సహస్రనామములను పఠించుటవలన, వినుట వలన మానవులకు కలుగు ఫలితములు ఇట్లు వివరించినాడు.

"తస్య లోక ప్రధానస్య జగన్నాథస్య భూపతే ।
విష్ణోర్నామ సహస్రం మే శృణు పాప భయాపహమ్ ॥"

భక్తితో విష్ణువును స్తుతించుట, విష్ణువును పూజించుట అనునవియే ఉత్తమ ధర్మములు అని భీష్ముడు సమాధానము చెప్పెను. ఈ ఉపోద్ఘాతముతో విష్ణు సహస్రనామములను ఒక మహామంత్రముగా భీష్ముడు ధర్మరాజునకు ఉపదేశించెను. ఈ మంత్రజపమునకు ఫలము పాపమును, భయమును తొలగించుట. ఇంకను ఈ స్తోత్రజపమునకును, పారాయణమునకును ఫలితములను ఉత్తరపీఠిక ఇట్లు వివరించును.

## పారాయణ ఫలము

"నారాయణేతి వాగ్వల్లీ చతురక్షర పల్లవా
ధర్మార్థ కామ మోక్షాణాం ఫలదానాత్ర సంశయః"

తా॥ నారాయణ అను వాక్స్వరూపమైన తీగ కలదు. అది 'నాలుగు అక్షరములు' అను చిగురాకులు కలది. ధర్మము, అర్థము, కామము, మోక్షము ఫలములను ఇచ్చుననుటలో సందేహము లేదు. ఈ శ్లోకము వలన విష్ణు సహస్రనామ పారాయణము బహుళ ఫల ప్రదమని తేలినది. ఆ ఫలములు ఈ క్రింద చూపబడినవి :-

1. ఈ స్తోత్రమును పఠించినవారికి ఇహపర లోకముల యందు ఎట్టి అశుభములును దరిచేరవు.
2. చాతుర్వర్ణ్యముల వారికి తగు ఫలితము నొసంగును.
3. సాభిలాషులకు మనోరథ సిద్ధి కలుగును.

4. కీర్తి, శ్రేయస్సును లభించును.

5. భయరాహిత్యము, వీర్య స్థైర్యాభివృద్ధి, రోగ రాహిత్యము, బలరూప గుణద్యుతులు (తేజస్సు) కలుగును.

6. రోగము, బంధనము, భయములు, ఆపదలు కలవాడు వాని నుండి విముక్తుడగును.

7. పాపములనుండి పరిశుద్ధుడగును.

8. అశుభమును, జన్మ, మృత్యు, జరా, వ్యాధి, భయములు కలుగవు.

9. ఈ స్తోత్రమును శ్రద్ధాభక్తులతో చదివిన వారికి సుఖము, ఓర్పు, సంపద, ధైర్యము, స్మృతి, కీర్తులు లభించును.

10. ఇట్టి స్తోత్రము పఠించువారికి ఎక్కడను, ఎప్పుడును, ఎట్టి అపజయములు కాని, పరాభవములు కాని ఉండనేరవు.

ఈ స్తోత్రములోని కొన్ని నామములు భదవద్గీతలోని 10, 11 అధ్యాయములలో కనబడును. భగవతత్త్వము ఎవ్వరు ఎచ్చట చెప్పినను ఒకే విధముగా ఉండును అనుటకు ఇదొక మంచి ఉదాహరణము. గీత 10వ అధ్యాయములో కనిపించు విష్ణునామములు ఇవి —

"ఆదిత్యః, విష్ణుః. రవిః, జ్యోతిః, మరీచిః, మరుతః, నక్షత్రిః వేదః, సామః, దేవః, రుద్రః, వసుః, పావకః, స్కందః, మహర్షిః, యజ్ఞః, అశ్వత్థః, వృక్షః, సిద్ధః కపిలః, అమృతః, నరిః, ఆయుధః, సర్పః, వాసుకిః,అనంతః, వరుణః, యమః, కాలః, రామః, ధాతాః, స్మృతిః, మేధా, క్షమః, ఋతిః, వ్యవసాయః, వాసుదేవః. ధనంజయః, వ్యాసః, కపిః, దండః.

## గీత 11వ అధ్యాయములో కన్పించు విష్ణు నామములు

"తత్పరః, అవ్యయః, పరమేశ్వరః, ప్రభుః, ఆదిత్యః, వసుః, రుద్రః, హరిః, పరమః, అనంతః, పురుషః, అనాదిః, అనంత బాహుః,

అర్కః, ద్యుతిః, అప్రమేయః, శాశ్వతః, ధర్మః, సనాతనః, స్వక్షః, విష్ణుః, శర్మ, తేజః, కాలః, హృషీకేశః, ఆదిదేవః, వాయుః, యమః, వరుణః, అగ్నిః, శంశాంకః, ప్రజాపతిః, పితామహః, విక్రమః, కృష్ణః, వేద్యః, చతుర్భుజః, విశ్వమూర్తిః" మొదలగునవి మొత్తము మీాద కేవలము విష్ణువును తెలుపు పదములు 70 ఉన్నవి

## సర్వమత సామరస్యము :

ఈ స్తోత్రము శివకేశవ భేదమును చూపక వారి ఏకత్వమును ప్రదర్శించును. శివునకు గల ఎన్నో పేర్లు విష్ణువునకు చూపుటయే ఇందుల కుదాహరణము. శివుని తెల్పు పదములు 30 ఉన్నవి.

"స్థాణుః, శివః, సర్వజ్ఞః, రుద్రః, శర్వః, శరభః, మహాభూతః, భూతావాసః, భూతమహేశ్వరః, భీమః, పరమేష్ఠీ, పరమేశ్వరః, ఈశ్వరః, ఈశానః, అనంతకః" మొదలగునవి.

ఇట్లే బౌద్ధ, శిక్కు, జైన, పార్శీ, క్రైస్తవ, యూదు సంప్రదాయములకు చెందిన నామములు కూడ ఎన్నియో ఈ విష్ణు సహస్రనామ స్తోత్రమునందు కలవు.

## బౌద్ధ మత సంప్రదాయమునకు చెందిన నామావళి :

"సిద్ధార్థః, సర్వజ్ఞః, శాస్తా, మహాబుద్ధిః, భగవాన్, ఆనందః, నిర్వాణమ్, అశోకః" మొదలగునవి.

## శిక్కు సంప్రదాయమునకు చెందిన పేర్లు :

"ఏకః, సత్, కర్తా, గురుః, జితామిత్రః" మొదలగునవి.

## జైన మతమును సూచించు పదములు :

"శుద్ధః, వర్ధమానః, వీరః, శమనః, మహాదేవః," మొదలగునవి.

## పార్శీ మతపు నామములు :

"వసుమతిః, మహాన్".

## క్రైస్తవ సంప్రదాయమునకు చెందిన పేర్లు:

"పరమాత్మా, ఏకాత్మా, క్షమిణాం వరః, భూతాత్మా, పితా." ఇట్టి భావము నిచ్చు పదములు వందల కొలది కలవు.

## యూదు సంప్రదాయమునకు చెందిన పదములు :

"మహావీర్యః, మహాశక్తిః."

ఈ విష్ణుసహస్రనామ స్తోత్రములో కొన్ని పదములు పునరుక్తములుగాను మరికొన్ని వ్యతిరేకార్థములుగాను కనబడును. కాని వాని అర్థములను సరిగా పరిశీలించినచో ఒక్కొక్క పదమునకు వేర్వేరు అర్థములుండుట వలన పునరుక్తి దోషము తొలగిపోవును.

## పునరుక్తులకు ఉదాహరణములు

"ఆనందః, నందనః, నందః, శ్రీవాసః, శ్రీపతిః, శ్రీదః, శ్రీనిధిః, శ్రీవిభావనః, శ్రీకరః, శ్రీమాన్, శతమూర్తిః, శతాననః"

## విరుద్ధార్థములను సూచించు నామములు

"అణుః × బృహత్ ; కామకృత్ × కామఘ్నః ;
రామః × విరామః ; నయః × అనయః ;
అక్రూరః × పేశలః ; ఆత్మయోనిః × దేవకీ నందనః;

## శ్రీమత్ సత్యసంధ తీర్థులవారి జీవిత చరిత్రము

శ్రీమత్ సత్యసంధ స్వాములవారి పూర్వాశ్రమ నామము శ్రీ "హావేరి రామచంద్రాచార్యులు", వీరు కర్ణాటక రాష్ట్రము నందలి ధార్వాడ్ జిల్లాలో వున్న "హావేరి" గ్రామము నందు వేంక

టార్యుడు-భారతీదేవి అను పుణ్య దంపతులకు జన్మించిరి. వీరు ప్రహ్లాదాంశమున జన్మించిన వారును, సప్తఋషులలో ఒకరును అయినట్లు ఎన్నియో నిదర్శనము లున్నవి. వీరి ప్రహ్లాదాంశమును ఈ క్రింది మూడు ముఖ్య విషయములు స్పష్టపరచు చున్నవి.

1. సంతానము లేనందు వలన వీరి తల్లిగారైన భారతీదేవి గారు శ్రీ రాఘవేంద్ర తీర్థులవారు బృందావనమునకు వెళ్లి స్వామిని సేవించిరి. శ్రీ రాఘవేంద్ర స్వామి ఆమెకు స్వప్నమున దర్శనమిచ్చి "నీ కేమి కావలయును?" అని ప్రశ్నించిరి. అందులకామె "మీవంటి కుమారుడు కావలెను" అని ప్రార్థించెను. దయామయుడగు స్వామి ఆమె కోర్కెను విని "మేమే నీ గర్భమున జన్మింతుము" అని అనుగ్రహించెను. ఆ తరువాత ఆమె గర్భవతియై శుభ ముహూర్తమున సుపుత్రిని ప్రసవించెను. ఆ బాలుడే హావేరి రామచంద్రాచార్యులు.

2. మంత్రాలయము నందలి బృందావనమున కెదురుగా ఒక ఆచార్యులు ఆసీనులై "సుధా" గ్రంథమును "పరిమళ" వ్యాఖ్యతో బాటు పాఠము చెప్పుచుండిరి. ఆ ఆచార్యునకు గ్రంథములో నొకచోట వ్యాఖ్య చదివినను అర్థము కాలేదు. అప్పుడు చిత్రముగా వారికి నిద్ర వంటి మైకము కలిగినది. ఆ దశలో శ్రీ రాఘవేంద్ర స్వాముల వారు కనబడి 'పరిమళమును' రచించినవారు ఇచ్చటికి సమీపముననే విడిది చేసి యున్నారు. వారి వద్దకు వెళ్లినచో నీ సంశయమును తీర్పగలరు" అని ఆనతిచ్చిరి. వెంటనే అదరిపడి లేచి ఆ ఆచార్యుడు ఆ నూతన వ్యక్తికై వెదుకగా బృందావనమునకు ఒక ఆమడ దూరములో సత్య సంధ స్వాముల వారు ఒక ఊరనున్నట్లు తెలిసినది. "ఆయనే శ్రీ రాఘవేంద్రులు సూచించిన వ్యక్తి" అను ఉద్దేశ్యముతో ఆయనను సమీపింపగా దూరము నుండియే శ్రీ సత్యసంధ తీర్థులు "మీరు సుధా గ్రంథమందు ఈ భాగములో కలిగిన సంశయమును నివారణ చేసి కొనుటకు వచ్చినారు కదా!" అని ఆ అనుమానమును తీర్చిరి. ఆ తరువాత

శ్రీ సత్యసంధ తీర్థులు ఆ ఆచార్యులతో :- "ఇక ఇరువది దినములవరకు అనగా మేము 'ఉడిపి' కి వెళ్ళి వచ్చువరకు ఈ సంగతి మీరెవరితోను చెప్పవద్దని" ఆనతి ఇచ్చిరి. ఆ ఆచార్యుడు కూడ "చిత్తము ఎవరితోను చెప్పను" అని వాగ్దానము చేసెను.

3) ప్రహ్లాదుడు ధరించిన ఏడు అవతారములలో నాలుగు అప్పుడే జరిగినట్లును, ఇంకను మూడు అవతారములు రావలసి ఉన్నట్లును అపరోక్ష జ్ఞానియైన కనకదాసు ఇట్లు చెప్పెను :

"వ్యాసగె ఏళు – దాశగె మూరు
ఈ నాయిగె ఇదరింద వేసరి"

వ్యాసరాయ స్వాముల వారికి ఏడు జన్మలు. పురందర దాసుల వారికి మూడు జన్మలు. తనకి దే కడపటి జన్మ అని దీని భావము. ప్రహ్లాదుని అవతారములలో

"ప్రథమో ప్రహ్లాదశ్చ వ్యాసరాయో ద్వితీయకః
తృతీయో రాఘవేంద్రశ్చ సత్యసంధ శ్చతుర్థకః"

ప్రహ్లాదుని అవతారములలో మొదటిది ప్రహ్లాదుడు. రెండవది వ్యాసరాయలు. మూడవది రాఘవేంద్ర స్వామి, నాల్గవది సత్యసంధ స్వామి. ఈ నాలుగు అవతారములే కాక భావి కాలములో ప్రహ్లాదుడు మరి మూడు అవతారములను ధరింపగలడని కనకదాసు ప్రవచించినాడు.

సప్త ఋషులలో ఒకరే శ్రీ సత్యసంధ స్వామి అనుటకు విష్ణు స్తుతి వ్యాఖ్యలో ఉన్న ఈ క్రింది శ్లోకము ఉదాహరణము.

"తాత శ్రీరామమూర్తేః అమల కమలతో భ్యర్చ్య మాతుర్నశిష్టమ్
కంజం కంజాలయాయాః ఇతి యదమనిషి వాదిదాః కంజ మేకమ్।
తత్ కిం జాయాదయాతః ? కిము మయి దయయా ? నైవ జానేహ
మజ్ఞః
స్వామిన్ శ్రీ సత్య బోధ యతివర హృదయాంభోజ వాసిన్ ! వద
త్వమ్ ॥"

ప్రహ్లాదాంశమున అవతరించిన శ్రీ సత్యసంధ స్వామి, వారి జీవిత కాలమునందే విశాఖపట్టణము ప్రాంతమందున్న విజయనగర సంస్థానాధీశుని కలిసికొన్నప్పుడు "తాము పూర్వజన్మ మందెక్కడనో ఒక చోట యోగీశ్వరులుగా నుండి తపస్సు చేసికొన్నట్లును, ఏ కారణము వలననో ఒకరు శ్రీమంతుడుగాను, ఒకరు సద్వైష్ణవ కులము నందు జన్మించినట్లును ముచ్చటించుకొనిరట !"

## పట్టాభిషేకము

శ్రీ కావేరి రామచంద్రాచార్యులుగారు పూర్వాశ్రమములో తమకు మామయును, అప్పటి "సవనూరు"(ఉత్తరాది) మఠాధీశులును అగు శ్రీ సత్యబోధ స్వాములవారి వద్దనే సకల శాస్త్రములను చక్కగా అభ్యసించిరి. ఆ తరువాత శ్రీ సత్యబోధస్వామి గురుపాదుల వద్దనే సన్యాసాశ్రమమును స్వీకరించి శ్రీ రామచంద్రాచార్యులుగారు శ్రీ సత్యసంధ తీర్థ నామమును ధరించిరి. శ్రీ సత్యసంధ తీర్థులకు సవనూరు మఠములో సామ్రాజ్య పట్టాభిషేకము జరుగుటను గూర్చి ఈ క్రింది ఐతిహ్యము ప్రచారములో నున్నది.

శ్రీ సత్యబోధస్వామి తమ కనంతరము (సవనూరు) ఉత్తరాది పీఠము నధిష్ఠించుటకు అర్హుడైన వ్యక్తికై వెదుకసాగిరి. ఆ అన్వేషణలో శ్రీ సత్యబోధ స్వామి వారి దృష్టి తన శిష్యుడైన రామచంద్రాచార్యునిపై పడినది. పూర్వజన్మ కృత భగవత్సేవా ఫలముగా శ్రీ రామపాద సేవార్చనకే అవతరించిన మహానుభావుడు శ్రీ రామ చంద్రాచార్యులు అనియు కనుక అతనినే తమ పీఠమునకు ఉత్తరాధి కారిగా చేయవలెననియు నిర్ణయించిరి. పట్టాభిషేకమునకు ముందుగనే రామచంద్రాచార్యుని భావిజీవితమును, ఆయుః పరిమాణమును శ్రీ సత్యబోధ స్వామి దివ్యదృష్టితో తిలకించి, అతని ఆయుః పరి మాణము అత్యల్పముగా ఉన్నదని గమనించిరి. అందువలన రామ చంద్రాచార్యునకు అధికాయుర్దాయము నిచ్చుటకు ఒక ప్రక్రియ నారంభించిరి.

శ్రీ సత్యబోధస్వామి పన్నెండు రజత పాత్రిలలో (వెండి గిన్నెలలో) జలమును తెప్పించి, దానిని మంత్రించి తన శిష్యుడైన రామచంద్రాచార్యులను పిలిచి ఆ మంత్రి పూతమైన జలమును త్రాగుమనెను. గురువు యొక్క మనోభావమును అభీష్టమును ఎరుగని రామచంద్రాచార్యులు గురువాక్యము ప్రికారము రోజుకొక పాత్రియందలి జలమును త్రాగనెంచి పదిపాత్రిల యందలి జలమును మాత్రిమే త్రాగెను. అందులకు శ్రీ సత్యబోధ స్వామి చిరునవ్వు నవ్వుకొని శిష్యునితో నీకింక పదిసంవత్సరములు మాత్రమే ఆయుః ప్రమాణమున్నదని చెప్పి, రామచంద్రాచార్యులకు సన్యాసాశ్రమము నిచ్చి శ్రీ సత్యసంధ తీర్థ నామముతో ఉత్తరాది మఠాధిపతిగా అతనిని క్రీ. శ. 1793వ సం॥లో పట్టాభిషేకము చేసిరి. శ్రీమదద్వైత మత మధ్వాచార్య గురుపరంపర యందు శ్రీ మదుత్తరాది మఠాధిపతులలో శ్రీ సత్యసంధ తీర్థులవారు శ్రీ మధ్వాచార్యుని నుండి 30వ వారును, ప్రిస్తుతము ఉత్తరాది మఠమునకు పీఠాధిపతియగు శ్రీ సత్య ప్రమోదతీర్థులకు పదిహేను తరములకు ముందువారునుగా పీఠాధిపత్యమును వహించిరి. ఇతర స్థలముల యందున్న మఠశిష్యులకు శ్రీ రామదేవుని సందర్శనమును శ్రీ సత్యబోధ స్వామియొక్క దర్శనమును, మంత్రి ముద్రా ధారణములును లభింపలేదని తెలిసికొని, పీఠాధిపతి కాగానే శ్రీ సత్యసంధ తీర్థులు పై లోటును తీర్చుటకై తీర్థయాత్రిల మిషతో సంచారమునకై బయలుదేరిరి. సవనూరు సంస్థానాధిపతియగు నవాబు స్వామివారి వలన తనకు వచ్చిన ఒక ఆపద తొలగి పోవుటవలన స్వామివారి యాత్రికు కావలసిన సదుపాయముల నన్నింటిని చేసి, వారి తీర్థయాత్రిలను ప్రోత్సహించిరి.

## తీర్థయాత్రిలు - దిగ్విజయ సంచారములు

ఉత్తరాది మఠాధిపత్యమును వహించి మఠ భక్తులను ముద్రాధారణ మంత్రోపదేశములతో ననుగ్రిహింప దలచి, శ్రీ సత్యసంధ స్వామి యావద్భారతము సంచార మొనరింప దొడంగిరి. వారు శ్రీపండరీ

పురము, ఆంధ్రప్రదేశమునందలి రాజమహేంద్రవరము, విజయనగరము, విశాఖపట్టణము మొదలగు ప్రదేశములను, గంజాము జిల్లాను, మదరాసు, కర్ణాటక ప్రాంతము, ఉడిపి, రామేశ్వరము, పూరీ జగన్నాథక్షేత్రము, కాశీ, గయ, ప్రయాగ [త్రిస్థలి], మొదలగు క్షేత్రములను సందర్శించిరి. ఈ సంచారము చేయుకాలము నందే శ్రీ సత్యసంధతీర్థులు సుమారు 108 హనుమద్విగ్రహములను, నృసింహ విగ్రహములను, అనంత పద్మనాభ విగ్రహమును ప్రతిష్ఠించిరి. మదరాసు నందలి ఉత్తరాది మఠములో వీరు ప్రాణదేవుని కూడ ప్రతిష్ఠించినారు. స్వామివారు ఆయా క్షేత్రముల యందు పర్యటించు నప్పుడు ఎన్నెన్నో మహిమలను కూడ ప్రదర్శించి తమ దివ్యత్వమును ప్రకటించిరి. ఆ మహిమలలో కొన్నింటిని ఈ దిగువ నుదాహరించు చున్నాను.

1) వీరు మహారాష్ట్రము నందలి శ్రీ పండరీపుర క్షేత్రమునకు వెళ్ళినప్పుడు అచ్చట శ్రీ పాండురంగ విఠలుడు ఒక బ్రహ్మచారి వేషముతో వచ్చి శ్రీ సత్యసంధ స్వామివారికి దర్శనమిచ్చి అంతలో అదృశ్యుడయ్యెను. ఆ బ్రహ్మచారి ఎవరో తెలిసికొనుడని స్వామి వారు శిష్యులకాజ్ఞనొసంగిరి. ఎంత వెదకినను ఆ వటువు కనబడలేదు. మరల మరియొకరోజున బ్రహ్మచారి రూపమున శ్రీ పాండురంగడు స్వామివారి వద్దకు వచ్చి, ముద్రాధారణ భాగ్యము ననుభవించెను. ఆ బాలునకు వేసిన ముద్రలు దేవాలయమునందలి శ్రీ విఠలమూర్తి విగ్రహముపై స్పష్టముగా కనబడినవట! భగవంతుడు తన భక్త సులభత్వమును నిరూపించుకొనుటకై ఈ లీలను ప్రదర్శించి యుండును.

2) మరియొకప్పుడు శ్రీ సత్యసంధ స్వామివారు దేవతార్చన చేయుచుండగా ఒక బ్రాహ్మణుడు వచ్చి, ఒక సహస్రదళ కమలమును స్వామివారివద్ద నుంచి వెడలిపోయెను. ఆ పుష్ప సౌందర్యమునకు మెచ్చి దానిని తెచ్చిన బ్రాహ్మణుడెవరో కనుగొన వలసినదిగా

స్వామివారు శిష్యుల నాదేశించిరి. ఎంత వెదకినను ఆ బ్రాహ్మణుడు ఎందును కానరాలేదు.

3) స్వామివారు ఒకసారి కాశీక్షేత్రమును దర్శింప బోవుచు దారిలో పూరియందలి శ్రీ జగన్నాథ స్వామిని చూడనేగిరి. అచ్చటి పండాలు దేవాలయ ద్వారములకు తాళమువైచి స్వామివారెంతగా అభ్యర్థించినను తలుపులు తెరువమనిరి. స్వామివారు ఆలయమునకు ప్రదక్షిణము చేసి ముఖ్యద్వారమువద్ద శ్రీ జగన్నాథస్వామికి కానుక లర్పించి స్తోత్రము చేసిరి. వెంటనే అత్యద్భుతముగా ఆ తాళములు ఊడి క్రింద పడినవి. దానిని చూచి, పండాలు ఆశ్చర్యపడి, క్షమాపణలను కోరి, ద్వారములను తెరిచి, స్వామివారిచే శ్రీ జగన్నాథ దర్శనమును చేయించిరి.

4) శ్రీ సత్యసంధ స్వాములవారు గయాక్షేత్రము నందలి శ్రీ విష్ణుపాద మందిర దర్శనమునకు వచ్చుచున్నారని తెలిసి "గయా పాలురు" అను పేర ప్రసిద్ధినందిన ఆ మందిరపు అర్చకులు తమ మందిరమునకు దయచేయవలసినదిగా స్వామివారికి విజ్ఞాపన పత్రికను పంపిరి. వారి కోరిక మేరకు శ్రీ సత్యసంధ స్వామివారు ఆ ప్రదేశమునకు చేరిరి. స్వాములవారి పరివారమును, వైభవమును, సంపదను చూచిన గయాపాలురు స్వామివారినుండి అధిక ద్రవ్యమును స్వీకరింపవలెనను లోభముతో విష్ణుపాద మందిర ద్వారములను తాళ్ళతో బంధించిరి. తమకు 10వేల వరహాలు ఇచ్చినగాని తలుపు తీయమనిరి. శ్రీ స్వామివారు వారి ప్రవర్తనకు అచ్చెరువంది, మందిర ముఖద్వారమువద్ద నిలచియుండి, శ్రీహరిని స్తుతించి, ద్వారమును తాకగానే తాళములు ఊడి క్రింద పడినవి. అది చూచిన గయాపాలురు సంభ్రమ భరితులై స్వాములవారికి సాష్టాంగులై క్షమాపణ కోరుటయేకాక శ్రీ సత్యసంధ స్వామి పీఠమునకు వేలకొలది రూపాయలను తాము కానుకగా సమర్పించిరి. స్వాములవారివలన ముద్రాధారణమునుకూడ పొందిరి. ఆ తరువాత మందిర ద్వారములను తెరచి సకల మర్యాదలతో శ్రీ సత్యసంధస్వామిచే విష్ణుపాదములను దర్శింపజేసిరి.

శ్లో॥ "గంగాపుత్రా విలోక్యైనం యత్తపో జ్ఞాన వైభవమ్
గయాయాం శిష్యతాం మీయుః సత్యసంధం గురుం భజే"

అను శ్లోకము పై వృత్తాంతమును వివరించుచున్నది.

5) గయా క్షేత్రమునుండి స్వామివారు కాశీ క్షేత్రమునకు దయచేసి, అచ్చట విశేష వైభవముతో భాగీరథీ దేవి నర్చించిరి. పూజాద్రవ్యములను తీసికొని మంగళ వాద్యములతో, బ్రాహ్మణులతో కలిసి గంగాతీరమును చేరి గంగపూజ చేసిరి. ఆ సమయమున శ్రీ. సత్యసంధ స్వాములవారు గంగానదికి వస్త్రములను, ఆభరణములను అలంకారములను మూసివాయనముతో పాటుగా అర్పించిరి. అప్పుడు అత్యాశ్చర్యముగా భాగీరథీ దేవి కంకణాది శోభితమైన తన దివ్య హస్తమును ప్రత్యక్షముగా నీటినుండి పైకిచాచి ఆయా కానుకల నన్నింటిని అత్యాదరముతో స్వీకరించెను. అప్పుడు ఆ ప్రాంతమున ఉన్నవారందరును ఆ దివ్య దృశ్యమును కనులారగాంచి అబ్బురపడిరి.

శ్రీ సత్యసంధ స్వామి తమ దేశాటన సమయమునందు ప్రదర్శించిన మహిమలు అసంఖ్యాకముగా నున్నవి. అవి అన్నియు స్వామివారి యొక్క దివ్యత్వమును ప్రకటించుచున్నవి. ఈ విషయ మును గమనించియే పూర్వాచార్యులు శ్రీ సత్యసంధ తీర్థులను ఈ విధముగా ప్రస్తుతించిరి.

"దృష్టా గంగా, శాలితం ద్వారకీలం
ఉష్ట్రా ముద్రా పంఢరీశశ్య దత్తా
కృష్ణః స్పృష్టః శేష దర్శీ, లతావాన్
అష్టైశ్వర్యం సత్యసంధం నమామి."

"గంగానది చూడబడినది. తలుపులకు బంధించిన తాళములు గయ, పూరి మొదలగు క్షేత్రములయందు స్వయముగా విరిగిపడినవి. తప్తముద్ర పాండురంగనికి వేయబడినది. "ఉడిపి"లోని శ్రీకృష్ణుడు

తాకబడినాడు. సుబ్రహ్మణ్య తీర్థములో ఆదిశేషుని యొక్క నిజరూప దర్శనమును స్వామివారు చేసిరి. బృందావనములోనికి ప్రవేశించుటకు ముందు తమ దండమును శిష్యునకిచ్చి తుంగా నదిని దాటుమనిరి. ఆ శిష్యుడు దండమును గ్రహించి పోవుచుండగా ఆ దండమునకును, స్వామి వారికిని అభేదమనియు, దండమునకు ప్రాణమున్నదనియు నిరూపించుటకు దానినుండి ఒక తీగ మొలిచినది. అందువలన స్వామి వారు లతావంతులైనారు. ఇట్టి మహిమాన్వితులును, అష్టైశ్వర్య సంపన్నులును అగు శ్రీ సత్యసంధ స్వామికి నా నమస్కారములు అని పై శ్లోకమునకు భావము. స్వామి వారు ప్రదర్శించిన మహిమలన్నియు ఈ ఒక్క శ్లోకమునందు చక్కగా పొందుపరుపబడినవి.

## బృందావన ప్రవేశము

శ్రీ సత్యసంధ స్వామి వారు "ఉడిపి"కి వెళ్ళి శ్రీకృష్ణ దర్శనమును చేసిరి. అప్పుడు అచ్చటి స్వాములలో ఒకరితో శాస్త్ర వాదము జరిగినది. తదనంతరము శ్రీ సత్యసంధ స్వామివారు "ఉడిపి" నుండి బయలుదేరి వచ్చుచు మార్గమధ్యమున "సీత" అను నదిని సమీపించిరి. అచ్చటికి రాగానే తమ గురువు శ్రీ సత్యబోధ స్వామియును, ఉడిపి స్వాములును సూచించిన విధముగా తమకు ప్రాణత్యాగ సమయము ఆసన్నమైనదని స్వామివారు గ్రహించిరి. వెంటనే స్వామి తమ శిష్యులను చేరబిలిచి, "మమ్ము ఈ పల్లకితోనే తుంగానదీ తీరమున కర్ణాటక దేశమందున్న "మహిషి" గ్రామమునకు తీసికొని పొండు. అచ్చట ఒక బృందావనము నిర్మింపుడు" అని శిష్యులకాజ్ఞాపించిరి. శిష్యులు అట్లే అని స్వామివారిని 'మహిషి' గ్రామమునకు తెచ్చి అచ్చట పావన తుంగానదీ తీరమున బృందావనమును నిర్మించి స్వామికి ఆ వార్తను తెలియజేసిరి. అప్పుడు శ్రీ సత్యసంధ స్వామి ఆ పల్లకితో పాటు తమ దండమును శిష్యులకిచ్చి నదిని దాట నాజ్ఞాపించిరి. అత్యద్భుతముగా అప్పుడు ఆ దండమునకు ఎండ తగులకుండా ఎచ్చటి నుండియో ఒక పెద్ద మేఘము వచ్చి, నీడనిచ్చినది. ఆ దండమునకు

ఒక తీగ మొలిచినది. శిష్యులు దండమును, పల్లకిని నదికి అవతల విడియజేసి, మరలివచ్చి స్వామి వారికి ఆ వార్తను తెలిపిరి. అప్పుడు శ్రీ సత్యసంధ తీర్థుల వారు శుభముహూర్తమున తమ పీఠమునకు ఉత్తరాధికారిగా "శ్రీ సత్యవర తీర్థుల"కు పట్టాభిషేకము చేసి, క్రీ.శ. 1793లో - సరియగు శాలివాహన శకము 1719 ఆనందనామ సంవత్సర జ్యేష్ఠశుద్ధ విదియా దినమున బృందావన ప్రవేశము చేసి శ్రీహరి సన్నిధికి చేరుకొనిరి. ఈ విధముగా శ్రీ సత్యసంధ తీర్థ స్వాములవారు 1783 నుండి 1793 వరకు 10 సం॥ల కాలము ఉత్తరాది మఠమునందు పీఠాధిపతులుగా ఉండి, దేశమంతటా సంచారము చేసి, తమ దివ్యత్వమును వివిధ మహిమల ద్వారా ప్రకటించి ఎందరో శిష్యులకు మంత్రోపదేశమును, ముద్రాదానమును చేసి మానవాళిని తరింపజేసిరి.

## ర చ న లు

శ్రీ సత్యసంధ తీర్థులు 1) విష్ణుస్తుతి, 2) శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్ర భాష్యమును, 3) పురుషసూక్త వ్యాఖ్యానమును రచించిరి. వీరి రచనలలో శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్ర భాష్యము సుప్రసిద్ధమైనది. శ్రీ సత్యసంధ తీర్థులను వారి జీవిత విశేషములను, మహిమా వైభవాదికమును ప్రతిపాదించునట్టి ఇతర గ్రంథములు:-

1. శ్రీ సత్యసంధ విజయ మహాకావ్యము:- (సంస్కృతము)
2. శ్రీ సత్యసంధ చరితామృతము:- (మరాఠీ)
3. శ్రీ సత్యసంధ తీర్థ స్తోత్రము:- (అలంకార గర్భితమైనది)

## శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్ర వైశిష్ట్యము

శ్రీ విష్ణు సహస్రనామముల యందలి రహస్యముల నెరుంగని

అజ్ఞానులగు జీవుల నుద్ధరించుటకై శ్రీమదానంద తీర్థులవారు ఆ స్తోత్రపు రహస్యములను, దాని వైశిష్ట్యమును ఇట్లు పేర్కొనిరి :—

" శాస్త్రేషు భారతం సారం, తత్ర నామ సహస్రకమ్ ।
వైష్ణవం కృష్ణగీతా చ తద్‌జ్ఞానాత్ ముచ్యతేఽం జసా "

శాస్త్రములన్నిటి యందును సారవంతమైనది భారతము. దానిలో సారవంతమైన ఘట్టము "శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రము". అంతటి పవిత్రమైన మరియొక ఘట్టమే భారతమునందు శ్రీ కృష్ణుడు ఉపదేశించిన "భగవద్గీత". ఈ రెంటియొక్క జ్ఞానమువలన పురుషుడు వెంటనే ముక్తుడగునని ఈ శ్లోకపు భావము. శ్రీ విష్ణు సహస్రనామ మును, భగవద్గీతయును సమాన ప్రతిపత్తిగల గ్రంథములని తేలినది కదా! అందుకే శ్రీమచ్ఛంకర భగవత్పాదులు కూడా " గేయం గీతానామ సహస్రం" అనిరి. "పాడదగిన గ్రంథములు రెండే ఉన్నవి. వానిలో మొదటిది భగవద్గీత, రెండవది శ్రీ విష్ణు సహస్రనామము" అనుచు ఈ రెండు గ్రంథములకు శంకరుడు అభేదమును సూచించినారు. ఈ విష్ణు సహస్రనామ స్తోత్రమునకు శ్రీ మధ్వాచార్యులవారు వ్యాఖ్యా నింప వలసిన సందర్భమును గూర్చి ఈ క్రింది కథ ప్రచారములో నున్నది:—

ఒకప్పుడు శ్రీ మదానంద తీర్థులవారు ఒక విద్వత్సభలో ఇట్లు పలికిరి. "వేదమునకు మూడు అర్థములును, భారతమునకు పది అర్థము లును, విష్ణు సహస్రనామము నందలి ప్రతి నామమునకు వందేసి అర్థము లను చెప్పవచ్చును". ఆ మాటను విన్న సభలోని పండితులు బిగ్గరగా నవ్వుచూ "హరి నామములకు గల వంద అర్థములను చెప్పుడు?" అనిరి. అప్పుడు శ్రీమదాచార్యులు శ్రీ విష్ణు నామములకు వివిధార్థము లను తెలుపుటకు ఒక ప్రణాళిక నేర్పాటు చేసికొని దానిని ఈ క్రింది శ్లోకము ద్వారా ప్రకటింప గోరి ఆ పండితులకు ఈ విధముగా ఒక షరతును విధించిరి.

"వర్ణయామి తదహం సకలం వః
స్తాష్ఠవా దనువదంతు భవంతః।
తం వదంత మితి తేఽథ వదంతో
బాఢమిత్యతి దృఢోద్యమ మాపుః॥"
(సుమధ్వ విజయము– ఆరవ సర్గ– ఏడవ శ్లోకం)

ఓ పండితులారా నేను నామములకున్న అర్థమును పూర్తిగా వర్ణించెదను. శ్రద్ధగా విన్న తరువాత మీరు స్పష్టముగా, పూర్తిగా **ఆ** అర్థములను తిరిగి చెప్పవలెను సుమా!" అనిరి. అందులకా పండితులంగీకరించి ఆ అర్థములను గుర్తుంచుకొని తిరిగి చెప్పాటకై నిర్ణయించుకొనిరి. అప్పుడు ఆచార్యుల వారు ప్రతి నామమునకును వందేసి అర్థములను చెప్పాటకై ఈ విధముగా ఒక ప్రణాళికను ఏర్పాటు చేసికొనిరి:–

"ప్రకృతి ప్రత్యయ సంగమ భంగీం
శబ్ద శాస్త్ర విహితాం ప్రతిదర్శ్య
శుద్ధధీః శ్రుతి శిరశ్శత సిద్ధాన్
అభ్యదా త్సపది "విశ్వ" పదార్థాన్"
(సుమధ్వ విజయము– 6–4)

వ్యాకరణ మంగీకరించిన రీతిగా ప్రకృతిని, ప్రత్యయములను కలుపుట చేతను; విడదీయుట చేతను "విశ్వ" మొదలగు పదములకు వేద వేదాంతముల యందు అంగీకరింపబడిన వేరు వేరు అర్థములను శుద్ధమైన బుద్ధికల ఆ మధ్వాచార్యులు వివరించిరని ఈ శ్లోకపుభావము.

"యావదర్థ శతకం న విశంకః
సంతతోక్తి కృదపూరయ దేషః
వర్ణితావ ధృతి దుర్బల చిత్తా
స్తావ దాకులహృదో హ్యభవం స్తే"

... శ్రీమదాచార్యులు తన ప్రజ్ఞా పాటవముచే చేసిన ప్రతిజ్ఞ మేరకు "విశ్వాది" పదములలో కొన్నింటికి వందేసి అర్థములను అవ

లీలగా చెప్పిరి. కాని వానిని విన్న పండితులు, విన్న దానిని తిరిగి వెంటనే గుర్తుచేసికొని చెప్పలేకపోయిరి. అందువలన వారు తామిచ్చిన మాటను నిలబెట్టుకొనలేక పోయిరి. వారి హృదయములు ఆకులము లైనవి. శ్రీమదాచార్యులును, "ప్రతి నామమునకు వందేసి అర్థములను ఈ దుర్బల చిత్తులకు బోధించుట అనవసరమును, కేవల కంఠశోష మాత్రమే అగుననియు" తలచి తరువాతి నామములకు వ్యాఖ్యాన మును చెప్పలేదు కాని, అవసరమైనచో అన్ని నామములకును వివి ధార్థములను ప్రతిపాదించు ప్రణాళికను మాత్రము తరువాతి తరముల వారికి అందించిరి. శ్రీమదానందతీర్థులు చూపిన ప్రణాళికను ఆధారము చేసికొనియే శ్రీ సత్యసంధ తీర్థులవారు తమ శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్ర భాష్యమును రచించినారు.

## గ్రంథముద్రణ సమయము

శ్రీ సత్యసంధ తీర్థులు అధివసించిన శ్రీ సవనూరు పీఠమునకే (ఉత్తరాది మఠమునే) తదనంతర కాలమున పీఠాధిపతి అయిన వారును సమస్త యతికులమునకు మార్గదర్శకులగుట వలన ఆసేతు శీతా చలమునందును "హిర్యస్వామిగళు" అని ప్రసిద్ధి నందిన వారును; "శ్రీమదభినవానంద తీర్థులు" అను అన్వర్థ నామధేయులును అగు శ్రీ 1008 శ్రీ మత్సత్య ధ్యాన తీర్థుల శతమానోత్సవము నందుతో పాటుగా; పరమత నిరాకరణ పూర్వముగా నిజమత స్థాపనక్కై నడుము కట్టిన వారును; శ్రీమన్న్యాయ సుధామండన కారులును (శ్రీ సత్య ప్రమోద తీర్థులు); యమ, నియమ విష్ణుపంచక కాష్ఠ మౌనవ్రత సుధాది సచ్ఛాస్త్ర ప్రవచన, వాది నిగ్రహాదులయందు కౌశలము కలవారును; పరవాదుల చేత కూడ "అభినవ సత్యధ్యాన తీర్థులు" అను బిరుద నామముతో ముక్త కంఠముగా ప్రస్తుతింపబడిన వారును అగు శ్రీ 1008 శ్రీమత్సత్య ప్రమోద తీర్థులయొక్క శ్రీమదుత్తరాది మఠీయ వేదాంత సామ్రాజ్య పట్టాభిషేక రజత మహోత్సవము జరుగగా ఆ ఉత్సవమునందు శ్రీ సత్యసంధ తీర్థులు సంస్కృతములో

రచించిన శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్ర భాష్య గ్రంథము మొట్ట మొదటిసారిగా తిరుపతి క్షేత్రమునందు ప్రకటింపబడినది.

## అంకితము

శ్రీ సత్యసంధ తీర్థులు దీనిని తన సేవా రూపముగా తన గురువగు శ్రీ సత్యబోధ స్వామి యొక్క శరీరమునందు అంతర్యామిగా ఉన్న శ్రీరామచంద్రునకు అంకిత మిచ్చిరి.

శ్లో॥ "శ్రీ మద్విష్ణు సహస్రి నామ వివృతిః శ్రీ సత్యబోధాభిధ
స్వామి స్వాంత్వ నిశాంత వర్త్య వనిజా కాంతస్య సంతుష్ట యే
భక్త్యా కారిచ సత్యసంధ యతినా తుష్టోఽన యా సేవయా
దేయాద్ జ్ఞానమతో భవామయ భయాత్పాయా ద్దయాతో
యధిః"

అను శ్లోకము ఇందుకు ప్రమాణము. తవ గురువైన శ్రీ సత్యబోధ స్వామి యొక్క మనస్సనెడు ఇంటియందున్న శ్రీరామునికి సంతోషము కలిగించుటకై శ్రీ విష్ణు సహస్రనామ భాష్యము భక్తితో రచింపబడి అంకిత మీయబడినది. ఈ సాహిత్య సేవచే సంతోషపడిన, దయా సముద్రుడైన ఆ రాముడు ఇంకను ఎక్కువ జ్ఞానమునిచ్చి, సంసార రోగము వలన కలుగు భయము నుండి రక్షించును గాక! అని ఈ శ్లోకమునకు అర్థము. ఈ శ్లోకము ద్వారా శ్రీ సత్యసంధ యతీశ్వరుని గురుభక్తి స్పష్టమగుచున్నది. ఈ విష్ణు సహస్రి నామ స్తోత్ర భాష్యము మోక్షదాన సమర్థముగా, జ్ఞాన గర్భితముగా ప్రసిద్ధి నందినది. దీనిని భగవత్పాదాచార్యులైన శ్రీ మదానంద తీర్థుల ప్రేరణము చేతను, వారి ప్రీతి కొఱకును శ్రీ సత్యసంధ యతీశ్వరులు రచించి, సహస్ర నామ జ్ఞానము లేని అకించనులకు కూడ దాని యందలి ఉత్తమ విషయములను సుబోధమొనర్చి, మహోపకారము గావించిరి. ఈ భాష్యములో పదములను వివరించు నప్పుడును, విగ్రహ వాక్యములను చెప్పునప్పుడును, ధాతువులకు అనేకార్థములను ప్రదర్శించు

నప్పుడును, ఆ అర్థములను నిరూపించుటకై ప్రమాణములను వివిధ వేద శాస్త్ర పురాణేతిహాసముల యందలి వాక్యములను ఎత్తి చూపు నపుడును, శ్రీసత్యసంధ యతీంద్రుని వైదుష్యమును, భాషా పాటవమును స్పష్టమగు చున్నది. ప్రమాణోదాహరణములను చూపునపుడు శ్రీ మదాచార్యులు రచించిన బృహద్భాష్య, సూత్ర భాష్యాది వచనములను ఉదాహరించుట వలన ఈ భాష్యము మధ్వ సంప్రదాచార్యులకు మిక్కిలి అంగీకార యోగ్యమైనట్లు స్పష్టమగుచున్నది. శ్రీ సత్యసంధ తీర్థులు రచించిన విష్ణు సహస్ర నామ స్తోత్ర భాష్యపు ప్రణాళికను ఇంత వరకు పరిశీలించితిమి. ఇక దాని ఆంధ్రానువాదపు ప్రణాళికను గమనింతము :

## ఆంధ్రానువాద ప్రణాళిక

సంస్కృత భాషయందున్న ఈ భాష్యము సామాన్యుల కర్థము కాదను తలంపుతో విశాఖపట్టణములోని శ్రీమధ్వ సంఘపు అధ్యక్షులును, మిసెస్ ఎ.వి.ఎన్. కళాశాలలో ఆంగ్లశాఖలో అనుభవజ్ఞులైన ఉపాధ్యాయులును, నా సహోపన్యాసకులును, ఆధ్యాత్మిక మిత్రులును అగు శ్రీ డి. ఆర్. వాసుదేవరావుగారు నా వద్దకు వచ్చి, శ్రీ సత్యసంధ యతీశ్వరులు సంస్కృత భాషలో రచించిన శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్ర భాష్యపు గ్రంథమును నాకిచ్చి ఆంధ్రములోనికనువదింపుడని కోరిరి. వారి ప్రోత్సాహ ఫలితమే ఈ ఆంధ్రానువాదము. శ్రీ వాసుదేవరావుగారు నాకీ సేవా భాగ్యమును కలిగించినందుకు వారికి కృతజ్ఞుడనై ధన్యవాదముల నర్పించుచున్నాను.

ఈ నా ఆంధ్రానువాదమునందు కొన్ని ప్రత్యేకత లున్నవి అవి :

1) మనువు అగస్త్య మహర్షితో "అగస్త్య సంహిత" యందు చెప్పిన "శ్రీ విష్ణు సహస్రనామ శాప విమోచన స్తోత్ర మంత్రము" అను విషయము నాకు లభించినది. ఈ క్రొత్త మంత్రమును అందరికి అందింపవలెనను ఉద్దేశ్యముతో దీనిని గ్రంథాదియందు చేర్చితిని.

"ఇది గ్రంథముయొక్క ఉత్కృష్టకు సహాయకారి కాదు" అని కొందరు సంప్రదాయజ్ఞులు చేర్పవలదనినను "ఉన్న విషయమును మాననేల?" అను ఉద్దేశ్యముతో చేర్చితిని. దీనిని పఠించిన తరువాత శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రమును పఠించినచో ఫలితము వెంటనే, అధికముగా కలుగునను ప్రమాణ వాక్యమే ఈ స్తోత్రమును గ్రంథములో చేర్చు సాహసమును నాకు కలిగించినది.

2) శ్రీ విష్ణు సహస్రనామమును పారాయణకు మాత్రమే గాక దానిని గురుముఖతః మంత్రరూపముగా గ్రహించినవారు తదంగముగా చేయవలసిన "పురుష సూక్త న్యాస సహిత పూజావిధానమును" విపులముగా ఈ గ్రంథమునందు ముద్రించితిని.

3) గ్రంథాదిని పారాయణమునకై స్తోత్ర పాఠమును తరువాత వ్యాఖ్యానమును, గ్రంథాంతమునందు అకారాది క్రమములో నామములను అవి ఉన్న పుటలతో సహా ముద్రించితిని.

4) వ్యాఖ్య వ్రాయునపుడు సహస్రనామ స్తోత్రము నందలి ఒక్కొక్క శ్లోకమును మరల ముద్రించి ఆ శ్లోకములో వచ్చు నామములకన్నింటికి వ్యాఖ్యను దాని క్రిందనే పొందుపరచితిని.

5) కొన్ని నామములందున్న పాఠాంతరములను కుండలీకరణములో ( ) చూపితిని.

6) ప్రతీ నామమును ఎన్ని విధములుగా పదవిభాగము చేయవచ్చునో ముందుగా చూపి, దానికి విగ్రహ వాక్యము ప్రకారము అర్థమును తెలిపి, భావము సులభముగా బోధపడుటకై తాత్పర్యార్థమును కుండలీకరణములో ( ) చూపితిని.

7) కొన్నిచోట్ల శ్రీ సత్యసంధ తీర్థులవారు రెండేసి నామములను కలిపి ఏకనామముగా గ్రహించి వ్యాఖ్యానించిరి. అట్టిచోట్ల ఆ విషయమును ప్రస్తావించి, అందలి రెండు నామములను విడివిడిగా

చూపి అర్థము చెప్పినప్పుడు వానికి ఆ నెంబరుతోనే "A B" అను అక్షరములను కలిపి చూపితిని. ఇట్లు చేయుటవలన ఈ స్తోత్రము నందలి నామములు వెయ్యి సంఖ్యకు సరిపోవును.

8) తిరుపతి యందలి సంస్కృత కళాశాలలో విశ్రాంత వ్యాకరణాచార్యులును, మధ్వ సంప్రదాయమునకు చెందిన ప్రముఖ విద్వాంసులును అగు శ్రీ R. రామమూర్తి శర్మగారు, శ్రీ సత్యసంధ తీర్థులు రచించిన సంస్కృత భాషయందలి గ్రంథములో లేని కొన్ని అర్థములను సంప్రదాయానుగుణముగా సూచించిరి. ఆప్త వాక్యముగా ఆ అర్థములనుకూడ స్వీకరించితిని.

ఈ విధముగా ఎంతయో శ్రమకోర్చి ఎందరో పండిత ప్రకాండులను సంప్రదించి, వారిచ్చిన సూచనలను శిరసావహించి, ఈ గ్రంథమును ముద్రణకై సిద్ధము చేసితిని. ఈ గ్రంథమును అక్షరశః పరిశీలించి అమూల్యములగు సూచనలను ఇచ్చిన విద్వద్వతంసులు

1) బ్రహ్మశ్రీ అప్పల సోమేశ్వర శర్మగారు, **M. A., PoL.,** (ఆంధ్ర విశ్వ విద్యాలయమునందు విశ్రాంత సంస్కృతాచార్యులు – విశాఖపట్టణము.)

2) మధ్వశ్రీ రాజాచార్య రామమూర్తి శర్మగారు (విశ్రాంత సంస్కృత వ్యాకరణాచార్యులు, శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయము – తిరుపతి).

3) బ్రహ్మశ్రీ ఆచార్య దివాకర్ల వెంకటావధానిగారు, **M. A. Ph.D.,** (విశ్రాంత ఆంధ్ర శాఖాధ్యక్షులు, ఉస్మానియా విశ్వ విద్యాలయము – హైదరాబాదు).

4) శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్య స్వామివారు, **M.A.,** (విశ్రాంత సంస్కృతోపన్యాసకులు – విశాఖపట్టణము).

ఈ విద్వన్మణులందరు గ్రంథమును సమీక్షించి. ఆశీస్సులను కూడ ప్రసాదించినారు. వారికెల్లరకు నా మనః పూర్వక ప్రణా మాంజలులను సమర్పించు చున్నాను.

గ్రంథ రచన పూర్తి అయినది. కాని ముద్రణకు మిక్కిలి ప్రయాసపడవలసి వచ్చినది. అందులకై వివిధ ఆధ్యాత్మిక సంస్థలను సమీపించి, ఈ పవిత్ర కార్యమునకై తోడ్పడ వలసినదిగా అభ్య ర్థించితిని—

1. శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారును,
2. ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక వ్యవహారముల శాఖయును,
3. శ్రీ సత్యసాయి సేవా సమితులు – 1) కాశీబుగ్గ, 2) శ్రీరామ్‌నగర్, 3) కడపలును,
4. మధ్వ సంఘములు—
   1) రాజమహేంద్రవరము 2) విశాఖపట్టణములును,
5. శ్రీకృష్ణచైతన్య మఠము, విశాఖపట్టణము మొదలగు ఆధ్యా త్మిక సంస్థలు గ్రంథ ముద్రణకై తోడ్పడి నన్నుత్సాహ పరచినవి.

పై సంస్థలేకాక కొందరు ప్రముఖులు వైయక్తికముగా కూడ నన్ను గ్రంథ ముద్రణకై ప్రోత్సహించిరి. అట్టి వారిలో ముఖ్యులు:

1. శ్రీ P. V. R. K. ప్రసాద్ గారును, (సాంస్కృతిక శాఖ కమీషనర్, హైదరాబాదు).
2. శ్రీ I. హరగోపాల్ గారును-(షిల్లాంగ్).
3. శ్రీ Y. S. నరసింహారావు గారు (రాజమండ్రి).
5. శ్రీ K. జనార్దన రావుగారును (విశాఖపట్టణము) మొదలగు వారు ముఖ్యులు.

దాతలుగా కొందరు రూ॥ 116/-లు ఇచ్చి తోడ్పడిరి. పుస్తక ముద్రణమునకు ముందే దాని మూల్యమును చెల్లించి మరికొందరు నన్ను త్తేజ పరచిరి. వీరికందరికి శ్రీ మహావిష్ణువు భవభయ భంజనుడై తన నాలుగు చేతులతో చతుర్విధ పురుషార్థములను పుష్కలముగా ప్రసాదించు గాక! యని ఆ దేవ దేవుని ప్రార్థించు చున్నాను.

ఈ గంథమునకు చిత్తు ప్రతులను తయారుచేసిన చిరంజీవినులు కుమారి V. M. L. T. సుందరి B. A., కుమారి కాటూరి కనక మహాలక్ష్మి B. Com., అను వారు. ఈ చిరంజీవినుల కందఱికిని ఆ పురాణ పురుషుడు సకల సంపదలను, శుభములను, ఉత్సాహశక్తులను ప్రసాదించి, ఆధ్యాత్మిక మార్గమున నింకను పురోభివృద్ధిని కలిగించు గాక!

ఆలస్యమైనను, తమ శక్తి మేరకు గ్రంథమును ముద్రించి ఇచ్చిన "ఎక్వేరియన్ ముద్రణాలయపు" యాజమాన్యము వారికి నా హార్దిక కృతజ్ఞతలు.

"ఈ నా కృషి సర్వజనోపయోగకరమై, భగవదనుగ్రహము నకు పాత్రి మగుగాక" అని ఆశించుచు ఆ వాసుదేవునకు అనంత ప్రణామములను సమర్పించుచున్నాను.

ఇట్లు
బుధజన విధేయుడు.
*గోళ్ళమూడి వెంకట శ్రీహరి సుబ్రహ్మణ్యా శర్మ.*

విశాఖపట్టణము.
క్రోధన॥ వైశాఖ శుద్ధ తదియ:-( అక్షతదియ )
తేది. 23-4-85

శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు, ఎం. ఏ.,
విశ్రాంత సంస్కృతోపన్యాసకులు,
MIG 61, షీలానగర్, విశాఖపట్నం-12.

# శ్రీ విష్ణు సహస్రనామ మహత్త్వము

పంచమ వేదమని ప్రసిద్ధిచెందిన భారతమున ప్రధానముగా వైదిక సంప్రదాయమునకు చెందినవారందరి చేతను ఆదరింప బడునవి మూడు 1 భగవద్గీత, 2 శ్రీ విష్ణు సహస్రనామము, 3 సనత్సుజాతీయము. ఇందు శ్రీ భగవద్గీత సాక్షాద్భగవన్ముఖోదితము. శ్రీవిష్ణు సహస్రనామము భగవదనుగ్రహ లబ్ధ దివ్య జ్ఞాన సంపన్నులైన, భీష్మాచార్యులవారిచే "ధర్మములలోకెల్ల అధికతమమైన ధర్మ" మని తమ మతముగా శ్రీ కృష్ణ భగవానుని సమక్షమున యుధిష్ఠిరున కెరింగింపబడినది. భగవన్మతము కంటె భాగవతము పరమ స్వీకార్యము కనుక, శ్రీవిష్ణు సహస్రనామము ఉపాదేయ తమము. 1. భగవద్గీతతో ఐకార్థ్యము ఉండుట వలనను, 2. భీష్మాచార్యుల వారిచే అధిక తమముగా ఆదరింపబడుట వలనను, 3. మహాభారత సారమగుట వలనను, 4. ఋషులచే ఆయా నామములు సమాధిలో దర్శించిన రూపముల ననుభవించి పరీవాహముగా గానము చేయబడిన వగుట వలనను, 5. వేదాచార్యులైన వ్యాసమహర్షిచే స్తోత్ర రూపముగా సమాహరింపబడుట వలనను, 6. పెద్దలు పిన్నలు ఎందరో దీనిని స్వీకరించుట వలనను, శ్రీవిష్ణు సహస్రనామము సహస్రనామములలో కెల్ల ఉత్కృష్ట తమము అని నిర్ధరింపబడినది. బ్రహ్మసూత్రములు, భగవద్గీత, ఉపనిషత్తుల తరువాత త్రిమతాచార్యులచే వ్యాఖ్యానింప బడినది శ్రీవిష్ణు సహస్ర నామమే. దీనియందు ఉపనిషద్గీతా వివరణము స్పష్టముగా కన్పట్టు చుండును. ఇట్టి సహస్ర నామమును ఉపాదేయ తమముగా సర్వులు స్వీకరించుట చేతనే నిరుపపదమగు సహస్రనామ

శబ్దము శ్రీవిష్ణు సహస్ర నామమునకే ప్రధానముగా వాడబడు చున్నది. "గీత" అను వ్యవహారము భగవద్గీతకిని, "సహస్రనామము" అను వ్యవహారము శ్రీవిష్ణు సహస్రనామము నకే ఉన్నట్లు శ్రీ శంకర భగవత్పాదుల వారి "గేయం గీతానామ సహస్రమ్" అను శ్లోక పాదము నిరూపించుచున్నది. శ్రీవిష్ణు సహస్ర నామము యొక్క ఉత్కృష్టతను నిరూపించుచు పూర్వులు ఇట్లు కొన్ని కారణములను వివరించిరి.

శ్లో॥ మహాభారత సారత్వాత్, ఋషిభిః పరిగానతః,
వేదాచార్య సమాహారాత్, భీష్మోత్కృష్టమతత్వతః,
పరిగ్రహాతిశయతో, గీతాద్యైకార్థ్య తశ్చనః
సహస్ర నామ్నామధ్యాయః ఉపాదేయతమోమతః।

1) లౌకిక, వైదిక సకలార్థ నిర్ణయమున మహాభారతము పురాణములలో కెల్ల బలవత్తరమగు ప్రమాణముగా పూర్వులు నిర్ణయించిరి. "సనాతన ధర్మ సంగ్రహమై, వేద ప్రతిపాదిత సకలార్థ సార సంగ్రహమై, తత్త్వార్థ నిర్ణాయకమై, పరమప్రకృష్టార్థ ప్రతిపాదకమై, మహా భారతము అభ్యుదయ నిఃశ్రేయ సార్థులగు వారిచే ప్రధానముగా స్వీకరింపబడ దగినది" అను విషయము సర్వ పురాణ ప్రతిపాదితము. అట్టి మహాభారతమున సారభూతము శ్రీవిష్ణు సహస్రనామము. శ్రీకృష్ణ భగవానులు యుధిష్ఠిరునకు భీష్ములచే ధర్మనిర్ణయము చేయించునపుడు "కోధర్మః సర్వధర్మాణాం భవతః పరమోమతః" అను యుధిష్ఠిరుని ప్రశ్నకు సమాధానముగా తెల్ప బడినది శ్రీవిష్ణు సహస్రనామము. ఇది మోక్షోపాయ ప్రతిపాదకము. "కర్మయోగమా? జ్ఞానయోగమా? భక్తియోగమా? వాక్యార్థ జన్య జ్ఞానమా? శరణాగతియా? ఏది మోక్షోపాయము?" లని బహు ప్రకారముగా పరిభ్రమించు ముముక్షువులకు "సహస్రనామ సంకీర్తనమే మోక్షోపాయ"మని భీష్ములవారు నిరూపించిరి. ఈ విధముగా ప్రావ్య

ప్రాపక నిరూపణ ప్రధానమైన వేదార్థ వివరణము శ్రీ విష్ణు సహస్ర నామము. అందుచే ఇది మహా భారత సారము.

2. ఇందలి సహస్రనామములు భీష్ముల వారిచే కల్పితములు కావు. ఋషులు భగవద్గుణముల ననుభవించి, ఆ అనుభవము హృదయమున నిండి పరీవాహమై, వాగ్రూపమున నిఃసృతములై, నామములుగా వెలసినవి. అనుభవపరీవాహనకే "గాన"మని పేరు. ఋషులు ద్రష్టలు. వారనుభవించిన మూర్తి యొక్క గుణమును వాగ్రూపమున ప్రసరింప జేసినారు. అందుచేతనే ఈ నామములు "గౌణములు" అనగా గుణాను జనితమని అర్థమే కాని, అప్రిధానమని అర్థము కాదు. ఈ నామములు భగవద్గుణ దర్పణములు. ఇట్లు ఋషులచే గానము చేయబడుట విష్ణు సహస్రనామము యొక్క విశిష్టత.

3) ఋషులనేకులు. వారిచే అనుభవింపబడిన గుణములు అనంతములు. వాని పరీవాహములు ఈ నామములు. వానినన్నింటిని ఏకత్రి చేర్చి వేదాచార్యులగు వేదవ్యాసులు, "సాక్షాన్నారాయణావతార రూపులగుటచే" నిరతిశయ జ్ఞానసంపన్నులై స్తోత్రముగా చేర్చిరి. కలి బలమందాధికారులగు మనుష్యులను అనుగ్రహించుటకై సమస్తమగు వేదమును వ్యస్తమొనర్చిన శ్రీకృష్ణ ద్వైపాయనులు పరమాప్తతములు. తత్త్వానుష్ఠానములందు కలుగు అజ్ఞాన, సంశయ, విపర్యయములను పరిహరించుటకై పంచమ వేదమగు భారతము ననుగ్రహించినారు. కాని "అదికూడ విశాలతమ మగుటచే ఎల్లరకు సులభము కాదనియు, ఋషులచే పరిగీతములగు భగవన్నామములు మంత్రములై ఉచ్చారణ మాత్రముచే నెల్లరను రక్షింప గలవనియును భావించి, వేదసార సంగ్రహ రూపముగా శ్రీ విష్ణు సహస్ర నామమును వెలయించిరి.

4) ఆ స్తోత్రము నెఱింగినవారు శ్రీ భీష్మాచార్యులు వారెఱుంగనిది లేదు. ఆతడు ధర్మజ్ఞుడు. సర్వవేద పారంగతుడు. అందుచే

యుధిష్ఠిరునకు ధర్మ నిరూపణము చేయుటకు భీష్ములనే నియోగించెను. అట్టి భీష్ములు "ఏష మే సర్వధర్మాణాం ధర్మోఽధికతమో మతః" అని "భగవత్ప్రాప్త్యు పాయములలో కెల్ల అధికతమమగు ఉపాయముగా, నిరపాయమగు, సిద్ధమగు, అవిలంబన ఫలప్రదమగు, ధర్మము శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రము" అని ప్రతిపాదించెను.

5) శ్రీ విష్ణు సహస్ర నామము ఆయుర్వేదాదులలో సన్నిపాతాది జ్వరముల నివారణమునకు సాధనముగా నిరూపించబడినది. మేహరోగమునకు ప్రాయశ్చిత్తముగా చెప్పబడినది. కొన్ని జ్వరములకు సహస్ర నామములతో హోమము నివారకముగా నిరూపింపబడినది. భూత గ్రహాది నివారణమునకు కూడ విష్ణు సహస్రనామము ఉపయోగించునని చెప్పబడినది. భట్టబాణుడు సూతికాగృహమునందు అవిచ్ఛిన్నముగా సహస్రనామ పారాయణము జరుగుచున్నదని వర్ణించెను. ఈ విష్ణు సహస్రనామమును ఒకసారి వినినను, ధరించినను, జపము చేసినను, సంకీర్తనము చేసినను, లిఖించినను, వ్యాఖ్యానించినను, దానియందు నిష్ఠ కలిగిఉన్నను, నిత్యము పూజించినను, కూడ విష పిశాచ వ్యాధిగ్రహ దుఃస్వప్న దుర్నిమిత్తాది అరిష్టములన్నియు తొలంగును. మహాపాతకములకు ప్రాయశ్చిత్తము – సహస్రనామము. ఐహికాముష్మిక అభ్యుదయ సిద్ధి సాధనము–సహస్రనామము. సంసార గ్రంథి విస్రంసనము–సహస్రనామము. పరమ పదావాప్తి సోపానము–సహస్రనామము. భగవద్గుణ సుధాస్వాద సుఖప్రాపణము – సహస్రనామము. బాలమూక మూర్ఖస్త్రీ నాస్తికాది తారతమ్యము లేక ఎల్లరకు సుఖసాధనము – సహస్రనామము. వేదములకుకూడ లేని పరిగ్రహాతిశయము సహస్రనామమునకు కలదు. కులచరణ గోత్ర శాఖా వర్ణ లింగ విభేదము లేక సర్వులచే సర్వదా స్వీకరింపదగినది–సహస్రనామము.

6) గీతలో ఉపనిషత్తులలో బ్రహ్మసూత్రములలో ప్రతిపాదింపబడిన సర్వరహస్యములు ఇందు నిరూపింపబడి యున్నవని భాష్యము సేవించిన వారికి అవగతము కాగలదు.

ఈ పై ఆరు కారణములచే శ్రీ విష్ణు సహస్రనామము ఉపా దేయతమమని నిర్ణయింప దగును. దీనికి శంకర భగవత్పాదులు భాష్యము ననుగ్రహించిరి. తరువాత శ్రీ పరాశర భట్టారకులు "భగ వద్గుణ దర్పణ"మను పేరున విపులముగా భాష్యమును ప్రసాదించిరి. మధ్వసంప్రదాయమునకు చెందిన శ్రీ సత్యసంధతీర్థులు సహస్రనామ ములకు అనుగ్రహించిన భాష్యము విలక్షణమైనది. విశిష్టమగు వ్యాక రణ పరిజ్ఞానముతో ఒక్కొక్క నామమునకు అక్షరశః అనేకార్థము లను ప్రతిపాదించినారు. సంస్కృత జ్ఞానమున్నను వాని నెఱుంగుట కష్టము. అట్టి భాష్యములను తామధ్యయనము చేసి, దానిని ఇతరుల కందింప వలెనను ఆకాంక్షతో బ్రహ్మశ్రీ జి. వి. యస్. సుబ్రహ్మణ్య శర్మగారు ఆంధ్రుల భాగ్యముగా ఆంధ్రమున అనువదించిరి. ఇది చాలా ప్రయాస సాధ్యమగు పని. వారి దీక్ష ప్రశంసనీయము. భాషా జ్ఞానము, వ్యాకరణ జ్ఞానము, ఉపనిషదాది గ్రంథ పరిచయము, సంప్రదాయ పరిజ్ఞానము కలిగిన వారు కాని దీనిని అనువదింప జాలరు. ఇంత విశాలమైన కార్యమును చేబట్టి, భగవత్కటాక్షముచే పూర్తి చేసి, ముద్రించి, లోకమునకు అందించిన శ్రీ సుబ్రహ్మణ్యశర్మగారు అభినందనీయులు. వీరికి శ్రీ విష్ణు భగవానుడు ఇతోధికముగా ఉత్తమ గ్రంథములను లోకమున కందించు శక్తిని ప్రసాదించుగాక! ఆయు రారోగ్యాభ్యుదయములను నిరంతరము ప్రసాదించుచు వారి సేవను లోకమున కందించునట్లు శ్రీ సీతారామ ప్రభువు కటాక్షించునుగాక!

ఇట్లు నివేదించు

భాగవత పాదరేణువు

24-3-1985 శ్రీభాష్యం అప్పలాచార్యులు

శ్రీః

శ్రీ గురుభ్యో నమః

శ్రీ శ్రీనివాసాయ నమః

# తొలి పలుకు

సనీర నీరద ప్రఖ్యం సచ్చిదానంద విగ్రహం।
రమారమణ మీశేశం విఠ్ఠలం సముపాస్మహే॥

భారతము పంచమ వేదము. "భారతః పంచమో వేదః" అను నానుడి యిందులకు నిదర్శనము. భారతమునకు 'మహాభారత' మను ప్రశస్తికలదు. 'మహత్త్వాత్ భారవత్త్వాత్ చ్చ మహాభారతముచ్యతే' అను నిర్వచనము ఈ ప్రశస్తిని చక్కగా విశదీకరించు చున్నది. మిగుల మహిమ గలది, విషయ గౌరవము కలది గావున, మహాభారత మనబడినది.

మహాభారతమునందలి మహత్త్వమునకు, విషయ గౌరవమునకు తార్కాణములైన ఘట్టములలో అగ్రగణ్యములు i) శ్రీమద్భగవద్గీత, ii) శ్రీ విష్ణుసహస్ర నామ స్తోత్రము. క్రింది శ్లోక మీవిషయము నే నొక్కి వక్కాణించుచున్నది.

శ్లో॥ శాస్త్రేషు భారతం సారం తత్ర నామ సహస్రకం ।
వైష్ణవం కృష్ణగీతా చ తజ్ఞానా న్ముచ్యతేఽంజసా ॥

ఈ ప్రమాణ శ్లోకము ననుసరించి, సకల శాస్త్ర సారభూతమైన మహాభారతమున విష్ణుసహస్రనామము, శ్రీ కృష్ణుని గీతోపదేశము నెలకొని యుండుటచే ఈ యితిహాసము మహా మహిమోపేత మయినదిగా వెల్లడియగుచున్నది.

పై రెండిటిలో నొకటైన విష్ణుసహస్రనామ స్తుతి మహాభారతము నందలి ఆనుశాసనిక పర్వములో కలదు. పరమ భాగవతోత్తములయిన భీష్మాచార్యులవారిచే శ్రీ కృష్ణుని సన్నిధానమున ధర్మజాది పాండవులకు ఉపదేశింపబడిన ఈ స్తోత్రరత్నములోని ప్రతియొక్క నామము నకును నూరర్థములు గలవని శ్రీమన్మధ్వాచార్యులవారు నుడివి యున్నారు. "కలిః సాధుః కలిః సాధుః కలిః సాధుః" అను శ్రీ వేదవ్యాసులవారి వచనము ననుసరించి, కరాళకలి కలుషితమైన ఈ కలియుగమునందు భగవన్నామకీర్తనచేత సకలపాపములు పరిహార మగుచున్నవను సత్యము నిశ్చితమగుచున్నది.

"విష్ణోర్నామ సహస్రన్తు యో వా పఠతి నిత్యశః ।
తస్యాపరాధ సాహస్రం సహతే విష్ణు రవ్యయః ॥"

అను ప్రమాణము ప్రకారము, నిత్యము సహస్ర నామ పారాయణము చేసినచో కరుణానిధియగు భగవంతుడు సకల పాపములను పరిహరించి భక్తజనుల నుద్ధరించు చున్నాడు.

ఇంతటి మహత్త్వము గలిగియున్న ఈ సహస్ర నామములకు శ్రీ సత్యసంధ తీర్థులవారు వ్యాఖ్యానము విరచించియున్నారు. ఈ సత్యసంధ తీర్థులవారు, సూర్యాస్తమయమైన పిమ్మట కూడ ఎల్లరకు సూర్యుని చూపించినట్టివారు, మహాతపస్వులు, త్రికాలజ్ఞులు, కర్ణాటక ప్రాంత సవణూరు పురమున బృందావనస్థులును—అయి విరాజిల్లుచున్న శ్రీ సత్యబోధ తీర్థ శ్రీపాదుల వారికి సాక్షాత్ శిష్యులు.

శ్రీ సత్యసంధ తీర్థులవారి పూర్వాశ్రమ నామధేయము హావేరి రామచంద్రాచార్యులు. మహాపండితులైన వీరు తమ గురువులగు శ్రీ సత్యబోధ తీర్థులను దర్శింపనేగిరి. ఆ సమయమున శ్రీ సత్యబోధ తీర్థులవారు తమకు వార్ధకము వచ్చి యున్నందున, శిష్యులైన హావేరి రామచంద్రాచార్యులకు సన్యాసాశ్రమము నీయదలంచిరి. అయితే

వీరికి ఆయుర్దాయము స్వల్పముగా నున్నదని గ్రహించి, పండ్రెండు కలశములందు ఉదకము నింపి అభిమంత్రించి, ఆ కలశోదకములను త్రావనిచ్చిరి. ఆచార్యులవారు పదికలశముల జలమును త్రాగి, మిగిలిన రెండింటిని త్రాగజాలకపోయిరి. అటుపిమ్మట వీరు మఠాధిపత్యమును వహించి పది సంవత్సరములు జీవించిరి.

వీరనేక గ్రంథములను రచించిరి. వాటిలో శ్రీ విష్ణు సహస్రనామ వ్యాఖ్యానమొకటి. 'సహస్ర' శబ్దమునకు 'అనంత' మని యర్థము.

"అనంతరూపో హి హరిః శబ్దో హ్యేష హ్యనంతధా ।
విష్ణో సహస్రనామ్నస్తు య త్త్రద్రూప సహస్రకమ్॥
బృహతీ సహస్రమేతచ్చ తద్వ్యక్తి హి పృథక్ పృథక్।
సహస్రశబ్దోఽప్యమితం యతో వక్ష్యమితాన్యతః॥
అనంతనామవచనే త్వశక్త్యాత్సహస్రకం।
ఆసీత్సహస్రమిత్యాఖ్యా సహస్రం ముఖ్యతోఽమితమ్॥
సహైవానంతరూపైస్తు సరణేన సహస్రకమ్।
నామ్నా సహ స్మృతేరేవ రూపాణాం వా సహస్రధా॥

సహ + సర = సహస్ర, అనగా సహ = అనంత రూపములతో కూడి, సర = (సరణేన) పొందుటచేత 'సహస్రం' అయినది. అందుపై స్వార్థిక కప్రత్యయము చేరి 'సహస్రక' మని యయినది. ఈ యొక్కొక్క నామము అనంతనామములను చెప్పుటచే, అనంత పదవాచ్యుడైన పరమాత్మునియొక్క అనంత నామములను చెప్పినట్లగుచున్నది.

"సర్వరూపాణ్యతో విష్ణోస్సంస్తుతాన్యమునైవ హి"

ఋగ్వేదమునందలి ఋక్కులలో వేయి ఋక్కులను బృహతీ ఛందస్సుగల మంత్రములుగ సంపాదించుకొని ఒక్కొక్క ఋక్కును పఠించి, యొక్కొక్క నామమునుచ్చరించి, హోమ, అర్చన, పారాయణాదుల చేసినయెడల మహత్తర ఫల ప్రాప్తి కలుగుచున్నది. ఈ విషయమున ఐతరేయోపనిషత్తు, తద్భాష్యము ముఖ్యప్రమాణములు,

## ఐతరేయోపనిషత్తు

"విశ్వామిత్రం హ్యేతదహః సంశిష్యంతమింద్ర ఉపనిషసాద। సహోన్నమిత్యభివ్యాహృత్య బృహతీసహస్రం శశంస। తేన ఇన్ద్రస్య ప్రియం ధామ ఉపేయాయ। తమిన్ద్ర ఉవాచ। ఋషే! ప్రియం మే ధామోపాగాః। స వా ఋషే ద్వితీయం శంసేతి। సహోన్నమిత్యేవ అభివ్యాహృత్య బృహతీ సహస్రం శశంస। తేన ఇన్ద్రస్య........ ధామోపాగాః। ఋషే! తృతీయం శంసేతి......మేధామోపాగాః। వరం తే దదామి। స హోవాచ 'త్వామేవ జానామీ' తి। తమిన్ద్ర ఉవాచ 'ప్రాణో వా అహమస్మ్యృషే।' ఇతి"—అని.

ఈ యుపనిషత్తుయొక్క భాష్యము :—
"వృత్రం హత్వా సురేన్ద్రస్తు మహేన్ద్ర త్వాభిపత్తయే"..........

ఇంద్రుడు స్వర్గమునకు మాత్ర మధిపతియై యుండెను. ఆయన వృత్రాసురుని సంహరించిన పిదప త్రిలోకాధిపతి కాదలచినవాడై, మహేన్ద్ర పదమును పొందగోరి 'బృహతీసహస్ర' హోమము నొనర్ప దలచెను. మహా వ్రతమనెడి ఈ మహాయజ్ఞమున విశ్వామిత్ర మహర్షిని హోతగాను, భృగుమహర్షిని అధ్వర్యునిగాను వరించి, చతుర్ముఖుని బ్రహ్మస్థానమునందును, వాయుదేవుని ఉద్గాతృ స్థానమునందును, సాక్షాత్పరమాత్మను సదస్యుడుగాను ఉండుటకై ప్రార్థించి యజ్ఞమును సాంగోపాంగముగ జరిపించు చుండెను. విశ్వామిత్రులు పరమాత్మను బృహతీ సహస్రముచే స్తుతించి, స్మరించెను.

"వాయునా సహ దేవేశ స్తదా వాసవమావిశత్।
తచ్ఛ్రుత్వా తుష్టిమగమత్ కేశవో వాయుసంయుతః॥
ద్వితీయవారం శంసేతి ప్రాహ తం చ జనార్దనః।
అతిప్రియత్వాద్భగవాన్ పునరప్యాహ కౌశికమ్॥
తృతీయం చ శశంసాసౌ విష్ణోరన్నం ప్రకల్పయత్।
తతోఽతి తుష్టో భగవాన్ దదామి వరమిత్యముమ్॥

ఊచే చ ప్రథమే త్వేవ నిజసాలోక్య మీశ్వరః।
ప్రాదాద్ ద్వితీయే సామీప్యం తృతీయే పునరేవ చ॥
వరం దదామీత్యుక్తస్సమునిః ప్రాహ జనార్దనమ్।
సమ్యక్ త్వామేవ జానీయామితి మోక్షే సుఖోచ్ఛ్రితామ్"॥

ఈ రీతిగ ఇంద్రుని ఆవేశించియున్న పరమాత్మ తనను మొదటి సారి స్తుతించుటచే సాలోక్యమును, రెండవమారు స్తుతించుటచే సామీప్యమును, మూడవమారు స్తుతించుటచే సాయుజ్య మోక్షము నిచ్చినట్లు విశ్వామిత్రునితో తెలిపి, ఇంకను నేమి వరము కావలెనో అనుగుమనెను. అందులకు విశ్వామిత్రుడు 'నీవెవ్వడివో తెలుపు' మని ప్రార్థించెను. అందులకు పరమాత్మ 'ప్రాణోవా అహమస్మృషే' నేను ప్రాణనామకుడగు భగవంతుడనని ప్రత్యుత్తర మొసంగెను.

"అభిమానీ బృహత్యాస్తు వాయురేవ యతః ప్రభుః।
తస్మాదేషా ఛందసాం హి వరిష్ఠా బృహతీ స్మృతా॥"

బృహతీ ఛందస్సునకు అభిమాని దేవత వాయువు. "బృహతీ దేవతా తత్రభగవాన్ పురుషోత్తమః" అని చెప్పబడి యుండుటవలన బృహతీ సహస్రమునకు అభిమానియగు వాయుదేవునితో కూడ భగవంతుని గుణగణాతిశయములను ప్రతిపాదించుట ద్వారా పరమాత్మకు పరమప్రీతికరమై విలసిల్లినది.

## బృహతీ ఛందస్సు యొక్క వివరణము :-

వేదములందు సామాన్యముగా 1) గాయత్రీ 2) ఉష్ణిక్ 3) అనుష్టుప్ 4) బృహతీ 5) జగతీ 6) పంక్తి 7) త్రిష్టుప్ – ఈ క్రమమున ఏడు ఛందస్సులయందు ఋక్కులు పఠింపబడియున్నవి. అనుష్టుప్ ఛందస్సులో పాదమునకు ఎనిమిది యక్షరముల ప్రకారము నాల్గు పాదములకు మొత్తము ముప్పది రెండక్షరములు. బృహతీ ఛందస్సులో పాదమునకు ముప్పదియక్షరముల వంతున నాల్గుపాదము

లకు ముప్పదియారక్షరము లుండును. ఋగ్వేదమందలి ఋక్కులలో వేయి ఋక్కులను బృహతీ ఛందస్సులోనికి సంపాదించుకొని, ఒక్కొక్క ఋక్కును చెప్పి, విష్ణు సహస్రనామముల యందలి ఒక్కొక్క నామము చేత (ఓం విశ్వాయనమః) భగవదర్చనను హోమమును చేయవలెను. ఈవేయి ఋక్కులలో ముప్పదియారు వేలు (36,000) అక్షరములున్నవి. వీనిలో 36,000 అజ్వర్ణములు, 36,000 హల్వర్ణములు. ఈ రెండును చేరి 72,000 వర్ణములగును.

మానవుని ఆయుః ప్రమాణము (శతమానం భవతి) అని చెప్పినట్లు నూరేండ్లు. వీనిలో 36,000 దినములు అనగా 3600 అహస్సులు 3600 రాత్రులు. అన్నియు చేరి 72,000 అహోరాత్రములు. మానవుని శరీరమునందు ఇడా, పింగళా - మున్నగాగల 72,000 నాడులున్నవి. కుడివైపున 3600 నాడులు ఎడమవైపున 3600 నాడులు గలవు. సూర్యాంతర్గత భగవంతుని మనము ధ్యానము చేయునపుడు మన హృదయ పద్మాంతర్గతుడగు భగవంతునితో గూడ ముఖ్య ప్రాణ [వాయు] దేవుని సాన్నిధ్య ముండుటచే ఈ మానవ శరీరమునగల 72000 నాడులలో నుండు దేవతలను ధ్యానము చేసినట్లగు చున్నది.

"ఇంద్రస్య = పరమేశ్వరస్య, విష్ణోః, నితరాం ప్రియత్వాత్ యః ప్రాణదేవతా వాయుః, తస్య ప్రతిమారూపం ఇదం బృహతీ సహస్రం। స చ వాయుః విష్ణోః ముఖ్య ప్రతిమా। తస్మాద్విష్ణోరేవ ప్రతిమా బృహతీ సహస్రం।" అని ఈ రీతిగ శ్రీ మన్మధ్వాచార్యుల వారు తెలిపియుండుటచే ఈ బృహతీ సహస్రముచేత ధ్యాన, హోమ, అర్చనలు చేసినచో మన శరీరమున అంతర్యామియైన పరమాత్మ, మరియు తదధిష్ఠాన భూతుడైన వాయుదేవుడు పరమప్రీతులై "తస్మాద్వాయుకృతం సర్వం క్రియతే విష్ణునైవ హి" అని చెప్పిన రీతిగా పరమానుగ్రహమును ప్రసరించి ఐహికాముష్మిక సుఖరూప ఫల ప్రదులగు చున్నారు. మానవుని జీవితకాలమున ఎపుడైన నొకమారు బృహతీ సహస్ర సహితమైన సహస్రనామములతో హోమము చేసి

నచో, అట్టివారికి నూరేండ్ల కాలము ధ్యానము చేసిన ఫలితము లభించు చున్నది. ఇందులకు సంశయము లేదు.

"ద్వాసప్తతి సహస్రాణి రూపాణ్యేనం రమాసతేః।
శతాబ్దానామహోరాత్రం దైవతాన్యుత్తమాని చ॥
బృహతీ సహస్ర వర్ణానాం అపి ధ్యాత్వాఖిలాన్యపి।
శతవర్ష హరిధ్యాన ఫలమాప్నోతి పూరుషః॥"

—అని శ్రీ మన్మధ్వాచార్యులవారు ప్రమాణ పూర్వకముగ వ్యాఖ్యానము చేసి మన యజ్ఞానమును పరిహరించి మోక్షసాధనమైన పరమోపకారము చేసి మనల నుద్ధరించినారు. కావున సర్వకాలము లందును సర్వావస్థ లందును సర్వజ్ఞులయిన యీ ఆచార్యులవారు చూపించిన సన్మార్గమునందు ప్రవృత్తులై వారిని స్మరించుచు వారికి కృతజ్ఞులై యుండవలెను.

ఇట్లు తెలిసికొనిన వారిని గూడ భగవంతు డనుగ్రహించి సకలైశ్వర్యముల ప్రసాదించి తుదకు మోక్షము నిచ్చును. ఇందులకు ప్రప్రమాణము—

"షట్ త్రింశత మక్షరాణాం సహస్రాణి భవన్తి తావన్తి శత సంవత్సర స్యాహ్నాం సహస్రాణి భవన్తి వ్యంజనై రేవ రాత్రీ రాప్నువన్తి స్వరైరహాని తద్వా ఇదం బృహతీ సహస్రం సంపన్నం తస్య వా ఏతస్య బృహతీ సహస్రస్య సంపన్నస్య పరస్తాత్ప్రజ్ఞామయో బ్రహ్మ మయోఽమృతమయః సంభూయ దేవతా అప్యేతి య ఏవం వేద॥"
( ఐతరేయ ఉ॥ 2 – 2 )

ఇట్టి మహిమోపేతమైన సహస్రనామ ద్వైత భాష్యమునకు ఇంతవరకు ఆంధ్రానువాదము లేని కొరతను గమనించిన శ్రీ డి. ఆర్. వాసుదేవరావుగారి (**Sr. Lecturer in English, Mrs. A.V.N. College, Visakhapatnam**) కోరిక ననుసరించి జిజ్ఞాసువులైన

భక్త జనుల ఉపయోగార్థమై సులభ సుందర శైలిలో ఆంధ్రీకరించిన వారు, నాకు మిక్కిలి ఆప్తులు అయిన బ్రహ్మశ్రీ జి. వి. యస్. సుబ్రహ్మణ్యశర్మగారు (Head of the Department of Sanskirt, Mrs. A.V.N. College, Visakhapatnam). వీరిరువురికిని భగవంతుడు సకలైశ్వర్యములను, ఆయురారోగ్య భాగ్యాది సమస్త సన్మంగళములను ప్రసాదించి యనుగ్రహించుగాక యని కలియుగ ప్రత్యక్ష దైవమైన శ్రీ శ్రీనివాసుని ప్రార్థించు చున్నాడను. ఇటులనే శ్రీ మధ్వాచార్యులవారి తదితర గ్రంథములు సైతము శ్రీ శర్మగారిచే తెలుగులోనికి అనువదింపబడి వెలుగులోకి రావలయునని మనసార భగవంతుని ప్రార్థించుచున్నాను.

తత్త్వజ్ఞానాసక్తులైన పాఠకుల విశేషాదరణవల్ల అచిరకాలంలోనే ఈ గ్రంథము పునర్ముద్రణ పొందగలదని విశ్వసిస్తూ సర్వులకు ఇహపర శ్రేయస్సుల ఒదగూర్చవలెనని భగవంతుని ప్రార్థిస్తున్నాను.

"సర్వేజనా స్సుఖినో భవన్తు"

దత్తాత్రేయ జయన్తి,
దుందుభి.
30-12-1982.

ఆర్. రామమూర్తి శర్మ,
విశ్రాన్త వ్యాకరణ ప్రధానాధ్యాపకులు,
శ్రీ వేంకటేశ్వర పాచ్యకళాశాల, తిరుపతి.

కళాప్రపూర్ణ ఆచార్య దివాకర్ల వెంకటావధాని    హైదరాబాదు,
ఎమ్. ఏ. పిహెచ్. డి.    28-6-83.
భూతపూర్వ ఆంధ్రశాఖాధ్యక్షులు,
ఉస్మానియా విశ్వ విద్యాలయం.

# శుభాశంస

సంస్కృతమున అనేక సహస్రనామ స్తోత్రములున్నవి. అవి వివిధ దేవతలకు సంబంధించినవి. ఏదైవము నుపాసించు వారు ఆ దైవమునకు సంబంధించిన సహస్రనామములు చెప్పుచు పూజలు చేయుచుందురు. ఈ సహస్రనామములలో కొన్ని పురాణాంతర్గతములైనవి. వీనిలో మిక్కిలి ప్రచారమందున్న సహస్రనామ స్తోత్రము శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రము. శరతల్ప గతుడైన భీష్ముడు విష్ణువు యొక్క మహాత్త్వమును బోధించుచు ధర్మరాజునకీ స్తోత్రమును చెప్పియుండెను.

శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రమునకు త్రిమతానుగుణమైన వ్యాఖ్యలే కాక ఇంకను పెక్కు వ్యాఖ్యానములు కలవు. జగద్గురు శంకరాచార్యులవారి భాష్యము లోకమున మిక్కిలి ప్రచారములో నున్నది. వైష్ణవులు శ్రీరామానుజ భాష్యమును ఆదరింతురు. మధ్వమతానుసారముగ శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రమునకు వ్యాఖ్య రచించినవారు శ్రీ సత్యసంధ తీర్థులవారు. శ్రీ మధ్వాచార్యులవారు విష్ణు సహస్రనామ స్తోత్రమును వేయి నామము లుండుటయే కాక ఒక్కొక్క నామమునకు వేయి అర్థములు చెప్పుటకు అవకాశమున్నదని ఒకప్పుడు తెలిపియుండిరట. ఇచ్చట సహస్ర శబ్దమునకు అనేకమని అర్థము చెప్పుకొనవలెను. సంస్కృత భాష విస్తృతమైనది. అందలి పదములకు వివిధములైన అర్థములు చెప్పుటకు కూడ వీలున్నది. అందుచే ఒక్కొక్క నామమును వీలైనన్ని విధముల విడదీసి అర్థము చెప్పవచ్చును. అట్లే సమాసరూపమున నున్న నామములకు భిన్న భిన్న రీతుల విగ్రహ వాక్యములను చెప్పవచ్చును.

శ్రీ సత్యసంధ తీర్థుల వారు కొన్ని నామములకు 10 విధములుగ కూడ అర్థములు చెప్పియుండిరి. అది వారి పాండిత్యమునకు, విష్ణు భక్తికిని, పురాణగాథా పరిచయమునకును తార్కాణము. ఒకే నామమునకు వివిధములైన అర్థములు చెప్పునపుడు కొన్ని దూరానేయములుగా కనుపట్ట వచ్చును. కాని వానిలో నా యర్థమిమిడి యున్నదనుటలో మాత్రము సందేహము లేదు. సత్కీర్తిః (635) అన్నచోట శ్రీ తీర్థులవారు వామనునకు సాధ్వియైన 'కీర్తి' యను భార్య యున్నదని ఒక అర్థమున తెలిపియుండిరి. వామనుడు వటువుకదా! అతనికి పెండ్లి యైనదా? అని మన కాశ్చర్యము కలుగును. కాని ఆ గాథ భాగవతము నందలి షష్ఠమ స్కందముననే ఉన్నదట. [భాగ–6–18–8] ఈ విధముగా విష్ణువు యొక్క 'జగద్వ్యాపకత్వమును, సర్వగుణ సంపన్నత్వమును సూచించుటకు వారెన్నో అర్థములు చెప్పియుండిరి.

భారత దేశమున త్రిమూర్తులలో విష్ణువును, శివుని పూజించు వారనేకులున్నారు. విష్ణువును పూజించువారు విష్ణు సహస్రనామ స్తోత్రమును పఠించుచు ఆ పూజ చేయుచుందురు. ఆ నామములలో కొన్నింటికి వారి కర్థములు తెలియవు. తెలిసినను ఒక అర్థమే తెలియును. కాని వివిధములైన అర్థములు తెలియవు–అందుచే నామముల యర్థములను సంపూర్ణముగా నెఱుంగ కోరు వారు భాష్యములను పఠింపవలెను. అది సంస్కృతభాష తెలిసిన వారికే సాధ్యముకాని ఇతరులకు సాధ్యము కాదు. శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్ర భాష్యమునకు ఆంగ్లముననను, కొన్ని ఇతర భాషలయందును అనువాదము లున్నవి. తెలుగున కూడ కొన్ని అనువాదము లిదివరకే ప్రచురించ బడినవి.

కాని మధ్వ సాంప్రదాయాను గుణముగా రచింపబడిన ఈ భాష్యమునకు ఇదివర కాంధ్రాను వాదములు వెలసినవో లేవో నాకు తెలియదు కాని యిప్పుడు శ్రీ జి. వి. యస్. సుబ్రహ్మణ్య శర్మ గారు దానిని తెలుగున కనువదించి మహనీయుడైన విష్ణువుకు గల

నామముల అర్థములన్నియు తెలుగున తెలిసిన సామాన్యులకు కూడ నెఱుంగుట కవకాశము కల్పించియున్నారు. ఇతర సంప్రదాయముల ననుసరించు వారు కూడ నిందలి యర్థములను గ్రహించి విష్ణువు మహాత్మ్యము నెఱుంగుటలో దోషములేదు. అనువాదము మూలానుసారియై, స్పష్టమై సర్వసుబోధముగా నున్నది. అర్థము నెఱిగి దేవతా నామము లుచ్చరించుచు పూజలు చేయువారికి ఫలిత మనల్పముగా నుండునని పెద్దలు చెప్పుదురు.

అందుచే భక్తులందరు నీయనువాదము సాహాయ్యమున జగత్ప్రసిద్ధమైన శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రమునకు అర్థము నెఱిగి, ఆ సంస్కారముతో సత్త్వగుణ సముద్రుడైన శ్రీ మన్నారాయణుని పూజించి తరింతురని ఆశించుచున్నాను.

(సం॥) దివాకర్ల వెంకటావధాని.

శ్రీః

వ్యాకరణాలంకార చక్రవర్తి, సాహిత్య విశారద,
వ్యాకరణ విద్యాప్రవీణ, సాహిత్య విద్యాప్రవీణ,
భాషాప్రవీణ :—
అప్పల్ల సోమేశ్వర శర్మ, ఎమ్. ఏ; పి. ఒ. ఎల్.
ఉపాచార్యుడు (విశ్రాంతుడు),
సంస్కృత విభాగము. ఆంధ్ర విశ్వవిద్యాలయము. (వాల్తేరు)

# సాధువాదము

సకల చరాచర సృష్టి స్థితి లయములకును, పరమ మూలము పరబ్రహ్మము. "తద్విజిజ్ఞాసస్వ— తద్ బ్రహ్మేతి" అని ఉపనిషత్తుల ఉద్ఘోషణము. ఆ పరబ్రహ్మమే శ్రీ మహావిష్ణువు. సృష్టియందలి నామ రూపములన్నియు ఆ మహానుభావుడే. 'ఏకం సద్విప్రా బహుధా వదంతి' అని ఋషివచనము. విష్ణువును త్రికరణశుద్ధితో సమారాధనము చేసి ఇహపర సౌఖ్యములను పొందదగు వివిధ మార్గములలో ప్రముఖమైనది "నామ సంకీర్తనము". దాని విశ్వరూపమే సాంప్రదాయకమగును, పారంపర్యముగను విస్తరించిన శతకములును, సహస్రనామములును.

సహస్రనామములకు ప్రచోదనమును వేదమే చేసిన దనవచ్చును. వేదములు భగవత్ స్తుతిరూపములే గదా! "యావంతి వేదాక్షరాణి తావంతి హరినామాని" (వేదమందలి ప్రతి యక్షరము హరినామమే) అని అనూచానమైన ఆభాణకము. యజుర్వేదములోని 'శతరుద్రీయము' లేక "రుద్రాధ్యాయము" రుద్రుని సహస్రనామములను కీర్తించి, సహస్రనామములకు దారి చూపినది. "సర్వాణి రూపాణి విచిత్య ధీరః। నామాని కృత్వా అభివదన్ యదాస్తే", "సహస్ర శీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్" మొదలగు వచనములు మంచిస్ఫూర్తిని, ఉత్సాహమును సంపాదించి పెట్టినవి. ఫలితముగ పురుష దేవ

తాకములును, స్త్రీ దేవతాకములునగు సహస్రనామ స్తోత్రములు కొల్లలుగా ఆవిర్భవించినవి. వానిలో పెక్కులు వ్యాసప్రోక్తములే. "శ్రీ వేదవ్యాసో భగవాన్ ఋషిః" అని అనక తప్పదు.

ఆ రీతిని "పారాశర్య వచస్సరోజము" యొక్క విలాసములుగ వెల్లివిరిసిన "సహస్రనామస్తోత్రము" లలో అతివిశిష్టమైనది 'శ్రీ విష్ణు సహస్రనామస్తోత్రము'–"పవిత్రం మంగళం పరమ్". ఇది మానవులకు "వజ్రకవచమువంటిది" అని శ్రీకాంచీ కామకోటి పీఠాధిపతులు ఒక సందర్భమున ప్రస్తావించి యున్నారు. సర్వరోగప్రశమనము, సర్వాపద్వినివారణము, సర్వసంపత్ ప్రదాయకమును– అని, భక్తుల సుదృఢమైన విశ్వాసము.

ఈ స్తోత్రము మహాభారతమున అనుశాసన పర్వములోని ఆనుశాసనిక పర్వమందు నూటనలుబది తొమ్మిదవ అధ్యాయముగ ప్రకాశించుచున్నది. అధ్యాయ సంఖ్యా విషయమున మతభేద మున్నట్లు తోచుచున్నది. రెండువందల ఏబదినాలుగవ అధ్యాయముగ కొందరు భావించుటయు, అట్లు కొన్ని పుస్తకములందు ముద్రించుటయు గూడ జరిగినది. అయినను 149వ అధ్యాయమనియే నా తాత్పర్యము. సునిశితముగ పరిశీలించి ప్రకటించిన "గీతాప్రెస్" (గోరఖ్ పూర్) మొదలగు ప్రకాశకుల మహాభారతములలో నాకు సంవాద మధికముగా లభించినది. దాక్షిణాత్యోదీచ్యపాఠ భేదములను అనుశీలించినను, అంతటి వ్యత్యాసముండుట కవకాశము చిక్కదు. అస్తు. సంఖ్యా విషయమున సంఖ్యమనుచితము. ఇట్లే నామముల సంఖ్య విషయమున గూడ కొంత వివాదమున్నది. "సహస్రనామములు" అన్నందున, ఎట్లయినను వెయ్యికి మించకూడదని కొందరి అభినివేశము. సహృదయ మిత్రులు, సతీర్థ్యులు, కొంతకాలముపాటు నాకు సహోపాధ్యాయులును అయిన మధ్వ శ్రీ రాజాచార్య రామమూర్తి శర్మగారు (తిరుపతి) అట్టి పట్టుదలను చూపినారనియు, అది మధ్వ సంప్రదాయమని చెప్పినారనియు తెలిసినది. సంతోషమే. వారి సంప్రదాయము సంభావ్యమే.

అయినను సహస్రనామ స్తోత్రములలోని "సహస్ర" శబ్దము అంతటి నిర్బంధము కాదనియు, ఉపలక్షకము మాత్రమే అనియు, కొద్దిపాటి హెచ్చుతగ్గులు నామసంఖ్యలో అంగీకర్తవ్యమనియు, అది అనూచానమే అనియు మరికొందరి వాదములు కూడ ప్రసిద్ధముగ కనబడుచున్నవి. సహస్రనామముల విషయముననే గాక, అష్టోత్తరశత నామములు, శతకములు, త్రిశతులు మొదలగు స్తోత్ర ప్రక్రియ లన్నింటి యందును—ముఖ్యముగ ఆధిక్యము—సర్వానుభవసిద్ధము. "సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్", "నమో స్త్వనంతాయ సహస్ర మూర్తయే" ఇత్యాది వచనములను ఈ సందర్భమున పరామర్శించుట యుక్తము. అట్లుకాదని ఆగ్రహము వహించినచో మూలపాఠమున మిక్కిలి ప్రయాసముతోడి పదవిభాగములను, పదసంఘటనములను, తప్పక చేయవలసి వచ్చును. కొన్నిచోట్ల అతీరు అనౌచిత్యమును గూడ పోషించును. కాగా అట్టిరీతి నాకభిమతము కాదు. ఏవో కొద్దినామము లధికమైనంత మాత్రమున దోషము వాటిల్లదని నా అభిసంధి. భవతు. ఇచట గూడ వాదోపవాదముల నావశ్యకము. విషయ ప్రశంసయే అందరకును కావలసినది. మీదింతయు ఆనుషంగికము.

విష్ణు సహస్రనామములకు మతత్రయము వారును, వారి వారి సిద్ధాంతాను సారముగ భాష్యములను వ్రాసికొన్నారు. అవి చిర కాలమునుండియు ప్రచారములో ఉన్నవి. అందు శ్రీ సత్యసంధయతి రాజు అను మహోదయులు మధ్వ సిద్ధాంత సువిధేయముగ సంతరించిన భాష్యము మనకు ప్రకృతము. సత్యసంధులు ప్రతియొక నామమునకు బహుభంగుల వ్యుత్పత్తిని చూపుచు, అద్దాని నానార్థప్రవణత్వమును విశదీకరించినారు. అట్టియెడ పెక్కుధాతువులను, కొల్లలుగ ప్రత్యయ ములను, వ్యాకరణ కార్యములను, ప్రదర్శింపుచు, వారివైయాకరణ సార్వభౌమత్వమును గూడ నిరూపించుకొన్నారు. కొన్నిచోట్ల వారు చూపిన ధాతువులును, ప్రక్రియా విశేషములును, "అపాణినీయము లేమో!" అనియు అనిపించును. ఆవశ్యకములైన శ్రుతి, స్మృతి, పురా

ణాది ప్రమాణవాక్య పరంపరలతో, శ్రీ సత్యసంధ యతిరాజ భాష్యము మిక్కిలి ప్రామాణికమై విశిష్య మధ్వ సంప్రదాయ ప్రదీపకమై అలరారుచున్నది.

అట్టి సత్యసంధ భాష్యమును, సహృదయ వతంసులు శ్రీ గోళ్లమూడి వెంకట శ్రీహరి సుబ్రహ్మణ్యశర్మగారిపుడు తెలుగుభాష లోనికనువదించినారు. శ్రీ శర్మగారు చిరకాలము నుండియు నాకాప్త మిత్రులు, అవ్యాజ గురుభావమును నాయందు పెంచుకొన్నవారు, భక్తాగ్రగణ్యులు, ఆధ్యాత్మిక చింతానాసక్తులు, దైవకార్య నిర్వహణ దక్షులు, సరస హృదయులు, సరసవచో నిపుణులును — అని నా మనస్సునకు హత్తుకొన్న భావములు. అనువాదమున కావశ్యకమైన పాండితి, పరికరము వీరికి గలదు. ఆస్థ, శ్రద్ధ, విశిష్టమైన కృషి— మొదలగునవి వీరి సహజ గుణములు. కారణ సామగ్రి పుష్కలముగ ఉన్నపుడు, కార్యమావిర్భవించుట కభ్యంతరమేమి? అదే జరిగినది. విష్ణుసహస్రనామ భాష్యమునకు ఆంధ్రానువాద ముద్భవించినది.

శ్రీ సుబ్రహ్మణ్య శర్మగారు తమ కర్తవ్యమును పూర్తిచేసి, ఆత్మవిశ్వాసమును పొందుటకును, సంవాదమును సంపాదించుకొనుటకును, ప్రామాణికత్వమును దృఢతరము చేయుటకును శమదమాదుల కోర్చి, అనువాదమును సంప్రదాయజ్ఞులకును, పండితులకును అప్పగించిరి. అట్టి వ్యక్తులలో నేనొకడ నగుట అదృష్ట విశేషము. గ్రంథమును చాలకాలము నాయొద్దనే ఉంచికొని, యథాశక్తి సముచిత సంస్కారములను చేసితిని. ఎడనెడ శ్రీ శర్మగారు కూడ నన్ను కలిసి ముచ్చటించుటయు, నాకు తోచిన మాటలను నేను సూచించుటయు, వారంగీకరించుటయు జరిగినది. ఈ విధముగనే, శ్రీ ఆర్. రామమూర్తి శర్మగారును (తిరుపతి), శ్రీమాన్ శ్రీ భాష్యము అప్పలాచార్యులుగారును (విశాఖపట్టణము—వీరు నాకు బాల్యమిత్రులు, సహాధ్యాయులు, సవయస్కులు) చేసినారని తెలిసినది. నేను అద్వైతిని, శ్రీమాన్ అప్పలాచార్యులుగారు విశిష్టాద్వైతి, శ్రీ రామమూర్తి

శర్మగారు ద్యుతి. త్రివేణీ సంగమము గుర్తుకు వచ్చినది. శ్రీ సుబ్రహ్మణ్య శర్మగారి గడుసుదనమునకు నవ్వును వచ్చినది. ఇట్లు వారు చమత్కారముగ తమ రచనకు "మతత్రియ ముద్ర" సంపాదించికొని, "సెబాస్" అనిపించు కొన్నారు. "కృతం కర్తవ్యమ్". మరియొక చిత్రము! పరిశీలకులము ముగ్వురముకూడ, ఒకే విద్యా వంశమునకు (విజయనగర విద్యా వంశము) చెందినవారము - తత్రాపి- పెనవేసికొన్న ఆంతరానుబంధములు గలవారము. ఇదే దైవ సంకల్పము. అది శ్రీ సుబ్రహ్మణ్యశర్మగారి సంకల్ప ఫలము.

ఇక అనువాదమును గురించి, రెండు మాటలు. "నాఽమూలం లిఖ్యతే కించిన్నాఽనపేక్షిత ముచ్యతే" (మూలములోలేని విషయమును చెప్పుటగాని, అక్కరలేని అంశమును వ్రాయుటగాని జరుగలేదు) అన్న సంప్రదాయము ననుసరించియే రచన సాగినది. ముఖ్యముగ బోధసౌకర్యమును దృష్టిలో నుంచికొని, వివరణము మొదలగునవి జరిగినవి. కాగా ఈ "శ్రీ విష్ణుసహస్రనామ భాష్యానువాదము" పండిత పామర సాధారణముగ రంజకమును, ఆస్వాద్యమును, సంసేవ్యమును కాగలదని, నా విశ్వాసము. సంప్రదాయమేది అయినను, విష్ణు పారమ్యము విషయమునను, నామ సంకీర్తనము విషయమునను విప్రతిపత్తి ఎవ్వరికిని ఉండవలసిన ఆవశ్యకము లేదు గదా! "ఏకో విష్ణుర్మహద్భూతం పృథగ్భూతా న్యనేకశః" అనునది సర్వోపాదేయమే గదా! అందువలన ఈ గ్రంథము సర్వదా— సర్వథా—సర్వోపాదేయ మగుగాక! — అని నా శుభాశంసనము.

"వివిధములైన భక్తి ప్రక్రియలలో భగవద్విషయ రచన ఒక ప్రక్రియ" అని ఘంటాపథముగా చెప్పవచ్చును. దీనినిగూడ చక్కగ సాధించి, శ్రీ సుబ్రహ్మణ్య శర్మగారు "స్వయం తీర్ణః పరాన్ తారయతి" (తాను సంసార సాగరమును దాటి, ఇతరులను గూడ దాటింప

వలెను) అన్న సూక్తికి సార్థక్యమును సంపాదించినారు. "సాధు! శ్రీ శర్మాణః - సాధు!" అని వారికి నా సాధువాదములను ప్రకటింపు చున్నాను. "అభీష్ట సిద్ధిరస్తు" మొదలగు మా ఆశీస్సులు వారిని ఎల్లవేళ లందును వెన్నంటియే ఉండును.

ఓం తత్ సత్

ఇంటి నెంబరు : 50_96_8/A,
టి. పి. టి, కాలనీ,
సీతమ్మధార, విశాఖపట్టణము_13.

అప్పల్ల సోమేశ్వర శర్మ
28-3-1985.
(క్రోధన_చైత్ర శుక్ల సప్తమి_గురువారము)

॥ ఓం నమో భగవతే వాసుదేవాయ ॥

॥ ఓం నమో నారాయణాయ ॥

# శ్రీ విష్ణు సహస్రనామ శాపవిమోచనమ్

ఓం అస్య శ్రీ విష్ణోః సహస్రనామ్నాం రుద్రశాపవిమోచన మంత్రస్య మహాదేవ ఋషిః. అనుష్టుప్ఛందః. శ్రీ రుద్రానుగ్రహ శక్తి ర్దేవతా. సురేశః శరణం శర్మేతి బీజమ్. అనంతో హుత భుగ్భోక్తేతి శక్తిః. సురేశ్వరాయేతి కీలకమ్. రుద్రశాపవిమోచనే వినియోగః.

కరన్యాసః :–

ఓం క్లీం హ్రాం అంగుష్ఠాభ్యాం నమః
ఓం హ్రీం తర్జనీభ్యాం నమః
ఓం హ్రూం మధ్యమాభ్యాం నమః
ఓం హ్రైం అనామికాభ్యాం నమః
ఓం హ్రౌం కనిష్ఠికాభ్యాం నమః
ఓం హ్రః కరతలకర పృష్ఠాభ్యాం నమః

హృదయాదిన్యాసః

ఓం క్లీం హ్రాం హృదయాయ నమః
ఓం హ్రీం శిరసేస్వాహా
ఓం హ్రూం శిఖాయై వషట్
ఓం హ్రైం కవచాయ హుం
ఓం హ్రౌం నేత్రత్రయాయ వౌషట్
ఓం హ్రః అస్త్రాయ ఫట్

ధ్యానం :–

తమాలశ్యామలతనుం పీతకౌశేయ వాససమ్
వర్ణమూర్తిమయం దేవం ధ్యాయే న్నారాయణం విభుమ్.

మూల మంత్రం :– ఓం క్లీం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం

ఈ మంత్రం నూరుసార్లు గాని, లేదా యథాశక్తి జపం చేసి, యీ క్రింది విధముగా ప్రార్థించేది.

ఓం శ్రీ విష్ణోః సహస్రనామ స్తవ! రుద్రశాప విముక్తో భవ.

ఈ విధముగా ప్రార్థించిన తరువాత విష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణం చేసేది.

గమనిక :— శ్రీ విష్ణు సహస్రనామమును గురుముఖతః మంత్ర రూపముగా ఉపదేశము పొందినవారు పురుషసూక్త న్యాస సహితముగా పూజచేసి, తరువాత పారాయణము చేయవలెను. ఇతరులు కేవలము శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రమ్. నుండి పారాయణ మొనర్పవలెను. పుట : 17.

శ్రీ మహా గణాధిపతయే నమః

# శ్రీ విష్ణు సహస్రనామ పూజా విధిః

## పురుషసూక్త న్యాస సహితమ్.

ఆగమార్థం తు దేవానాం, గమనార్థం తు రక్షసామ్ ।
కురు ఘంటారవం తత్ర, దేవతాహ్వాన లాంఛనమ్ ॥

ఇతి ఘంటానాదం కృత్వా

అపసర్పంతు యే భూతాః । యే భూతా భూమి భారకాః ।
యే భూతా విఘ్నకర్తార । స్తే నశ్యంతు శివాజ్ఞయా ॥
అపక్రామంతు భూతాద్యా, స్సర్వే తే భూమి భారకాః ।
సర్వేషా మవిరోధేన బ్రహ్మకర్మ సమారభే ॥

ఆచమ్య । కేశవాయ స్వాహా । నారాయణాయ స్వాహా । మాధవాయ స్వాహా । గోవిందాయ నమః। విష్ణవే నమః॥ మధుసూదనాయ నమః । త్రివిక్రమాయ నమః । వామనాయ నమః। శ్రీధరాయ నమః । హృషీకేశాయ నమః । పద్మనాభాయ నమః । దామోదరాయ నమః । సంకర్షణాయ నమః । వాసుదేవాయ నమః। ప్రద్యుమ్నాయ నమః । అనిరుద్ధాయ నమః । పురుషోత్తమాయ నమః । అధోక్షజాయ నమః । నారసింహాయ నమః । అచ్యుతాయ నమః । జనార్దనాయ నమః ।

ఉత్తిష్ఠన్తు భూతపిశాచాః, ఏతేభూమి భారకాః।
ఏతేషా మవిరోధేన బ్రహ్మకర్మ సమారభే॥
దైవీ గాయత్రీ ఛందః, ప్రాణాయామే వినియోగః।

ఓమ్ భూః। ఓమ్ భువః। ఓగ్ంసువః। ఓమ్ మహః। ఓమ్ జనః। ఓమ్ తపః। ఓగ్ం సత్యం। ఓమ్ తత్సవితు ర్వరేణ్యం। భర్గో దేవస్య ధీమహి। ధియో యో నః ప్రచోదయాత్॥ ఓ మాపోజ్యోతీ రసోఽమృతం బ్రహ్మభూర్భువస్సువరోమ్॥

మమ ఉపాత్త సమస్త దురిత క్షయద్వారా శ్రీపరమేశ్వర ముద్దిశ్య శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం। శుభే। శోభనే ముహూర్తే। అద్య బ్రహ్మణః ద్వితీయ పరార్ధే శ్వేత వరాహకల్పే, వైవస్వత మన్వంతరే। కలియుగే, ప్రథమపాదే, జంబూ ద్వీపే, భరతవర్షే, భరతఖండే, మేరోర్దక్షిణ దిగ్భాగే శ్రీశైలస్య వాయవ్య దిగ్భాగే కృష్ణా గోదావర్యోర్మధ్య ప్రదేశే స్వ (శోభన) గృహే। సమస్త దేవతా బ్రాహ్మణ హరిహరసన్నిధౌ॥ అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన .. సంవత్సరే...అయనే...ఋతౌ...మాసే...పక్షే....తిథౌ...వాసరే శుభనక్షత్ర శుభయోగ శుభకరణ ఏవం గుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ॥ మమ ఉపాత్త సమస్త దురిత క్షయ ద్వారా। శ్రీపరమేశ్వర ముద్దిశ్య, శ్రీ పర మే శ్వ ర ప్రీత్యర్థం శ్రీమాన్........గోత్రః శ్రీమతః...గోత్రస్య......నామధేయస్య ధర్మపత్నీ సమేతస్య మమ సకుటుంబస్య క్షేమ స్థైర్య విజయ అభయ ఆయురారోగ్య ఐశ్వర్యాభి వృద్ధ్యర్థం ధర్మార్థ కామమోక్ష చతుర్విధ ఫలపురుషార్థ సిద్ధ్యర్థం శ్రీలక్ష్మీనారాయణస్వామిన ముద్దిశ్య। శ్రీలక్ష్మీనారాయణ స్వామి ప్రీత్యర్థం, పురుషసూక్త న్యాసపూర్వక విష్ణు సహస్ర నామార్చనం కరిష్యమాణః। తదాదౌ పురుషసూక్త విధానేన యావచ్ఛక్తిధ్యానా వాహనాది షోడశోపచార పూజాంచ కరిష్యే॥

తదంగ కలశారాధనం కరిష్యే.

కలశం గంధ పుష్పాక్షతై రభ్యర్చ్య।
కలశస్య ముఖే విష్ణుః కంఠే రుద్రః సమాశ్రితః॥

మూలే తత్ర స్థితో బ్రహ్మా, మధ్యే మాతృగణా స్మృతాః ।
కుక్షౌతు సాగరా స్సర్వే, సప్తద్వీపా వసుంధరా ॥
ఋగ్వేదోథ యజుర్వేద స్సామవేదో హ్యథర్వణః ।
అంగైశ్చ సహితా స్సర్వే కలశాంబు సమాశ్రితాః ॥

ఆపోవా ఇదగ్ం సర్వం విశ్వా భూతా న్యాపః ప్రాణా వా ఆపః పశవ అపోన్న మాపోఽమృత మాప స్సమ్రాడాపో విరాడాప స్స్వరాడాప శ్ఛందాగ్ంస్యాపో జ్యోతీగ్ంష్యాపో యజూగ్ంష్యాప స్సత్య మాప స్సర్వా దేవతా ఆపో భూర్భువస్సువ రాప ఓమ్.

గంగేచ యమునే చైవ గోదావరి సరస్వతి ।
నర్మదే సింధు కావేరి జలేస్మి న్సన్నిధిం కురు ॥
తుంగభద్రా పినాకినీ కృష్ణవేణీచ గౌతమీ ।
భాగీరథీతి విఖ్యాతాః పంచగంగాః ప్రకీర్తితాః ॥
ఆయాంతు దేవపూజార్థం దురిత క్షయకారకాః ॥

ఓమ్ ఓమ్ ఓమ్ ॥ ఇతి త్రివార మభిమంత్ర్య । కలశోదకేన పూజాద్రవ్యాణి సంప్రోక్ష్య । దేవ మాత్మానంచ సంప్రోక్ష్య ॥

## పీఠ పూజా

సప్తప్రాకారం చతుర్ద్వారకం సువర్ణమంటపం ధ్యాయేత్ ॥
ఆత్మనే నమః । బ్రహ్మణే నమః । ప్రాగ్ద్వారే ద్వారశ్రియై నమః ।
ధాత్ర్యై నమః విధాత్ర్యై నమః ॥ దక్షిణద్వారే ద్వారశ్రియై నమః ।
చండాయ నమః। ప్రచండాయ నమః। పశ్చిమద్వారే ద్వారశ్రియై నమః।
భద్రాయ నమః। సుభద్రాయ నమః। ఉత్తరద్వారే ద్వారశ్రియై నమః।

హరిచందనాయ నమః । కల్పవృక్షాయ నమః । తన్మధ్యే

హృత్పుండరీక మధ్యస్థం దివ్య తేజోమయం విభుమ్ ॥
దివ్యమాలాంబరధరం చిద్రూపం భక్తవత్స లమ్ ॥
నభో మధ్యగతం పద్మం కర్ణికా కేసరాన్వితమ్ ।
దళాష్ట కేసరా న్వితమ్ ॥
దళాష్టకేషు సంయుక్తం శ్వేత మత్యంత నిర్మలమ్ ।
శ్వేతాఖ్యా సన మారుఢం గదినం చక్రిణం తథా ॥
వనమాలా పరివృతం ధ్యాయే న్నారాయణం ప్రభుమ్ ।
శ్రీలక్ష్మి నారాయణ స్వామినే నమః । ధ్యాయామి ॥

శ్లో॥ శాన్తాకారం భుజగశయనం పద్మనాభం సురేశం ।
విశ్వాకారం గగన సదృశం మేఘవర్ణం శుభాంగమ్ ।
లక్ష్మికాన్తం కమలనయనం యోగిహృద్ధ్యాన గమ్యం ।
వందే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథమ్ ॥

శ్రీలక్ష్మినారాయణస్వామినే నమః ॥ ధ్యానం సమర్పయామి ॥

## ఆ వా హ న ం

సహస్ర శీర్షా పురుషః । సహస్రాక్ష స్సహస్రపాత్ ।
స భూమిం విశ్వతో వృత్వా ॥ అత్యతిష్ఠ ద్దశాంగులమ్ ॥
శ్రీలక్ష్మినారాయణాయ నమః । ఆవాహనం సమర్పయామి ॥

## ఆ స న ం

పురుష ఏవేదగ్ం సర్వం । యద్భూతం యచ్చ భవ్యమ్ ॥
ఉతామృతత్వ స్యేశానః । యదన్నే నాతిరోహతి ।
శ్రీలక్ష్మి.........నమః ఆసనం సమర్పయామి ॥

## పా ద్య ం

ఏతావానస్య మహిమా । అతో జ్యాయాగ్ంశ్చ పూరుషః ॥
పాదోస్య విశ్వాభూతాని । త్రిపాదస్యామృతం దివి ॥

## అర్ఘ్యం

త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః । పాదోస్యేహా భవాత్పునః ।
తతో విష్వఙ్వ్యక్రామత్ । సాశనానశనే అభి ॥
శ్రీలక్ష్మీ.........నమః । హస్తయోః అర్ఘ్యం సమర్పయామి ॥

## ఆచమనీయం

తస్మాద్విరాడజాయత । విరాజో అధి పూరుషః ।
సజాతో అత్యరిచ్యత । పశ్చాద్భూమి మధోపురః ।
శ్రీలక్ష్మీ.........నమః । ఆచమనీయం సమర్పయామి ॥

## స్నానం

యత్పురుషేణ హవిషా । దేవా యజ్ఞ మతన్వత ।
వసన్తో అస్యాసీ దాజ్యం । గ్రీష్మఇధ్మ శ్శరద్ధవిః ॥

## (పంచామృతం) పాలు

ఆప్యాయస్వ సమేతు తే విశ్వత స్సోమ వృష్ణియం ।
భవా వాజస్య సంగథే । క్షీరేణ స్నపయామి ॥

## దధి – పెరుగు – మజ్జిగ

దధిక్రావ్ణ్ణో అకారిషం । జిష్ణో రశ్వస్య వాజినః ।
సురభినో ముఖాకరత్ప్రణ ఆయూగంషి తారిషత్ ॥
దధ్నా స్నపయామి ॥

## ఆజ్యం – నెయ్యి

శుక్రమసి జ్యోతిరసి తేజోసి దేవో వస్సవితోత్పునాత్వచ్ఛి
ద్రేణ పవిత్రేణ వసోః సూర్యస్య రశ్మిభిః ॥ ఆజ్యేన [illegible]

### మధు - తేనె

మధువాతా ఋతాయతే మధు క్షరన్తి సింధవః। మాధ్వీర్నస్సన్త్వోషధీః। మధునక్తముతోషసి। మధుమత్పార్థివగ్ం రజః మధుద్యౌరస్తు నః పితా। మధుమాన్నో వనస్పతి ర్మధుమాగ్ం అస్తు సూర్యః। మాధ్వీర్గావో భవంతు నః॥ మధునా స్నపయామి।

### శర్కర - పంచదార

స్వాదుః పవస్వ దివ్యాయ జన్మనే। స్వాదు రింద్రాయ సుహవేతు నామ్నే। స్వాదు ర్మిత్రాయ వరుణాయ వాయవే బృహస్పతయే మధుమాగ్ం అదాభ్యః॥ శర్కరయా స్నపయామి।

### ఫలోదకం - కొబ్బరికాయ

యాః ఫలినీర్యా అఫలా అపుష్పాయాశ్చ పుష్పిణీః। బృహస్పతి ప్రసూతా స్తా నో ముంచన్త్వగ్ం హసః॥ ఫలోదకేన స్నపయామి।

### శుద్ధోదకం - మంచినీరు

అపోహిష్ఠామ యోభువస్తాన ఊర్జే దధాతన। మహేరణాయ-చక్షసే। యో వ శ్శివతమోరస స్తస్య భాజయతే హనః। ఉశతీరివ మాతరః। తస్మా అరంగమా మవో యస్య క్షయాయ జిన్వథ! ఆపో జనయథా చనః॥

శ్రీలక్ష్మీ...నమః। పంచామృత స్నానానన్తరం శుద్ధోదక స్నానం సమర్పయామి-స్నానానన్తరం ఆచమనీయం సమర్పయామి.

### వస్త్రం

సప్తాస్యాస న్పరిధయః। త్రిస్సప్త సమిధః కృతాః॥
దేవా యద్యజ్ఞం తన్వానా। అబధ్నన్ పురుషం పశుమ్॥

## యజ్ఞోపవీతం

తం యజ్ఞం బర్హిషిప్రౌక్షన్ । పురుషం జాత మగ్రతః ।
తేన దేవా అయజంత । సాధ్యా ఋషయశ్చ యే ॥
శ్రీలక్ష్మీ......నమః । యజ్ఞోపవీతం సమర్పయామి ।

## గంధం

తస్మా ద్యజ్ఞా త్సర్వహుతః । సంభృతం పృష దాజ్యం ।
పశూగ్ స్తాగ్ం శ్చక్రే వాయవ్యాన్ । ఆరణ్యాన్ గ్రామ్యాశ్చ యే ॥
శ్రీలక్ష్మీ......నమః । గంధం ధారయామి ।

## ఆభరణాని

తస్మా ద్యజ్ఞా త్సర్వహుతః । ఋచ స్సామాని జజ్ఞిరే ।
ఛందాగ్ంసి జజ్ఞిరే తస్మాద్ । యజు స్తస్మా దజాయత ॥
శ్రీలక్ష్మీ...... ఆభరణార్థం అక్షతాన్ సమర్పయామి॥

## పుష్పాణి

తస్మా దశ్వా అజాయన్త । యేకే చో భయా దతః ।
గావో హ జజ్ఞిరే తస్మాత్ । తస్మా జ్జాతా అజావయః ॥
శ్రీలక్ష్మీ..........నమః। పుష్పాణి పూజయామి ॥

శ్రీవిష్ణు సహస్ర నామార్చనం ( అథవా ) అష్టోత్తర శతనామ పూజనం చ కరిష్యే ॥

శ్రీ లక్ష్మీ నారాయణాయ నమః । నానావిధ పరిమళ పత్ర పుష్పకుసుమాక్షతాన్ సమర్పయామి ॥

## ధూపం

యత్పురుషం వ్యదధుః । కతిధా వ్యకల్పయన్ ।
ముఖం కి మస్య కౌ బాహూ । కా వూరూ పాదా ఉచ్యేతే ॥

## దీపం

బ్రాహ్మణోస్య ముఖ మాసీత్ । బాహూ రాజన్యః కృతః ।
ఊరూ తదస్య యద్వైశ్యః । పద్భ్యాగ్ం శూద్రో అజాయత ॥
శ్రీలక్ష్మీ.........నమః । దీపం దర్శయామి.
ధూప దీపానన్తరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి ॥

## నైవేద్యం

ఓమ్ భూర్భువస్సువః। తత్సవితు ర్వరేణ్యం। భర్గో దేవస్య ధీమహి।ధియో యోనః ప్రచోదయాత్ ॥ సత్యం త్వర్తేన పరిషించామి। అమృత మస్తు। అమృతోపస్తరణ మసి స్వాహా । చంద్రమా మనసోజాతః । చక్షో స్సూర్యో అజాయత । ముఖాదింద్ర శ్చాగ్నిశ్చ । ప్రాణా ద్వాయు రజాయత ॥

శ్రీలక్ష్మీ.........నమః ......నైవేద్యం సమర్పయామి ।

ఓం ప్రాణాయస్వాహా । ఓం అపానాయ స్వాహా । ఓం వ్యానాయ స్వాహా । ఓం ఉదానాయ స్వాహా । ఓం సమానాయ స్వాహా ।
మధ్యే మధ్యే పానీయం సమర్పయామి ॥
ఉత్తరాపోశనం సమర్పయామి ।
హస్తప్రక్షాళనం సమర్పయామి ।
పాదప్రక్షాళనం సమర్పయామి ।
ముఖప్రక్షాళనం సమర్పయామి ।
శుద్ధాచమనీయం సమర్పయామి ॥

## తాంబూలం

నాభ్యా ఆసీ దంతరిక్షం । శీర్ష్ణో ద్యౌ స్సమవర్తత ।
పద్భ్యాం భూమి ర్దిశ శ్శ్రోత్రాత్ । తథా లోకాగ్ం అకల్పయన్ ॥
శ్రీలక్ష్మీ.........నమః । తాంబూలం సమర్పయామి ।

## నీ రా జ న ం

వేదాహమేతం పురుషం మహాన్తం ।
ఆదిత్యవర్ణం తమసస్తు పారే ।
సర్వాణి రూపాణి విచిత్య ధీరః ।
నామాని కృత్వా భివదన్ యదాస్తే ॥
శ్రీలక్ష్మీ.........నమః । నీరాజనం సమర్పయామి ॥
నీరాజనానన్తరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి ॥

## మ ం త్ర పు ష్పం

ధాతా పురస్తాద్య ముదాజహార । శక్రః ప్రవిద్వాన్ ప్రదిశ శ్చతస్రః ।
త మేవం విద్వా నమృత ఇహ భవతి। నాన్యః పంథా అయనాయ విద్యతే॥
ఓం నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి ।
తన్నో విష్ణుః ప్రచోదయాత్ ॥
ఓం మహాదేవ్యైచ విద్మహే । విష్ణుపత్న్యైచ ధీమహి ॥
తన్నో లక్ష్మీః ప్రచోదయాత్ ॥
శ్రీలక్ష్మీ.........నమః । దివ్యమంత్రపుష్పం సమర్పయామి ॥

## ప్ర ద క్షి ణ ం

యాని కానిచ పాపాని జన్మాంతర కృతానిచ ।
తాని తాని వినశ్యన్తి ప్రదక్షిణ పదే పదే ।
పాపోహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః ।
త్రాహి మాం కృపయా దేవ శరణాగత వత్సల ।
అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ ।
తస్మాత్కారుణ్యభావేన రక్షరక్ష జనార్దన ॥
శ్రీలక్ష్మీ......నమః । ప్రదక్షిణనమస్కారాన్ సమర్పయామి ॥

## పు నః పూ జా ం చ క రి ష్యే

ఛత్రమాచ్ఛాదయామి(ధారయామి)చామరం వీజయామి । నృత్యం

దర్శయామి। గీతం శ్రావయామి। ఆందోళికాన్ ఆరోహయామి। అశ్వా రోహ మావాహయామి। గజారోహమావాహయామి। సమస్త రాజోప చార దేవోపచార శక్త్యుపచార భక్త్యుపచార పూజాం సమర్పయామి॥

యస్య స్మృత్యాచ నామోక్త్యా తపః పూజాక్రియాదిషు । న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందే త మచ్యుతమ్ । మంత్రహీనం క్రియా హీనం భక్తిహీనం రమాపతే యత్పూజితం మయా దేవ పరిపూర్ణం తదస్తు తే। అనేన పురుషసూక్త విధానేన ధ్యానావాహనాది షోడశోప చార పూజనేన భగవాన్సర్వాత్మకః శ్రీలక్ష్మీనారాయణస్వామీ సుప్రీత స్సుప్రసన్నో వరదో భవతు.

## తీర్థ గ్రహణం

అకాల మృత్యుహరణం సర్వవ్యాధి నివారణమ్ ।
సమస్త పాపక్షయకరం శ్రీ విష్ణు పాదోదకం పావనం శుభమ్ ॥
శరీరే జర్ఝరీభూతే। వ్యాధిగ్రస్తే కళేబరే।
ఔషధం జాహ్నవీతోయం। వైద్యో నారాయణో హరిః ॥

శ్రీ శ్రీ శ్రీ

ఆచమ్య ॥ కేశవాయస్వాహా............శ్రీకృష్ణాయ నమః ॥ ఓం భూః। ఓం భువః...వరోమ్। మమఉపాత్త సమస్త దురితక్షయ ద్వారా సన్మంగళావాప్త్యర్థం శుభేశోభనే...ప్రీత్యర్థం శ్రీమతః... గోత్రస్య....నామధేయస్య.... వృద్ధ్యర్థం శ్రీలక్ష్మీనారాయణస్వామి నముద్దిశ్య, శ్రీలక్ష్మీనారాయణ స్వామినః ప్రీత్యర్థం, పురుషసూక్త న్యాసపూర్వక విష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణం కరిష్యే ॥

అస్యశ్రీ పురుషసూక్త మహామంత్రస్య। నారాయణ ఋషిః। గాయత్రీఛందః। శ్రీపురుషోత్తమో దేవతా । పురుషసూక్తన్యాస

గమనిక :— కరన్యాస అంగన్యాసాదులను, లమిత్యాది పంచ పూజలను, సంప్రదాయాను సారముగా గురు ముఖతః ఉపదేశము పొందినవారే ఆద్యంతముల యందు అను సంధానము చేయవలెను. ఇతరులు కేవలను పారాయణ మొనర్చి కూడ ఫలితము నందగలరు. ]

కరన్యాసః

| | |
|---|---|
| ఓం నారాయణాయ | అంగుష్ఠాభ్యాం నమః |
| ఓం మాధవాయ | తర్జనీభ్యాం నమః |
| ఓం హృషీకేశాయ | మధ్యమాభ్యాం నమః |
| ఓం జనార్దనాయ | అనామికాభ్యాం నమః |
| ఓం శ్రీవిష్ణవే | కనిష్ఠికాభ్యాం నమః |
| ఓం పురుషోత్తమాయ | కరతలకరపృష్ఠాభ్యాం నమః ॥ |

అంగన్యాసః

| | |
|---|---|
| మూర్ధ్ని | కేశవాయ నమః |
| లలాటే | నారాయణాయ నమః |
| కర్ణయోః | మాధవాయ నమః |
| నేత్రయోః | గోవిందాయ నమః |
| ఘ్రాణే | విష్ణవే నమః |
| ముఖే | మధుసూదనాయ నమః |
| కంఠే | త్రివిక్రమాయ నమః |
| భుజయోః | వామనాయ నమః |
| హృది | శ్రీధరాయ నమః |
| నాభౌ | హృషీకేశాయ నమః |
| కట్యాం | పద్మనాభాయ నమః |
| పాదయోః | దామోదరాయ నమః |

వా మ హ స్తే

ఓం సహస్రశీర్షా పురుషః । సహస్రాక్షస్సహస్రపాత్ ।
సభూమిం విశ్వతో వృత్వా । అత్యతిష్ఠ ద్దశాంగులమ్ ॥

ద క్షి ణ హ స్తే

పురుష ఏ వేదగ్ం సర్వం । యద్భూతం యచ్చ భవ్యం ।
ఉతామృతత్వ స్యేశానః । యదన్నేనాతిరోహతి ॥

వా మ పా దే

ఏతావానస్య మహిమా । అతో జ్యాయాగ్ శ్చ పూరుషః ।
పాదోస్య విశ్వా భూతాని । త్రిపాదస్యామృతం దివి ॥

ద క్షి ణ పా దే

త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః । పాదోస్యేహాభవాత్పునః ।
తతో విష్వఙ్వ్య క్రామత్ । సాశనానశనే అభి ॥

వా మ జం ఘే

తస్మాద్విరాడజాయత । విరాజో అధిపూరుషః ।
సజాతో అత్యరిచ్యత । పశ్చాద్భూమిమథోపురః ॥

ద క్షి ణ జం ఘే

యత్పురుషేణ హవిషా । దేవా యజ్ఞ మతన్వత ।
వసంతో అస్యాసీదాజ్యం । గ్రీష్మ ఇధ్మ శ్శరద్ధవిః ॥

గు హ్యే

సప్తాస్యాసన్పరిధయః । త్రిస్సప్త సమిధః కృతాః ।
దేవా యద్యజ్ఞం తన్వానాః । అబధ్నన్ పురుషం పశుమ్ ॥

నా భౌ

తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్ । పురుషం జాత మగ్రతః ।
తేన దేవా అయజన్త । సాధ్యా ఋషయశ్చ యే ॥

హృ ది

తస్మా ద్యజ్ఞా త్సర్వహుతః । సంభృతం పృష దాజ్యం ।
పశూగ్ స్తాగ్ంశ్చక్రే వాయవ్యాన్ । ఆరణ్యాన్ గ్రామ్యాశ్చ యే ॥

కం ఠే

తస్మా ద్యజ్ఞా త్సర్వహుతః । ఋచ స్సామాని జజ్ఞిరే ।
ఛందాగ్ంసి జజ్ఞిరే తస్మాత్ । యజు స్తస్మా దజాయత ॥

వా మ బా హౌ

తస్మా దశ్వా అజాయన్త । యే కే చోభయాదతః ।
గావోహ జజ్ఞిరే తస్మా । త్తస్మాజ్జాతా అజావయః ॥

ద క్షి ణ బా హౌ

యత్పురుషం వ్యదధుః కతిధా వ్యకల్పయన్ ।
ముఖం కి మస్య కౌ బాహూ । కావూరూ పాదా వుచ్యేతే ॥

ము ఖే

బ్రాహ్మణోస్య ముఖమాసీత్ । బాహూ రాజన్యః కృతః ।
ఊరూ తదస్య య ద్వైశ్యః । పద్భ్యాగ్ం శూద్రో అజాయత ॥

వా మ క ర్ణే

చంద్రమా మనసోజాతః । చక్షో స్సూర్యో అజాయత ।
ముఖా దింద్ర శ్చాగ్నిశ్చ । ప్రాణా ద్వాయు రజాయత ॥

దక్షిణకర్ణే

నాభ్యా ఆసీ దన్తరిక్షం। శీర్ష్ణో ద్యౌ స్సమవర్తత।
పద్భ్యాం భూమి ర్దిశః శ్రోత్రాత్। తథా లోకాగ్ం అకల్పయన్॥

వామనేత్రే

వేదాహమేతం పురుషం మహాన్తం। ఆదిత్యవర్ణం తమసస్తు పారే।
సర్వాణి రూపాణి విచిత్య ధీరః। నామాని కృత్వా భివదన్ యదాస్తే॥

దక్షిణనేత్రే

ధాతా పురస్తా ద్య ముదాజహార। శక్రః ప్రవిద్వా న్ప్రదిశ శ్చతస్రః।
త మేవం విద్వా నమృత ఇహ భవతి। నాన్యః పంథా అయనాయ విద్యతే॥

శిరసి

యజ్ఞేన యజ్ఞ మయజన్త దేవాః। తాని ధర్మాణి ప్రథమా న్యాసన్।
తేహ నాకం మహిమాన స్సచన్తే। యత్ర పూర్వే సాధ్యా స్సన్తి దేవాః॥

హృదయాదిన్యాసః

అతో దేవా అవంతు నో యతో విష్ణు ర్విచక్రమే।
పృథివ్యా స్సప్త ధామభిః॥ హృదయాయ నమః।
ఇదం విష్ణు ర్విచక్రమే త్రేథా నిదధే పదం।
సమూఢ మస్య పాగ్ంసురే॥ శిరసే స్వాహా
త్రీణిపదా విచక్రమే విష్ణు ర్గోపా అదాభ్యః।
తతో ధర్మాణి ధారయన్॥ శిఖాయై వషట్।
విష్ణోః కర్మాణి పశ్యత యతో వ్రతాని పస్ప(స్పృ)శే।
ఇంద్రస్య యుజ్య స్సఖా॥ కవచాయ హుం॥
తదిఽషోః పరమం పదగ్ం ...

దివీవ చక్షు రాతతం ॥ నేత్రత్రియాయ వౌషట్ ॥
తద్విప్రాసో విపన్యవో జాగృవాగ్ం సస్సమింధతే ।
విష్ణోర్యత్పరమంపదమ్ ॥ అస్త్రాయఫట్ ॥
భూర్భువస్సువరోమితి దిగ్బంధః ॥

## ధ్యానం

శ్లో॥ గోక్షీరాభం పుండరీకాయతాక్షం ।
చక్రాబ్జాద్యై ర్భూషణై ర్భూషితాంగమ్ ॥
శ్రీభూమిభ్యా మర్చి తే యోగపీఠే ।
యస్తం దేవం పూజయే త్పౌరుషేణ ॥

శ్లో॥ యోజపే త్పురుషసూ క్తం త్రివారన్తు దినే దినే ।
పారాయణఫలం తస్య దేవానాంవై సహస్రశః ॥

లం॥ పృథివీతత్త్వాత్మనే భగవతే నమః గంధం పరికల్పయామి ।
హం॥ ఆకాశతత్త్వాత్మనే భగవతే నమః పుష్పం సమర్పయామి ।
యం॥ వాయుతత్త్వాత్మనే భగవతే నమః ధూపమాఘ్రాపయామి ।
వం॥ అమృతతత్త్వాత్మనే భగవతే నమః అమృత నైవేద్యం సమర్పయామి
సం॥ సర్వతత్త్వాత్మనే భగవతే నమః సర్వోపచారపూజాం సమర్పయామి

## గురుధ్యానం

శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరం బ్రహ్మ తస్మై శ్రీగురవేనమః ॥

గమనిక :- అంగన్యాస కరన్యాసములను మరికొందరు ఈ క్రింది విధముగా చేయుదురు.

అంగన్యాసాదులు 12 వ పేజీలో ఉన్నవి.

• ఓం నమో భగవతే వాసుదేవాయ •

• ఓం నమో నారాయణాయ •

# శ్రీ విష్ణు సహస్ర నామ స్తోత్రమ్

## మాధ్వ సంప్రదాయ ధ్యాన శ్లోకః

ధ్యాయే న్నృసింహ మురువృత్త రవి త్రినేత్రమ్
జాను ప్రసక్త కరయుగ్మ మథా ధరాభ్యామ్।
చక్రం దరం చ దధతం ప్రియయా సమేతమ్
తిగ్మాంశుకోట్యధిక తేజస మగ్ర్యశక్తిమ్॥

## మంత్రః

ఉగ్రం వీరం మహావిష్ణుం జ్వలన్తం సర్వతోముఖమ్।
నృసింహం భీషణం భద్రం మృత్యుమృత్యుం నమామ్యహమ్॥

## ధ్యానమ్

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్।
ప్రసన్న వదనం ధ్యాయే త్సర్వవిఘ్నోప శాన్తయే॥
యస్య ద్విరద వక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్।
విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం త మాశ్రయే.

## పూ ర్వ పీ ఠి కా

**హరిః** ఓమ్, వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్,
పరాశరాత్మజం వన్దే శుకతాతం తపోనిధిమ్.

వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే,
నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః. 2

అవికారాయ శుద్ధాయ నిత్యాయ పరమాత్మనే,
సదైకరూప రూపాయ విష్ణవే సర్వజిష్ణవే. 3

యస్య స్మరణ మాత్రేణ జన్మసంసార బంధనాత్.
విముచ్యతే నమస్తస్మై విష్ణవే ప్రభవిష్ణవే. 4

ఓం నమో విష్ణవే ప్రభవిష్ణవే
ఓన్నమో సచ్చిదానన్ద రూపాయాఽ క్లిష్ట కారిణే,
నమో వేదాంత వేద్యాయ గురవే బుద్ధిసాక్షిణే. 5

కృష్ణద్వైపాయనం వ్యాసం సర్వలోకహితే రతమ్,
వేదాబ్జభాస్కరం వందే శమాదినిలయం మునిమ్. 6.

సహస్రమూర్తేః పురుషోత్తమస్య సహస్రనేత్రానన పాదబాహోః,
సహస్రనామ్నాం స్తవనం ప్రశస్తం నిరుచ్యతే జన్మజరాది శాన్త్యై.

## శ్రీ వైశంపాయన ఉవాచ

శ్రుత్వా ధర్మా నశేషేణ పావనాని చ సర్వశః,
యుధిష్ఠిరః శాన్తనవం పునరే వాభ్యభాషత. 1

## యుధిష్ఠిర ఉవాచ

కి మేకం దైవతం లోకే? కిం వాఽ ప్యేకం పరాయణమ్?
స్తువంతః కం క మర్చన్తః ప్రాప్నుయు ర్మానవా శ్శుభమ్? 2
కో ధర్మ స్సర్వధర్మాణాం భవతః పరమో మతః?
కిం జప న్ముచ్యతే జంతు ర్జన్మ సంసార బంధనాత్? 3

## శ్రీ భీష్మ ఉవాచ

జగత్ప్రభుం దేవదేవ మనంతం పురుషోత్తమమ్,
స్తువ న్నామ సహస్రేణ పురుష స్సతతోత్థితః. 4

తమేవ చాఽర్చయన్నిత్యం భక్త్యా పురుష మవ్యయమ్,
ధ్యాయన్ స్తువ న్నమస్యంశ్చ యజమాన స్త మేవ చ. 5

అనాదినిధనం విష్ణుం సర్వలోక మహేశ్వరమ్,
లోకాధ్యక్షం స్తువన్నిత్యం సర్వదుఃఖాతిగో భవేత్. 6

బ్రహ్మణ్యం సర్వధర్మజ్ఞం లోకానాం కీర్తివర్ధనమ్,
లోకనాథం మహద్భూతం సర్వభూత భవోద్భవమ్. 7

ఏష మే సర్వధర్మాణాం ధర్మోఽధికతమో మతః,
యద్భక్త్యా పుండరీకాక్షం స్తవై రర్చే న్నర స్సదా. 8

పరమం యో మహ త్తేజః పరమం యో మహ త్తపః,
పరమం యో మహద్బ్రహ్మ పరమం యః పరాయణమ్. 9

పవిత్రాణాం పవిత్రం యో మంగళానాం చ మంగళమ్,
దైవతం దేవతానాం చ భూతానాం యోఽవ్యయః పితా. 10

యతః సర్వాణి భూతాని భవ న్త్యాదియుగాగమే,
యస్మింశ్చ ప్రళయం యాన్తి పున రేవ యుగక్షయే. 11

తస్య లోకప్రధానస్య జగన్నాథస్య భూపతే,
విష్ణోర్నామ సహస్రం మే శృణు పాపభయాపహమ్. 12

యాని నామాని గౌణాని విఖ్యాతాని మహాత్మనః,
ఋషిభిః పరిగీతాని తాని వక్ష్యామి భూతయే. 13

ఋషీ ర్నామ్నాం (విష్ణోర్నామ్నాం) సహస్రస్య వేదవ్యాసో మహా
మునిః,
ఛందోఽనుష్టు ప్తథా దేవో భగవాన్ దేవకీసుతః. 14

అమృతాంశూద్భవో బీజం శక్తి ర్దేవకినందనః,
త్రిసామా హృదయం తస్య శాన్త్యర్థే వినియుజ్యతే. 15

విష్ణుం జిష్ణుం మహావిష్ణుం ప్రభవిష్ణుం మహేశ్వరమ్,
అనేకరూపదైత్యాన్తం నమామి పురుషోత్తమమ్. 16

అస్య శ్రీ విష్ణోర్దివ్య సహస్రనామస్తోత్ర మహామంత్రస్య శ్రీ వేదవ్యాసో భగవానృషిః. అనుష్టుప్ ఛందః. శ్రీ మహావిష్ణుః పరమాత్మా శ్రీమన్నారాయణో దేవతా. అమృతాంశూద్భవో భానురితి బీజమ్, దేవకీనందనస్స్రష్టేతి శక్తిః, ఉద్భవః క్షోభణో దేవ ఇతి పరమో మంత్రః, శంఖభృన్నందకీ చక్రీతి కీలకమ్, శార్ఙ్గధన్వా గదాధర ఇత్యస్త్రమ్, రథాఙ్గపాణి రక్షోభ్య ఇతి నేత్రమ్, త్రిసామా సామగస్సామేతి కవచమ్, ఆనందం పరబ్రహ్మేతి యోనిః, ఋతుస్సుదర్శనః కాల ఇతి దిగ్బంధః, విశ్వరూప ఇతిధ్యానమ్, శ్రీ మహావిష్ణు (ప్రీత్యర్థే) కైంకర్యరూపే శ్రీ మహావిష్ణు సహస్రనామ స్తోత్ర జపే (పారాయణే) వినియోగః.

## ధ్యానమ్

క్షీరోదన్వత్ప్రదేశే శుచిమణివిల సత్సైకతే మౌక్తికానాం
మాలాక్లృప్తాసనస్థః స్ఫటికమణి నిభై ర్మౌక్తికైర్మండితాఙ్గః
శుభ్రైరభ్రై రదభ్రైరుపరి విరచితై ర్ముక్త పీయూషవర్షై
రానన్దీ నః పునీయా దరి నలిన గదా శఙ్ఖ పాణి ర్ముకుందః ॥
భూః పాదౌ యస్య నాభి ర్వియ దసు రనిల శ్చంద్రసూర్యౌచ నేత్రే
కర్ణా వాశా శ్శిరో ద్యౌ ర్ముఖమపి దహనో యస్య వాస్తేయ మబ్ధిః।
అన్తస్థం యస్య విశ్వం సురనరఖగగోభోగి గంధర్వదైత్యై
శ్చిత్రం రంరమ్యతే తం త్రిభువనవపుషం విష్ణు మీశం నమామి॥
శాన్తాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాకారం గగన సదృశం మేఘవర్ణం శుభాఙ్గమ్
లక్ష్మీ కాన్తం కమలనయనం యోగిహృ ద్ధ్యానగమ్యం
వందే విష్ణుం భవభయహరం సర్వలోకైక నాథమ్.
మేఘశ్యామం పీతకౌశేయవాసం
శ్రీవత్సాఙ్కం కౌస్తుభోద్భాసితాఙ్గమ్।
పుణ్యోపేతం పుండరీకాయతాక్షం
విష్ణుం వందే సర్వలోకైకనాథమ్.

సశఙ్ఖచక్రం సకిరీటకుండలం సపీత వస్త్రం సరసీరుహేక్షణమ్,
సహారవక్షఃస్థలశోభి కౌస్తుభం, నమామి విష్ణుం శిరసా చతుర్భుజమ్॥

ఛాయాయాం పారిజాతస్య హేమ సింహాసనోపరి,
ఆసీన మంబుదశ్యామ మాయతాక్ష మలంకృతమ్.

చంద్రాననం చతుర్బాహుం శ్రీవత్సాంకిత వక్షసమ్,
రుక్మిణీ సత్యభామాభ్యాం సహితం కృష్ణ మాశ్రయే.

## లమిత్యాది పంచ పూజా

లం॥ పృథివీతత్త్వాత్మనే భగవతే నమః గంధం పరికల్పయామి.
హం॥ ఆకాశ తత్త్వాత్మనే భగవతే నమః పుష్పం పరికల్పయామి.
యం॥ వాయుతత్త్వాత్మనే భగవతే నమః ధూపం పరికల్పయామి.
రం॥ తేజస్తత్త్వాత్మనే భగవతే నమః దీపం దర్శయామి.
వం॥ అమృతతత్త్వాత్మనే భగవతే నమః నైవేద్యం పరికల్పయామి.
సం॥ సర్వతత్త్వాత్మనే భగవతే నమః సర్వోపచార పూజాం పరికల్పయామి.

హరిః ఓం తత్సత్

ఇతి పూర్వ పీఠికా.

# శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రమ్

హరిః ఓమ్, విశ్వం విష్ణు ర్వషట్కారో భూతభవ్యభవత్ప్రభుః,
భూతకృ ద్భూతభృ ద్భావో భూతాత్మా భూత భావనః. 1

పూతాత్మా పరమాత్మా చ ముక్తానాం పరమాగతిః,
అవ్యయః పురుష స్సాక్షీ క్షేత్రజ్ఞో౽క్షర ఏవచ. 2

యోగో యోగవిదాం నేతా ప్రధానపురుషేశ్వరః,
నారసింహావపుః శ్రీమాన్ కేశవః పురుషోత్తమః. 3

సర్వ శ్శర్వ శ్శివ స్స్థాణు ర్భూతాది ర్నిధి రవ్యయః,
సంభవో భావనో భర్తా ప్రభవః ప్రభు రీశ్వరః. 4

స్వయమ్భూ శ్శమ్భు రాదిత్యః పుష్కరాక్షో మహాస్వనః,
అనాదినిధనో ధాతా విధాతా ధాతురుత్తమః. 5

అప్రమేయో హృషీకేశః పద్మనాభోఽమరప్రభుః,
విశ్వకర్మా మను స్త్వష్టా స్థవిష్ఠః స్థవిరో ధ్రువః. 6

అగ్రాహ్య శ్శాశ్వతః కృష్ణో లోహితాక్షః ప్రతర్దనః,
ప్రభూత స్త్రి కకుద్ధామ పవిత్రం మంగళం పరమ్. 7

ఈశానః ప్రాణదః ప్రాణో జ్యేష్ఠ శ్శ్రేష్ఠః ప్రజాపతిః,
హిరణ్యగర్భో భూగర్భో మాధవో మధుసూదనః. 8

ఈశ్వరో విక్రమీ ధన్వీ మేధావీ విక్రమః క్రమః,
అనుత్తమో దురాధర్షః కృతజ్ఞః కృతి రాత్మవాన్. 9

సురేశ శ్శరణం శర్మ విశ్వరేతాః ప్రజాభవః,
అహ స్సంవత్సరో వ్యాళః ప్రత్యయ స్సర్వదర్శనః. 10

అజ స్సర్వేశ్వర స్సిద్ధ స్సిద్ధి స్సర్వాది రచ్యుతః,
వృషాకపి రమేయాత్మా సర్వయోగ వినిస్సృతః. 11

వసు ర్వసుమనా స్సత్య స్సమాత్మా సమ్మిత స్సమః,
అమోఘః పుండరీకాక్షో వృషకర్మా వృషాకృతిః. 12

రుద్రో బహుశిరా బభ్రు ర్విశ్వయోని శ్శుచిశ్రవాః,
అమృత శ్శాశ్వతస్థాణు ర్వరారోహో మహాతపాః. 13

సర్వగ స్సర్వవి ద్భాను ర్విష్వక్సేనో జనార్దనః,
వేదో వేదవి దవ్యంగో వేదాంగో వేదగోచరః. 14

లోకాధ్యక్ష స్సురాధ్యక్షః ధర్మాధ్యక్షః కృతాకృతః,
చతురాత్మా చతుర్వ్యూహ శ్చతుర్దంష్ట్ర శ్చతుర్భుజః. 15

భ్రాజిష్ణు ర్భోజనం భోక్తా సహిష్ణు ర్జగదాదిజః,
అనఘో విజయో జేతా విశ్వయోనిః పునర్వసుః. 16

ఉపేంద్రో వామనః ప్రాంశు రమోఘ శ్శుచి రూర్జితః,
అతీంద్ర స్సంగ్రహ స్సర్గో ధృతాత్మా నియమో యమః. 17

వేద్యో వైద్య స్సదాయోగీ వీరహా మాధవో మధుః,
అతీంద్రియో మహామాయో మహోత్సాహో మహాబలః. 18

మహాబుద్ధి ర్మహావీర్యో మహాశక్తి ర్మహాద్యుతిః,
అనిర్దేశ్యవపు శ్శ్రీమా నమేయాత్మా మహాద్రిధృత్. 19

మహేష్వాసో మహీభర్తా శ్రీనివాస స్సతాం గతిః,
అనిరుద్ధ స్సురానందో గోవిందో గోవిదాం పతిః, 20

మరీచి ర్దమనో హంస స్సువర్ణో భుజగోత్తమః
హిరణ్యనాభ స్సుతపాః పద్మనాభః ప్రజాపతిః 21

అమృత్యు స్సర్వదృ క్సింహ స్సన్ధాతా సన్ధిమాన్ స్థిరః,
అజో దుర్మర్షణ శ్శాస్తా విశ్రుతాత్మా సురారిహా. 22

గురు ర్గురుతమో ధామ స్సత్య స్సత్యపరాక్రమః,
నిమిషోఽనిమిష స్స్రగ్వీ వాచస్పతి రుదారధీః. 23

అగ్రణీ ర్గ్రామణీ శ్శ్రీమా న్న్యాయో నేతా సమీరణః,
సహస్రమూర్ధా విశ్వాత్మా సహస్రాక్ష స్సహస్రపాత్. 24

ఆవర్తనో నివృత్తాత్మా సంవృత స్సంప్రమర్దనః,
అహస్సంవర్తకో వహ్ని రనిలో ధరణీధరః. 25

సుప్రసాదః ప్రసన్నాత్మా విశ్వసృ డ్విశ్వభు గ్విభుః,
సత్కర్తా సత్కృత స్సాధు ర్జహ్ను ర్నారాయణో నరః. 26

అసంఖ్యేయోఽప్రమేయాత్మా విశిష్ట శ్శిష్టకృ చ్ఛుచిః,
సిద్ధార్థ స్సిద్ధసఙ్కల్పః సిద్ధిద స్సిద్ధిసాధనః. 27

వృషాహిః వృషభో విష్ణు ర్వృషపర్వా వృషోదరః,
వర్ధనో వర్ధమానశ్చ వివిక్త శ్శ్రుతిసాగరః. 28

సుభుజో దుర్ధరో వాగ్మీ మహేంద్రో వసుదో వసుః,
నైకరూపో బృహద్రూపః శిపివిష్టః ప్రకాశనః. 29

ఓజ స్తేజోద్యుతిధరః ప్రకాశాత్మా ప్రతాపనః,
ఋద్ధ స్స్పష్టాక్షరో మంత్ర శ్చంద్రాంశు ర్భాస్కరద్యుతిః. 30

అమృతాంశూద్భవో భానుః శశిబిందు స్సురేశ్వరః,
ఔషధం జగత స్సేతు స్సత్యధర్మపరాక్రమః. 31

భూతభవ్యభవన్నాథః పవనః పావనోఽనలః,
కామఘ్నో కామకృత్కాన్తః కామః కామప్రదః ప్రభుః. 32

యుగాదికృద్యుగావర్తో నైకమాయో మహాశనః,
అదృశ్యో వ్యక్తరూపశ్చ సహస్రజిదనంతజిత్. 33

ఇష్టోఽవిశిష్టశ్శిష్టేష్టః శిఖండీ ర్నహుషో వృషః,
క్రోధహా క్రోధకృత్కర్తా విశ్వబాహుర్మహీధరః. 34

అచ్యుతః ప్రథితః ప్రాణః ప్రాణదో వాసవానుజః,
అపాంనిధిరధిష్ఠానమప్రమత్తః ప్రతిష్ఠితః. 35

స్కన్దః స్కన్దధరో ధుర్యో వరదో వాయువాహనః,
వాసుదేవో బృహద్భానురాదిదేవః పురన్దరః. 36

అశోకస్తారణస్తారః శూరశ్శౌరిర్జనేశ్వరః,
అనుకూలశ్శతావర్తః పద్మీ పద్మనిభేక్షణః. 37

పద్మనాభోఽరవిందాక్షః పద్మగర్భశ్శరీరభృత్,
మహర్ధిరృద్ధో వృద్ధాత్మా మహాక్షో గరుడధ్వజః. 38

అతులశ్శరభో భీమస్సమయజ్ఞో హవిర్హరిః,
సర్వలక్షణలక్షణ్యో లక్ష్మీవాన్ సమితింజయః. 39

విక్షరో రోహితో మార్గో హేతుర్దామోదరస్సహః,
మహీధరో మహాభాగో వేగవానమితాశనః. 40

ఉద్భవః క్షోభణో దేవః శ్రీగర్భః పరమేశ్వరః,
కరణం కారణం కర్తా వికర్తా గహనోగుహః. 41

వ్యవసాయో వ్యవస్థానః సంస్థానస్స్థానదో ధ్రువః,
పరర్ధిః పరమస్పష్టస్తుష్టః పుష్టశ్శుభేక్షణః. 42

రామో విరామో విరజో మార్గో నేయో నయోఽనయః,
వీరశ్శక్తిమతాం శ్రేష్ఠో ధర్మో ధర్మవిదుత్తమః. 43

వైకుంఠః పురుషః ప్రాణః ప్రాణదః ప్రణవః పృథుః,
హిరణ్యగర్భశ్శత్రుఘ్నో వ్యాప్తో వాయురధోక్షజః. 44

ఋతు స్సుదర్శనః కాలః పరమేష్ఠీ పరిగ్రహః,
ఉగ్ర స్సంవత్సరో దక్షో విశ్రామో విశ్వదక్షిణః. 45

విస్తారః స్థావర స్స్థాణుః ప్రమాణం బీజ మవ్యయమ్,
అర్థోఽ నర్థో మహాకోశో మహాభోగో మహాధనః. 46

అనిర్విణ్ణ స్స్థవిష్ఠో భూ ర్ధర్మయూపో మహామఖః,
నక్షత్రనేమి ర్నక్షత్రీ క్షమః క్షామ స్సమీహనః. 47

యజ్ఞ ఇజ్యో మహేజ్యశ్చ క్రతు స్సత్రం సతాంగతిః,
సర్వదర్శీ విముక్తాత్మా సర్వజ్ఞో జ్ఞాన ముత్తమమ్. 48

సువ్రత స్సుముఖ స్సూక్ష్మః సుఘోష స్సుఖద స్సుహృత్,
మనోహరో జితక్రోధో వీరబాహు ర్విదారణః. 49

స్వాపన స్స్వవశో వ్యాపీ నైకాత్మా నైకకర్మకృత్,
వత్సరో వత్సలో వత్సీ రత్నగర్భో ధనేశ్వరః. 50

ధర్మగుప్ ధర్మకృ ద్ధర్మీ సదస త్క్షర మక్షరమ్,
అవిజ్ఞాతా సహస్రాంశు ర్విధాతా కృతలక్షణః. 51

గభస్తినేమి స్సత్త్వస్థ స్సింహో భూతమహేశ్వరః,
ఆదిదేవో మహాదేవో దేవేశో దేవభృద్గురుః. 52

ఉత్తరో గోపతి ర్గోప్తా జ్ఞానగమ్యః పురాతనః,
శరీరభూతభృ ద్భోక్తా కపీంద్రో భూరిదక్షిణః. 53

సోమపోఽ మృతప స్సోమః పురుజి త్పురుసత్తమః,
వినయో జయ స్సత్యసంధో దాశార్హ స్సాత్త్వతాంపతిః. 54

జీవో వినయితా సాక్షీ ముకుందోఽ మితవిక్రమః,
అంభోనిధి రనంతాత్మా మహోదధి శయోఽంతకః. 55

అజో మహార్హ స్స్వాభావ్యో జితామిత్రః ప్రమోదనః,
ఆనందో నందనోఽనంద స్సత్యధర్మా త్రివిక్రమః. 56

మహర్షిః కపిలాచార్యః కృతజ్ఞో మేదినీపతిః,
త్రిపద స్త్రిదశాధ్యక్షో మహాశృంగః కృతాంతకృత్. 57

మహావరాహో గోవిన్ద స్సుషేణః కనకాంగదీ,
గుహ్యో గభీరో గహనో గుప్త శ్చక్రగదాధరః. 58
వేధా స్స్వాంగో౽జితః కృష్ణో దృఢ స్సఙ్కర్షణో౽చ్యుతః,
వరుణో వారుణో వృక్షః పుష్కరాక్షో మహామనాః. 59
భగవాన్ భగహా నందీ వనమాలీ హలాయుధః,
ఆదిత్యో జ్యోతిరాదిత్య స్సహిష్ణు ర్గతిసత్తమః. 60
సుధన్వా ఖణ్డపరశు ర్దారుణో ద్రవిణప్రదః,
దివస్పృ క్సర్వదృ గ్వ్యాసో వాచస్పతి రయోనిజః. 61
త్రిసామా సామగ స్సామ నిర్వాణో భేషజో భిషక్,
సన్న్యాసకృ చ్ఛమ శ్శాన్తో నిష్ఠా శాంతిః పరాయణః. 62
శుభాంగ శ్శాంతిద స్స్రష్టా కుముదః కువలేశయః,
గోహితో గోపతి ర్గోప్తా వృషభాక్షో వృషప్రియః. 63
అనివర్తీ నివృత్తాత్మా సంక్షేప్తా క్షేమకృ చ్ఛివః,
శ్రీవత్సవక్షా శ్శ్రీవాస శ్శ్రీపతిః శ్రీమతాంవరః. 64
శ్రీద శ్శ్రీశ శ్శ్రీనివాసః శ్రీనిధిః శ్రీవిభావనః,
శ్రీధరః శ్రీకర శ్శ్రేయః శ్రీమాన్ లోకత్రయాశ్రయః. 65
స్వక్ష స్స్వఙ్గ శ్శతానందో నంది ర్జ్యోతిర్గణేశ్వరః,
విజితాత్మా విధేయాత్మా సత్కీర్తి శ్ఛిన్నసంశయః. 66
ఉదీర్ణ స్సర్వతశ్చక్షు రనీశ శ్శాశ్వత స్స్థిరః,
భూశయో భూషణో భూతి ర్విశోక శ్శోకనాశనః. 67
అర్చిష్మా నర్చితః కుంభో విశుద్ధాత్మా విశోధనః,
అనిరుద్ధో౽ప్రతిరథః ప్రద్యుమ్నో౽మితవిక్రమః 68
కాలనేమినిహా వీర శ్శౌరి శ్శూరజనేశ్వరః,
త్రిలోకాత్మా త్రిలోకేశః కేశవః కేశిహా హరిః. 69
కామదేవః కామపాలః కామీ కాంతః కృతాగమః,
అనిర్దేశ్యవపు ర్విష్ణు ర్వీరో౽నంతో ధనంజయః 70

బ్రహ్మణ్యో బ్రహ్మకృ ద్బ్రహ్మా బ్రహ్మ బ్రహ్మవివర్ధనః,
బ్రహ్మవి ద్బ్రాహ్మణో బ్రహ్మీ బ్రహ్మజ్ఞో బ్రాహ్మణప్రియః. 71
మహాక్రమో మహాకర్మా మహాతేజా మహోరగః,
మహాక్రతు ర్మహాయజ్వా మహాయజ్ఞో మహాహవిః. 72
స్తవ్య స్స్తవప్రియ స్స్తోత్రం స్తుతి స్స్తోతా రణప్రియః,
పూర్ణః పూరయితా పుణ్యః పుణ్యకీర్తి రనామయః. 73
మనోజవ స్తీర్థకరో వసురేతా వసుప్రదః,
వాసవో వాసుదేవశ్చ వసు ర్వసుమనా హవిః. 74
సద్గతి స్సత్కృతి స్సత్తా సద్భూతి స్సత్పరాయణః,
శూరసేనో యదుశ్రేష్ఠ స్సన్నివాస స్సుయామునః. 75
భూతావాసో వాసుదేవః సర్వాసు నిలయోఽనలః,
దర్పహా దర్పదోఽ దృప్తో దుర్ధరోఽథాపరాజితః. 76
విశ్వమూర్తి ర్మహామూర్తి ర్దీప్తమూర్తి రమూర్తిమాన్,
అనేకమూర్తి రవ్యక్త శ్శతమూర్తి శ్శతాననః. 77
ఏకో నైక స్సవః కః కిం యత్త త్పద మనుత్తమమ్,
లోకబంధు ర్లోకనాథో మాధవో భక్తవత్సలః. 78
సువర్ణవర్ణో హేమాంగో వరాంగ శ్చందనాంగదీ,
వీరహా విషమ శ్శూన్యో ఘృతాశీ రచల శ్చలః. 79
అమానీ మానదో మాన్యో లోకస్వామీ త్రిలోకధృక్,
సుమేధా మేధజో ధన్య స్సత్యమేధా ధరాధరః. 80
తేజోవృషో ద్యుతిధర స్సర్వశస్త్రభృతాం వరః,
ప్రగ్రహో నిగ్రహో వ్యగ్రో నైకశృంగో గదాగ్రజః 81
చతుర్మూర్తి శ్చతుర్బాహు శ్చతుర్వ్యూహ శ్చతుర్గతిః,
చతురాత్మా చతుర్భావ శ్చతుర్వేదవి దేకపాత్. 82
సమావర్తోఽ నివృత్తాత్మా దుర్జయో దురతిక్రమః,
దుర్లభో దుర్గమో దుర్గో దురావాసో దురారిహా. 83

శుభాంగో లోకసారంగ స్సుతంతు స్తంతువర్ధనః,
ఇంద్రకర్మా మహాకర్మా కృతకర్మా కృతాగమః. 84

ఉద్భవ స్సుందర స్సుందో రత్ననాభ స్సులోచనః,
అర్కో వాజసన శ్శృంగీ జయంత స్సర్వవి జ్జయీ. 85

సువర్ణబిందు రక్షోభ్య స్సర్వవాగీశ్వ రేశ్వరః,
మహాహ్రదో మహాగర్తో మహాభూతో మహానిధిః. 86

కుముదః కుందరః కుందః పర్జన్యః పావనోఽనిలః,
అమృతాంశోఽమృతవపు స్సర్వజ్ఞ స్సర్వతోముఖః. 87

సులభ స్సువ్రత స్సిద్ధ శ్శత్రుజి చ్ఛత్రుతాపనః,
న్యగ్రోధో దుంబరోఽశ్వత్థ శ్చాణూరాంధ్రనిషూదనః. 88

సహస్రార్చి స్సప్తజిహ్వ స్సప్తైధా స్సప్తవాహనః,
అమూర్తి రనఘోఽచింత్యో భయకృ ద్భయనాశనః. 89

అణు ర్బృహ త్కృశః స్థూలో గుణభృ న్నిర్గుణో మహాన్,
అధృతః స్వధృత స్స్వాస్యః ప్రాగ్వంశో వంశవర్ధనః. 90

భారభృ త్కథితో యోగీ యోగీశః సర్వకామదః,
ఆశ్రమః శ్రమణః క్షామ స్సుపర్ణో వాయువాహనః. 91

ధనుర్ధరో ధనుర్వేదో దండో దమయితా దమః,
అపరాజిత స్సర్వసహో నియంతా నియమో యమః. 92

సత్త్వవాన్ సాత్త్విక స్సత్య స్సత్యధర్మపరాయణః,
అభిప్రాయః ప్రియార్హోఽర్హః ప్రియకృ త్ప్రీతివర్ధనః. 93

విహాయసగతి ర్జ్యోతి స్సురుచి ర్హుతభు గ్విభుః,
రవి ర్విలోచన స్సూర్యః సవితా రవిలోచనః. 94

అనంతో హుతభు గ్భోక్తా సుఖదో నైకజోఽగ్రజః,
అనిర్విణ్ణ స్సదామర్షీ లోకాధిష్ఠాన మద్భుతః. 95

సనా త్సనాతనతమః కపిలః కపి రవ్యయః,
స్వస్తిద స్స్వస్తికృ త్స్వస్తి స్వస్తిభు క్స్వస్తిదక్షిణః. 96

అరౌద్రః కుండలీ చక్రీ విక్రమ్యూర్జితశాసనః,
శబ్దాతిగ శ్శబ్దసహ శ్శిశిర శ్శర్వరీకరః. 97
అక్రూరః పేశలో దక్షో దక్షిణః క్షమిణాంవరః,
విద్వత్తమో వీతభయః పుణ్యశ్రవణకీర్తనః. 98
ఉత్తారణో దుష్కృతిహా పుణ్యో దుస్స్వప్ననాశనః
వీరహా రక్షణ స్సంతో జీవనం పర్యవస్థితః. 99
అనంతరూపో౽నంతశ్రీ ర్జితమన్యు ర్భయాపహః,
చతురశ్రో గభీరాత్మా విదిశో వ్యాదిశో దిశః. 100
అనాది ర్భూర్భువో లక్ష్మీ స్సువీరో రుచిరాంగదః,
జననో జనజన్మాది ర్భీమో భీమపరాక్రమః. 101
ఆధారనిలయో ధాతా పుష్పహాసః ప్రజాగరః,
ఊర్ధ్వగ స్సత్పథాచారః ప్రాణదః ప్రణవః పణః. 102
ప్రమాణం ప్రాణనిలయః ప్రాణభృ త్ప్రాణజీవనః,
తత్త్వం తత్త్వవి దేకాత్మా జన్మమృత్యుజరాతిగః. 103
భూర్భువ స్స్వస్తరు స్తార స్సవితా ప్రపితామహః,
యజ్ఞో యజ్ఞపతి ర్యజ్వా యజ్ఞాంగో యజ్ఞవాహనః. 104
యజ్ఞభృ ద్యజ్ఞకృ ద్యజ్ఞీ యజ్ఞభు గ్యజ్ఞసాధనః,
యజ్ఞాంతకృ ద్యజ్ఞగుహ్య మన్న మన్నాద ఏవచ. 105
ఆత్మయోని స్స్వయంజాతో వైఖాన స్సామగాయనః,
దేవకీనందన స్స్రష్టా క్షితీశః పాపనాశనః. 106
శఙ్ఖభృ న్నందకీ చక్రీ శార్ఙ్గధన్వా గదాధరః,
రథాంగపాణి రక్షోభ్య స్సర్వప్రహరణాయుధః 107

శ్రీ సర్వప్రహరణాయుధోన్నమ ఇతి,
వనమాలీ గదీ శార్ఙ్గీ శంఖీ చక్రీ చ నందకీ,
శ్రీమాన్నారాయణో విష్ణు ర్వాసుదేవో౽భిరక్షతు. 108
శ్రీ వాసుదేవో౽భి రక్ష త్వోన్నమ ఇతి.

## ఉత్తర పీఠికా

ఇతీదం కీర్తనీయస్య కేశవస్య మహాత్మనః,
నామ్నాం సహస్రం దివ్యానా మశేషేణ ప్రకీర్తితమ్. 1
య ఇదం శృణుయా న్నిత్యం యశ్చాపి పరికీర్తయేత్,
నాశుభం ప్రాప్నుయా త్కించి త్సోఽముత్రేహ చ మానవః. 2
వేదాంతగో బ్రాహ్మణస్స్యా త్క్షత్రియో విజయీ భవేత్,
వైశ్యో ధనసమృద్ధ స్స్యా చ్ఛూద్ర స్సుఖ మవాప్నుయాత్. 3
ధర్మార్థీ ప్రాప్నుయా ద్ధర్మ మర్థార్థీ చార్థ మాప్నుయాత్,
కామా నవాప్నుయా త్కామీ ప్రజార్థీ చాప్నుయా త్ప్రజాః. 4
భక్తిమాన్ య స్సదోత్థాయ శుచి స్తద్గతమానసః
సహస్రం వాసుదేవస్య నామ్నా మేత త్ప్రకీర్తయేత్. 5
యశః ప్రాప్నోతి విపులం యాతి ప్రాధాన్య మేవచ,
అచలాం శ్రియ మాప్నోతి శ్రేయః ప్రాప్నో త్యనుత్తమమ్. 6
న భయం క్వచి దాప్నోతి వీర్యం తేజ శ్చ విందతి,
భవ త్యరోగో ద్యుతిమా న్బలరూపగుణాన్వితః. 7
రోగార్తో ముచ్యతే రోగా ద్బద్ధో ముచ్యేత బంధనాత్,
భయాన్ముచ్యేత భీత స్తు ముచ్యే తాపన్న ఆపదః. 8
దుర్గా ణ్యతితర త్యాశు పురుషః పురుషోత్తమమ్,
స్తువ న్నామ సహస్రేణ నిత్యం భక్తిసమన్వితః. 9
వాసుదేవాశ్రయో మర్త్యో వాసుదేవ పరాయణః,
సర్వపాపవిశుద్ధాత్మా యాతి బ్రహ్మ సనాతనమ్. 10
న వాసుదేవభక్తానా మశుభం విద్యతే క్వచిత్,
జన్మమృత్యుజరావ్యాధి భయం నా ప్యుపజాయతే. 11
ఇమం స్తవ మధీయానః శ్రద్ధాభక్తి సమన్వితః
యుజ్యే తాత్మా సుఖక్షాంతి శ్రీ ధృతి స్మృతి కీర్తిభిః. 12

న క్రోధో నచ మాత్సర్యం న లోభో నాశుభా మతిః,
భవంతి కృతపుణ్యానాం భక్తానాం పురుషోత్తమ. 13

ద్యౌ స్సచంద్రార్క నక్షత్రం ఖం దిశో భూ ర్మహోదధిః,
వాసుదేవస్య వీర్యేణ విధృతాని మహాత్మనః. 14

ససురాసురగంధర్వం సయక్షోరగరాక్షసం,
జగ ద్వశే వర్తతేదం కృష్ణస్య సచరాచరమ్. 15

ఇంద్రియాణి మనోబుద్ధి స్సత్త్వం తేజోబలం ధృతిః,
వాసుదేవాత్మకా న్యాహుః క్షేత్రం క్షేత్రజ్ఞ ఏవ చ. 16

సర్వాగమానా మాచారః ప్రథమం పరికల్పితః,
ఆచారప్రభవో ధర్మో ధర్మస్య ప్రభు రచ్యుతః. 17

ఋషయః పితరో దేవా మహాభూతాని ధాతవః,
జఙ్గమా జఙ్గమం చేదం జగ న్నారాయణోద్భవమ్. 18

యోగో జ్ఞానం తథాసాఙ్ఖ్యం విద్యా శ్శిల్పాది కర్మచ,
వేదశాస్త్రాణి విజ్ఞాన మేత త్సర్వం జనార్దనాత్. 19

ఏకో విష్ణు ర్మహద్భూతం పృథగ్భూతా న్యనేకశః,
త్రీన్లోకా న్వ్యాప్య భూతాత్మా భుఙ్క్తే విశ్వభు గవ్యయః. 20

ఇమం స్తవం భగవతో విష్ణో ర్వ్యాసేన కీర్తితమ్,
పఠేద్య ఇచ్ఛే త్పురుషః శ్రేయః ప్రాప్తుం సుఖాని చ. 21

విశ్వేశ్వర మజం దేవం జగతః ప్రభు మవ్యయమ్,
భజంతి యే పుష్కరాక్షం న తే యాంతి పరాభవమ్. 22

న తే యాంతి పరాభవ మోన్నమ ఇతి.

అర్జున ఉవాచ

పద్మపత్ర విశాలాక్ష పద్మనాభ సురోత్తమ,
భక్తానా మనురక్తానాం త్రాతా భవ జనార్దన! 23

## శ్రీ భగవానువాచ

యో మాం నామ సహస్రేణ స్తోతు మిచ్ఛతి పాండవ,
సోఽహ మేకేన శ్లోకేన స్తుత ఏవ న సంశయః. 24

స్తుత ఏవ న సంశయ ఓన్నమ ఇతి.

## వ్యాస ఉవాచ

వాసనా ద్వాసుదేవస్య వాసితం తే జగత్త్రయమ్,
సర్వభూతనివాసోఽసి వాసుదేవ నమోస్తుతే. 25

శ్రీ వాసుదేవ నమోస్తుత ఓన్నమ ఇతి.

## పార్వత్యువాచ

కేనోపాయేన లఘునా విష్ణోర్నామ సహస్రకమ్,
పఠ్యతే పండితై ర్నిత్యం శ్రోతు మిచ్ఛా మ్యహం ప్రభో. 26

## ఈశ్వర ఉవాచ

శ్రీరామరామ రామేతి రమే రామే మనోరమే,
సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే. 27

శ్రీరామనామ వరానన ఓన్నమ ఇతి.

## బ్రహ్మోవాచ

నమోఽ స్త్వనంతాయ సహస్రమూర్తయే సహస్రపాదాక్షి.
శిరోరుబాహవే

సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే సహస్రకోటీ యుగధారిణే నమః 28

సహస్రకోటీ యుగధారిణ ఓన్నమ ఇతి

## సంజయ ఉవాచ

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్రపార్థో ధనుర్ధరః,
తత్ర శ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ. 29

## శ్రీ భగవానువాచ

అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్. 30

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్,
ధర్మసంస్థాపనార్థాయ సమ్భవామి యుగే యుగే. 31

ఆర్తా విషణ్ణా శ్శిథిలాశ్చ భీతా ఘోరేషు చ వ్యాధిషు వర్తమానాః,
సంకీర్త్య నారాయణ శబ్దమాత్రం విముక్త దుఃఖా స్సుఖినో భవంతి. 32

ఇతి శ్రీ మన్మహాభారతే శతసాహస్రికాయాం సంహితాయాం, వైయాసిక్యా మానుశాసనికే పర్వణి, మోక్షధర్మే, భీష్మ యుధిష్ఠిర సంవాదే, శ్రీ విష్ణో ర్దివ్య సహస్రనామస్తోత్రం నామైకోన పఞ్చాశదధిక శతతమోఽధ్యాయః.

శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రం సమాప్తమ్.

—oo:o:oo—

శ్రీ లక్ష్మీ హయగ్రీవాయ నమః

హరిః ఓమ్

# శ్రీ విష్ణు సహస్ర నామ స్తోత్రమ్

( శ్రీ సత్యసంధతీర్థ గురురాజ కృత భాష్య సహితమ్ )

సందర్భము : శ్రీ మన్మహా భారతము నందలి ఆనుశాసనిక పర్వము లోని 149 వ అధ్యాయమునందు భీష్ముడు ధర్మరాజునకు చెప్పినట్లుగా వ్యాసమహర్షి "శ్రీ విష్ణు సహస్రనామము" ను రచించెను. ఉమా మహేశ్వర సంవాదము తరువాత ఈ ఘట్టము వచ్చును.

ఇందు విష్ణువునకు గల సహస్ర (1000) నామములను, వానిని స్మరించుటచే మానవులకు కలుగు ఫలమును, విష్ణువుయొక్క మాహాత్మ్యమును, ధర్మరాజు అడుగగా భీష్ముడు వివరించెను. భారత కథను జనమేజయ మహారాజునకు వైశంపాయన మహర్షి చెప్పుటవలన ఈ ఘట్టము "వైశంపాయన ఉవాచ" అను మాటలతో ప్రారంభమగును.

## వైశంపాయన ఉవాచ : వైశంపాయనుడు చెప్పెను :

శ్రుత్వా ధర్మా నశేషేణ
పావనాని చ సర్వశః।
యుధిష్ఠిర శ్శాంతనవం
పునరే వాభ్య భాషత॥ 1

భీష్ముడు చెప్పిన పవిత్రమైన, అన్నిరకముల ధర్మములను పూర్తిగా విని, ధర్మరాజు అతనితో మరల పల్కెను.

కి మేకం దైవతం లోకే?
కిం వా ప్యేకం పరాయణమ్?

స్తువన్తః కం? క మర్చన్తః
ప్రాప్నుయు ర్మానవా శ్శుభమ్॥? 2

ఓ తాతా! లోకమునందు ఒకే ఒక్క దైవము ఏది? అన్నిటి కంటె ఉత్తముడైన దేవుఁ డెవరు? ఎవరిని స్తోత్రముచేసి, ఎవరిని పూజించి, మానవులు శుభమును పొందగలరు?

కో ధర్మ స్సర్వ ధర్మాణాం
భవతః పరమో మతః?
కిం జపన్ ముచ్యతే
జంతు ర్జన్మ సంసార బంధనాత్॥? 3

అన్ని ధర్మములలోను నీకు నచ్చిన ఉత్తమ ధర్మమేది? జంతువు (ప్రాణి) జన్మము, సంసారము అను బంధనములనుండి దేనిని జపము చేయుచు ముక్తుడగును ?

## భీష్మ ఉవాచ : భీష్ముడు చెప్పెను :

జగత్ ప్రభుం దేవదేవ
మనంతం పురుషోత్తమమ్।
స్తువ న్నామ సహస్రేణ
పురుష స్సతతో త్థితః॥ 4

జగత్తునకు ప్రభువును, దేవతలకు దేవుఁడును, అనంతుడును, పురుషోత్తముడును నగు విష్ణువును వేయిపేర్లతో నిత్య జాగరూకుడై స్తోత్రము చేసెడి పురుషుడు ఎప్పుడును అభివృద్ధినే చెందును.

తమేవ చార్చయన్ నిత్యం
భక్త్యా పురుష మవ్యయమ్।

ధ్యాయన్ స్తువన్ నమస్యం శ్చ
యజమాన స్తమేవ చ॥ 5

పురుషుడును, అవ్యయుడును అగు ఆ విష్ణువునే నిత్యము పూజించుచు, ధ్యానించుచు, స్తోత్రము చేయుచు, నమస్కరించుచు, యజ్ఞములు అతని కొరకే చేయుచు – (తర్వాతి శ్లోకముతో అన్వయము)

అనాది నిధనం విష్ణుం
సర్వలోక మహేశ్వరమ్।
లోకాధ్యక్షం స్తువన్ నిత్యం
సర్వ దుఃఖాతిగో భవేత్॥ 6

ఆది లేనివాడును, నిధనము (మరణము) లేనివాడును, విష్ణువు (అంత వ్యాపించిన వాడును), అన్ని లోకములకు అధ్యక్షుడును అగు విష్ణువును నిత్యము స్తోత్రము చేయువాడు అన్ని దుఃఖములను దాటిన వాడగును.

బ్రహ్మణ్యం సర్వధర్మజ్ఞం
లోకానాం కీర్తి వర్ధనమ్।
లోకానాం మహత్ భూతం
సర్వభూత భవోద్భవమ్॥ 7

ఆ విష్ణువును బ్రహ్మణ్యునిగను, సర్వధర్మములను తెలిసిన వానిగను, అన్ని లోకముల కీర్తిని పెంపొందించు వానిగను, లోకములకు నాథునిగను, మహద్భూతముగను (పంచ భూతములు) సర్వ భూతముల పుట్టుకకు మూలకారణునిగను తెలిసికొనవలెను.

ఏష మే సర్వధర్మాణాం
ధర్మోఽధిక తమో మతః।

యద్ భక్త్యా పుండరీకాక్షం
స్తవై రర్చే న్నర స్సదా॥ 8

నరుడు ఎల్లప్పుడు భక్తితో స్తోత్రముల ద్వారా పుండరీకాక్షుని స్తుతించుటే అన్ని ధర్మములలోనికి ఉత్తమ ధర్మమని నా అభిప్రాయము.

పరమం యో మహత్ తేజః
పరమం యో మహత్తపః।
పరమం యో మహత్ బ్రహ్మ
పరమం యః పరాయణమ్॥

గొప్ప తేజస్సు ఏదో (అదే పరమమైనది) గొప్ప తపస్సు ఏదో (అదే పరమమైనది) మహత్ బ్రహ్మ పదార్థ మేదో (అదే పరమమైనది) పరాయణం (మిక్కిలి చేరతగినది) ఏదో (అదే పరమమైనది) అనగా ఆ పరమమైన విష్ణువు, మహాతేజుడు, మహాతపః సంపన్నుడు, మహాతపస్సు, బ్రహ్మ, లోకైక శరణ్యుడు అని దీని భావము.

పవిత్రాణాం పవిత్రం యో
మంగళానాం చ మంగళమ్।
దైవతం దేవతానాం చ
భూతానాం యోఽ వ్యయః పితా॥ 10

దేవతలకు దేవుడును, పవిత్రమైన పదార్థము లన్నిటికి పవిత్రత నిచ్చువాడను, మంగళములైన వాటిన్నింటిని శుభదాయి ఎవరో భూతముల కన్నిటికి నాశములేని తండ్రి, ఎవరో (అతడే విష్ణువు).

యత స్సర్వాణి భూతాని
భవం త్యాది యుగాగమే।
యస్మింశ్చ ప్రళయం యాన్తి
పునరేవ యుగక్షయే॥ 11

ఆదియుగము వచ్చినపుడు సృష్టి ప్రారంభమున అన్ని భూతములు ఎవనినుండి పుట్టుచున్నవో, యుగములు క్షీణించి నపుడు (ప్రళయ కాలమునందు) మరల ఎవని యందు ప్రలీన మగుచున్నవో-

తస్య లోక ప్రధానస్య
జగన్నాథస్య భూపతే।
విష్ణో ర్నామ సహస్రం మే
శృణు పాప భయాపహమ్॥ 12

ఓ ధర్మరాజా అట్టి జగన్నాథుడును, లోకము లన్నిటియందును ప్రధానుడును అగు ఆ విష్ణువు యొక్క సహస్ర నామములను వినుము. అవి పాపమును, భయమును కూడ తొలగించును.

యాని నామాని గౌణాని
విఖ్యాతాని మహాత్మనః।
ఋషిభిః పరిగీతాని
తాని వక్ష్యామి భూపతే॥ 13

ఓ ధర్మరాజా! మహాత్ముడగు విష్ణువునకున్న, ఆతని గుణగణములను తెలుపునట్టి, ఋషులచేత సమగ్రముగా కీర్తింపబడినట్టి, ప్రఖ్యాతములైన ఏ నామములు కలవో వానిని చెప్పబోవుచున్నాను.

ఋషి ర్నామ్నాం సహస్రస్య వేదవ్యాసో మహామునిః।
ఛందోఽనుష్టు ప్తథా దేవో భగవాన్ దేవకీ సుతః॥ 14

ఈ విష్ణు సహస్రనామమునకు ఋషి- వేదవ్యాస మహాముని ఛందస్సు-అనుష్టుప్పు, దేవుడు భగవంతుడైన దేవకీ సుతుడు.

అమృతాం శూద్భవో బీజం శక్తి ర్దేవకి నందనః।
త్రిసామా హృదయం తస్య శాంత్యర్థే వినియుజ్యతే॥ 15

బీజము—అమృతాం శూద్భవః అనునామము. శక్తి—దేవః నందనః అనునామము. హృదయము—త్రిసామా అనునామము. లోక శాంత్యర్థము ఈ సహస్రనామమును మంత్రముగా ఉపయోగింతురు.

విష్ణుం జిష్ణుం మహావిష్ణుం ప్రభవిష్ణుం మహేశ్వరమ్।
అనేక రూపదైత్యాంతం నమామి పురుషోత్తమమ్॥ 16

విష్ణువునకు, జిష్ణువునకు (గెలుచువానికి), మహావిష్ణువునకు, ప్రభవిష్ణునకు, మహేశ్వరునకు అనేక రూపములలో ఉన్న రాక్షసులను సంహరించు వానికి, పురుషోత్తమునకు నమస్కారము.

అస్య శ్రీ విష్ణోర్దివ్య సహస్రనామ స్తోత్ర మహామంత్రస్య శ్రీ వేద వ్యాసో భగవాన్ ఋషిః। అనుష్టుప్ ఛందః। శ్రీ మహావిష్ణుః పరమాత్మా శ్రీమన్నారాయణో దేవతా। అమృతాం శూద్భవో భానురితి బీజమ్। దేవకీ నందనః స్రష్టేతి శక్తిః। ఉద్భవ క్షోభణో దేవ ఇతి పరమో మంత్రః। శంఖ భృన్నందకీ చక్రీతి కీలకమ్। శార్ఙ్గ ధన్వా గదాధర ఇత్యస్త్రమ్। రథాంగపాణి రక్షోభ్య ఇతి నేత్రమ్। త్రిసామా సామగ స్సామేతి కవచమ్। ఆనందం పరబ్రహ్మేతి యోనిః। ఋతుః సుదర్శనః కాల ఇతి దిగ్బంధః। శ్రీ విశ్వరూప ఇతి ధ్యానమ్। శ్రీ మహా విష్ణు ప్రీత్యర్థే సహస్ర నామ జపే వినియోగః।

ఈ విష్ణు సహస్రనామ స్తోత్ర మహామంత్రమునకు భగవంతుడైన వేదవ్యాసుడు ఋషి. (కర్త). అనుష్టుప్ అనునది ఛందస్సు. పరమాత్మయును, శ్రీమన్నారాయణుడును అగు శ్రీ మహావిష్ణువు దేవత (ఫలప్రదుడు). అమృతాం శూద్భవః, భానుః అను నామములు బీజము. దేవకీ నందనః స్రష్టా అను నామములు శక్తి. ఉద్భవః, క్షోభణః దేవః అను నామములు పరమమంత్రములు, శంఖభృత్, నందకీ,

చక్రీ అను పేర్లు కీలకము. శార్ఙ్గధన్వా, గదాధరః అను నామములు అస్త్రములు. రథాంగపాణిః, అక్షోభ్యః అను నామములు నేత్రములు. త్రిసామా, సామగః, సామ అను పేర్లు కవచము. ఆనందం, పరబ్రహ్మ అను పేర్లు యోని. ఋతుః, సుదర్శనః, కాలః అనునామములు దిగ్బంధము. శ్రీ విశ్వరూపః అను నామముధ్యానము. ఈ మంత్రము విష్ణుప్రీతి కొఱకు చేయు జపము నందు ఉపయోగింప దగినది.

శ్రీః

# శ్రీ విష్ణు సహస్రనామ భాష్యమ్

## ( శ్రీ సత్యసంధ యతిరాజ కృతిమ్ )

హరిః ఓమ్

ఇహ లోకమున వివిధ వ్యసన (ఆపదల) రాశుల వలన కలుగు తలవంపు కలవారిని, నిః శ్రేయసమునకు (మోక్షమునకు) సాధనమైన జ్ఞానము నందు పండితులను, వేదాధ్యయనమునకు అధికారము లేని స్త్రీలు, శూద్రులు మొదగు వారిని, సంసార సముద్రము నుండి దాటించుటకును, పరమ కారుణికుడై, కమల (లక్ష్మి), కమలా సనుడు (బ్రహ్మ), మొదలైన ఉత్తమ దేవతా సమూహములచే ప్రార్థితుడై, శ్రీ నాథుడే (విష్ణువే) వ్యాసుని యొక్క రూపమును స్వీకరించి, నిర్మించిన సహస్ర నామములను బుద్ధి శుద్ధి కొఱకై మాకు తెలిసినంతవరకు వ్యాఖ్యానము చేయు చున్నాము. ఈ నామములను ఇంతకు పూర్వము ఎందరో వ్యాఖ్యాసించి ఉన్నను, ద్వైత సంప్రదాయము ననుసరించి మరల వివరించుచున్నాము.

శ్లో॥ విశ్వం విష్ణుర్వషట్కారో భూత భవ్య భవత్ ప్రభుః।
భూత కృత్ భూత భృత్ భావో భూతాత్మా భూతభావనః ॥

# 1 విశ్వం

1 విశ్ + వం = విశ్వం = జగత్తులోనికి ప్రవేశించిన వాఁడు అని అర్థము "విశ్" = ప్రవేశించుట " అను ధాతువును బట్టి, "తత్సృష్ట్వా, తదే వాను ప్రావిశత్" జగత్తును సృష్టించి, దానిలోనికి ప్రవేశించిన వాఁడు' అను శృతిని బట్టి ఈ అర్థము సార్థక మైనది.

2 విశ్ + వం = అంతట ప్రవేశించిన వాడు, జ్ఞానరూపము కలవాడు, "వా" గతి గంధనయోః" అను ధాతువునకు గతి లేక గంధనము అను అర్థము ఉండుటచే ఈ భావము వచ్చినది.

3 విః + శ్వం = విః = పక్షి అగు గరుడుని ద్వారా, శ్వ = పయనించు వాడు.

4 వి + శ్వం = వి = ఎక్కువగా (విశేషముగా), శ్వ = వ్యాపించు వాడు.

5 వి + శ్వం = వి = విశేషముగా, శ్వ = పెరుగువాఁడు. ఈ అర్థమునకు "టు ఓ శ్వి = గతి వృద్ధ్యోః" అను ధాతువు ప్రమాణము.

6 విశ్వ + వం = "వృతు = వర్తనే" అను ధాతువును బట్టి విశ్వ = విశ్వములోనికి అంతర్యామిగా వాయువును వం = ప్రవర్తింపజేయువాడు అని అర్థము. "లోపస్సమానే" (సమానమైన వర్ణము పరమైనపుడు మొదటి వర్ణము లోపించును) అను వాక్యముచే ఇందు మొదటి "వ" కారము లోపించినది.

7 విశ్వ + వం = విశ్వ = విశ్వమును, వం = వర్తింప జేయువాడు (నడిపించువాడు). విశ్వమునకు కారణమైనవాడు.

8 శరీరములయందు ప్రవేశించుట వలన "విశ్వ" మనగా జీవుడు.

" జీవస్య తదధీనత్వాద్ విష్ణు ర్విశ్వ ఇతి స్మృతః " అను ప్రమాణ వాక్యము వలన ఈ జీవుడు ఆ విష్ణువునకు అధీనుడు కనుక విశ్వ మనగా " జీవ నియామకుడు " అని అర్థము,

9 వి+సు+అమ్ "విశ్వం సుబల రూపత్వాత్"=విశ్వమనగా మంచి బలము, మంచి రూపము " అను ప్రమాణ వాక్యమును బట్టి విశిష్ట మైన సుఖముకాని, జ్ఞానముకాని, రూపముగా కలవాడు. లేక విశిష్ట మైన సుఖముకాని, జ్ఞానము కాని తన రూపముగా కలవాడు.

" స్వాత్మానన్దః సముద్దిష్టః " అను వాక్యము ఇందుకు ప్రమాణము.

## 2. విష్ణుః

1 విశ్ +ణుః = " విష్ ఌ వ్యాప్తౌ " అను ధాతువు ద్వారా అంతట వ్యాపించి ఉండువాడు

2 "విశ ప్రవేశనే"అను ధాతువును బట్టి అంతట ప్రవేశించి ఉండువాడు.

3 వి+ష్ణుః = " ష్ణు " ప్రత్యయము గత్యర్థమును సూచించును. త్రివిక్రమ రూపముతో, 'వి'=విశేషముగా మూడు పాదములతో, " ష్ణుః "= వ్యాపించినాడు కనుక విష్ణువు. ( వామన రూపమున సర్వము నాక్రమించిన వాడు ).

## 3. వషట్కారః

1 వ+షట్ = ' వృతువర్తనే ' అను ధాతువును బట్టి "వాః" అనగా ఉండువారు అని అర్థము. ఐశ్వర్యము, వీర్యము, యశస్సు, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము అను ఆరును ఎవనియందు ఉన్నవో అతడు వషట్కారుడు.

2 షడ్గుణములతో ఉండువాడు.

3 "వషట్" అను పేరుతో ఆక్రియతే = పిలువబడు వాడు.

## 4. భూత భవ్య భవత్ ప్రభుః

1 భూత + భవ్య + భవతామ్ + ప్రభుః = గడచిన, రానున్న, జరుగుచున్న కాలములకు ప్రభువు.

2 భూత భవ్య + భవత్ ప్రభుః = "భూత భవ్య" = ఎక్కువయైన మంగళములు ఎవని వలన కలుగునో అతడు భూత భవ్యుడు. భూత భవ్యుడైన భవత్ప్రభుః = కాబోవు ప్రభువు, (మంగళ ప్రదుడగు భవిష్యత్ ప్రభువు)

## 5. భూతకృత్

1 భూత + కృత్ = భూతములను ఛేదించువాడు. "కృతీ = చ్ఛేదనే" అను ధాతువు దీనికి ప్రమాణము. (భూతములకు [ప్రాణులకు] వచ్చు ఉపద్రవములను తొలగించువాడు అని అర్థము.)

2 "కృత్" అనగా చేయువాడు, సృష్టించువాడని అర్థము. "భూత కృత్" (అనగా భూతములను సృష్టించువాడని అర్థము.)

## 6. భూతభృత్

భూత + భృత్ = భూతములను భరించు వాడు.

## 7. భావః

1 ప్రపంచమును ఉత్పాదింప చేయువాడు.

2 భా + అవః = భా = కాంతులను (చంద్రుడు మొదలగు వారికి)

అవః = ఇచ్చువాడు. అవ = దానే అనుధాతువు నుండి ఈ అర్థము వచ్చును (జ్యోతిస్సులన్నింటికి కాంతిని దానము చేయువాడు.)

3 భా + అవః = అవ ధాతువునకు రక్షణము, గతి, కాంతి. ప్రీతి, తృప్తి. అవగతి (తెలిసికొనుట), ప్రవేశము, శ్రవణము, స్వామి కొరకు యాచించు కోరిక, దీప్త్యవాప్తి (తేజస్సును పొందుట), ఆలింగనము, హింస, దానభాగము, వృద్ధి అను అర్థము లున్నవి. భా = నక్షత్రములలోనికి వానికి వెలుగు నిచ్చుటకై అవః = ప్రవేశించు వాడు అని అర్థము.

## 8 భూతాత్మా

1 భూత + ఆత్మా = "భూత" భూతములను, "ఆత్మా" = నియమించు వాడు. భూత స్వరూపుడు అని కూడ ఈ పదమున కర్థము చెప్పుదురు. కాని అది సరికాదు. ఆ అర్థము పూర్వోత్తర విరుద్ధము.

2 భూ + త + ఆత్మా = "భూ" = భూమియందు, "త" వ్యాపించి యున్న ఆత్మ, సర్వ వ్యాపి యని అర్థము.

## 9 భూత భావనః

1 భూత + భావ + నః = ప్రపంచములయొక్క భావములను (మనస్సులను) నడుపు వాడు.

2 భూతములను గూర్చి భావించువాడు (ఉత్పాదకుడు)

3 భూ + ఊత + భా + అవనః "భూ" = భూమియందు, ఊత = ఊతమైన (వ్యాపించిన), "భా" కాంతి కలవాడు మఱియు "అవనుడు" = రక్షకుడు = భూత భావనుడు.

శ్లో॥ పూతాత్మా పరమాత్మాచ ముక్తానాం పరమాగతిః
అవ్యయః పురుషః సాక్షీ క్షేత్రజ్ఞోఽక్షర ఏవచ 2

## 10 పూతాత్మా

1 "పూత" + ఆత్మా = ఎవని వలన; ఆత్మానః; జీవులు = పూతః = పవిత్రులుగా చేయబడిరో అతడు. (జీవులను పవిత్రులుగా చేయు వాడు)

2 "పూత" = పవిత్రులైన వారియొక్క; "ఆత్మా" = మనస్సు ఎవరి యందు ఉండునో అతడు (పవిత్రులైన దేవఋష్యాదులచే భావింప బడు వాడు)

3 పవిత్రమైన ఆత్మ

## 11 పరమాత్మా

1 పరమ + ఆత్మా = "పరమ" = ఉత్తమమైన ఆత్మ.

2 పర + మాత్మా = ఎవనిచేత; "పర" = శత్రువులు; "మాత్మా" = హింసింప బడుదురో అతడు పరమాత్మ; మీఙ్ = హింసాయాం అను ధాతువు ఇందుకు ప్రమాణము (శత్రు సంహారకుడు)

3 పర + మా + ఆత్మా = "పర" = గొప్పది యైన "మా" = లక్ష్మి, "ఆత్మా" = కలవాడు (లక్ష్మీవంతుడు)

4 ప + రమా + ఆత్మా = "ప" = రక్షించునట్టి, "రమా" = రమకు; (లక్ష్మికి), "ఆత్మా" = పతి, ఆత్మ శబ్దమునకు "పతి" అను అర్థము అనువ్యాఖ్యానము నందు తెలుపబడినది. "ఆదానార్థ త్వాత శ్చాయ మాత్మ శబ్దః పతిం వదేత్", "భాగవతము నందు ఏది

పొందునో, ఏది గ్రహించునో, ఏది ఐహిక విషయములను అనుభవించునో, ఏది నిత్యముగా ఉండునో, అది ఆత్మ అని చెప్పబడినది"

"యచ్చాప్నోతి యదాదత్తే యచ్చాత్తి విషయా నిహ।
యచ్చాస్య సన్తతోభావః తస్మా దాత్మేతి భణ్యతే॥" (భాగవతం)

5 "పర" = సేవకులను, భృత్యులను, "మాత్మా" = తన వారుగా గ్రహించువాడు. (లక్ష్మీపతి) నమ్మినవారిని రక్షించువాడు.

పరం + ఆత్మా

6 సూత్రి భాష్యమునందు సర్వగుణములు, సర్వదోషములు, నిందలు లేనివాడు "ఆత్మ" అని చెప్పబడినది. కనుక పరమమైన ఆత్మ పరమాత్మ (దోష రహితుడు)

## 12 ముక్తానాం పరమా గతిః

"ముక్తానాం" = ముక్తులకు, "పరమా" = ఉత్తమమైన "గతిః" = గమ్యస్థానమైన వాడు. (ముక్తశరణ్యుడు)

## 13 అవ్యయః

1 అవి + అయః = "అవేః" = సూర్యుని యొక్క, "అయః" = గమనము ఎవని వలనో అతడు.

2 అవి = పొట్టేలు వలె శత్రువులకు, అయః = ఎదురు నడచువాడు.

## 14 పురుషః

1 పుర్ + షః = "పుర్" = అందరికంటె ముందు, "షః" = నడచువాడు (నాయకుడు)

2 సృష్టి కంటెను ముందుండువాడు

3 పుర + షః = "పుర" = ఎక్కువైన, "షః" = చేష్టలు కలవాడు.

4 పుర + షః = "పుర" = ఎక్కువమంది రాక్షసులను షః = నాశనము చేయువాడు. ఇందు "షః" అను ధాతువునకు అంతకర్మ (చంపుట) అను అర్థము ద్వారా ఈ భావము చెప్పబడినది. ("షో = అంత కర్మణి" అనునది ధాతువు) (దుష్ట శిక్షకుడు)

5 పుర + సః = "పుర" = పూర్ణమైన మోక్షమను ఫలమును (తననే), "సః" = ఇచ్చువాడు. "షణు = దానే" అను ధాతువు ఇందుకు ప్రమాణము. (భక్తవశుడు ఉదా : కలలోనం దను మున్నెరుంగని మెచ్చి ఆర్తిహరుడై తన్నైన నిచ్చుం– భాగ 10–ఉత్తర–967 అను భాగవత వాక్యమిందుకు ప్రమాణము)

## 15 సాక్షీ

స + అక్షీ = ప్రత్యక్షముగా చూచువాడు "సాక్షాద్ ద్రష్టః సంజ్ఞాయామ్" అను స్మృతి వాక్యము ఇందుకు ప్రమాణము.

## 16 క్షేత్రజ్ఞః

క్షేత్ర + జ్ఞః = "క్షేత్ర" = భగవంతుడు నివసించు ప్రదేశము. "క్షి" అను ధాతువునకు "నివాసము, గతి" అను అర్థములున్నవి. క్షేత్రమును "జ్ఞః" = తెలిసికొన్నవాడు క్షేత్రమును తెలిసికొన్న వాడు)

## 17 అక్షరః

1 క్షరము = నాశము, న = "అ" = లేనివాడు.

2 అక్ష + రః = అక్షముల యందు = ఇంద్రియముల యందు, "రః" = రమించు వాడు.

3 అ + క్ష + రః = "క్షి" ధాతువునకు నశించుట అని అర్థము. "అక్ష" = క్షయము లేనివి (వైకుంఠాది లోకములు) వానిని "రః" = ఇచ్చువాడు లేక వానియందు రమించు వాడు. (వైకుంఠాది లోకముల నిచ్చువాడు లేక వాని యందు రమించువాడు.)

శ్లో॥ యోగో యోగ విదాం నేతా ప్రధాన పురుషేశ్వరః,
నారసింహ వపుః శ్రీమాన్ కేశవః పురుషోత్తమః.

## 18 యోగః

1 యోగుల చేత హృదయమందు ధ్యానింపబడువాడు.

2 గుణములను తనయందు చేర్చుకొనువాడు.

3 భక్తులకు సంసారము నుండి తరణోపాయము అయినవాడు.

## 19 యోగవిదాం నేతా

యోగ + విదాం + నేతా = యోగ మనగా సమాధి.

దానిని పొందిన వారు = యోగ విదులు (భక్తులు.)

వారిని "నేతా" = మోక్షమను ఫలము వద్దకు చేర్చువాడు. (యోగులకు మోక్షము నిచ్చువాడు.)

## 20 ప్రధాన పురుషేశ్వరః

1 ప్రధాన+పురుష+ఈశ్వరః=ప్రధాన మనగా ప్రకృతి. పురుషు లనగా జీవులు. ఈ ప్రకృతి పురుషులకు ఈశ్వరుడైన వాడు.

2 ప్ర+ధాన+పురుషే + అశ్వ + రః = "ప్ర" = ప్రకృష్టమైన, "ధాన"=ధారణము, పోషణము ఎవని వలన జరుగునో అతడు ప్రధానుడు. చతుర్ముఖుని కొఱకు అశ్వ = అశ్వరూపమును ధరించి (హయగ్రీవ రూపముతో) ఋక్ మొదలగు వేద విద్యలను రః= ఇచ్చువాడు=పురుషేశ్వరుడు, ప్రధానుడును, పురుషేశ్వరుడును అగువాడు. (పోషణ కర్తయై బ్రహ్మకు వేదములను ప్రసాదించిన వాడు.)

3 ప్రధానుడైన పురుషేశ్వరుడు అనికూడ అర్థము వచ్చును.

## 21 నారసింహ వపుః

నార+సింహ + వపుః = "నార"=నరునియొక్క, "సింహ"= సింహముయొక్క, "వపుః"=రూపము కలవాడు.

## 22 శ్రీమాన్

శం+ర+మాన్="శం" అను స్వరూపము గల వాయువు నందు "ర" = రతి కలిగియుండుట వలన "శ్రీః" అను పద మేర్పడినది. "శ్రీ" పదమునకు భారతి, లక్ష్మి, కాంతి అను అర్థము లున్నవి. భారతికి, లక్ష్మికి, కాంతికిని స్వామియును, భర్తయును, ఆధారమును అగుటచేతను=శ్రీ అగును. శ్రీ కలవాడు = శ్రీమంతుడు. (వాయు ప్రియుడు, కాంతికిని లక్ష్మి సరస్వతులకును భర్తయు ఆధారమును, స్వామియును అగువాడు.)

## 23 కేశవః

1 క + ఈశ + వః = "కేశవః", "కః" = బ్రహ్మ, ఈశః = రుద్రః = రుద్రుడు, వీరిద్దరిని "వః" = వర్తయతి = ప్రవర్తింపజేయువాడు.

"కో బ్రహ్మేతి సమాఖ్యాతః
ఈశోఽహం సర్వదేహినామ్।
ఆవాం తవాంగ సంభూతౌ
తతః కేశవ నామవాన్"

అని హరివంశమునందు రుద్రుడు కైలాస యాత్రాఘట్టములో చెప్పెను. (బ్రహ్మను రుద్రుని తమ తమ కార్యములయందు నియమించువాడు.)

2 కశ్చ ఈశ శ్చ కేశౌ = పుత్ర పౌత్రౌ స్తః అస్య, "శమ్యోః పితామహో బ్రహ్మపితా శక్రా ద్యధీశ్వరః" అను పద్మ పురాణ ప్రమాణ వాక్యముచే బ్రహ్మకు తండ్రియును, శివునకు తాతయును ఇంద్రాదులకు అధీశ్వరుడును అయినవాడు అని అర్థము.

3 కేశ = కేశి అను రాక్షసుని, "వః" = చంపిన వాడు. ఈ విషయము విష్ణు పురాణము నందు కృష్ణునకు నారదుడు చెప్పెను.

4 మోక్ష ధర్మమునందు సూర్యునియొక్క, చంద్రునియొక్క కిరణములకు "కేశ" అనుపేరు చెప్పబడినది. కేశములు = కిరణములు వః = కలవాడు = కేశవుడు.

## 24 పురుషోత్తమః

1 పురుష + ఉత్తమః = పురుషుల యందు ఉత్తముడు.

"యస్మా త్క్షర మతీతోఽహమ్

అతోఽ స్మి లోకే వేదే చ
ప్రథితః పురుషోత్తమః ॥ గీతా.

నేను క్షరాక్షరుల కంటె అతీతుడను, శ్రేష్ఠుడను గాన లోకమందును వేదములందును గూడ "పురుషోత్తము"డ నని ప్రసిద్ధి కెక్కితిని.

శ్లో॥ సర్వః శర్వః శివః స్థాణుః భూతాది ర్నిధి రవ్యయః
సంభవో భావనో భర్తా ప్రభవః ప్రభు రీశ్వరః 4

## 25 సర్వః

1 స+రవః = వేదమను శబ్దముతో కూడియుండుట చేత సర్వుడు. (శబ్ద బ్రహ్మ స్వరూపుడు)

2 సర్వత్ర వ్యాపించి యుండుట వలన సర్వుడు "సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః" అను గీతా వాక్యము ఇందుకు ప్రమాణము.

3 సర్వమును సృష్టించుటకు మూలకారణుడు. "సృష్టించు వాడను, పోషించువాడను, నాశము చేయువాడను, నియామకుడను, ప్రకటించు వాడను నేనే కనుక ఋషులచే 'సర్వుడు' అని పిలువబడు చున్నాను." అను గీతా భాష్యోక్తి ఇందుకు ప్రమాణము.

## 26 శర్వః

1 "శౄ" (హింసించుట) అను ధాతువునుండి ఏర్పడినది శర్వపదము (దుష్టులను హింసించువాడు అని దీనికి అర్థము.)

2 అయోగ్యుల యొక్క శుభములను నిరోధించువాడు. "శర్వః శ

## 27 శివః

1 మంగళము కలవాడు.

2 శుభమును కలిగించువాడు.

3 సుఖము కలవారు శివులు = ముక్తులు. వారిని వః = పవిత్రింప జేయువాడు.

## 28 స్థాణుః

1 స్థ + అణుః = "స్థ" = అంతట ఉండువాడు. అంతటను నున్న అణువు = స్థాణువు (అణురూపమున జగద్వ్యాపియై ఉండువాడు.)

2 స్థా + ణుః = స్థిరముగా ఉండువాడు.

ఇచ్చట మరికొందరు 27, 28 నామములను కలిపి "శివస్థాణుః" అందురు. శివునియందు అంతర్యామిగా ఉండువాడు అని దీని కర్థము.

## 29 భూతాదిః

1 భూతములకు కారణమైన వాడు.

2 భూతములచేత – ఉపాదీయతే = సేవకై గ్రహింపబడువాడు. (ప్రాణులన్నిటిచేత సేవింపబడువాడు.)

3 భూత + ఆదిః = "అద్ = భక్షణే" అను ధాతువు ద్వారా ప్రళయమునందు ప్రాణులను భక్షించువాడు.

## 30 నిధిః

## 31 అవ్యయః

1 అవి+అయః = "అవౌ" = సూర్యునియందు, "అయః" = నడచువాడు, "ధ్యేయః సదా సవితృ మండల మధ్య వర్తీ" అను వాక్యమిందుకు ప్రమాణము.

2 అవ+య+యః = "అవ" శబ్దమునకు ప్రీతి అని అర్థము. ప్రీతితో "య" అనగా జ్ఞానులను గూర్చి "యః" వెళ్ళువాడని అర్థము. (ప్రీతితో జ్ఞానులను గూర్చి వెళ్ళువాడు.)

## 32 సంభవః

సం+భ+వః = "సమ్" = బాగుగా, "భ" = నక్షత్రములను, వాని గతులయందు, "వః" = ప్రవర్తింప జేయువాడు. (గ్రహ నక్షత్రములను వానివాని గతులయందు ప్రవర్తింప జేయువాడు.)

## 33 భావనః

1 భావ+నః = "భావ" = అభిప్రాయమును, "నః" = నడిపించువాడు (మనః ప్రేరకుడు.)

2 భ+ఆవనః = "భ" = సూర్యమండల మందలి తన కాంతితో పదార్థములను "ఆవనః" = తెలుపువాడు ("తస్యభాసా సర్వమిదం విభాతి" అను వాక్యముద్వారా సర్వద్యోతకుడు.)

3 భ+అవనః = "భ" = కాంతులయొక్క, "అవనః" = ప్రాప్తి కలవాడు. (జ్యోతిర్మయుడు.)

4 అ+భావనః అని పదచ్ఛేదము చేసినచో "భావ" = ఉత్పాదనము

## 34 భర్తా

భర్తా = పోషించు వాడు.

## 35 ప్రభవః

1 ప్ర + భ + వః = "ప్ర" = ప్రకృష్టమైన, "భా" = కాంతికల సూర్యచంద్రులు = ప్రభులు. వారిని ప్రవర్తింపజేయువాడు ప్రభవుడు. ("సూర్యచంద్రాగ్నులలో నున్న తేజము నాదే" అను గీతా వాక్యము ప్రకారము సూర్యచంద్రాదులకు తేజస్సు నిచ్చి వారివారి విధులయందు వారిని ప్రవర్తింపజేయు వాడు.)

2 ప్ర + భవః = ఎవనిచేత, "ప్ర" = ప్రకృష్టమైన ( గొప్ప ) "భవః"=పుట్టుక, జీవులకు కలదో అతడు. (జీవులను ఉద్ధరించువాడు.)

## 36 ప్రభుః

1 "ప్ర" = ఎక్కువగా సర్వ కార్యముల యందు
"భుః" = సమర్థుడగు వాడు, లేక

2 "ప్ర" = గొప్ప, "భుః" = పుట్టుక కలవాడు, (అఘటన ఘటనా సమర్థుడు, లేక పురుషోత్తముడు.)

## 37 ఈశ్వరః

1 శాసించు లక్షణము కలవాడు.

2 ఈశ + వరః = ఈశ్వరుల కంటె శ్రేష్ఠుడైన వాడు

శ్లో॥ స్వయంభూ శ్శంభు రాదిత్యః పుష్కరాక్షో మహాస్వనః,
అనాది నిధనో ధాతా విధాతా ధాతు రుత్తమః. 5

## 38 స్వయంభూః

స్వయం + భూః = స్వయముగనే అవతరించు వాడు

## 39 శంభుః

శం + భుః = "శం" = సుఖమును, "భుః" = భావింప జేయు వాడు.

## 40 ఆదిత్యః

1 ఆదిత్యుని యందు (సూర్యుని యందు) ఉండు వాడు.

2 ఆది + త్యః = సూర్యునిఅంతర్గతమైన రూపముతో భూమియందలి రసమును (జలమును) త్యః = స్వీకరించుచు పయనించువాడు. "ఆదిత్యస్థత్వాత్ స ఆదిత్యః ఆద దానః ప్రయాతి వేతి" అను ఋగ్భాష్య వాక్యము ఇందుకు ప్రమాణము. (సూర్యమండల మధ్యగతుడై వృష్టికి కారకుడైన వాడు.)

3 ఉపేంద్ర రూపముతో అదితికి పుత్రుడగుట వలన ఆదిత్యుడు.

## 41 పుష్కరాక్షః

1 పుష్కర + అక్షః = పుష్కర = కమలము వంటి, "అక్షః" = కన్నులు కలవాడు.

2 పుష్కల + అక్షః = "రలయోర భేదః" అను వాక్యము వలన పుష్కలమైన (అధిక సంఖ్యలో నున్న) కన్నులు కల వా డు. "సహస్రాక్షః సహస్ర పాత్" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము.

3 పుష్ + కర + అ + క్షః = "పుష్ పుష్టౌ" అను ధాతువునుండి "పుషం" = పుష్టిని, కరః = కలిగించు వాడు = పు ష్క రః.

"అక్ష" = క్షయము లేనివాడు, పుష్కరుడును, అక్షుడును అయినవాడు. (అనగా ఇతరులను పోషించుచు తనకు నాశము లేని వాడని అర్థము.)

## 42 మహాస్వనః

1 (మహత్) మహా + అస్వ + నః = "స్వమ్" = ధనము; "అస్వాలు" = ధనము లేనివారు. అస్వాలను ధనము వద్దకు "నః" = నడిపించు వాడు = అస్వనుడు. మహా = గొప్పవాడైన, అస్వనుడు = మహాస్వనుడు = (ధనము లేనివారిని ధనము వద్దకు నడిపించు వారిలో శ్రేష్ఠుడు)

2 మహా + అసు + అనః = "మహా" = గొప్పదియగు, అసుః = మహాసుః = (వాయు దేవుడు). అతనిని "అనః" = జీవింప జేయువాడు లేక చలింప జేయువాడు. వాయువునకు చైతన్యశక్తి నిచ్చిన వాడు.

3 "మహా" = గంభీరమైన, స్వనః = శబ్దము లేక కంఠధ్వని కలవాడు.

## 43 అనాది నిధనః

1 "ఆది" = ఆదియును, "నిధనః" = నిధనమును (మరణమును), "న" = లేని వాడు. (ఆద్యంత రహితుడు)

2 అన + ఆదినిధనః = "అన" = అనునియొక్క (ముఖ్య ప్రాణుని యొక్క) ఆదియును, నిధనమును ఎవని వలననో అతడు.

3 అనాత్ + ఇ = నిధనః + "అనం" = ముఖ్య ప్రాణుని, అనతిఇతి = జీవింప జేయువాడు; కనుక, అనాత్ = ;రుద్రునియొక్క అంతర్యామి యగు నృసింహ రూపము వలన—ఏః = మన్మథుని యొక్క—"నిధనం" (మరణము) ఎవని వలననో అతడు, ఇనిధనుడు. (అనగా వాయువును జీవింపజేయు వాడును, మన్మథ మారకుడును అయినవాడు.)

4 అ + నాది + నిధనః = భగవద్విషయమగు గానాదులు నాదములు. ఆ నాదములు కలవారు 'నాదినః = నాదులు. నాదులకు ఎవరి వలన "నిధనః" = నిధనము (మరణము) కలదో అతడు = నాది నిధనుడు, న = కానివాడు = అనాదినిధనుడు.("గానప్రియుడు")అను ప్రమాణ వాక్యము వలన ఈ అర్థము చెప్పబడినది. [నారద తుంబురాదుల గానముచే సంతసించువాడు.]

## 44 ధాతా

"డు ధాఞ్" అను ధాతువునకు ధారణము, పోషణము అను అర్థములున్నవి. అందువలన ధారణము చేయువాడు, పోషణ చేయువాడని అర్థము. "ధాతా, విధాతా, పరమోత, సన్దృక్" అను శ్రుతి వాక్యమిందుకు ప్రమాణము.

## 45 విధాతా

1 వి + ధాతా = "విః" = గరుడుడు—ఎవరికి "ధాతా" = ధారకుడో (వాహనమో) అతడు = విధాతా (గరుడవాహనుడు).

2 ఎవనికి "ధాతా" = ధారక పోషకులు, "వి" = లేరో అతడు.

3 వి + ధాతా = "వి" = విశిష్టులైన ముక్తులు. వారిని "ధాతా" = ధరించువాడు విధాత.

## 46 ధాతురుత్తమః

1 ధాతు + రుత్ + తమః = ధాతువులచే సూచింపబడు పదములచే రుమత్ = పిలువబడువాడు ధాతురుత్. అతిశయముగా ధాతు (రుత్) ధాతురుత్తముడు? (శబ్దస్వరూపుడు–వాచ్యుడు)

2 ధాతువులు ప్రకృతిగా (మూలముగా) గల ఆఖ్యాత (క్రియాపద ములు) మొదలగు వానిచే వ్యవహారింపబడు వాడు. ధాతురుత్ =

హనుమంతుడు. అతనిచేత "తమః" = తమింపబడువాడు = కోర బడువాడు. "తము" కాంక్షాయాం అను ధాతువును బట్టి ఈ అర్థము వచ్చినది, (హనుమంతునకు ఇష్టదైవమైన వాడు).

3 ధాతుః + ఉత్తమః = "ధాతుః" = బ్రహ్మకంటె, "ఉత్తమః" = ఉత్తముడైనవాడు.

శ్లో॥ అప్రమేయో హృషీకేశః పద్మనాభోఽమరప్రభుః,
విశ్వకర్మా మనుస్త్వష్టా స్థవిష్ఠః స్థవిరో ధ్రువః. 6

## 47 అప్రమేయః

1 అ + ప్రమేయః = ఇన్ని అనికాని, ఇట్టివి అనికాని కొలిచి చెప్పుటకు వీలులేని గుణములు కలవాడు.

2 సర్వజ్ఞుడగుట వలన "ప్రమేయమ్" = తెలిసికొన దగినది, "న" = లేనివాడు. "జ్ఞాతవ్యాశ్చైవ ధ్యాతవ్యాగుణాః సర్వేప్యతో హరేః" అనువాక్యము ఇందుకు ప్రమాణము. (హరియొక్క సర్వ గుణములు తెలిసికొన దగినవి. ధ్యానింప దగినవి అని ఈ వాక్యము నకు భావము.)

3 "ప్రి" = ప్రకృష్టమైన, "మేయ" = భక్తులచేత తెలిసికొన దగిన గుణములు కలవాడు ప్రిమేయుడు. "అశ్చాసౌ ప్రమేయశ్చేతి" = విష్ణువైన ప్రిమేయుడు అప్రమేయుడు. ఇందు "అ" కారమునకు "విష్ణువు" అని పేరు. (విష్ణువై, భక్తగ్రాహ్యుడగువాడు.)

4 అ + ప్రి + మా + ఇ + యః = "ప్ర" = ప్రకృష్టమైన, "మా" = తల్లి = ప్రమా = లక్ష్మీదేవి. ఆమెను "ఇ" = ఆశ్చర్యమును, "య" = పొందించువాడు అనగా లక్ష్మికి ఆశ్చర్యమును కల్గించు "అ" = విష్ణువు. "అశ్చాసౌ ప్రమేయః" = అప్రమే

యః. "అ" = విష్ణువైన ప్రమేయుడు = లక్ష్మికి తన లీలారూప గుణ వైభవాదులతో ఆశ్చర్యమును కలిగించువాడు.

## 48 హృషీకేశః

1 హృషీ + ఈ + క + ఈశః = "హృష్" ధాతువునకు సంతోషపడుట అని అర్థము. "హృషీ" = హర్షము కలవాడు. "ఈ" = లక్ష్మీదేవి, "కః" = బ్రహ్మ, "ఈ కౌ" = లక్ష్మీ బ్రహ్మలు. వారిద్దరికిని ఈశుడు = శాసించువాడు = ఈకేశుడు; హృషియును, ఈకేశుడును అయినవాడు.

2 తాను ఆనంద భరితుడు అగుచు, లక్ష్మీ బ్రహ్మ రుద్రులకు నియామకుడైన వాడు=హృషీకేశుడు.

3 హృషీకాణామ్=ఇంద్రియాణామ్; ఈశః=అధిపతిః=ఇంద్రియము లకు అధిపతి అని అర్థము.

## 49 పద్మనాభః

1 పద్మ+నాభః = "పద్మ" = పద్మము, "నాభః" = నాభియందు (బొడ్డునందు) కలవాడు.

2 పద్ + మా + నాభః = "పద్"=పాదముల వద్ద, "మా"= లక్ష్మీదేవి కలవాడు పద్ముడు; వృషభ నామముతో "నాభి" అను రాజునకు జన్మించినవాడు నాభుడు. అగ్నీధ్ర పుత్రుడైన నాభి యను పేరు గల రాజుచే చేయబడిన యజ్ఞముచేత పరమ సంతుష్టుడైన భగవంతుడు నాభి భార్యయైన మేరుదేవియందు ఋషభ నామముతో ప్రాదుర్భవించెను.

( భాగ. ౫ స్కంధ, అధ్యా ౩. శ్లో॥ 1 )

(పద్ముడును, నాభుడును అయినవాడు పద్మనాభుడు.)

3 "నాభ" శబ్దమును "న+అ+భః" అని పదచ్ఛేదము చేసినపుడు (నఞ్ ద్వయస్య ప్రకృతార్థ దార్ఢ్య బోధకత్వాత్ అను ప్రమాణ వాక్యముచే మిక్కిలి ప్రకాశము కలవాడని అర్థము) భా=ప్రకాశము, "న"=లేనివాడు. అభః; న+అభః=నాభః=జ్యోతి స్స్వరూపుడు అను అర్థము వచ్చును. (పాదములవద్ద లక్ష్మి ఉన్నవాడును, జ్యోతిర్మయుడును అగువాడు పద్మనాభుడు).

4 పద్మ + న + ఆభః = "పద్మ" = పద్మములను వికాసమును "నః"=పొందించువాడు పద్మనుడు (సూర్యుడు). అతనివంటి "ఆభ" = కాంతి కలవాడు = పద్మనాభుడు. (సూర్యునివంటి కాంతి కలవాడు.)

## 50 అమరప్రభుః

1 అమ+ర+ప్రభుః = "అమ" ధాతువునకు గత్యర్థమును బట్టి (గత్యర్థకానాం జ్ఞానార్థ కత్వాత్) "అమం" = జ్ఞానమును, "రాతి" = ఇచ్చువాడు (రా = దానే అను ధాతువు వలన) అమరుడు. వారియొక్క ప్రభువు అమర ప్రభువు. (జ్ఞాన ప్రదాతలలో శ్రేష్ఠుడు.)

2 అ+మా+ర+ప్రభుః = "మా" = మితి లేక కొలత అని అర్థము. "అమ" = మితి లేనిది. "రమ్" = ఆనందము. "అమమైన" = మితిలేని, "రమ్" = ఆనందము కలవాడు అమరుడు. వారికి ప్రభువు అమర ప్రభువు. (ఆనందాధి దేవత)

3 అ+మా+ర+ప్రభుః = "అ" = విష్ణువుయొక్క, "మా"= జ్ఞానము కలవారు అములు; వారిని "రః" = ప్రకాశింప జేయువాడు అమరుడు. వారియొక్క ప్రభువు అమర ప్రభువు. (విష్ణువుయొక్క యథార్థ జ్ఞానము కలవారందరికి ప్రభువు.)

4 అమర + ప్రభుః ప్రకర్షేణ భవతీతి = ప్రభుః; అమరశ్చాసౌ ప్రభు శ్చేతి = అమర ప్రభుః. (అమరుడైన మహాత్ముడు అని భావము)

## 51 విశ్వకర్మా

1 వి + శు + అ కర్మ = "వి" = గరుడుడు. "శ్వి" ధాతువునకు వెళ్ళుట అని అర్థము. "విశుః" = గరుడునిపై పయనించువాడు. "అకర్మా" = కర్మబంధములు లేనివాడు. లేక కష్టమైన కర్మ అనునది లేనివాడు అని అర్థము. విశువును, అకర్మయును అయినవాడు విశ్వకర్మా = (గరుడునిపై పోవువాడును, కర్మ బంధనము కాని, క్లిష్టమైన కర్మగాని, లేనివాడని ఈ పదమున కర్థము.)

2 ఎవని వలన "విశ్వ" = విశ్వము, "కర్మ" = కర్మకలది యగుచున్నదో అతడు విశ్వకర్మ. "న ఋతే తత్ క్రియతే" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము.

## 52 మనుః

అవబోధ = జ్ఞానమే రూపముగా కలవాడు కనుక మనువు. (జ్ఞాన స్వరూపుడని భావము.) "మన అవబోధనే" అను ధాతువు ఇందుకు ప్రమాణము.

## 53 త్వష్టా

త్వష్టా = దీప్తుడు (వెలుగువాడు; తేజస్స్వరూపుడు)

## 54 స్థవిష్ఠః

స్థవిష్ఠః = మిక్కిలి స్థూలమైన వాడు (అన్నిటికంటె పెద్దవాడు.)

## 55 స్థవిరః

స్థవిరః = వృద్ధుడు "ప్రవయాః స్థవిరో వృద్ధః" అని అమరము.

## 56 ధ్రువః

ధ్రువః = స్థిరమైనవాడు. "ధ్రు = గతి స్థైర్యయోః" అను ధాతువు ఇందుకు ప్రమాణము.

శ్లో॥ అగ్రాహ్యః శాశ్వతః కృష్ణో లోహితాక్షః ప్రతర్దనః,
ప్రభూతః త్రికకుబ్ధామ పవిత్రం మంగళం పరమ్.

## 57 అగ్రాహ్యః

1 అ + గ్రాహ్యః = పూర్తిగా గ్రహింప (తెలిసికొన) వీలు లేనివాడు.

2 అన్నిటిని ఇంతకుముందే స్వీకరించి ఉండుటచేత ఇకమీద గ్రహించ దగినదేదియు లేనివాడు.

3 (గ్రాహ్యుడు = పట్టుకొనుటకు వీలు అయినవాడు) న = కాదు కనుక, అగ్రాహ్యః = (పట్టుకొనుటకు వీలుకానివాడు.)

4 అగ్ర + ఆహ్య = "అహ" ధాతువునకు వ్యాప్తి చెందుట అని అర్థము. దానినుండి "ఆహ్యుడు" = గుణములచేత వ్యాపింపజేయ తగినవాడు అని అర్థము. అగ్రుడును అనగా అందరి కంటె ముందుండు వాడును, ఆహ్యుడును = గుణములచేత వ్యాపింప జేయ దగిన వాడును అగ్రాహ్యుడగును.

## 58 శాశ్వతః

ఎప్పుడును ఒకేరూపము కలవాడు.

## 59 కృష్ణః

నియమనము (అదుపులో పెట్టుట) మొదలగు పనులచేత సకల లోకములను తనవైపునకు లాగువాడు. "యతః కర్షసి దేవేశ। నియమ్య సకలం జగత్। అతో వదంతి మునయః। కృష్ణం త్వాం బ్రహ్మ వాదినః" అను మహా కూర్మ పురాణము నందలి వాక్యము ఇందుకు ప్రమాణము.

## 60 లోహితాక్షః

లోహిత+ అక్షః = సహజముగా కాని, హిరణ్యాకశిపుడు మొదలగు శత్రువులమీాది కోపము వలనగాని లోహితములైన అనగా ఎఱ్ఱనైన "అక్షులు" = కన్నులు కలవాడు.

## 61 ప్రతర్దనః

శత్రువులను హింసించువాడు.

## 62 ప్రభూతః

1 ప్రభు + ఊ + తః = ఎక్కువ సామర్థ్యము కలవాడు ప్రభువు. "ఊ" అనగా దారములో నేసిన వస్త్రములు. ద్రౌపది కొరకు ఆ వస్త్రములను ఇచ్చుటయందు "తః" = ఎక్కువ సామర్థ్యము కలవాడు అగుట వలన ప్రభూతుడు, అని విష్ణువునకు పేరు. (ద్రౌపదీ మాన సంరక్షకుడు)

2 ప్రభు + ఊతః = "ప్రభు" = సామర్థ్యము కలిగిన ప్రభువును, "ఊతః" = గుణములచేత వ్యాపించిన వాడును అగుటచే ప్రభూతుడు.

3 ప్ర + భూతః = "ప్ర" = ప్రకృష్టములైన (గొప్ప) "భూతములు" = ఆకాశము మొదలగు పంచ మహాభూతములు ఎవనినుండి

పుట్టినవో అతడు ప్రభూతుడు. "ఆత్మన ఆకాశః సంభూతః" అను శృతి వాక్యము ఇందుకు ప్రమాణము.

## 63 త్రికకుబ్ధామ

త్రి + కకుబ్ + ధామ = "త్రి" = మూడు, "కకుబ్" = దిక్కులు, "ధామ" = ఇల్లుగా కలవాడు. (త్రిలోకవాసి). కొందరు ఈ నామమును "త్రికకుద్ధామ" అని చదువుదురు. అప్పుడు "త్రి" = మూడు, "కకుత్" = మూపురములు లేక శిఖరములు కల వరాహరూపమును "ధామ" = ఆశ్రయించిన వాడు అని అర్థము. ఈ విషయమే "మోక్షధర్మోత్తర పురాణము" నందు సప్రమాణముగా చూపబడినది. "త్రికకుత్తేన విఖ్యాతః శరీరస్య ప్రభావనాత్" వరహావతారమునందు రెండు భుజములు, కందమూలము (ముట్టె) అనునవి మూడు కకుదములు. వానికి "ధామ" = ఉనికియైన వాడు. (వరాహ రూపము కలవాడు)

## 64 పవిత్రమ్

1 పావనము చేయువాడు.

2 పవి + త్రమ్ = "పవి" = వజ్రాయుధము. దానివలె "త్రమ్" = రక్షించువాడు.

3 పవిత్రమనగా చక్రము. చక్రము కలవాడు పవిత్రుడు. "పవిత్రమ్ చరణం చక్రం లోకద్వారం సుదర్శనమ్ పర్యాయ వాచకాహ్యేతే చ పరమాత్మనః" అను శ్రీ పాంచరాత్ర శాస్త్రము నందలి వాక్యమిందుకు ప్రమాణము.

## 65 మంగళమ్

1 కళ్యాణమైన రూపము కలవాడు కల్యాణ స్వరూపుడు.

2 మంగళముల నిచ్చువాడు (మంగళ స్వరూపుడు).

## 66 పరమ్

1 అన్ని ప్రాణుల కంటె ఉత్తమ మైనవాడు.

2 అన్ని ప్రాణుల కంటె విలక్షణ మైనవాడు.

శ్లో॥ ఈశానః ప్రాణదః ప్రాణో జ్యేష్ఠః శ్రేష్ఠః ప్రజాపతిః,
హిరణ్య గర్భో భూగర్భః మాధవో మధుసూదనః. 8

## 67 ఈశానః

1 ఈశ+అనః="ఈశుని"=రుద్రుని,"అనః"=చేష్టింప జేయువాడు.

2 ఈ+శ+ఆనః="ఈ"=లక్ష్మీదేవి. "శమ్"=సుఖము. లక్ష్మికి ఎవనివలన సుఖము కలుగునో అతడు ఈశుడు. అనుని యొక్క యజమాని=ఆనుడు. ఈశుడును, ఆనుడును అయినవాడు ఈశానుడు. (అనగా లక్ష్మికి సుఖము కలిగించువాడును, చైతన్యము కల్గించు వారందరికి యజమానియును అయినవాడు=ఈశానుడు.)

3 ఈశ+ఆనః. (ఈశులకు కూడ=ముక్తులకు కూడ, ఆనః=నియామకుడు)=ఈశానుడు, "ఈశానామపి ముక్తానాం ఈశానః సోఽననాత్ శ్రుతిః" అని మాండూక్యభాష్యపు వాక్య మిందుకు ప్రమాణము.

## 68 ప్రాణదః

1 ప్రాణములను ఇచ్చువాడు.

2 ప్ర+అణ+దః = "ప్ర" = ఎక్కువగా, అణ = సుఖ విరుద్ధమైన దుఃఖమును, "దః" = ఖండించువాడు. "దో" = అవఖండనే అను ధాతువు ఇందుకు ప్రమాణము.

## 69 ప్రాణః

"ప్ర" = ప్రకృష్టమైన, "అనః" = చేష్టకలవాడు.

## 70 జ్యేష్ఠః

గుణముల చేతను, కాలము చేతను వృద్ధుడు.

## 71 శ్రేష్ఠః

1 ప్రశస్తమైన వానిలో ప్రథముడు.

2 పొగడదగిన వారిలో ముఖ్యుడు.

## 72 ప్రజాపతిః

1 "ప్రజా" = ప్రజలకు, "పతిః" = భర్త. (పాలించుటవలన) ప్రజాపతిః "ప్రజానాం పాలనాత్ విష్ణుః ప్రజాపతి రితీర్యతే" అను షట్ ప్రశ్న భాష్యము నందలి వాక్యము ఇందుకు ప్రమాణము.

2 ప్రజ+అపతి = "ప్రజ" = అధికముగా పుట్టించువాడు (సృష్టికర్త), "పతి" = యజమాని, "అ" = లేనివాడు = అపతి (సర్వోత్తముడు) ప్రజుడును, అపతియును అయినవాడు.

## 73 హిరణ్య గర్భః

హిరణ్య+గర్భః = సువర్ణాత్మకమైన బ్రహ్మాండము గర్భమునందు కలవాడు.

## 74 భూగర్భః

1 భూగా + ఋభః = ఎవని ఆజ్ఞవలన, "ఋభులు" = దేవతలు, "భూగాః" = భూమి మీదకు వచ్చినవారో అతడు భూగర్భుడు. (దేవతలను అవతరింపుడని ఆదేశించువాడు.)

2 భూ + గర్భః = "భూ" = భూమి ఎవనియొక్క, "గర్భ" = గర్భము నందున్నదో అతడు.

## 75 మాధవః

1 మా + ధవః = "మా" = లక్ష్మియొక్క, "ధవః" = భర్త.

2 మధువుయొక్క వంశమునకు చెందినవాడు.

3 ధవః = భర్త (పోషించువాడు), "మా" = లేనివాడు. "న విద్యతే ధవః యస్యసః = మాధవః" (సర్వాధారుడు.)

## 76 మధుసూదనః

1 మధు + సు + ఉద + నః = "మధు" ఆనందము, "ఉద" = కర్మ జ్ఞానములు; "సూద" = మంచి కర్మ జ్ఞానములు కలవారు. ఆనంద విశిష్టులైన వారిని "నః" = నడిపించువాడు. "నయతీతి = నః" (ముక్త శరణ్యుడు)

2 మధు + సు + ఉద + నః = "ఉద" = జీవులు. సు + ఉదు లనగా మంచి జీవులు. "మధుసూద" = ఆనంద మయులైన జీవులు. వారిని "నః" = నడిపించువాడు. (ఆనంద మయులైన జీవులను తనవద్దకు నడిపించు వాడు.)

3 మధు + సూదనః = "షూద్" అను ధాతువునకు నశింపజేయు అను అర్థము వలన "సూదన" = నశింపజేయువాడు. మధువు అను

రాక్షసుని "సూదనః" = చంపినవాడు మధుసూదనుడు. "షూద = క్షరణే" అను ధాతువు ఇందుకు ప్రమాణము.

శ్లో॥ ఈశ్వరో విక్రమీ ధన్వీ మేధావీ విక్రమః క్రమః
అనుత్తమో దురాధర్షః కృతజ్ఞః కృతిరాత్మవాన్ 9

## 77 ఈశ్వరః

1 ఈశ + వరః = "ఈశ" = బ్రహ్మ, ఈశ్వరుడు మొదలగు వారి కంటె, "వరః" = శ్రేష్ఠుడు.

2 ఈ + శ్వ + రః = "అ" = విష్ణువు. అతని భార్య అగు లక్ష్మికి "ఈ" అని పేరు. "శ్వా" = వాయువు. "శ్వావై వాయుః శ్వసనాత్" అను ఋగ్భాష్య వాక్యము ఇందుకు ప్రమాణము. "ఈ" = లక్ష్మి తోను, "శ్వా" = వాయువుతోను కలిసి, "రః" = ప్రకాశించు వాడు = ఈశ్వరుడు. (లక్ష్మితోను వాయువుతోను కలిసి ప్రకాశించువాడు.)

## 78 విక్రమీ

1 విక్రమము కలవాడు.

2 వి + క్రమీ = "క్రమీ" = తారతమ్య భావము కలవాడు. "వి" = వ్యతిరేకార్థమును సూచించును. తారతమ్య భావములేని వాడగుటచే "విక్రమీ" అని పేరు వచ్చెను.

3 "వి" శబ్దమునకు నఞ్ అర్థము వలన "విక్రమీ" అనగా తన అవతారములందు తారతమ్యము లేనివాడని భావము.

## 79 ధన్వీ

ధన్వీ = ధనువు కలవాడు.

## 80 మేధావీ

"మేధా" = అనగా తెలివి. అది కలవాడు మేధావీ.

## 81 విక్రమః

1 వి + క్రమః = "క్రము" అను ధాతువునకు అడుగు వేయుట అని అర్థము. "వి" = విశేషమైన, "క్రమః" = పాద విక్షేపము కలవాడు. "క్రము = పాద విక్షేపే" అని ధాతువు. (వామనుడు)

## 82 క్రమః

"క్రమః" = పద దేవత అను పేరు కలవాడు.
"పృథివీ స్థోవరాహస్తు సంహితా దేవతోదితా
దివిష్ఠో వామనశ్చైవ సంప్రోక్తాః పద దేవతాః
నృసింహఃతు అంతరిక్షస్థః భగవాన్ క్రమ దేవతాః"
అను ఐతరేయ భాష్యోక్తి ఇందుకు ప్రమాణము.

## 83 అనుత్తమః

1 న + ఉత్తమః = తనకంటె ఉత్తముడు లేనివాడు.

2 అ + నుత్ + తమః = నుద ధాతువునకు ప్రేరేపించుట అని అర్థము (నుద = ప్రేరణే అని ధాతువు.)
"అనుత్" = ప్రేరకుడు లేనివాడు. అట్టి వారిలో "తమః" = శ్రేష్ఠుడు – అనుత్తముడు (సర్వ ప్రేరకుడు)

3 అ + నుత్త + మః = నుత్తమ్ అనగా తిరస్కరింప బడినది. అనుత్త మనగా తిరస్కరింపబడనిది. అనుత్తమైన "మా" = సంపత్ జ్ఞానము కలవాడు అనుత్తముడు. (తిరస్కరింపబడని సంపత్ జ్ఞానము కలవాడు.)

4 "నుత్త" = క్లిన్నమైనది, "అనుత్త" = నశింపని "మా" = లక్ష్మి (సంపద) కలవాడు అనుత్తముడు. (నిత్య లక్ష్మీయుక్తుడు.)

## 84 దురాధర్షః

భయపెట్టుటకు వీలులేనివాడు. భయపెట్టరాని వాడు. "శ్రుతి స్మృతీ హారే రాజ్ఞే" అను వాక్య మిందుకు ప్రమాణము.

## 85 కృతజ్ఞః

1 కృత + జ్ఞః = "కృత" = చేయబడిన కర్మను (ఆరాధనాదులను) "జ్ఞః" = (తెలిసికొనువాడు.)

2 "కృత" = తన కారాధన రూపముగా భక్తునిచే చేయబడిన ఉపకారమును, "జ్ఞః" = తెలిసికొనువాడు.

3 "కృత" = నిత్యములైన సర్వ పదార్థములు. వానిని "జ్ఞః" = తెలిసి కొనువాడు.

4 ఎవనిచేత "జ్ఞః" = జీవులు, "కృత" = ఉత్పాదింప బడినారో అతడు కృతజ్ఞుడు. ఇందలి "జ్ఞ" శబ్దమునకు జీవుడని అర్థము. "యతో వా ఇమాని భూతాని జాయంతే" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము. (సృష్టికర్త)

## 86 కృతిః

ప్రయత్న రూపము కలిగియుండుట వలన కృతి.

## 87 ఆత్మవాన్

1 ఆత్మ + వాన్ = ఆత్మ అనగా బ్రహ్మ. బ్రహ్మను నాభికమలమునందు

ఉంచుకొనువాడు. "ఆత్మా విరించః సుమనాః సుధాతశ్చేతి కథ్యతే" అను వాక్యమిందుకు ప్రమాణము.

2 "ఆత్మ" అనగా దేహము. నిత్యము ఆత్మ కలవాడు ఆత్మవాన్.

శ్లో॥ సురేశః శరణం శర్మ విశ్వరేతా ప్రజాభవః,
అహస్సం వత్సరో వ్యాలః ప్రత్యయః సర్వదర్శనః. 10

## *88* సురేశః

1 "సుర" = సముద్రమునుండి ఉద్భవించిన "సుర" కలవారు సురులు. వారికి ఈశుడు సురేశుడు.

2 సు + ర + ఈశః = "రాజృ = దీప్తౌ" అను ధాతువునకు ప్రకాశించుట అని అర్థము. చక్కగా ప్రకాశించు వారు సురులు. వారికి ఈశుడు సురేశుడు.

## *89* శరణమ్

1 ఆశ్రయమిచ్చువాడు లేక రక్షించువాడు.

2 "శరణం గృహ రక్షిత్రోః" అను అమరము (నందలి వాక్యము) ప్రమాణము.

## 90 శర్మ

"శౄ = హింసాయామ్" అను ధాతువునకు హింసించుట అని అర్థము. అశుభమును నశింప జేయువాడు శర్మ.

## 91 విశ్వరేతాః

1 జగత్తునకు కారణమైన వాడు "భువనస్య రేతో విష్ణుః" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము.

2 విశ్వ మనగా వాయువు. దానికి "రేతాః" = కారణమైనవాడు. "విశ్వో వాయుః సముద్దిష్టః" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

## 92 ప్రజాభవః

1 ప్రజా + అభవః = భగవంతుని గూర్చి జ్ఞాపకము చేయువారు ప్రజలు. "ఇంద్ర ఏకం సూర్య ఏకం జజాన", "యస్తా విజానాత్ స పితుః పితా సత్" అను శ్రుతి వాక్యములు ఇందుకు ప్రమాణము. "అభవః"=పుట్టుక లేనివాడు, లేక ఎవనియందు పుట్టుక ఉండదో అతడు. (భగవద్భక్తులకు జన్మ లేకుండ చేయువాడు.)

2 "అభవ" = వైకుంఠాది లోకము. "ప్రజా" = ప్రజలకు ఎవని వలన అభవః=వైకుంఠాది లోకప్రాప్తి కలదో అతడు, ప్రజాభవుడు. (ప్రజలను వైకుంఠాది లోకమునకు తీసికొని వెళ్ళువాడు.)

3 ప్రజలయొక్క ఉత్పత్తి ఎవని వలననో అతడు.

4 ప్రజా + భ + వః = "ప్రజ" = ప్రజలను, "భా" = నక్షత్రాది జ్యోతిస్సులను, "వః" = నడిపించువాడు ప్రజాభవుడు. (సర్వ ప్రవర్తకుడు.)

## 93 అహః

1 అ + హః = చంపబడుట వలన జీవునకు "హ" అని పేరు. అహః = చంపబడనివాడు (మృత్యుంజయుడు.)

2 అసహ్యించుకొన దగినట్టి, విడువదగినట్టి వానికి "హ" అనిపేరు. హేయుడు = హేయుడు కానివాడు "అహః". "ఓ హాక్ = త్యాగే" అను ధాతువు ఇందుకు ప్రమాణము. (నిర్దోషి)

## 94 సంవత్సరః

ఇచ్చట (ప్రతిప్రాణి హృదయమందును – అంతర్యామిగా) నివసించువాడు కనుక సంవత్సరః.

## 95 వ్యాలః

1 వి + అడః = "అడ" ధాతువునకు ఉద్యమము (ప్రయత్నము) అని అర్థము. "వి" = విశిష్టముగా "అడః" = భక్తుల కోర్కెలను నెర వేర్చుట యందు ఉద్యమము కలవాడు. "వ్యాడః" = డలయో రభేదః అను వాక్యము వలన 'డ' కారము 'ల' కారము కాగా "వ్యాలః" అను రూపము సిద్ధించినది.

2 వి + ఆలః = "అలమ్" శబ్దమునకు భూషణము అని అర్థము. "ఆలః" = భూషణముల యొక్క సమూహము. విశిష్టములైన కౌస్తుభము మొదలగు భూషణముల సమూహములు కలవాడు.

3 వి + ఆలః = "వి" = విశేషముగా, "ఆలః" = సృష్టి మొదలగు కార్యములకు తగినవాడు. (చాలిన సమర్థుడు.)

4 శత్రువులను "వి" = విశేషముగా "ఆలః" = నివారించుటకు సామర్థ్యము కలవాడు.

5 "లీఙ్" అను ధాతువునకు "నశించుట" అని అర్థము. వి + ఆ + లః = "వి" = విశేషముగా, "ఆ" = అన్నివైపుల నుండి, "లః" = జగత్తును నాశనము చేయువాడు. (సంహారకర్త.)

6 వి + ఆ + లః = "లస్" అను ధాతువునకు ప్రకాశించుట అని అర్థము. "వి" = ఎక్కువగా, "ఆ" = అన్నివైపులనుండి, "లః" = ప్రకాశము (జ్ఞానము) కలవాడు. (సర్వజ్ఞుడు.) ("లస్ = ప్రకాశనే" అని ధాతువు.)

## 96 ప్రత్యయః

1 జ్ఞానరూపుడు.

2 ప్రతి = ఇంద్రియ విషయములను గూర్చి, "అయః" = (అయతే)= తెలిసికొనువాడు. "అయ, పయ = గతౌ" అని ధాతువు.

## 97 సర్వ దర్శనః

1 అన్ని విషయములను చూచినవాడు. అన్ని విషయములు తానే అగుట వలన ఈ అర్థము కుదురును.

2 సర్వ+దర్శనః = "ఈశ్వరః సర్వ ఈశానః" అను ద్విరూపకోశ ప్రమాణము వలన సర్వుడనగా రుద్రుడు. దర్శన మనగా జ్ఞానము. ఎవని వలన సర్వునియొక్క జ్ఞానము కలుగునో అతడు = సర్వ దర్శనః.

శ్లో॥ అజః సర్వేశ్వరః సిద్ధః సిద్ధి స్సర్వాది రచ్యుతః,
వృషాకపి రమేయాత్మా సర్వయోగ వినిస్సృతః. 11

## 98 అజః

1 అ+జః = "జ" = పుట్టుట, "అ" = లేనివాడు.
2 "అజ = గతౌ" అను ధాతువునకు వెళ్ళుట అను అర్థమును బట్టి = వెళ్ళువాడు.

## 99 సర్వేశ్వరః

1 సర్వ+ ఈశ్వరః="సర్వ"=అందరికి, "ఈశ్వరః"=ఈశ్వరుడు.

## 100 సిద్ధః

1 "షిధ=గత్యామ్" అను ధాతువునకు "నడచుట" అను అర్థమును బట్టి "సిద్ధః" = పోగలిగినవాడు. [illegible]

2 నిశ్చయమైన జ్ఞానరూపము కలవాడు.

3 భక్తులను రక్షించుటకు సిద్ధమైనవాడు.

## 101 సిద్ధిః

నిరతిశయమైన రూపము కలుగుటవలన సిద్ధి అను పేరు కలవాడు.

## 102 సర్వాదిః

1 సర్వ+ఆదిః = అన్నిటికి కారణము అగుటవలన సర్వాది.

2 సర్వ = అందరిచేత మొదటినుండి "ఆదితః" (ఉపాదీయతే = గ్రహింపబడువాడు) సేవకై స్వీకరింపబడు వాడు. (సర్వాసంసేవ్యుడు.)

3 "సర్వ" = సర్వమును, "ఆదిః" = తినువాడు (ఆజ్ పూర్వకమైన అద భక్షణే అని ధాతువు.) (సంహారకర్త.)

## *103* అచ్యుతః

అ+చ్యుతః = దేశమునుండి గాని, కాలమునుండి గాని, గుణము నుండి గాని చ్యుతి (నాశము లేక జారుట) లేనివాడు. (శ్చ్యుతిర్ = క్షరణే" అని ధాతువు.)

## *104* వృషాకపిః

1 వృష+ఆక+పిః = "వృష" = కోరికలను వర్షించు వాడును, "ఆక" = సుఖమును (ఆకమును), "పిః" = పానము చేయువాడు ("పా = పానే" అని ధాతువు), "ఆకపిః" = సుఖము ననుభవించు వాడు. వృషుడును, ఆకపియును అగువాడు. (ఇష్ట ఫలదుడై ఆనందము ననుభవించువాడు.)

"వృష"=ధర్మము చేత, "అకమ్" = దుఃఖమును, "పిః"=నశింప జేయువాడు. "పిశ=పేషణే" అని ధాతువు. (దుఃఖహర్త.)

## 105 అమేయాత్మా

అ+మేయ+ఆత్మా=పూర్తిగా తెలిసికొనుటకు, "అ" = అశక్యమైన, "ఆత్మా"=రూపము కలవాడు (అవ్యక్తుడు.)

## 106 సర్వయోగ వినిఃసృతః

సర్వయోగ=అన్ని యోగములు, అన్ని ఉపాయములు ఎవని నుండి, "వినిఃసృతాః" = బయలు దేరినవో, అతడు. (యోగేశ్వరుడు.)

శ్లో॥ వసు ర్వసుమనాః సత్యః సమాత్మా సమ్మితః సమః,
అమోఘః పుండరీకాక్షో వృషకర్మా వృషాకృతిః. 12

## 107 వసుః

1 అంతట నివసించువాడు.

2 వ+సుః="వ" అనగా జ్ఞానము. దానిని "సుః" = ఉత్పాదించువాడు.

## 108 వసుమనాః

వసు+మనాః="వసు"=భక్తులు సమర్పించిన ధనమునందు గాని, జలమునందు గాని, ద్రవ్యమునందు గాని, శమంతక మణియందు గాని, "మనాః" = మనస్సు కలవాడు.

## 109 సత్యః

సత్+యః="సత్"=సద్భావమును, "యః"=పొందించు

వాడు. "సద్భావం యాపయే ద్యస్మా త్సత్యమ్ తత్తేన కథ్యతే" అను ఐతరేయభాష్య వాక్యము ఇందుకు ప్రమాణము.

## 110 సమాత్మా

1 స+మా+ఆత్మా= "మా" అనగా లక్ష్మి, "ఆత్మా" అనగా బ్రహ్మ; ఆ ఇరువురితోను "స"=సహితుడు అనగా కూడినవాడు.

2 స+మా+ఆత్మా=సారము కలిగియుండుటవలన "స" అని పేరు. "మా" అనగా లక్ష్మియందు ఆత్మకలవాడు=మాత్ముడు (సార రూపియైన లక్ష్మీపతి.)

3 స+మాత్మా="స"=సారము కలిగినవాడును, "మాత్మా"= లక్ష్మియందు మనసు కలవాడును సమాత్ముడు.

4 "మాత్మా" శబ్దమునకు లక్ష్మియొక్క మనస్సు అని అర్థము, అది ఎవనియందు కలదో అతడు సమాత్ముడు. అని కూడ అర్థము చెప్ప వచ్చును.

5 మయా=జ్ఞానముతో, సహితాః=కూడినవారు, సమాః=జ్ఞానులు. వారికి "ఆత్మా"=ధ్యేయస్వరూపుడు. (జ్ఞానులకు ధ్యేయుడైనవాడు.)

## 111 సమ్మితః

1 సమ్+మితః="సమ్"=బాగుగా. ప్రమాణములతో, "మితః"= కొలువబడిన వాడు.

2 "సమ్"=బాగుగా మూడు లోకములు ఎవనిచే, "మిత"=కొలువ బడినవో అతడు. "మిత జగత్త్రితయాయ జితారయే" అను వాక్యము ఇందుకు ప్రమాణము. (వామనుడు.)

3 మరికొందరు "అసమ్మితః" అని పదచ్ఛేదము చేసి బాగుగా కొలుచుటకు వీలులేని వాడని చెప్పుదురు. (అవ్యక్తుడు.)

## 112 సమః

1 స+మః="మా" అనగా లక్ష్మీదేవి, వేదములు, ప్రమాణములు అనికూడ అర్థము. వీనితో స=కూడినవాడు.

2 అన్నిచోట్ల, అన్ని రూపములయందు సమత్వము కలిగియుండుట వలన సముడు.

3 వారి వారికి తగిన (యోగ్యములైన) ఫలములను దానము చేయుట వలన సముడు (నిష్పక్షపాతి.)

## 113 అమోఘః

న+మోఘః = జగత్తును సృష్టించుట మొదలగు పనులు వ్యర్థము కానివాడు.(సఫలుడు.)"యచ్చికేత సత్యమిత్తం న మోఘమ్" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము.

## 114 పుండరీకాక్షః

1 పుండరీక+అక్షః="పుండరీక"=పద్మము వంటి"అక్షః"=కన్నులు కలవాడు.

2 "పుండరీకః"= అగ్ని. అగ్నియే మూడవ, "అక్షః" = కన్నుగా కల నరసింహుడు.

3 పుండరీక = పుండరీకు డను పేరు గల మునియందు "అక్షః" = కృపాదృష్టి కలవాడు.

## 115 వృషకర్మా

1 వృష + కర్మా = "వృష" = పుణ్యము, శ్రేయస్సు; పుణ్యమైన శ్రేయస్సును కల్గించు, "కర్మా" = కర్మలు కలవాడు.(పుణ్యకర్ముడు.)

2 "వృష" = ఎద్దులకు, నాసా వేధాది (ముక్కు కుట్టుట, మొదలగు) "కర్మా" = పనులు చేసినవాడు.

"బద్ధ్వా తాన్ దామభిః శౌరిః భగ్న వీర్యాన్ హతౌజసః।
అకర్ష ల్లీలయా బద్ధాన్ బాలో దారుమయా న్యథా"

అను భాగవతోక్తి ఇందుకు ప్రమాణము. నాగ్న జితి అను భార్యను వివాహమాడుటకై ఏడు ఎద్దులను ఒకేసారి లొంగ దీసి కొనవలసి వచ్చినప్పుడు ఆ ఎద్దులకు ముక్కుతాడు పోసి వాని ఆట కట్టించెను. అందువలన వృషకర్మ అయినాడు.

## 116 వృషాకృతిః

1 వృష + ఆకృతిః = "వృష" = ఎద్దువలె బలిసిన, "ఆకృతిః" = ఆకారము కలవాడు.

శ్లో॥ రుద్రో బహుశిరా బభ్రుః విశ్వయోనిః శుచిశ్రవాః
అమృతః శాశ్వతః స్థాణుః వరారోహో మహాతపాః 13

## 117 రుద్రః

1 రుజ + ద్రః = రుజ అనగా బాధ. దానిని "ద్ర" అనగా పరుగెత్తింప చేయువాడు = రుద్రుడు. "రుజం ద్రావయతే యస్మాత్ రుద్రః తస్మాత్ జనార్దనః" అను బ్రహ్మాండ పురాణోక్తి యును, భాష్యో

2 రోదింప జేయువాడు రుద్రుడు.

3 రుద+రః = భేరీ మొదలగు వాద్యములకు "రుద" = శబ్దమును, "ర"=ఇచ్చువాడు.

4 "రుద" = భక్తులు చేసిన శ్రుతి శబ్దములచేత, "రః"=రమించు వాడు, సంతసించువాడు (స్తోత్రప్రియుడు.)

## *118* బహుశిరాః

1 బహు=అధికమైన, "శిరాః" = శిరస్సులు కలవాడు.

2 బహు+శిరాః = "బహు"= ఎక్కువ సంఖ్యగల, "శిరాః"= శిరలు = నాడులు కలవాడు.

## *119* బభ్రుః

జగత్తును భరించువాడు (బిభర్తి జగత్ ఇతి.)

## 120 విశ్వయోనిః

1 విశ్వ+యోనిః = "విశ్వ" = జగత్తే, "యోనిః"=స్థానముగా కలవాడు.

2 విశ్వ=వాయువు. దానికి "యోనిః"=కారణమైనవాడు. "యోని ర్భార్యా తథా స్థానం యోనిః కారణమేవచ" అను గీతా తాత్పర్య వాక్యము ఇందుకు ప్రమాణము. (వాయుదేవునకు జనకుడు.)

## *121* శుచిశ్రవాః

1 "శుచి"=శుద్ధమైన, "శ్రవాః"=కీర్తి కలవాడు.

2 "శుచి"=పవిత్రీకరమైన, "శ్రవాః"=విద్య కలవాడు.

3 శుచి=శ్రవణీయమైన దానిని (వినదగిన వానిని) శ్రవాః=విను వాడు.

"శుచీని శ్రవణీయాని శృణోమీహ ధనంజయ।
నచ పాపాని గృహ్ణామి తతోఽహం వై శుచిశ్రవాః॥"

అను మోక్ష ధర్మోక్తి ఇందుకు ప్రమాణము.

## 122 అమృతః

1 అమృత=అనంతాసనము. ఆ ఆసనము ఆధారముగా కలవాడు- అమృతః.

2 అమృతః = నిత్యుడు. "బ్రహ్మ పూర్ణగుణాత్వాచ్చ నిత్యత్వా దమృతం తథా" అను ఐతరేయ భాష్యోక్తి ఇందుకు ప్రమాణము.

3 అమ+ఋతః="అమమ్" అనగా అపరిమితమైన "ఋతమ్"= శాస్త్రము కలవాడు.

## 123 శాశ్వతః

1 నిత్యుడు.

2 శశ+వతః="శశ" మనగా అత్యంతమైన సుఖము.

"శశ శబ్దస్య అత్యంత సుఖవాచిత్వేన శశమానః"

అను ఋగ్ వ్యాఖ్యాన వాక్యము ఇందుకు ప్రమాణము. శశము కలవారు శశ్వంతులు అనగా ముక్తులు. వారికి (సంబంధించిన) స్వామి = శాశ్వతుడు. (ముక్తులకు స్వామి.)

## 124 స్థాణుః

జగత్తు అంతయు ఇతనియందు ఉండును కనుక స్థాణుడు. 123, 124 అగు ఈ రెండు నామములను కలిపి కొందరు "శాశ్వతస్థాణుః" అని ఒకే నామముగా పేర్కొందురు.

## 125 వరారోహః

1 వర+ఆరోహః = వరమైన ఆరోహము (1. వాహానం కలవాడు, 2. శ్రేష్ఠమైన ఒడి కలవాడు.)

2 వర+అరో+హః = "వర" = గొప్ప, "అరాణి" = దోషములు కలవారు (వరారాః) వారిని, "హః"=చంపువాడు. మహాదోషులగు రాక్షసులను, (దుష్టులను) చంపువాడని భావము. ఇందు "అర" శబ్దము "అరో" గా మారుటకు "పరోవరీయాన్" అను ప్రయోగము నందు పరశబ్దము "పరో" గా మారుట ఇట ప్రమాణముగా చూపబడినది.

## 126 మహా తపాః

1 మహా+తపాః = "మహాత్" = గొప్పదియైన, "తపః" = జ్ఞానము కలవాడు. "యస్య జ్ఞానమయం తపః" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

2 కపిలాది రూపముతో గొప్ప తపస్సు కలవాడు.

శ్లో॥ సర్వగః సర్వ విద్భానుః విష్వక్సేనో జనార్దనః
వేదో వేద విదవ్యంగో వేదాంగో వేదవిత్కవిః 14

## 127 సర్వగః

1 సర్వ+గః = "సర్వ" = అన్నిచోట్లకు, "గః" = వెళ్ళువాడు.

2 సర్వ = అన్ని విషయములను, "గః" = తెలిసినవాడు.

## 128 సర్వవిద్

1 సర్వ + విద్ = సర్వమును పొందువాడు (విద్ ౢ లాభే = పొందుట)

**2** సర్వ = అన్నిచోట్ల, "విద్" = ఉండువాడు. "విద సత్తాయామ్" (ఉండుట) అను ధాతువు వలన ఈ అర్థము కలుగుచున్నది.

3 "సర్వ"=అన్నిటిని, "విద్" = తెలియజేయువాడు. "విద్"= తెలిసికొనుట, "విద్" =లాభము, "విద్" = సత్త (ఉండుట) అను ధాతువులనుండి పై అర్థములు వచ్చును.

## 129 భానుః

ప్రకాశించువాడు.

## 130 విష్వక్సేనః

విషు + అఞ్చ + సేనః = "విషు" నానా (అన్నివైపులకు) "అఞ్చతి"=వెళ్ళునది=విష్వక్. దీనికి స్త్రీలింగ రూపము విషూచీ. విషూచియగు సేన కలవాడు విష్వక్సేనుడు. (అన్నివైపులకు తన సేనను పంపజాలినవాడు)

## 131 జనార్దనః

1 జన + అర్దనః = "జన" జనమును, "అర్దనః"=నశింప జేయువాడు. "అర్ద=(హింసాయామ్) హింసించుట" అను ధాతువునుండి ఈ అర్థము వచ్చినది.

2 జనాః=సముద్రము నందున్న ఒకజాతి రాక్షసులు. వారిని, "అర్దనః"=నాశనము చేయువాడు.

3 జ+న+అర్దనః="జన" =పుట్టుక లేనివాడును, "అర్దనః"=సంసారమును నశింప జేయువాడును (అజుడును, సంసారనాశకుడును అగువాడు.)

4 జన=జనులచేత, "అర్దనః = అర్థింపబడువాడు (కోరబడువాడు లేక పొందబడువాడు.)

## 132 వేదః

వేదుడు = తెలియజేయువాడు.

## 133 వేదవిత్

వేదమును తెలిసికొనినవాడు.

## 134 అవ్యంగః

1 అవి+అంగః="అవి"=సూర్యుడు, "అంగః" = శరీరమునందు (కంటియందు) కలవాడు.

2 న+వి+అంగః = "వి" = వికలమైన, "అంగ" = శరీరము, "న" = లేనివాడు (సర్వాంగ సుందరుడు.)

3 అవిరంగః = యజ్ఞాంగము ఎవనినుండి ఉద్భవించునో అతడు. (యజ్ఞపురుషుడు.)

4 అ+వి+అంగః= "వి" అనగా గరుత్మంతుడు. అ+వి అనగా గరుడునకు శత్రువైన శేషుడు; అతనిమీద 'అంగః'= శరీరము కలవాడు. (శేషశాయి అని అర్థము.)

## 135 వేదాంగః

1 వేద + అంగః = "వేద" = వేదాభిమానము గల దేవులు, తన అంగమునందు కలవాడు.

2 వేదమను పేరుగల "రమ" అంగమునందు కలవాడు.

3 వేదమునకు అంగములైన భారతాదికములు ఎవని వలన ఉద్భవించినవో అతడు. "ఇతిహాస పురాణాభ్యాం వేదం సముప బృంహయేత్" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

## 136 వేదవిత్

వేదమును మత్స్యాది రూపముతో బ్రహ్మ మొదలగు వారికి చేర్చినవాడు.

## 137 కవిః

కు + ఇః = పొగడ దగినవాడు. 'కుఙ్ శబ్దే' అను ధాతువు వలన ఈ అర్థము వచ్చినది.

శ్లో॥ లోకాధ్యక్షః సురాధ్యక్షో ధర్మాధ్యక్షః కృతాకృతః
చతురాత్మా చతుర్వ్యూహ శ్చతుర్దంష్ట్ర శ్చతుర్భుజః 15

## 138 లోకాధ్యక్షః

1 లోక + అధ్యక్షః = "లోక" = జ్యోతిః స్వరూపుడు, "అధ్యక్షః" = అధిపతి. లోకుడైన అధ్యక్షుడు లోకాధ్యక్షుడు (జ్యోతిః స్వరూపుడైన అధిపతి.)

2 లోకాధి + అ + క్షః = "లోకాధి" = లోకముల కంటె అధికుడు లేక—పైనున్నవాడు. "అక్షః" = క్షయము లేనివాడు. లోకాధి

యును అక్షుడును అయినవాడు (లోకోత్తరుడును, శాశ్వతుడును అగువాడు.)

3 లోక + అధ్యక్షః = "లోక" = లోకములకు, "అధ్యక్షః" = అధ్యక్షుడు.

## 139 సురాధ్యక్షః

1 సు + రాధ్య + క్షః = "సు" = బాగుగా, "రాధ్య" = ఆరాధింప దగినవాడు లేక సాధింప దగినవాడు = సురాధ్యః; "క్షః" = ఎక్కడ క్షయము ఉండునో అది. "క్షి నివాస గత్యోః" అను ధాతువునకు "నివాసము, గతి" అను అర్థము ఉండుట వలన ఈ భావమును చెప్పవచ్చును. సురాధ్యుడును, "క్షు"డును అయినవాడు. (బాగుగా పూజింప దగినవాడును, లోకములను నాశము చేయువాడును అని "సురాధ్యక్ష" పదమునకు భావము.)

2 సుర + అధి + అక్షః = "సుర" = సురులకు, "అధి" = నాయకుడు. కనుక సురాధి. అనగా దేవేంద్రుడు. అతని "అక్షః" = కన్నులు ఎవరిని గూర్చి ప్రసరించునో అతడు. (దేవేంద్రునిచే ఎల్లప్పుడు దర్శింప బడువాడు అని అర్థము.)

## 140 ధర్మాధ్యక్షః

1 ధర్మ + అధి + అక్షః = "ధర్మ" = ధరించుట వలన ధర్మము అగును. "అధి" = అధికమైన "అక్షః" = ఇంద్రియములు కలవాడు. (ధరించువాడును, అధికమైన అక్షములు కలవాడును = ధర్మాధ్యక్షుడు.)

2 ధర్మమునకు అధ్యక్షుడు.

## 141 కృతాకృతః

1 కృత + అకృతః = "కృత" = చేయబడిన కర్మచేత "అకృతః" =

చేయబడని వాడు (పుట్టుక మొదలగు బంధములు లేనివాడు.)

2 "అకృతః" = కర్మ బంధము లేని ప్రదేశము (మోక్షము.) ఎవని చేత కృతమగునో (సృష్టించబడునో) అతడు. (మోక్షప్రదుడు.)

## 142 చతురాత్మా

1 చతుర + ఆత్మా; "ఆత్మా" = తిరుగునది. "అత = సాతత్యగమనే" అను ధాతువునకు "సదా వెళ్ళువాడు" అని అర్థము. అందువలన "ఆత్మ" అనగా తిరుగునది. "చతుర" = చతురమైన, "ఆత్మా" = చతురాత్మా = (నేర్పుతో తిరుగువాడు అని అర్థము.)

2 చతుర = కుశలమైన, "ఆత్మా" = చతుర్ముఖుడు ఎవనినుండి జన్మించినాడో అతడు.

## 143 చతుర్వ్యూహః

చతుర్ + వ్యూహః = "చతుర్" = వాసుదేవాది నాలుగు సంఖ్య గల, "వ్యూహః" = ఆత్మలు (వ్యూహములు) కలవాడు.

## 144 చతుర్దంష్ట్రః

నాలుగు కోరలు కలవాడు.

## 145 చతుర్భుజః

1 చతుర్ + భుజః = నాలుగు చేతులు కలవాడు.

2 "భుజ్" ధాతువునకు భుజించుట లేక పొందుట అను అర్థమును బట్టి "భుజః" = అనుభవించువాడు. "చతుర్" = ధర్మ, అర్థ, కామ,

మోక్షములను నాలుగు పురుషార్థములను "భుజః" = అనుభ వించువాడు.

3 చతుర్భు + జః; "చతుర్" = నాలుగు వేదములనుండి "భు" = పుట్టినది (చతుర్భు = జ్ఞానము.) దానిచేత "జః" = జన్మించువాడు లేక "అభిత్యాజ్యతే" = (భక్తిపూర్వ స్థాపనక్తి) విడువబడు వాడు (జ్ఞానమువలన జన్మించువాడు లేక జ్ఞానముచే భక్తిసాధన విషయము నందు విడువబడువాడు.)

శ్లో॥ భ్రాజిష్ణు ర్భోజనం భోక్తా సహిష్ణు ర్జగదాదిజః,
అనఘో విజయో జేతా విశ్వయోనిః పునర్వసుః. 16

## 146 భ్రాజిష్ణుః

దీప్తిమంతుడు.

## 147 భోజనమ్

అందరిచేత ఉపజీవింపబడువాడు = ఆధారముగా చేసికొనబడువాడు.

## 148 భోక్తా

సమస్తమైన, సారవంతములైన పదార్థములను భుజించువాడు.

## 149 సహిష్ణుః

భక్తుల యొక్క అపరాధములను సహించువాడు.

## 150 జగదాదిజః

1 జగత్ + ఆది + జః = "జగత్" = జగత్తునకు "ఆది" = కారణము

(జగదాది=చతుర్ముఖుడు.) చతుర్ముఖుడు ఎవనినుండి "జ"= పుట్టెనో అతడు జగదాదిజుడు.

2 జ+గద+ఆదిజః = "గద" = గదుడనువాడు. "ఆదిజః"= ముందు పుట్టుకగా కలవాడు గదాదిజుడు "జః"= అన్నిరూపము లతో పుట్టువాడు. "జః+గదాది జః"=(అన్ని రూపములతో పుట్టు వాడును, గదుడను వానికి అన్నయును అగువాడు జగదాదిజుడు.)

"బలం గదం సారణం చ దుర్మదం విపులం ధ్రువమ్।
వసుదేవస్తు రోహిణ్యాం కృతాదీన్ ఉదపాదయత్॥"
భాగ-9-24-46

"దేవరక్షితయా లబ్ధాః నవచాత్ర గదాదయః।
వసుదేవ స్సుతా నష్టౌ ఆదదే సహదేవయా॥"
భాగ-9-24-52

## *151* అనఘః

న+అఘః; "అఘః"= పాపము, దానివలన వచ్చు యావద్దోషము లును, "న" = లేనివాడు (పాపరహితుడు.)

## *152* విజయః

1 వి=విశేషమైన, "జయః"= జయము కలవాడు.

2 వి+జయః="వి"=గరుడుడు. అతనికి "జయః"= జయము ఎవరి వలన వచ్చునో అతడు. (గరుడునకు విజయమును కలిగించువాడు.)

## 153 జేతా

జయమే శీలముగా కలవాడు.

## 154 విశ్వయోనిః

1 వి+శు+అ+యోనిః = "వి" = గరుడుని ద్వారా, "శ్వ" = నడచుట అను ధాతువు ద్వారా; "శుః" = (గరుడునిమీద) నడచువాడు. "యోనిః" = జన్మకు కారణము. "అయోనిః" = యోని లేనివాడు; విశు+అయోనిః = (గరుడుని మీద ప్రయాణము చేయువాడును, తన జన్మకు కారణము లేనివాడును "విశ్వయోని" అగును.)

2 విశ్వస్య = ప్రపంచమునకు, "యోనిః" = కారణభూతుడు.

## *155*

పునః+వసుః; "పునః" = మాటి మాటికి, "వసుః" = ద్రవ్యము ఎవరి వలన వచ్చునో అతడు.

శ్లో॥ ఉపేంద్రో వామనః ప్రాంశు రమోఘః శుచి రూర్జితః
అతీంద్రః సంగ్రహః సర్గో ధృతాత్మా నియమో యమః 17

## *156* ఉపేంద్రః

ఉప+ఇంద్రః = ఇంద్రునకు తమ్ముడైనవాడు.

## *157* వామనః

1 వామ+నః = "వామ" = అందమైన వస్తువులను "నః" = పొందించువాడు.

2 వామమ్ = శత్రువును చీకటిలోనికి, "నః" = తీసికొనిపోవు వాడు. (శత్రునాశకుడు.)

## 158 ప్రాంశుః

1 త్రివిక్రమ రూపముతో మిక్కిలి ఎత్తైనవాడు.

2 ప్ర+అంశుః; "ప్ర" = ప్రకృష్టములైన, "అంశుః" = కిరణములు కలవాడు.

## 159 అమోఘః

న + మోఘః = ఎవరి సంకల్పము కాని, వాక్యము కాని,
'మోఘః' = వ్యర్థము "న" కాదో అతడు.
(అమోఘమగు వాక్కు, సంకల్పము కలవాడు.)

## 160 శుచిః

శుద్ధమైనవాడు.

## 161 ఊర్జితః

ఊర్జ + తః; "ఊర్జా" = సారవంతమైన అన్నము కలవారు (అన్నదాతలు) వారిని, "తః" = వ్యాపింప చేయువాడు = ఊర్జితః
(అన్నదాతల నభివృద్ధి పరచువాడు.)

## 162 అతీంద్రః

ఇంద్రుని అతిక్రమించిన వాడు.

## 163 సంగ్రహః

1 సమ్ + గ్రహః = భక్తులను సంగ్రహించు వాడు.

2 విశిష్టులైన (బలిచక్రవర్త్యాదులు) ఎవరిచే యాచింపబడుట కొరకు ఉద్భవించిరో అతడు. (బలినుండి దానమును గ్రహించినవాడు.)

3 "సమ్" = సమీచీనములైన (మంచి), "గ్రహాః" = గ్రహములు సూర్యాది నవగ్రహములు-శింశుమార రూపములో ఎవనియందు ఉన్నవో అతడు. (గ్రహాధిపతి.)

## 164 సర్గః

సృష్టి చేయువాడు.

## 165 ధృతాత్మా

1 ధృత = ధైర్యమైన, "ఆత్మా" = మనస్సు కలవాడు.

2 ధృత + ఆత్మా = ఎవనిచేత ఆత్మలు (జీవులు) ధృతమైనవో అతడు. "ఆత్మా" = మనస్సు ఎవనియందు ఋషులచేత ధృతమైనదో (లగ్నము చేయబడినదో) అతడు. (జీవాధారుడును, ఋషులచే ధ్యానింపబడువాడును.)

## 166 నియమః

నియమనము = అరికట్టుట-వశములోనికి తెచ్చుకొనుటను-చేయువాడు.

## 167 యమః

1 నియమించువాడు "యమో నియమాత్ హరిః" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

2 కొందరు ఈ నామమునే "అయమః" అని (పదచ్ఛేదము) చూపుదురు. "యమః" = నియామకుడు, "న" = లేనివాడు. (సమానుడు లేనివాడు లేక అసమానుడు.)

3 అయ + మా అని మరొక విధముగా పదచ్ఛేదము చేసినపుడు "అయ" = శుభావహ విధిని "మః" మాతి = తెలిసికొన్నవాడు- అయముడు. (శుభజ్ఞుడు.)

శ్లో॥ వేద్యో వైద్య స్సదా యోగీ వీరహా మాధవో మధుః।
అతీంద్రియో మహామాయో మహోత్సాహో మహాబలః॥ 18

## *168* వేద్యః

తెలిసికొన దగినవాడు.

## 169 వైద్యః

1 భవరోగమును పరిహరించు (తొలగించు) వాడు.

2 సకల విద్యలయందు ప్రతిపాదింపబడి ఉండుటవలన వైద్యుడు.

## 170 సదాయోగీ

కపిలాది రూపములతో ఎల్లప్పుడు యోగాభ్యాసమునం దుండువాడు.

## *171* వీరహా

1 వి + ఈర + హా = "ఈరః" = వాయువు. వాయువు ఎవరి నుండి "వి" = విగతుడో = తొలగి పోయెనో వారు వీరులు = వాయుద్వేషులు. వారిని "హా" = చంపువాడు (వాయుద్వేషులను చంపువాడు.)

2 వి + ఈర + హా; "వి" = గరుడుడు; "ఈరః" = వాయువు. "హన = హింసాగత్యోః" అను ధాతువు ద్వారా "హా" = నడచు వాడు అని అర్థము. (గరుడుని వాయువును వాహనముగా చేసి కొని పయనించువాడు.)

## 172 మాధవః

మా+ధవః = "మా" = లక్ష్మి "ధూఞ్ = కంపనే" అను ధాతువు ద్వారా "ధవః" = కంపింప జేయబడుచున్నది. అనగా లక్ష్మిని కంపింప జేయువాడు.

## 173 మధుః

సుఖరూపము కలిగియుండుట వలన మధుః.

## 174 అతీంద్రియః

1 అతి+ఇంద్రియః = ఇంద్రియ = ఇంద్రియములకు, "అతి" = అతీతు డైన వాడు = దాటినవాడు.

2 అతి+ఇంద్రియః; "అతి" = అధిక సంఖ్యలో నున్న ఇంద్రియః = ఇంద్రియములు కలవాడు. (అనేక బాహూదర వక్త్ర నేత్రుడు.)

## 175 మహామాయః

మహాత్ +మా+అయః; మహత్ = గొప్పదియైన, మా = (తల్లి) మహామా=లక్ష్మీదేవి; ఆమెయొక్క "అయః"=ప్రాప్తి (ఎవని వలన కలుగునో అతడు ) (లక్ష్మిని ప్రసాదించు వాడు.)

2 మహాత్ +అమ+ఆయః="అమ గత్యామ్ అను ధాతువు నుండి, "అమ" = తెలిసికొనిన జ్ఞానులు అని అర్థము వచ్చును. మహాత్ము లైన "అమాః" (జ్ఞానులు)=మహామాః. వారికి ఆయము=శుభము ఎవరివలననో అతడు (జ్ఞానులకు శుభము నిచ్చువాడు.)

3 మహాత్ +అ+మాయః; "మాయా"=కపటము. "..." — లే..

వాడు అమాయః; "మహా" = గొప్ప; "అమాయః" = మహామాయః
(కపటము లేనివాడు.)

4 మహత్ + మాయః; "మహా" = గొప్ప; "మాయా" = ఇచ్ఛ లేక కోరిక కలవాడు. "మహామాయే త్యవిద్యేతి తవేచ్ఛాஉనంత కథ్యతే" అను వాక్యము ఇందుకు ప్రమాణము. (భక్తరక్షణయందు గొప్ప కోరిక కలవాడు.)

## 176 మహోత్సాహః

1 మహత్ + ఉత్సాహః = జగత్తును సృష్టించుట మొదలగు వ్యాపారములయందు; "మహా" = గొప్ప; "ఉత్సాహః" = ఉత్సాహము కలవాడు.

2 మహేషు = యజ్ఞాది ఉత్సవములయందు "ఉత్సాహః" = ఉత్సాహము కలవాడు.

## 177 మహాబలః

1 మహత్ + బలః; "మహా" = ఎక్కువ; "బలః" = బలము కలవాడు.

2 మహతీ + అబలః = మహాత్మురాలైన, లక్ష్మీరూపమైన అబలః = భార్య కలవాడు. ( లక్ష్మీపతి. )

3 బలః = "బలుడు" అను పేరుగల రాక్షసుడు శత్రువుగా కలవాడు. బలుడు "న" = కానివాడు అబలుడు = ఇంద్రుడు. ఇంద్రుడు తన కంటె (మహాత్) పెద్దవాడుగా (అన్నగా) కలవాడు. (ఉపేంద్రుడు ఇంద్రుని తమ్ముడు.)

శ్లో॥ మహా బుద్ధి ర్మహా వీర్యో మహాశక్తి ర్మహాద్యుతిః
అనిర్దేశ్య వపుః శ్రీమాన్ అమేయాత్మా మహాద్రిధృక్ 19

## 178 మహాబుద్ధిః

గొప్ప బుద్ధి కలవాడు.

## 179 మహావీర్యః

గొప్పదైన వీర్యము (పరాక్రమము) కలవాడు.

## 180 మహాశక్తిః

1 గొప్ప శక్తి కలవాడు.

2 అనుగ్రహ నిగ్రహములచే గొప్పశక్తులు ఎవనినుండి వెలువడునో అతడు.

## 181 మహాద్యుతిః

గొప్ప "ద్యుతిః"=సూర్య ప్రకాశము కలవాడు. లేక ఎవని నుండి సూర్యునకు ప్రకాశము వచ్చుచున్నదో అతడు. "తమేవ భాంతమనుభాతి సర్వమ్" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము. "రూపనీ పాచికా చైవ శోషణీ చ ప్రకాశినీ నైవ రాజన్ రవేః శక్తిః శక్తిః నారాయణస్య" అను నృసింహ పురాణోక్తి ఇందుకు ప్రమాణము. ( తేజోవంతుడు. )

## 182 అనిర్దేశ్యవపుః

1 నిర్దేశించుటకు= ఇట్టిది, అట్టిది, ఇంతది, అంతది అని నిర్దేశించి చెప్పుటకు వీలుకాని శరీరము కలవాడు. "అనామా సోఽ ప్రసిద్ధత్వాత్" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

2 నిర్దేశ్య=నిర్దేశింపబడువాడు; "న"= కానివాడు=అనిర్దేశ్యః; అట్టి

"వపుః"=శరీరము కలవాడు అనగా(అరూపుడని భావము.)"భూత వర్జనాత్ అరూపః" అను వాక్య మిందుకు ప్రమాణము.

3 అనిర్దేశ్+అవపుః అని కొందరు పదచ్ఛేదము చేయుదురు. నిర్దేశించుటకు (వర్ణించుటకు) వీలులేనివాడును, రూపము లేనివాడును అనిర్దేశ్యవపుః.

4 పోల్చి చెప్పుటకు (నిర్దేశించుటకు) మరియొక వస్తువు లేనివాడు అనిర్దేశ్యః; అవపుః = శరీరము లేని మన్మథుడు, సౌందర్యమును చెప్పునపుడు మన్మథునితో నైనను పోల్చుటకు వీలుకాని శరీరము కలవాడు. అనగా మన్మథుని కంటె అందగాడు. "సాక్షాన్మన్మథ మన్మథః" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

## 183 శ్రీమాన్

లక్ష్మి కలవాడు.

## 184 అమేయాత్మా

1 న+మేయ + ఆత్మా; "మేయ" = పూర్తిగా తెలిసికొనుటకు "న"=అశక్యమైన;"ఆత్మా"=స్వరూపము కలవాడు.(అవ్యక్తుడు.)

2 అ = లక్ష్మిచేత; "మేయ" = మానముల ద్వారా కొలవదగిన "ఆత్మా"=స్వరూపము కలవాడు; న= కాదు కనుక అమేయాత్మా-(లక్ష్మికి కూడ అందని స్వరూపము కలవాడు). "శ్రీమా నమేయాత్మా" అని కొందరు పై రెండు నామములను కలిపి చదువుదురు.

## 185 మహాద్రిధృక్ (త్)

1 మహాత్ +అద్రి+ధృక్;మహాద్రి=గొప్పదియగు పర్వతము అనగా మందరము గాని గోవర్ధనము గాని అగును. ఆ రెండు పర్వతములను "ధృక్" = ధరించినవాడు.

2 అద్రి=ఆదరణీయమైనవి. (ప్రాణములు) వానిని "ధృక్"=ధరించు వాడు. "అద్రి రాదరణీయత్వాత్ ప్రాణః" అను వాక్య మిందుకు ప్రమాణము. (వాయుధారకుడు.)

శ్లో॥ మహేష్వాసో మహీభర్తా శ్రీనివాస స్సతాంగతిః
అనిరుద్ధ స్సురానందో గోవిందో గోవిదాం పతిః 20

## 186 మహేష్వాసః

1 మహాత్ + ఇష్వాసః; మహా=గొప్పదియైన; ఇష్వాసః=అమ్ములపొది కలవాడు.

2 మహా + ఇషు + ఆ + సః; ఇషు అనగా కోరిక. గొప్ప కోరిక కలవాడు. ఇషు అనగా బాణమని కూడ అర్థమున్నది. అందువలన మహేషుః= గొప్పబాణము కలవాడు. ఆ+సః= "ఆ"=అన్నివైపుల, "సః" = అతడే ఉండువాడు, మహేషుడును, ఆసుడును అగువాడు మహేష్వాసః. (గొప్పకోరిక లేక బాణముకలవాడును, సర్వవ్యాపియును.)

## 187 మహీభర్తా

1 మహ + ఈ + భర్తా = "మహ"=ఉత్సవము. అది కలవాడు మహీ. "యాః"=లక్ష్మికి గాని; ఏః=మన్మథునకుగాని భర్త అగువాడు= "ఈ భర్తా" (ఉత్సవము కలవాడును, లక్ష్మికిని మన్మథునకును భర్త అగు వాడును= మహీభర్తా.)

2 మహీ = భూదేవికి; భర్తా = భర్త అగువాడు.

## 188 శ్రీనివాసః

1 ఇతనియందు "శ్రీ" = లక్ష్మి; "నివాసః" = నివసించును. కనుక శ్రీనివాసః.

2 శ్రీ+ని+వాసః; "శ్రీ" = లక్ష్మిని నడిపించువాడు. "వస్"

ధాతువునకు కప్పుట అని అర్థము. దీనిద్వారా "వాసః" = అన్నిటిని ఆవరించి ఉండువాడు అనియు; "వాసయతి" = అన్నిటిని వసించునట్లు చేయువాడు అనియు; "వసతి" = అంతట నివసించువాడు అనియు అర్థము వచ్చును. (సంపదను నడిపించువాడును, అన్ని చోట్ల వసించు వాడును కనుక శ్రీనివాసః అని పేరు వచ్చినది.)

## *189* సతాంగతిః

1 సతామ్; "తా" = ఆనందముతో; "సహితాః" = కూడినవారు సంతః = ఆత్మజ్ఞానము కలిగిన ముక్తులని అర్థము. వారికి "గతిః" = గతి యైన వాడు. (ముక్తశరణ్యుడు.)

2 సతామ్; "షద్ ౡ = విశరణ గత్యవసాదనేషు" అను ధాతువునకు "విశరణ" = ముక్కలుగా విడిపోవుట; నశించుట, "గతి" = విశీర్ణులైన వారు = పట్లు తప్పిన వారు, అనగా ఆర్తిలో నున్న వారికి, నడచువారికి, జ్ఞానులు మొదలగు వారందరికి, "గతిః" = గతియగు వాడు.

## *190* అనిరుద్ధః

1 అ + నిరుద్ధః = ఎవనిచేతను ఆపబడని వాడు.

2 జ్ఞానులను గూర్చి పోవుటకు నిరోధము లేనివాడు.

3 అని + రుద్ధః = "అన" = ముఖ్య ప్రాణుడు. అనము కలవారు అనులు = జీవులు, వారిచేత హృదయమునందు నిరుద్ధః = నిరోధింపబడువాడు. (జీవహృదిస్థితుడు.)

4 అ + నిరుత్ + హః = అనిరుద్ధః; "నిరుత్" = వేదాది రూపమైన శబ్దము. అది లేనివారు అనిరుత్ = వేద విరుద్ధములైన ఆచారములు కలవారు. (రాక్షసాదులు) వారిని "హః" = చంపువాడు. (రాక్షస వినాశకుడు.)

## 191 సురానందః

సు+ర+ఆనందః; "సు"=శోభనమైన జ్ఞానమును "ర"=ఇచ్చు వాడు=సురుడు; "ఆనందః"= ఆనంద పరచువాడు. (జ్ఞానమును ఆనందమును ఇచ్చువాడు.)

## 192 గోవిందః

గో+విందః = "గో" శబ్దమునకు భూమి, బాణము, ధేనువు, స్వర్గము, వేదము అను అర్థములు కలవు. "విందః" పొందువాడు. "గో" శబ్దమున కున్న అర్థముల నన్నిటిని పొందువాడు.

## 193 గోవిదాం పతిః

గోవిదామ్=(1) వేదములు తెలిసిన వారికిని, (2) జలచరముల కును, "పతిః"=పతియగువాడు.

శ్లో॥ మరీచి ర్దమనో హంసః సుపర్ణో భుజగోత్తమః,
హిరణ్యనాభ స్సుతపాః పద్మనాభః ప్రజాపతిః. 21

## 194 మరీచిః

1 ఇతనిచేత తమము (1) తమోగుణము (2) చీకటి చంపబడుచున్నది. (నశింపజేయబడు చున్నది.) మ్రియతే తమః అనేన ఇతి=మరీచిః.

2 మరీ+చిః="మర"=ఉదకము. అది కలవారు=మరిణః". వారిని "చిః" = చలింపజేయువాడు. (జీవచైతన్య కారకుడు.)

## 195 దమనః

1 "దమనుడు" అను రాక్షసుని సంహరించినవాడు.

2 దమన = ఇంద్రియ నిగ్రహమునందు ప్రియము కలవాడు.

3 దమ = దమము కలవారు దములు. వారిని "నః" = నడిపించువాడు.

4 ద + మనః = "ద" = అభీష్టమును ఇచ్చునట్టి; "మనః" మనస్సు కలవాడు.

## 196 హంసః

హమ్ + సః = దోషహీనుడు కనుక "హమ్" అని పేరు. సారము కలిగి యుండుట వలన "సః" అని పేరు. (దోష హీనుడును, సార వంతుడును కనుక హంసుడు.) "నిత్యం హీనోఽఖిలై ర్దోషైః స్సార రూపో యతో హరిః హంసః ఇత్యుచ్యతే తస్మాత్" అను కాఠక భాష్యోక్తి ఇందుకు ప్రమాణము.

## 197 సుపర్ణః

సు + పర్ణః; "సు" = మిక్కిలి ఆనందమయమైన "పర్ణః" రూపము కలవాడు. (ఆనందస్వరూపుడు.)

## 198 భుజగోత్తమః

1 భుజగాః = సర్పములు; "తేషాం" = వారియందు "ఉత్తమః" = శ్రేష్ఠుడైన ఆదిశేషుడు శయ్యగా కలవాడు.

2 భుజ + గ + ఉత్ + తమః = "భుజ" = కౌటిల్యముతో (వంకరగా) గాః = నడచువారు (వక్రబుద్ధులు), తేషామ్ = వారికి, "ఉత్" = ఉత్కృష్టమైన, "తమః" = అజ్ఞానమును ఇచ్చువాడు. (వక్రబుద్ధుల కజ్ఞానము నిచ్చి నశింపజేయువాడు.) తా నహం ద్విషతః క్రూరా న్సంసారేషు నరాధమాన్ క్షిపా మ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు-(గీత-16-19) అను శ్లోక మిందుకు ప్రమాణము.

## 199 హిరణ్యనాభః

హిరణ్య+నాభః="ణభ్ = హింసాయామ్" (హింసించుట) అను ధాతువునుండి ఏర్పడిన "నాభ"=అను పదమునకు హింసించువాడు అని అర్థము. "హిరణ్యుడు" అను పేరుగల రాక్షసునికి నాభః= నాశన కారకుడు.

## 200 సుతపాః

1 సు+తపాః; "సు"=మంచి, "తపః"=జ్ఞానము కలవాడు.

2 సుత+పాః; "సుత"=కొడుకైన చతుర్ముఖుని "పాః"=రక్షించు వాడు. "పా = రక్షణే" అని ధాతువు.

3 సుతమ్ = అభీప్సితం = ఇష్టమైన సోమరసమును; "పాః" = త్రాగు వాడు "పా = పానే" అని ధాతువు.

## 201 పద్మనాభః

1 పద్మ+నాభః; "పద్మ" = చతుర్ముఖుడు; "నాభః" = బొడ్డు యందు కలవాడు.

2 పదమ్ = భగవత్స్వరూపమును, "మన్యతే ఇతి పద్మనాః" = ధ్యానము చేయువాడు = భగవద్భక్తుడు. వారికి "ఆభః = ఆభాతి" = ప్రత్యక్షమగువాడు.

## 202 ప్రజాపతిః

1 ప్రజా+పతిః = ప్రజలకు పతి యగువాడు.

2 ప్ర+జాప+తిః = "జప" అను ధాతువునకున్న "స్పష్టమైన మాట"

అను అర్థము ద్వారా "ప్రజాప" = ప్రకృష్టమైన స్తుతిగాని ధ్యానము గాని కలవారు = ప్రజాపులు అగుదురు. వారికి "త" = ఆనందము ఎవరి వలన వచ్చునో అతడు ప్రజాపతిః "ఆనందంతీతి వై వదేత్" అను వాక్యము ఇందుకు ప్రమాణము. (భక్తానంద దాయకుడు.)

శ్లో॥ అమృత్యు స్సర్వదృక్ సింహః సంధాతా సంధిమాన్ స్థిరః
అజో దుర్మర్షణ శ్శాస్తా విశ్రుతాత్మా సురారిహా 22

## 203 అమృత్యుః

1 మృత్యువు లేనివాడు.

2 మృత్యువు ఎవరివలన ఉండదో అతడు.

## 204 సర్వదృక్

సర్వమును చూచువాడు.

## 205 సింహః

1 తడుపునది. "షిచ్" = క్షరణే" అను ధాతువులోని "చ" కారమునకు "హ"కారము ఆదేశముకాగా, "నుమ్" ఆగమముగా వచ్చినపుడు "సింహ" శబ్ద మేర్పడును. (భక్తులను అనుగ్రహము నందును అభక్తులను ఆగ్రహము నందును ముంచెత్తు వాడు.)

2 నశింపజేయువాడు = సింహః. "సింహో వర్ణవిపర్యయాత్" అను వాక్యము ఇందుకు ప్రమాణము. "హిసి = హింసాయామ్" అని ధాతువు. "హింస" అను పదము నందలి అక్షరములు తిరుగబడి 'సింహ' అను పదమేర్పడినది.

## 206 సంధాతా

1 సమ్ = బాగుగా; "ధాతా" = ధరించువాడు లేక పోషించువాడు.

2 రామాది రూపములతో అహల్యా మొదలగు వారిని, గౌతముడు మొదలగు వారితో సంధాన పరచువాడు = కలుపువాడు.

## 207 సంధిమాన్

సుగ్రీవుడు, విభీషణుడు మొదలగు వారితో సంధి గావించుకొనుట వలన ఈ పేరు వచ్చినది.

## 208 స్థిరః

అనాది, నిత్యుడు అగుటవలన స్థిరుడు.

## 209 అజః

పుట్టనివాడు, జన్మలేనివాడు.

## 210 దుర్మర్షణః

మర్షయితుమ్ = సహించుటకు; దుర్ = శక్యము కాకపోవుట వలన = దుర్మర్షణుడు. లోకోత్తర ప్రాభవాదులచే సహింప శక్యము కానివాడు.

## 211 శాస్తా

జగత్తును శాసించువాడు.

## 212 విశ్రుతాత్మా

విశ్రుత = ప్రసిద్ధమైన; ఆత్మా = స్వరూపము కలవాడు.

## 213 సురారిహా

సుర + అరి + హా; "సుర" = దేవతలకు; "అరి" = శత్రువులు (రాక్షసులు), వారిని "హా" = చంపువాడు. (రాక్షసులను చంపువాడు.)

శ్లో॥ గురుర్గురు తమోధామ స్సత్యః సత్యపరాక్రమః,
నిమిషోఽ నిమిష స్స్రగ్వీ వాచస్పతి రుదారధీః. 23

## 214 గురుః

1 గృణాతి = ఉపదేశము చేయువాడు.

2 మిక్కిలి పెద్దవాడు "గురుః", "శ్రీ బ్రహ్మణో ర్విష్ణుః
సురాణాంచ గురోర్గురుః
మూలభూత గురుః సర్వ
జనానాం పురుషోత్తమః" అను భాగవతము నందలి దశమ స్కంధ తాత్పర్య వాక్యము ఇందుకు ప్రమాణము.

## 215 గురుతమః

1 గురు = గురువులైన బ్రహ్మ మొదలగు వారిచేత, తమః = కాంక్షింపబడువాడు.

2 గురు + త + మః; "గురు" = గురువైన బృహస్పతికి, "త" = విస్తృతమైన, "మా" = జ్ఞానము ఎవరి వలన వచ్చునో అతడు. (బృహస్పతికి అధికమైన జ్ఞానము నిచ్చినవాడు.)

3 గురు = శ్రేష్ఠుడును, తమః = మిక్కిలి వ్యాప్తుడును, గురుశ్చాసౌ తమశ్చ = (మిక్కిలి శ్రేష్ఠుడును, మిక్కిలి వ్యాప్తుడును అయిన వాడు.)

## 216 ధామః

తేజో రూపము కలవాడు.

## 217 సత్యః

1 సత్య భాషణము, ధర్మమను గుణములే రూపముగా కలవాడు.

2 సత్య=జగత్తును సృష్టించువాడు. "సద్భావం యాపయే ద్యస్మాత్ సత్యం తత్తేన కథ్యతే"

3 సత్ +యా="సత్" = సత్వమును అనగా జీవనముగాని, విశర ణము కాని (విశరణము = లయమును.) భూతములకు యః=ఇచ్చు వాడు (సత్యః) (జీవనదాత, లయకారకుడు.)

4 సత్ = గతిని, యః = ఇచ్చువాడు. "ఉక్తం సదితి ధాత్వర్థో గతి శ్చాత్రోహి సత్యేన ప్రాణత్వ మితి" అను వాక్యముద్వారా ప్రాణ మును కల్గించునది సత్యము.

5 సత్య= భాగవత తాత్పర్యమునందు "సత్యం పరం ధీమహి" అనుచోట సత్య శబ్దమును ప్రతీకగా గ్రహించి "నిర్దుఃఖ నిత్య నిరతి శయానందానుభవ రూపము" అని వ్యాఖ్యానింపబడినది. కనుక దుఃఖము లేని నిత్యమైన నిరతిశయమైన ఆనందానుభవమే రూప ముగా కలవాడు.

6 "సత్" శబ్దమునకు సర్వోత్తముడు అను అర్థము ఐతరేయ భాష్యమునందు పేర్కొన బడినది.

"స ఏష భగవాన్ విష్ణుః సత్య మి త్యభిధీయతే సర్వోత్తమ త్వాత్ పూర్ణత్వాత్ సర్వజ్ఞత్వాత్ తథైవచ" అను వాక్యము ఇందుకు ప్రమాణము. సర్వోత్తముడును, పూర్ణుడును, సర్వజ్ఞుడును అగుట

వలన విష్ణువే "సత్య" మను నామముతో పిలువబడు చున్నాడు.

8 సత్య="సదితి అమృత ధర్మాణః ముక్తాః శ్రీ రపి చేరితాః" అను ఛాందోగ్య భాష్యము, "సత్" శబ్దమునకు ముక్తులు అని అర్థము చెప్పినది. ఆ ముక్తుల గూర్చి వెళ్ళువాడు కనుక సత్యుడు. "సత్య మిత్యుచ త్యే సద్భి రితి వ్యాఖ్యాతః"

9 సత్ =సాదయతి. విశరణాదికము (క్షీణదశ) లను పొందింప జేయు వాడు; యామయతి=(నియచ్ఛతి) నియమించువాడు అను అర్థము వలన "యః?" సత్ ను, యుడును అయినవాడు సత్యుడు (నాశన కర్తయు, నియామకుడును అగువాడు) "తస్యోపనిషత్సత్యస్య సత్య మితి ఏష ఏవైత త్సాదయతి యామయతీతి" అను ప్రాచీన శాల శ్రుతి వాక్య మిందుకు ప్రమాణము.

## 218 సత్య పరాక్రమః

1 సత్యమైన పరాక్రమము కలవాడు సత్యపరాక్రముడు.

2 సత్యపర+ఆ+క్రమః; "సత్యపర"=సత్యమైన వచనములుగల బలిచక్రవర్తియందు; "ఆ"=బాగుగా; "క్రమః"=తలపై పాదము నుంచినవాడు. (వామనుడు.)

3 సత్ +తి+య+పరాక్రమః; "సత్"=వాయువు "వాయుః సదితి సంప్రోక్తో జీవేషు తు సు పూర్ణతః." తి=బ్రహ్మ, "తీతి బ్రహ్మ సముద్దిష్టః." స ఏవాన్నాభిమానవాన్ (అన్నం ప్రజాపతి రితి శ్రుతి రన్యాఽప్య భాషత)

య = ఆదిత్యుడు.
"య మిత్యాదిత్య ఉద్దిష్టో యమయేత్ యత్ప్రకాశయన్
దేవతాత్రయ మేతత్తు సహితం సత్యముచ్యతే

శుక్ల కృష్ణ కనీనాసు చక్షు షోః ప్యేత ఆస్థితాః
ఏవం సత్యపదార్థం యో విజ్ఞాయో పాస్త ఆదరాత్
యోగ్య స్తస్యా ఉపాస్యాయా నైవాసత్యేన దుష్యతి.
దేవతా మునయశ్చైవ యోగ్యా అస్యా అపిస్ఫుటం
మానుషాణాం జ్ఞానమాత్రా దోషో నానితరా భవేత్"

అను ఐతరేయ భాష్యోక్తి వలన సత్యశబ్దమునకు 1) వాయువు 2) బ్రహ్మ 3) సూర్యుడు. వాయు, బ్రహ్మ, సూర్యులకు ఎవనివలన పరాక్రమము కలుగునో అతడు. (శక్తిదాత.)

## 219 నిమిషః

1 నిమి + షః; "నిమి" అను పేరుగల రాజునకు షమ్=బలము ఎవని వలన వచ్చినదో అతడు.

2 అందరిని నియమించువాడు.

3 కాలమే స్వరూపముగా కలవాడుకనుక నిమిషుడు.

4 ని + మిషః; మిష ధాతువునకు స్పర్ధ అని అర్థము. "ని"=మిక్కిలి, "మిష"=స్పర్థ (దైత్యులతో) కలవాడు. (దైత్యారి.)

## 220 అనిమిషః

1 అని + మిషః; "అన"=వాయుదేవుడు. అని=వాయువే దేవుడుగా కలవారు. (వాయుభక్తులు). వారిని మిషః=కలియువాడు. "మిష" ధాతువునకున్న సంగమము అను అర్థము వలన ఈ భావము కుదురును. "మిష=సంగమే" అని ధాతువు. (వాయుభక్తులతో కూడి యుండువాడు.)

2 అ + నిమిషః; నిమిషమనగా కనురెప్ప పాటుకాలము. ఆ కొద్ది పాటి కాలము కూడ వదలక ఎల్లప్పుడు దయతో భక్తులను చూచువాడు.

## 221 స్రగ్వీ

స్రక్ = పూలదండ. అది కలవాడు స్రగ్వీ.

## 222 వాచస్పతిః

వాచః + పతిః; "వాచః" = వేదములకు; "పతిః" = నాయకుడు.

## 223 ఉదారధీః

1 ఉత్ + దార + ధీః; "ఉత్" = గొప్పదియైన; దార = భార్యయైన లక్ష్మికి; "ధీః" = బుద్ధి ఎవనివలన వచ్చినదో అతడు. (లక్ష్మికి దాన బుద్ధిని కలిగించువాడు.)

2 ఉత్ + ఆర + ధీః; ఆరము లనగా దోషములు; ఉత్ + ఆర = దోష రహితమైన (నిర్దోషమైన) ధీః = బుద్ధి కలవాడు.

శ్లో॥ అగ్రణీ ర్గ్రామణీః శ్రీమాన్ న్యాయో నేతా సమీరణః,
సహస్రమూర్ధా విశ్వాత్మా సహస్రాక్షః సహస్రపాత్. 24

## 224 అగ్రణీః

అగ్రి + ణీః; "అగ్రి" = ముందుగా; "నీః" = తీసికొని పోవువాడు. "ణీఙ్ = ప్రాపణే" అని ధాతువు. (మార్గదర్శి.)

## 225 గ్రామణీః

గ్రామ + ణీః; "గ్రామమ్" = భూత గ్రామమును (ప్రాణి సమూహ మును) "నీః (నయతి) = [కర్మ ఫలము వద్దకు] తీసికొనిపోవు వాడు. (కర్మ ఫలప్రదాత.)

## 226 శ్రీమాన్

నిత్య లక్ష్మి వంతుడు.

## 227 న్యాయః

ని + ఆయః = "ని" = మిక్కిలి; "ఆయః" = లాభము కలవాడు.

## 228 నేతా

నేతా = ప్రాణులకు యోగ్యమైన ఫలమును నియమించువాడు. "పుణ్యేన పుణ్యాలోకం నయతి పాపేన పాపమ్" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము.

## 229 సమీరణః

1 సమీర + ణః; "సమీర" = వాయువునకు, "ణః" = సుఖము ఎవరి వలననో అతడు.

2 సమ్ + ఈ + రణః; "సమ్" = బాగుగా; "ఈ" = లక్ష్మీదేవి చేత; "రణః" = "జయ జయ" మొదలగు స్తుతిరూప శబ్దములు ఎవని కొరకో అతడు. అనగా (లక్ష్మిచేత బాగుగా స్తుతింపబడువాడు.)

3 సమ్ + ఈరణః; "సమ్" = బాగుగా; "ఈరణః" = ప్రేరేపించు వాడు.

## 230 సహస్రమూర్ధా

సహస్ర = వేయి; మూర్ధా = శిరస్సులు కలవాడు.

## 231 విశ్వాత్మా

1 విశ్వ + ఆత్మా; "విశ్వ" = ప్రపంచమును "ఆత్మా" = నియమించు వాడు.

2 విశ్వము కంటె భిన్నుడు కానివాడు అని కొందరందురు. "భిన్నోఽచింత్యః పరమో జీవ సంఘాత్ సోఽహం విశ్వ సృజం విశ్వ మవిశ్వం విశ్వవేదసమ్" అను బహు ప్రమాణ విరోధముచేత విశ్వాఽభిన్న డను అరము సరికాదు.

## 232 సహస్రాక్షః

సహస్ర = వేయి; అక్షః = కన్నులు కలవాడు.

## 233 సహస్రపాత్

సహస్ర = వేయి; "పాత్" = పాదములు కలవాడు.

శ్లో॥ ఆవర్తనో నివృత్తాత్మా సంవృత స్సంప్రమర్దనః,
అహస్సంవర్తకో వహ్ని రనిలో ధరణీ ధరః. 25

## 234 ఆవర్తనః

1 ఆ+వర్తనః; "ఆ" = మేలైన; "వర్తనమ్ = నడవడి కలవాడు.

2 ఆవర్త +నః; "ఆవర్త" = నది మొదలగు వానిలో ఉండు సుడి గుండమును; "నః" = నడిపించువాడు.

## 235 నివృత్తాత్మా

నివృత్త+ఆత్మా; "ఆత్మనః" = తననుండి ప్రళయము ఎవనిచేత; "నివృత్తః" = మరలింపబడినదో అతడు.
కొందరు ఈ నామమునే అనివృత్తాత్మా అని పదచ్ఛేదము చేయుదురు. "అనివృత్తమైన" = మరలిరాని, "ఆత్మా" = దేహము కలవాడు.

## 236 సంవృతః

సమ్+వృతః; "సమ్" = బాగుగా గుణములచేత వృతః = చుట్టబడినవాడు. (గుణ సంపూర్ణుడని అర్థము.)

## 237 సంప్రమర్దనః

సమ్ = బాగుగా రాక్షసులను; ప్రమర్దనః = మర్దించువాడు.

## 238 అహస్సంవర్తకః

1 అహః =దినములను సమ్=బాగుగా; "వర్తకః"=వర్తింప జేయువాడు.

2 అ+హాః; "హాః"=విడుచువాడు; "అహాః"=భక్తులను విడువని వాడు. ఇతనియందు జగత్తు బాగుగా నివసించును కనుక సంవర్తకః. భక్తులను విడువని వాడును, జగత్తును ప్రవర్తింపజేయువా డని అర్థము.

## 239 వహ్నిః

జగత్తును వహించువాడు.

## 240 అనిలః

1 ఇతనిచేత ప్రాణిసమూహము. "అనతి"=బ్రతుకుచున్నది కావున అనిలః.

2 అ+నిలః; "నిల"=లీనమైపోవుట (కలసిపోవుట) ఇంకొక పదార్థము నందు తాను విలీనమగుట జరుగదు కనుక అనిలః "మత్స్థాని సర్వ భూతాని నచాహం తేష్వవస్థితః" గీత=9-4 అను వాక్య మిందుకు ప్రమాణము.

3 న+ఇలః; ఇలా అనగా భూమి; ఇలః = ఆధార భూతమైన భూమి కలవాడు. "అనిలః" = తనకు ఆధార భూతమైన భూమి లేనివాడు. (సర్వాధారుడు.)

## 241 ధరణీధరః

1 ధరణీ+ధరః; "ధరణీ" = భూమిని; ధరః = ధరించువాడు.

2 ధర + ణీ + ధరః; "ధర" = పర్వతములు, వానిని "నీః" = ముందుండి నడిపించువాడు = పర్వత శ్రేష్ఠుడగు గోవర్ధనము (ధరణీః); దానిని "ధరః" = ధరించువాడు. (గోవర్ధనధారి.)

శ్లో॥ సుప్రసాదః ప్రసన్నాత్మా విశ్వధృ గ్విశ్వభు గ్విభుః,
సత్కర్తా సత్కృతిః సాధు ర్జహ్ను ర్నారాయణో నరః. 26

## 242 సుప్రసాదః

1 సు + ప్రసాదః; "సు" = శోభనమైన లేక మోక్షజనకమైన; ప్రసాదః = అనుగ్రహము కలవాడు.

2 దేనిచేత ప్రాణి "ప్రసీదతి" = సంతోషపడునో అది ప్రసాదః = సుఖము. సు = మంచి ప్రసాదము కలవాడు. (ఉత్తమమైన సుఖము కలవాడు.)

## 243 ప్రసన్నాత్మా

ప్రసన్న = ప్రసన్నమైన; ఆత్మా = మనస్సు కలవాడు.

## 244 విశ్వధృక్ (త్)

విశ్వ = విశ్వమును ధృక్ = ప్రగల్భముగా (విశేషముగా) ధరించువాడు. "ధృష్ = ప్రగల్భే" అను ధాతువునుండి ఈ అర్థము వచ్చును. (విశ్వంభరుడు.)

## 245 విశ్వభుక్

1 విశ్వ = విశ్వమును; భుక్ (భుంక్తే) = అనుభవించువాడు.

2 విశ్వ = విశ్వమును; భుక్ (భునక్తి) = పాలించువాడు.

## 246 విభుః

వి + భుః; "వి" = వివిధ రూపుడుగా; "భుః" = అగువాడు లేక వ్యాపించు వాడు.

## 247 సత్కర్తా

1 సత్ = కర్తా; "సత్" = క్లేశాది రహితుడును, "కర్తా" = అన్ని పనులను చేయువాడును సత్కర్తా.

2 సత్ = సత్యమైన జగత్తునకు; కర్తా = కారకుడు.

3 సతామ్ = (విశరణాది యక్తులగు) రాక్షసులను కర్తా = హింసించు వాడు. "సద్ ఌ = విశరణగతి అవసాదనేషు" అను ధాతువునుండి ఈ అర్థము వచ్చును. "కృతీ = ఛేదనే" అను ధాతువు నుండి "కర్తా" అని సిద్ధించును. (రాక్షస నాశకుడు.)

## 248 సత్కృతిః

సతీ + కృతిః = సత్యకర్మ వ్యాపారము = మంచి పనులను చేయు ఆసక్తి కలవాడు.

2 సత్ + కృతిః = ఉత్తమురాలైన "కృతి" యను పేరుగల భార్య కల వాడు.

## 249 సాధుః

ఇతరుల కార్యమును సాధించువాడు.

## 250 జహ్నుః

అయోగ్యులను విడుచువాడు. "హా" ధాతువునకు గల "విడుచుట" అను అర్థమును బట్టి ఈ నామ మేర్పడినది.

## 251 నారాయణః

1 న+అర+అయణః; "దోషాఽర చ్ఛిద్ర శబ్దానాం పర్యాయత్వం యత స్తతః "అను వాక్యమునుబట్టి "అరాః" = దోషములు; నారాః = దోష రహితములైనవి = గుణములు; "అయనః" = ఆ గుణముల కాశ్రియమైన వాడు. (సద్గుణ సంపన్నుడు.)

2 అరాణామ్ = దోషములకు; అయనమ్ = చేరదగినవాడు "న" = కాడు. కనుక నారాయణుడు. (నిర్దోషి.)

3 నారమ్ = నరులకు సంబంధించిన; అయనమ్ = ప్రాప్తిస్థానమైన వాడు. (మానవులకు శరణ్యుడు.)

4 నిర్దోషమై, వేదములనుండి ఉత్పన్న మగుటవలన "నార" మనగా జ్ఞానము, నార + అయనః = జ్ఞాన విషయుడును, జ్ఞానమును పొందించు వాడును అగుటవల్ల నారాయణుడు.

5 నార + క్షయ రహితులైన ముక్తులు. వారికి అయనః = ఆశ్రియ భూతుడు.

6 నారాః = నారములు అనగా నరులకు సంబంధించిన వేదములు అయనః = వాటియందు ప్రతిపాదింప బడుట వలన లేక వానికి చేరదగినవా డగుటవలన నారాయణుడు. (వేదవేద్యుడు.)

7 నార = నరులకు సంబంధించిన ఉద్భవము మొదలగు లక్షణములు. వానిని "అయనః" ఇచ్చువాడు లేక వాని కాశ్రయమైన వాడు. (కర్మఫలదాత.)

8 నార మనగా మానవుల సమూహము. వారికే, అయనః = నమస్కరింప దగినవాడు. (జీవ వంద్యుడు.)

9 నరులకు అధిపతి = నారుడు = ముఖ్య వాయువు. అతనికి = పరమ ప్రేమాస్పదు డగుట చేత వాయువునకు, "అయనమ్" = ఆశ్రయ భూతుడు.

10. నారము లనగా నీరు. అవి "అయనమ్ = వాసస్థానముగా కలవాడు.

"ఆపో నారా ఇతి ప్రోక్తా
ఆపో వై నర సూనవః।
అయనం తస్యంతాః పూర్వ
తేన నారాయణః స్మృతః"॥

అను స్మృతి వాక్యము ఇందుకు ప్రమాణము. (ప్రశయ పయోధి శాయి.)

## 252 నరః

1 న + రః; "నా" ధాతువునకు పరివర్తన మనియు.

2 రీజ్ క్షయే = క్షీణించుట రిష్ హింసాయాం = హింసించుట. అను ధాతువుల ద్వారా. నరః = 1) నిర్వికారుడు. 2) నరః = అవి నాశి = నశింపని వాడు.

శ్లో॥ అసంఖ్యేయోఽ ప్రమేయాత్మా విశిష్టః శిష్టకృ చ్ఛుచిః,
సిద్ధార్థః సిద్ధసంకల్పః సిద్ధిదః సిద్ధిసాధనః. 27

## 253 అసంఖ్యేయః

న = సంఖ్యేయః = లెక్కింప వీలుకాని గుణములు కలవాడు.

## 254 అప్రమేయాత్మా

అప్రమేయ = కొలతకు అందని; ఆత్మా = స్వరూపము, దేహములు స్వభావము కలవాడు.

## 255 విశిష్టః

వి = విశేషముగ, శిష్టః = శాసన యోగ్యులు కలవాడు. "శాసు = అనుశిష్టౌ" అను ధాతువు వలన ఈ అర్థము వచ్చును. (సర్వశాసకుడు.)

## 256 శిష్టకృత్

శిష్ట = సమర్థులైన ఇతర దేవత లందరిచేతను చేయుటకు వీలుకాక మిగిలిన పనిని "కృత్" = స్వయముగా పూర్తి చేయువాడు. (అఘటన ఘటనా సమర్థుడు.)

## 257 శుచిః

పరిశుద్ధుడు.

## 258 సిద్ధార్థః

1 సిద్ధ + అర్థః; "సిద్ధ" = భక్తులు కోరిన దాని నిచ్చుటకై "అర్థః" ప్రార్థింప బడువాడు లేక చేరబడువాడు. (ఈప్సితార్థదుడు.)

2 సిద్ధిమంతులైన వారికి అర్థః = ధనరూపమైన వాడు.

3 సృష్ట్యాది ప్రయోజనమును, సిద్ధార్థః = నెరవేర్చుకొనినవాడు.

4 అయోగ్యులకు నివృత్తి కలుగుట అను "అర్థః" = ప్రయోజనవ ఎవని వలన; "సిద్ధ" = సిద్ధించునో అతడు. (దుష్ట నాశకుడు.)

## 259 సిద్ధ సంకల్పః

సిద్ధ + సంకల్పః = "సంకల్ప" = భక్తులు కోరిన కోరికను "సిద్ధ" సిద్ధింప జేయువాడు.

## 260 సిద్ధిదః

సిద్ధి + దః = యోగ్యులకు సిద్ధిని ఇచ్చువాడు, లేక అయోగ్యులకు సిద్ధిని "దః" = ఖండించు వాడు. "దో = అవఖండనే" అను ధాతువునుండి ఈ అర్థము సిద్ధించును. (శిష్ట రక్షకుడు. దుష్ట శిక్షకుడు.)

## 261 సిద్ధిసాధనః

సిద్ధి = మోక్ష రూపమైన ఫలమును, "సాధనః" = సాధించువాడు.

శ్లో॥ వృషాహీ వృషభో విష్ణు ర్వృషపర్వా వృషోదరః।
వర్ధనో వర్ధమానశ్చ వివిక్తః శ్రుతిసాగరః॥

## 262 వృషాహీ

వృష + అహీ = వృష = ధర్మముచేత; "అహీ" = వ్యాపించువాడు. "అహ = వ్యాప్తౌ" అని ధాతువు.

## 263 వృషభః

1 వర్షించు వాడు.

2 వృష + భః = "వృష" = చేయబడిన ధర్మముతో "భః" = ప్రకాశించువాడు.

## 264 విష్ణుః

"స్ను = ప్రస్రవణే" అను ధాతువునుండి "స్నుః" = ప్రవాహము, వి + స్నుః = 1) వి = విగతమైన (జన్మలేని); స్నుః = జన్మాది ప్రవాహములు కలవాడు. (సంసారరూప ప్రవాహము లేనివాడు.) 2) విశేషముగా నదులకు ఎవని వలన ప్రవాహము వచ్చునో అతడు.

## 265 వృషపర్వా

వృష + పర్వా = "వృష" = పుణ్యము. దానికి సాధనములైన అమావాస్య మొదలగు పర్వములు కలవాడు.

## 266 వృషోదరః

1 వృషోద + రః = "వృషోద" = పుణ్యమైన ఉదకముచేత; "రః" = ఆనందించువాడు. (తీర్థగతుడు.)

2 త్రివిక్రమ రూపముతో బ్రహ్మాండ మందున్న అందరికి "వృషోద" = గంగోదకమును; "రః" = ఇచ్చినవాడు. (గంగకు ఉత్పత్తి స్థాన మైనవాడు.)

3 వృష + ఉత్ + అరః; "వృష" = పుణ్యమును వర్షించువాడు. "అరః" = దోషమునుండి "ఉత్" = బయటపడినవాడు. (దోషము నుండి బయటపడినవాడు = ఉదరుడు); మనోరథములను వర్షించు వాడును, దోషరహితుడును = వృషోదరుడు.)

4 వృష = ఎద్దుయొక్క; "ఉదర" = ఉదరమువంటి ఉదరము కలవాడు.

## 267 వర్ధనః

1 తనవారిని అభివృద్ధి పరచువాడు.

2 వర్ + ధనః = "వర్" = కోరిన; "ధనః" = ధనము కలవాడు.

## 268 వర్ధమానః

నిత్యము అభివృద్ధి చెందువాడు. విశ్వరూపి అని భావము.

## 269 వివిక్తః

జగత్తుకంటె భిన్నుడు.

## 270 శ్రుతిసాగరః

1 సాగర సమాన శ్రుతి ప్రతిపాద్యుడు.

2 "శ్రుతి" = వేదములను; "స" = ఇచ్చినవాడు-శ్రుతిసః = వేదములను ఇచ్చినవాడు. "షణు = దానే" అని ధాతువు. ఆ + గరః = ఆగరః = ఉపదేశించినవాడు. శ్రుతిస + ఆగరః = శ్రుతిసాగరః = (వేదములను ఇచ్చినవాడును; ఉపదేశించినవాడును.) "వేదాంతకృద్వేద విదేవ చాహమ్" అను గీతావాక్య మిందుకు ప్రమాణము.

3 శ్రుతిసా + అగ + రః = శ్రుతులకు సాగరుడగుట వలన 'శ్రుతిసా' అని పేరు. "అగ" = గోవర్ధనము మొదలగు పర్వతముల చేత; "రః" = రమించువాడు = అగరుడు. శ్రుతిసుడును, అగరుడును అయినవాడు శ్రుతి సాగరుడు. (వేదస్వరూపుడైన గోవర్ధనధారి.)

శ్లో॥ సుభుజో దుర్ధరో వాగ్మీ మహేంద్రో వసుదో వసుః।
నైకరూపో బృహద్రూపః శిపివిష్టః ప్రకాశనః॥ 29

## 271 సుభుజః

1 సు + భుజః = మంచి భుజములు కలవాడు.

2 సు + భుజః; "సు" = సుఖముగా; "భుజః" = భుజింపజేయువాడు. (ఆనందదాయకుడు.)

## 272 దుర్ధరః

ధరించుటకు అశక్యమైనవాడు.

## 273 వాగ్మీ

వేదాదిరూప వాగ్విశేషముతో కూడియున్నవాడు కావున "వాగ్మీ"=మహావక్తయని తాత్పర్యము.

## 274 మహేంద్రః

మహా + ఇంద్రః="ఇంద్ర" శబ్దమునకు 1) పరమైశ్వర్యవంతుడు 2) విషయ సుఖములను గూర్చి ద్రవించువాడు 3) కోర్కెలను ఇచ్చువాడు అని అర్థము. మహా + ఇంద్రః = గొప్పవాడైన ఇంద్రుడు.

## 275 వసుదః

1 వసు+దః = "వసు=తోయే ధనే, మణౌ" అను కోశ వాక్య ప్రకారము వసు 1) గంగాది ఉదకమును 2) ధనమును, లేక 3) మణులను దః=ఇచ్చువాడు. అని అర్థము.

## 276 వసుః

1 జనులను వారి వారి స్థావరములయందు ఉంచు వాడు.

2 స్వ స్వరూపమును "వాసయతి" = కప్పువాడు. (అవ్యక్తు డని భావము.)

3 అన్నిచోట్ల నివసించువాడు.

## 277 నైకరూపః

న+ఏక+రూపః = అనేకములైన రూపములు కలవాడు.

## 278 బృహద్రూపః

బృహత్ = పెద్ద; రూపః = రూపము కలవాడు. (విశ్వరూపుడు.)

## 279 శిపివిష్టః

1 శిపి+విష్టః; "శిపి" కాష్ఠముల యందు అగ్ని రూపమున అంతర్యామిగా; "విష్టః"=ఉన్నవాడు.

2 "శిపి" = పశువులు. వానియందు అంతరాత్మరూపుడుగా (ఆ) విష్టుడు = ప్రవేశించి ఉండువాడు. "శిపివిష్టః తతః ప్రోక్తః సర్వాంతర్యామి సంజ్ఞయా", "యజ్ఞో వై విష్ణుః, పశవః శిపిర్యజ్ఞ ఏవ పశుషు ప్రతితిష్ఠతి" అను స్మృతి శ్రుతి వాక్యములు ఇందుకు ప్రమాణములు.

"శిపి విష్టేషు చాఖ్యాయాం హీనరోచో మో భవేత్।
తేనావిష్టం చ యత్కించిత్ శిపివిష్టేషు చ స్మృతః॥
యాస్కో మాం ఋషి రవ్యగ్రః
నైక యజ్ఞేషు గీతవాన్।
శిపివిష్ట ఇతి హ్యస్మాత్
గుహ్యానామ ధరో హ్యహమ్॥
స్తుత్వామాం శిపివిష్టేతి
యాస్కో ఋషి రుదారధీః।
మత్ప్రసాదా దధో నష్టం
నిరుక్త మభిజగ్మివాన్॥
ఇతి మోక్ష ధర్మేనారాయణీయే"
(జీవులయందు ఆత్మరూపమున నుండువాడు.)

3 శిపి = కిరణములు, వానియందు "విష్ట" = ప్రవేశించి ఉండువాడు.

"శిపయో రశ్మయో మతాః
తేషు ప్రవేశాత్ విశ్లేశః శిపివిష్ట ఇహోచ్యతే"

అను వాక్యము ఇందుకు ప్రమాణము. సూర్యమండల మధ్యవర్తి.)

## 280 ప్రకాశనః

1 భక్తులను ప్రకాశింపజేయువాడు కావున ప్రకాశనుడు.

2 ప్ర+క+అశనః; "ప్ర" = ప్రకర్షమైన; "క" = సుఖమును; "అశనః" = ఆహారముగా గ్రహించువాడు. (ఆనంద స్వరూపుడు.)

3 ప్రకాశ+నః = సూర్యాది ప్రకాశమును నడిపించువాడు.

శ్లో॥ ఓజస్తేజో ద్యుతిధరః ప్రకాశాత్మా ప్రతాపనః,
బుద్ధః స్పష్టాక్షరో మంత్ర శ్చందాంశు ర్భాస్కరద్యుతిః॥ 30

## 281 ఓజస్తేజోద్యుతిధరః

ఓజస్సును, తేజస్సును, ద్యుతిని ధరించువాడు. ఓజస్సు అనగా పదార్థావష్టంభన శక్తి. తేజస్సు అనగా ప్రతాపము. ద్యుతి అనగా ప్రకాశము.

## 282 ప్రకాశాత్మా

1 ప్రకాశ స్వరూపము కలవాడు.

2 ప్ర+క+అశ్+ఆత్మా; "ప్ర"=మిక్కిలి; "కమ్"=సుఖమును; "అశ్"=అనుభవించువాడు ప్రకాశః; "ఆత్మా"=ఆదేయమును (స్వీకరింపదగిన భక్తులను) గూర్చి; "యాతి"=వెళ్ళువాడు. ప్రకాశుడును ఆత్మయును అయినవాడు. (మిక్కిలి సుఖము ననుభవించువాడును, భక్తుల నను గ్రహించుటకై వారివద్దకు నడచి వెళ్ళువాడును అని ఈ నామమునకర్థము.)

## 283 ప్రతాపనః

1 ప్ర + తాపనః = ప్రకర్షముగా సూర్యాదుల యందుండి తపింప జేయువాడు.

2 ప్ర + త + ఆప + నః = "ప్ర" = ఎక్కువగా; "త" = వ్యాపించి ఉన్న; "ఆప" = నీటి (సమూహము) ని "నః" = ఆవిరి రూపమున తీసికొని పోవువాడు.

## 284 ఋద్ధః

అభివృద్ధి నందినవాడు.

## 285 స్పష్టాక్షరః

స్పష్ట + అక్షరః; "స్పష్ట" = స్పష్టమైన; "అక్షరః" = వేదశాస్త్రము లందున్న అక్షరములు (వేద ప్రతిపాదకములైన అక్షరములు) కల వాడు. కొందరు ఈ రెండు నామములను కలిపి "ఋద్ధ స్పష్టాక్షరః" అని చదువుదురు. అప్పుడు "ఋద్ధ" = అభివృద్ధిని కల్గించునట్టి, స్పష్ట = స్పష్టమైన, అక్షరః "ఓం నమో నారాయణాయ" అను అష్టాక్షరములు (ఎనిమిది వర్ణములు) తన నామమునందు కలవాడు. "ఋద్ధ స్పష్టాక్షరః ఇతి పాఠేతు అష్ట. ఓం నమో నారాయణాయ ఇత్యేతా న్యక్షరాణి యస్యా సౌ." అను వాక్యమిందుకు ప్రమాణము. బృహతీచ్ఛందస్సు ప్రకారము ఈ రెండు నామములు కలుపబడినవి. ఇంకొందరు "ఋద్ధ స్స్పష్టాక్షరః" అని చదువుదురు. అర్థభేదము లేదు.

## 286 మంత్రః

1 మన్ = మననము చేత; "త్రః" = రక్షించువాడు.

2 "మాననాత్ త్రాతీతి మన్త్రోయ మితి కథ్యతే" (మననము వలన రక్షించునది) అను గీతా తాత్పర్యోక్తి ఇందుకు ప్రమాణము.

3 మననము చేయించు వాడు.

## 287 చంద్రాంశుః

1 చంద్ర=చంద్రునకు "అంశు"=కిరణములు ఎవనినుండి వచ్చినవో అతడు. (చంద్రునకు తేజస్సు నిచ్చినవాడు.)

శ్లో॥ యదాదిత్య గతం తేజో జగ ద్భాసయతే ఖిలమ్
యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్.
గీత-15-12 అను వాక్య మిందుకు ప్రమాణము.

2 తాపముచేత ఆర్తులైన వారికి చంద్ర = చంద్రుని, అంశు = కిరణములవలె ఆహ్లాదము కల్గించువాడు. (ఆర్త శీతలుడు.)

## 288 భాస్కరద్యుతిః

భాస్కర = సూర్యునకు; ద్యుతిః=కాంతి ఎవనివలన వచ్చినదో అతడు.

శ్లో॥ అమృతాంశూద్భవో భానుః శశబిందు స్సురేశ్వరః।
ఔషధం జగతస్సేతుః సత్యధర్మపరాక్రమః॥ 31

## 289 అమృతాం శూద్భవః

1 అమృతాంశు+ఉద్భవః; "అమృత" = అమృత మయములైన "అంశు"=కిరణములు కలవాడు. (ధన్వంతరి మొదలగు రూపములు కలవాడు.) ఉత్ +భవః సంసారము నుండిగాని, ఉత్పత్తి నుండి గాని వెలువడినవాడు = ఉద్భవః; లేక "భవః"=రుద్రదేవుడు. ఇన్ద్రియాదిభ్యః = ఇంద్రియాదుల కంటె "ఉత్" = ఉత్కృష్టుడుగా ఎవరిచే నుద్ధరింపబడెనో అతడు ఉద్భవుడు. (అమృతాంశుడును రుద్రుని ఉద్ధరించిన వాడును అమృతాంశూద్భవుడు.)

2 అమృతాంశు=అమృతాంశుడగు చంద్రుని యొక్క; "ఉద్భవః" =

## 290 భానుః

ప్రకాశించువాడు.

## 291 శశబిందుః

1 "జ్ఞాన జ్ఞానః సుఖ సుఖః" అను శ్రుతివాక్యము వలన అత్యంత సుఖరూపుడు = శశుడు. "వ బయో ర భేదః" అను న్యాయము వలన విందుః, అనునదే బిందుః = జ్ఞాని. శశుడును, బిందుడును అయిన వాడు. (అత్యంత సుఖరూపుడైన జ్ఞాని అని అర్థము.)

2 వేటయందు "శశ" = కుందేలు యొక్క; "బిందుః" = గుర్తు (చిహ్నము) కలవాడు.

## 292 సురేశ్వరః

1 సుర + ఈశ్వరః; "సు" = బాగుగా; "ర" = ప్రకాశించు వాడు = సురః (దేవత). "ఈశ్వరః" = (అశ్నుతే) = జగత్తును అనుభవించువాడు. సురుడును, ఈశ్వరుడును అయినవాడు. (భాస్వరుడై జగత్తు ననుభవించువాడు.)

2 సురాణా మీశ్వరః = దేవతలకు ప్రభువు.

## 293 ఔషధమ్

ఉష్ట = తాపత్రయముచే దగ్ధమైన వారికి ఆశ్రియ మగుట వలన ఔషధమ్. "ఉష్టానాం నిధి రౌషధమ్" అను గీతా తాత్పర్యోక్తి ఇందుకు ప్రమాణము.

## 294 జగతస్సేతుః

1 జగత్తునకు సేతువు (వంతెన) వంటివాడు. (సంసార సాగరమును దాటింప జేయువాడని భావము.)

2 జగత్తు నుండి జీవుల ఉద్ధరణకు కారణభూతుడు.

## 295 సత్యధర్మపరాక్రమః

1 సత్య + ధర్మ + పరాక్ + రమః

సత్య = వ్యక్తా వ్యక్త రూప జగత్తునకు ఆశ్రియ మగునది.
" నోక్త పూర్వం మయా క్షుద్రి మలీకం వా కదాచన।
ఋతా బ్రహ్మసుతా సా మే సత్యా దేవీ సరస్వతీ॥
సచ్చా సచ్చ కౌంతేయ మాయ్యావేశిత ఆత్మని॥
పౌష్కరే బ్రహ్మసదనే సత్యం మా మృషయోవిదుః॥"
అను మోక్ష ధర్మోక్తి వాక్యము ఇందుకు ప్రమాణము.
ధరించునది కనుక ధర్మము. "పరాక్ రమతే" = సర్వత్రి విహరించు వాడుకనుక పరాక్రిముడు. సత్యము చేతను, ధర్మము చేతను పరాక్రమించువాడు. సత్యధర్మపరాక్రిముడు.

2 సత్య = నిజమైన; ధర్మ పరాక్రమః = ధర్మాచరణమునందు పరాక్రిమము కలవాడు.

శ్లో॥ భూత భవ్య భవన్నాథః పవనః పావనోఽనలః
కామహా కామకృ త్కాంతః కామఃకామప్రిదః ప్రిభుః॥ 32

## 296 భూత భవ్య భవన్నాథః

భూత + భవ్య + అభ + వన + నాథః

1 భూత = భూమియందు ఊతములైనవి (వ్యాపించినవి) భూతములు. భవిన్ = సంసారము కలవారు- భవ్యులు. అభవన్ = జ్ఞాన శూన్యులైన భక్తులు; భూత భవ్య భవన్ (భూతములు, సంసారులు, జ్ఞాన శూన్యులైన భక్తులు.) వారికి నాథుడు = భూత భవ్య భవన్నాథుడు. "వన = సంభక్తౌ" అను ధాతువు వలన ఈ అర్థము వచ్చినది. (సకల జీవులకును సంప్రార్థనీయుడు.)

2 భూత భవ్యభవనుల చేత = భూతముల చేత, సంసారులచేత, అజ్ఞానుల చేత, "నాథ్యతే" = ప్రార్థింప బడువాడు. "నాథృ = యాచ్ఞోపతాపై శ్వర్యాశీష్షు" అను ధాతువు వలన ఈ అర్థము వచ్చినది. (జీవప్రార్థ్యుడు.)

## 297 పవనః

ప + వనః; "ప" = రక్షించు రాజులు. వారిని "వనః" = (వనతి) భాగ్యము మొదలగునవి ఇచ్చి రక్షించువాడు. (పోషించువాడు.) (రాజపోషకుడు.)

## 298 పావనః

1 పవిత్రము చేయువాడు.

2 ప + అవనః; "ప" = రాజులు; వారికి ఎవని వలన రక్షణ కలుగునో అతడు. (రాజరక్షకుడు.)

## 299 అనలః

1 అ + అలః = "అలమ్" = వారణము, ఆపు, అడ్డు మొదలగునవి "అ" = లేనివాడు. (అనివార్యుడు.)

2 "అనం" = ముఖ్యప్రాణుని (వాయుదేవుని) "లాతి" = భర్తనిగా స్వీకరించువాడు. "లా = ఆదానే" అను ధాతువు వలన ఈ అర్థము వచ్చినది. (వాయుదేవుని భర్తనిగా గ్రహించినవాడు.)

3 అ + అలమ్ = జగత్తును సృష్టించు విషయమున "భూత సృష్టి చాలును" అను ఆలోచన లేనివాడు.

## 300 కామహా

1 కామ = కోరికను; "హా" = చంపువాడు.

2 కు + ఆమ + హా = కుసుల యొక్క (కుసినః = వడ్డీపై డబ్బును అప్పిచ్చు వారియొక్క) ధనకాంక్ష అను "ఆమః" = రోగము = (కామము) దానిని హా = చంపువాడు. (పేరాశకల వారి ధన కాంక్షను నశింపజేయువాడు. కామములను నశింపజేయువాడు.)

## 301 కామకృత్

కామ + కృత్; "కామ" = భక్తులకు ప్రియమగు వానిని "కృత్" = చేయువాడు (నెరవేర్చువాడు.) (భక్తకామదుడు.)

## 302 కాంతః

1 క + అంతః; "క" = బ్రహ్మాది సుఖస్వరూపమును "అంతః" = నిర్ణయించువాడు.

2 దైత్యులయొక్క "క" = సుఖమునకు; "అంతః" = నాశము ఎవని వలననో అతడు. (రాక్షసులకు దుఃఖదాయకుడు.)

3 క = సముద్రోదకమును; "అంతతి" = బంధించువాడు. (అదుపు చేయువాడు.) (సేతుబంధనము చేసిన రాముడు.)

## 303 కామః

1 కామ్యతే జనై రితి = జనులచే కోరబడువాడు.

2 క + అమః; "క" = చతుర్ముఖుడైన బ్రహ్మచేత "అమ్యతే" = చేరబడువాడు.

3) "క" = వాయుదేవుని చేత; "అమ్యతే" = సమీపింపబడువాడు. "స ఏనాన్ గమయతి" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము. (వాయువునకు చేరదగినవాడు.)

"విద్యుత్వ తిర్యాయు రేవ నయేద్ బ్రహ్మా న చాపరః।
కుతోఽన్యస్య భవేచ్ఛక్తిః త మృతే ప్రాణనాయకమ్॥
అను స్మృతి వాక్యము ఇందుకు ప్రమాణము.

## 304 కామప్రదః

కామ + ప్రదః; "కామ" = కోరికలను; "ప్రదః" = ఇచ్చువాడు.

## 305 ప్రభుః

ప్రకర్షముగా నుండువాడు.

శ్లో॥ యుగాదికృ ద్యుగావర్తో నైకమాయో మహాశనః।
అదృశ్యోఽవ్యక్తరూపశ్చ సహస్రజి దనంతజిత్॥ 33

## 306 యుగాదికృత్

యుగ + ఆదికృత్; "యుగ" = కృతాది యుగముల కాలములకు ఆది = మొదలును తెలిపి వానిమధ్య భేదమును; కృత్ = కల్గించు వాడు. (యుగములను విభజించి చూపువాడు.)

## 307 యుగావర్తః

"యుగ" = కృతము మొదలగు యుగములను మరల మరల; "ఆవర్తః" = త్రిప్పువాడు.

## 308 నైకమాయః

న + ఏకమాయః; మాయ అనగా కోరిక. అనేకమైన కోరికలు కలవాడు.

## 309 మహాశనః

1 మహత్ = గొప్ప; "అశనః" = భోజనము కలవాడు.

2 "మహాశ" = గొప్ప ఆశగల దుర్వాసునికి అన్నమును, "సః" = ఇచ్చినవాడు.

3 "నన్ను ఉద్దేశించి యజ్ఞము జరుగును గాక" అను యజ్ఞ విషయమున ఆశ గలవాడు = మహాశుడు, అతనిని నడిపించువాడు = మహాశనః.

## 310 అదృశ్యః

కనబడని వాడు.

## 311 అవ్యక్తరూపః

1 అవ్యక్తమైన = స్పష్టముగా తెలియబడని, "రూపః" = రూపము కలవాడు, "తదవ్యక్తమాహా హి" అని బ్రహ్మ సూత్రము లందు చెప్పబడినది.

2 "వ్యక్తరూపః" అనికూడ పాఠము కలదు "వ్యక్తమ్ = బ్రహ్మాండాదికమును, రూపయతి నిర్మించువాడు." ("వ్యక్తం బ్రహ్మాండాదికం రూపయతి నిర్మాతి".)

## 312 సహస్రజిత్

సహస్ర = వేయిమంది రాక్షసులను, "జిత్" = గెలుచువాడు.

## 313 అనంతజిత్

"అనంత" = అనంతములైన వస్తువులను, "జిత్" = పొందువాడు.

శ్లో॥ ఇష్టో విశిష్టః శిష్టేష్టః శిఖండీ నహుషో వృషః।
క్రోధహా క్రోధ కృత్కర్తా విశ్వబాహు ర్మహీధరః॥ 34

## 314 ఇష్టః

1) యజ్ఞముచేత పూజింపబడువాడు.

2 అందరికి ఇష్టమైన వాడు.

## 315 విశిష్టః

1 విశేషముగా ఎవనివలన భక్తు లందరు శాసింపబడుదురో అతడు. (భక్తశాసకుడు.)

2 ప్రళయ కాలమునందు మిగిలియున్న వాడు.

## 316 శిష్టేష్టః

1 శిష్ట = శిష్టులచేత; ఇష్టః = పూజింపబడువాడు.

2 ప్రళయకాలమునందు; శిష్టా = మిగిలిన; ఇష్టా = లక్ష్మీదేవి కల వాడు. (శాశ్వతుడు.)

## 317 శిఖండీ

1 బాల్యము నందు జుట్టుముడిని ధరించినవాడు.

2 శి + ఖండీ; "శి" = సుఖము కలవారిని; "ఖండీ" = ఖండించువాడు.

## 318 నహుషః

"నహ = బంధనే" అను ధాతువు వలన రాక్షసులను బంధించువాడు అని అర్థము.

## 319 వృషః

భక్తులయొక్క ఇష్టమును వర్షించువాడు.

## 320 క్రోధహా

1 క్రోధ = క్రోధ స్వరూపులైన దైత్యులను; "హా" = చంపువాడు.

2 క్షమానిధి అగుటవలన క్రోధమును చంపువాడు.

## 321 క్రోధకృత్

1 అసాధువులయందు కోపము చేయువాడు.

2 క్రోధమును; "కృఞ్ = హింసాయాం" అను ధాతువు నుండి కృణోతి = నాశనము చేయువాడు అని అర్థము.

## 322 కర్తా

స్వతంత్రుడు.

## 323 విశ్వబాహుః

విశ్వ = వాయువునకు కారణీ భూతములైన బాహుః = చేతులు కలవాడు. "సోఽహం వాయుం దిశాం వత్సం" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము. (వాయువును సృష్టించినవాడు.)

## 324 మహీధరః

1 మహీం = భూమిని; "ధరః" = ధరించువాడు. (మహ్యాః ధరః = భూమికి ధారకుడు.)

శ్లో॥ అచ్యుతః ప్రథితః ప్రాణః ప్రాణదో వాసవానుజః।
అపాంనిధి రధిష్ఠాన మప్రమత్తః ప్రతిష్ఠితః॥ 35

## 325 అచ్యుతః

చ్యుతి = నాశము; "న" = లేనివాడు.

## 326 ప్రథితః

ప్రసిద్ధుడు.

## 327 ప్రాణః

1 ప్ర=ప్రకృష్టమైన వారిని (గొప్పవారిని); "ఆ" = బాగుగా; తన లోకమునకు; "నః"=తీసికొనిపోవు వాడు.

2 ప్రి+ఆణా; "ఆణా"=సరస్వతి, ఆమెకంటె, ప్రి= గొప్పవాడు (ప్రకృష్టుడు.)

## 328 ప్రాణదః

1 ప్రాణ+దః=ప్రాణములను ఇచ్చువాడు.

## 329 వాసవానుజః

వాసవ+అనుజః; "వాసవ" = 1 వసువు యొక్క సంతానము 2 వసువు=రత్నములు కలవాడు 3 (దైత్యుల యొక్క) వాస= నివాసమును, వాతి=నాశము చేయువాడు. ఈ మూడు వ్యుత్పత్తు లకు అర్థము=ఇంద్రుడు. వాసవుని అనుజుడు "వాసవానుజః" (ఉపేంద్రుడు=వామనుడు.)

## 330 అపాంనిధిః

"ఆపోవై సర్వా దేవతాః" అను శ్రుతివాక్య ప్రమాణమును బట్టి; అపామ్ = దేవతలకు; నిధిః = ఆశ్రయమైనవాడు.

## 331 అధిష్ఠానమ్

ఇతనియందు ప్రాణులన్నియు అధిష్ఠించి యుండును. (జగన్మూల కారకుడు.)

## 332 అప్రమత్తః

న+ప్రమత్తం=మిక్కిలి మదము కలవాడు ప్రమత్తుడు. ప్రమత్తుడు కానివాడు—(నిత్య జాగరూకుడు.)

## 333 ప్రతిష్ఠితః

ప్రతిష్ఠ కలవాడు.

శ్లో॥ స్కన్దః స్కన్దధరో ధుర్యో వరదో వాయువాహనః।
వాసుదేవో బృహద్భాను రాదిదేవః పురందరః॥ 36

## 334 స్కన్దః

1 స్కన్దనమువలన (సంసార తాపత్రయమును శోషింపజేయుట వలన) స్కన్దుడు. "స్కన్దిర్ = గతిశోషణయోః" అని ధాతువు.

## 335 స్కన్దధరః

కుమారస్వామిని ధరించినవాడు.

## 336 ధుర్యః

బరువును మోయువాడు.

## 337 వరదః

1 వర + దః = మోక్షరూపమైన వరము నిచ్చువాడు.

2 రుద్రుడు మొదలగు వారిచేత ఇవ్వబడిన వరములను; దః (ద్యతి) = ఖండించు వాడు. "దో = అవఖండనే" అని ధాతువు.

3 కొందరు ఈ పదమును "అవరదః" అని చూపుదురు. అవర = భర్తలేనివారు. శూర్పణఖ మొదలగు రాక్షసస్త్రీలు. వారిని "దః" = ముక్కు, చెవులు ఖండింప జేసినవాడు. "దో = అవఖండనే" అను ధాతువునుండి "ద" అను శబ్దమునకీ అర్థము వచ్చెను.

## 338 వాయు వాహనః

1 వాయు + వాహ + నః = "వాయు" = శ్వాసమును: వాహ —

మోయువారు (కల్గించుచుండువారు) వాయువాహులు = జీవులు. వారిని "నః" = నడిపించు వాడు (జీవులను. కర్మాను గుణముగా నడపువాడు.)

2 వాయువు వాహనముగా కలవాడు.

## 339 వాసుదేవః

1 వసుదేవుని యొక్క కుమారుడు.

2 వా = జ్ఞానము; "సు" = జన్మించుట; "దేవః" = క్రీడ; జ్ఞానము, జన్మించుట, క్రీడ అను రూపముల యందుండువాడు.

3 "వాసు" = అన్ని చోట్ల నివసించుటవలన (వాసు) లేక అన్నిటి యందు అధికరణుడుగా నుండువాడు. "దేవః" = కాంతి మంతుడు. వాసుడును, దేవుడును అగువాడు వాసుదేవుడు. "వానాత్ సూత్యే దేవనా ద్వాసు దేవమ్" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము. (సర్వాంతర్యామియై, కాంతిమంతు డగువాడు.)

4 "వస ఆచ్ఛాదనే" అను ధాతువు యొక్క అర్థమునుండి "వాసు" = అవిద్య మొదలగు ఆవరణములు లేనివాడు. "దేవః" = క్రీడించు వాడు. అవిద్యావరణము లేనివాడును, ఎప్పుడును క్రీడించువాడు = వాసుదేవుడు. "వాసాత్ ద్యుతేః ఛాదనాత్ క్రీడయాచ" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము.

5 వ + అసు + ద + వః = "వ" = బలము కలవాడు; "అసు" = ప్రాణములు కలవాడు. వ + అసు = వాసు = బలమును, ప్రాణమును "ద" = ఇచ్చువాడును, "దదాతేరేకారః" కృన్మేజన్త ఇత్యవ్య

యమ్” అను సూత్రము వలన ‘ద’ ‘దే’ గామారినది. వః = అంతట నివసించువాడు.

“బలా దసుత్వాత్ దాత్వతో వర్తనాచ్చ।
తం వాసుదేవం ప్రవదంతి వేదాః॥”

అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము. (బలమును, ప్రాణమును ఇచ్చుచు సర్వప్రాణుల యందు చైతన్య రూపుడుగా ఉండువాడు.)

## 340 బృహద్భానుః

బృహత్ = మిక్కిలి; అనేక; “భానుః” = కిరణములు కలవాడు. (సహస్రకిరణుడు.)

## 341 ఆదిదేవః

అన్నిటికి కారణభూతుడైన దేవుడు.

## 342 పురందరః

పురమ్ = శత్రువును; దరః = చీల్చువాడు.

శ్లో॥ అశోక స్తారణః తారః శూరః శ్శౌరి ర్జనేశ్వరః।
అనుకూల శ్శతావర్తః పద్మీ పద్మ నిభేక్షణః॥

## 343 అశోకః

న + శోకః = శోకము లేనివాడు.

## 344 తారణః

1 తరింపజేయువాడు.

2 తారేణ = తనకు గల ఓంకార రూపముచేత, ణః = సుఖము ఎవని వలన కల్గునో అతడు. (ఓంకార ధ్యానము వలన సుఖము నిచ్చువాడు)

3 తరణునికి = సూర్యునకు సంబంధించిన వాడు. సూర్యమండలమునకు లోపల ఉండుట వలన లేక సూర్య వంశము నందు ఉద్భవించుట వలన ఈ అర్థము వచ్చినది.

## 345 తారః

తరింపజేయువాడు.

## 346 శూరః

1 సంగ్రామమున; శూరయతి = పరాక్రమమును ప్రదర్శించు వాడు, "శూర = విక్రాన్తౌ" అని ధాతువు.

2 శు = సుఖమును; ఊరః = పెంచువాడు.

## 347 శౌరిః

శూరుని వంశము నందు జన్మించిన వాడు.

## 348 జనేశ్వరః

1 జనులకు ఈశ్వరుడు.

2 జ + న + ఈశ్వరః; పుట్టనివాడు "జనః" అతని భార్య "ఈ" అనునది (లక్ష్మి) ఈ + ఈశ్వరః = లక్ష్మికి; ఈశ్వరుడు = జనేశ్వరుడు. (జన్మ లేని వాడును, లక్ష్మిపతియును అయిన వాడు)

## 349 అనుకూలః

భక్తులకు మేలు కల్గించువాడును, గంగ మొదలగు నదుల యొక్క "కూల" = ఒడ్డును అనుసరించి ఉండువాడు. (క్షేత్రములందు

తీర్థములందు నివసించువాడు.)

"జలాశయం సమారభ్య యావత్ హస్త చతుష్టయం।
తావన్నారాయణ క్షేత్రం తత్ర సన్నిహితో హరిః"

అను స్మృతి వాక్యము ఇందుకు ప్రమాణము.
నీటిపట్టులకు 4 మూరల దూరమునందు విష్ణువు నివసించునని ఈ వాక్యమునకు భావము.

## 350 శతావర్తః

1 శత + ఆ + వర్తః; "శత" = అమృతమును గ్రోలుటకు యోగ్యతగల దేవతల సమూహమును; ఆ = అన్ని వైపులనుండి తత్త్వ దేవతాది రూపముతో వర్తః = ప్రవర్తింప చేయువాడు (దేవతా నియామకుడు.)

2 శత = వంద = అనేక; "ఆవర్త" = సుడిగుండములు ఎవని వలననో అతడు. (దుష్టులకు కష్టకారకుడు.)

## 351 పద్మ

1 పద్మము కలవాడు.

2 పద్మ = బ్రహ్మ పుత్రుడుగా కలవాడు.

## 352 పద్మనిభేక్షణః

1 "పద్మ" = పద్మముతో; "నిభ" = సమానమైన; ఈక్షణః = కన్నులు కలవాడు.

2 పద్మ = పద్మములు స్నేహితులుగా కలవాడు (సూర్యుడు.) "ని" (నితరామ్) = మిక్కిలి; "భా" = కాంతి కలవాడు "నిభః" = చంద్రుడు. పద్ముడును, నిభుడును కన్నులుగా కలవాడు. "భాస్వత్ చంద్రమసౌ యదీయ నయనే" అను స్మృతి వాక్యము ఇందుకు ప్రమాణము. (సూర్యచంద్రులే కన్నులుగా కలవాడు.)

శ్లో॥ పద్మనాభోఽరవిందాక్షః పద్మగర్భః శరీరభృత్।
మహర్ధిః ఋద్ధో వృద్ధాత్మా మహాక్షో గరుడధ్వజః ॥ 38

## 353 పద్మనాభః

పద్మ=పద్మములను; "నః"=వికాసమునకు తీసికొని పోవువాడు=సూర్యుడు; అతని యొక్క; "ఆభః"= కాంతివంటి కాంతికలవాడు—పద్మనాభః. (సూర్యునివంటి దివ్యతేజస్సు కలవాడు.)

## 354 అరవిందాక్షః

1 అర=పద్మదళములు. వానిని"విందతి"=పొందునది—అరవిందము—పద్మము. పద్మమువంటి "అక్షిణీ"=కన్నులు కలవాడు.

2 అ+రవిందమ్=రవిందమనగా చీకటి. చీకటి కానిది అరవిందము=ప్రకాశము, జ్ఞానమని అర్థము. ప్రకాశస్వరూపమైన, జ్ఞానస్వరూపమైన; "అక్షులు"=కన్నులు కలవాడు. "అంధకారో రవిందాంధతిమిరం తమ ఉచ్యతే" అను ఉత్పల మాలోక్తి ఇందుకు ప్రమాణము. (జ్ఞానరూపములైన కన్నులు కలవాడు.)

## 355 పద్మగర్భః

1 పద్మము గర్భమునందు కలవాడు.

2 పద్మః=చతుర్ముఖుడు; "గర్భః"=(ప్రళయకాలమునందు) అన్నముగా కలవాడు. (లయకర్త.) "గర్భోపి నరకే అన్నే అగ్నావితి అభిధానమ్" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

## 356 శరీరభృత్

1 శరీర+భృత్=నిత్యము; (ఎల్లప్పుడు) శీర్యతే=నశించునది (శరీ

రము) "శీర్యతే నిత్యమేవ" అను స్మృతి వాక్యము ఇందుకు ప్రమాణము. ఈ అర్థమును బట్టి శరీరమనగా జగత్తు. దానిని భృత్ = భరించువాడు. ( జగద్భర్త.)

2 "శరీ" = అమోఘమైన శరములు కలవాడు; "ఈర" = ప్రేరేపించువాడు; "భృత్" = భరించువాడు. ఈ మూడు పనులు చేయువాడు శరీరభృత్. (రామావతారమున శరమును ధరించినవాడును, జీవులను కర్మాచరణకై ప్రేరేపించు వాడును; శిష్టులను, జగత్తును భరించు వాడును అని ఈ నామమున కర్థము.)

## 357 మహర్ధిః

1 మహా + ఋద్ధిః = గొప్ప అభివృద్ధి కలవాడు.

2 మహ = యజ్ఞాది ఉత్సవములచేత; ఋద్ధిః = అభివృద్ధి కలవాడు.

3 మహ = బలి చక్రవర్తి చేసిన యజ్ఞమునందు ఋద్ధిః = త్రివిక్రమ రూపముతో అభివృద్ధి చెందినవాడు.

## 358 ఋద్ధః

జ్ఞానానందాది గుణములచేత అభివృద్ధి చెందినవాడు.

## 359 వృద్ధాత్మా

1 వృద్ధ = అభివృద్ధి చెందిన; "ఆత్మా" = శరీరము కలవాడు.(విశ్వరూపి.)

2 వృద్ధ = గుణవృద్ధులైన బ్రహ్మ మొదలగు వారికి, ఆత్మా = అంతర్యామి అయినవాడు.

## 360 మహాక్షః

1 మహత్ + అక్షః = పెద్దకన్నులు కలవాడు.

2 మహాన్తి, అక్షాణి = గొప్ప బాణములు కలవాడు.

## 361 గరుడధ్వజః

గరు + డ + ధ్వజః; "గరుడః" = రెక్కలతో "డ" = ఎగురువాడు [గరుత్మంతుడు] లేక సర్పములను మ్రింగువాడు. (గరుడుడు.) అతడు "ధ్వజః" = ధ్వజముగా కలవాడు.

శ్లో॥ అతుల శ్శరభో భీమ స్సమయజ్ఞో హవిర్హరిః।
సర్వలక్షణ లక్షణ్యో లక్ష్మీవాన్ సమితింజయః॥ 39

## 362 అతులః

న + తులః = సాటిలేని వాడు.

## 363 శరభః

1 శర = ప్రళయసముద్రపు నీటియందు; "భః" = ప్రకాశించువాడు. (ప్రళయ పయోధిశాయి.)

2 "శర" = త్రిపురాసురులను సంహరించిన బాణమునందు "భః" = ప్రకాశించువాడు. (త్రిపుర సంహార కాలమున శివునకు బాణమైన వాడు.)

## 364 భీమః

1 మాః = ప్రత్యక్షాది ప్రమాణములు, వ్యాసాది రూపముతో ఎవని చేత "భీ" = భరింపబడినవో అతడు. (వ్యాసునిచే పురాణములందు సప్రమాణముగా నిరూపింపబడిన వాడు.)

2 జనులు ఇతనిని చూచి భయపడుదురు కావున భీముడు. (దుష్టజన భయంకరుడు.]

3 భియమ్ = భక్తులకున్న భయమును; మినాతి = నశింపజేయువాడు.

## 365 సమయజ్ఞః

1 స + మ + యజ్ఞః = "మా" = లక్ష్మితో; "స" = సహితుడు = సమః; యదస్తి = ఏది ఉన్నదో, తత్ జానాతి = దానిని తెలిసికొన్న వాడు = యజ్ఞః; సముడును, యజ్ఞుడును అగువాడు.(లక్ష్మితో కూడిన వాడును, తత్త్వజ్ఞానము కలవాడును–సమయజ్ఞుడు.)

2 "సమ్" = బాగుగా; "అయ" = భక్తుల శుభావహ విధిని "జ్ఞః" = తెలిసికొన్న వాడు. (భక్తులకు మేలు కలిగించు విధిని తెలిసినవాడు.)

3 సమయ + జ్ఞః = సమయ = భక్తులకు అభీష్టములను ఇచ్చు కాలమును, తెలిసికొన్న వాడు.

4 "సమయ" = శాస్త్రములను; "జ్ఞః" = తెలిసికొన్న వాడు.

## 366 హవిర్హరిః

హవిః = ఆహుతులను; హరిః = హరించువాడు.

## 367 సర్వలక్షణ లక్షణ్యః

1 సర్వలక్షణ = జగజ్జన్మ మొదలగు కారణ రూపములైన అన్ని లక్షణముల చేత, "లక్షణ్యః" = గుర్తించుటకు తగినవాడు.

2. అందరియొక్క, లక్షణములు = చిహ్నములు కలవాడు సర్వలక్షణుడు. సర్వలక్షణుడును, లక్షణ్యుడును అగువాడు. (సర్వలక్షణములు కలిగినవాడు. అయినను ప్రత్యేకముగా గుర్తింపదగినవాడు.)

## 368 లక్ష్మీవాన్

1 లక్ష్మీః = భక్తులను చూచునది, లక్షించునది (గుర్తించునది.)

లక్ష్య=(దర్శన అంకనయోః) అను ధాతువును బట్టి ఈ అర్థము వచ్చును. లక్ష్మి కలవాడు=లక్ష్మీవాన్

2 లక్ష్మీవాన్=రమా, సంపత్తిః, శోభా, అస్యాస్తీతి లక్ష్మీవాన్, రమాదేవిని, సంపదను, శోభను కలిగినవాడు.

## 369 సమితిం జయః

"సమితిమ్"=యుద్ధమునందు; "జయః"=గెల్చువాడు.

శ్లో॥ విక్షరో రోహితో మార్గో హేతు ర్దామోదరః సహః।
మహీధరో మహాభాగో వేగవా నమితాశనః॥ 40

## 370 విక్షరః

1 వి+క్షరః=నాశము లేనివాడు

2 వి=ఎక్కువగా; "క్షరః"=భక్తులు అభిలషించిన దానిని దానము చేయువాడు.

## 371 లోహితః

లోహిత=ఎర్రని; వర్ణః=వర్ణము కలవాడు.

## 372 మార్గః

1 మృగాః=శాస్త్రముల ద్వారా వెదకువారు. [ జ్ఞానులు. ] వారికి సంబంధించినవాడును మార్గః ( జ్ఞానులచే వెదుకబడువాడు. )

2 మార్+గ=(లింగ శరీరమును)మారయతి=చంపువాడు "మార" (అపవర్గమునకు) "గః"=చేర్చువాడు (భౌతిక దేహములను నశింప జేయువాడు, భక్తులకు మోక్షము నిచ్చువాడు.)

## 373 హేతుః

జగత్తునకు కారణమైనవాడు.

## 374 దామోదరః

1 దామ + ఉద + రః = దీనియందు ప్రాణులు దమింప జేయబడు చున్నవి. కనుక "దమః" = ప్రళయము. దమమునకు సంబంధించినది దామము = ప్రళయాదికము. ప్రళయాదికమైన ఉదమ్ = నీరు; దామోదము = ప్రళయ సముద్రమునందలి నీరు. దానియందు "రః" = రమించువాడు దామోదరుడు. (ప్రళయ సముద్రజలము నందు పరుండి ఆనందించువాడు.)

2 దమము (ఇంద్రియ నిగ్రహము) అధికముగా కలవారు; దాములు = మునులు. వారిచ్చు "ఉదేన" = అర్ఘ్యాది రూపమున నున్న నీటితో; రమతే = ఆనందించువాడు. (మును లిచ్చిన అర్ఘ్యాదుల వలన ఆనందించువాడు.)

3 దా + ఆమోద + రః; దా = దానము ఇచ్చువారు. వారికి ఆమోదమ్ = సంతోషమును (ఆనందమును) "రః" = ఇచ్చువాడు.

4 దా + ఆమోద + రః (ద్యతి) = ఖండించువాడు(రాక్షసుడు). వారికి అమోదమ్ = దుఃఖమును; "రః" = ఇచ్చువాడు.

5 దామ + ఉదరః. దామ = తాడు; తామర కాడ; "ఉదరః" = ఉదరమునందు కలవాడు.

6 దామ + ఉద్ + అ + రః "ఉద్" = ఉత్కృష్టుడైన; "అః" నారాయణుడు కలవారు, ఉదాః = జీవులు.

"అ ఇత్యుక్తః పరో విష్ణు ర్యేభ్యః ఉచ్చః స ఏవతత్। త ఉదాః

జీవ సంఘాస్సుఃి" అను తైత్తిరీయ భాష్య వాక్యము ఇందుకు ప్రమాణము. దములును, ఉదములును, దామోదములు, వారియందు (ఋషులయందు, జీవులయందు) "రః"=రమించువాడు=దామోదరుడు.

## 375 సహః

అన్నిటిని సహించువాడు.

## 376 మహీధరః

మహీ=భూమిని; "ధరః"=ధరించువాడు.

## 377 మహాభాగః

1. భగమనగా ఐశ్వర్యాది షడ్గుణములు. వానికి ఆధారభూతుడు=భాగుడు. మహాత్ముడైన భాగుడు మహాభాగుడు.

2. మహా+ఆ+భాగః = మహ=యజ్ఞములందు; "ఆ"=మంచి; "భాగః"=హవిర్భాగము కలవాడు.

3. మహా=గొప్ప; "భా"=కాంతికలవాడు; "మహాభగః"=మహాభమైన; అగః=గోవర్ధనము లేక మందర పర్వతము కలవాడు.

## 378 వేగవాన్

గజేంద్రుడు మొదలగు భక్తులను రక్షించుటయందు వేగము కలవాడు.

## 379 అమితాశనః

న+మిత+అశనః=మితముగా భుజింపనివాడు. అమితముగా భుజించు వాడు=అమితాశనుడు.

శ్లో॥ ఉద్భవః క్షోభణో దేవః శ్రీగర్భః పరమేశ్వరః।
కరణం కారణం కర్తా వికర్తా గహనో గుహః॥ 41

## 380 ఉద్భవక్షోభణః

"ఉద్భవ+క్షోభణః" అని రెండు నామములను కలిపినచో ఉద్భవమ్ = జననాది క్లేశమును, క్షోభయతి = నివారించుటచే ఉద్భవ క్షోభణుడు. బృహతీచ్ఛందస్సు నాశ్రయించి ఈ పద సమ్మేళనము చూపబడినది.

శ్రీ సత్యసంధతీర్థులు ఈ నామమును "ఉద్భవః, క్షోభణః" అని రెండు వేరు వేరు నామములుగా చెప్పినారు. అప్పుడు వాని అర్థము ఇట్లుండును :-

## 380 (A) ఉద్భవః

1 భవః = భవము (పుట్టుక) నుండి; ఉత్ = వెలువడిన వాడు. (జన్మము లేనివాడు.)

2 పార్వతి మొదలగు వారికంటె, ఎవనిచేత "భవః" = శివుడు పై స్థానమున ఉంచబడినాడో అతడు.

3 భవాత్ = సంసారము నుండి వెలువడినవాడు.

## 380 (B) క్షోభణః

ప్రకృతి పురుషులను క్షోభింప జేయువాడు.

## 381 దేవః

క్రీడించుట వలనను, స్తుతించుటకు తగినవాడగుట వలనను, చేరదగిన వాడగుట వలనను, = దేవుడు. "దివు = క్రీడా విజిగీషా వ్యవహార

ద్యుతి స్తుతి మోద మద స్వప్న కాంతి గతిషు” అను ధాతువు నుండి ఈ అర్థములు వచ్చినవి. “ద్యోతనాత్ విజయాత్ కాంత్యా! స్తుత్యా వ్యవహృతే రపి గత్యా రత్యా చ దేవాఖ్యమ్”॥ అను ఋగ్భాష్య వాక్యము ఇందుకు ప్రమాణము.

## 382 శ్రీగర్భః

1 శ్రీకి గర్భము ఎవని వలననో అతడు. (లక్ష్మీకారకుడు.)

2 శ్రీదేవియొక్క పుట్టుకకు కారణమైనవాడు.

## 383 పరమేశ్వరః

1 పరమ=పరముడైన [గొప్ప]; ఈశ్వరః=ఈశ్వరుడు.

2 ప+రమేశ్వరః; పః=రక్షించువాడు; రమేశ్వరః=లక్ష్మికి భర్త. రక్షించువాడును. (రక్షించువాడును, రమేశ్వరుడును అగువాడు.)

## 384 కరణమ్

కర=చేతితో; ణమ్=సుఖము లేక బలము కలవాడు. “ణో బలమ్ ణశ్చ నిర్వృతి వాచకః” అను వాక్యము ఇందుకు ప్రమాణము. (బలమును, సుఖమును సృష్టించు వాడు, లేక ఆ రెంటిని కరతలామలకము గావించుకొన్న వాడు.)

## 385 కారణమ్

1 జగత్తు ఇతని చేత నిర్మింప బడుచున్నది కనుక కారణుడు.

2 క+అరణమ్; “కమ్”=నీరు; అరణమ్=ఆశ్రయముగా కలవాడు.

3 క=వాయువునకు; బ్రహ్మకు; “అరణమ్”=ఆశ్రయమైన వాడు

## 386 కర్తా

1 అన్నిటిని చేయువాడు.

2 బంధములను ఛేదించువాడు. "కృతీ=ఛేదనే" అను ధాతువు నుండి ఈ అర్థము వచ్చినది.

## 387 వికర్తా

1 వివిధములైన పనులను చేయువాడు.

2 తనకు వేరొక కర్త లేనివాడు.

## 388 గహనః

తెలిసికొనుటకు వీలు లేనివాడు.

## 389 గుహః

స్వరూపమును దాచి లేక కప్పి ఉంచువాడు. "గుహూ=సంవరణే" అను ధాతువు నుండి ఈ అర్థము వచ్చినది.

శ్లో॥ వ్యవసాయో వ్యవస్థానః సంస్థానః స్థానదో ధ్రువః।
పరర్ధిః పరమస్పష్టః తుష్టః పుష్టః శుభేక్షణః॥ 42

## 390 వ్యవసాయః

నిశ్చయము కలవాడు లేక నిశ్చయ రూపమైన వాడు.

## 391 వ్యవస్థానః

1 వి=వివిధములైన; అవస్థా=జాగ్రత్, స్వప్న, సుషుప్త్యాదులకు; నః= (జీవులను) తీసికొని పోవువాడు.

2 రాక్షసులను గూర్చి (వి=) వ్యతిరేకముగా; అవస్థానః=ఉండు వాడు. (రాక్షస నాశనమునకు నిర్ణయించు కొన్నవాడు.)

3 దేవతలను గూర్చి పరమాత్మగా, (వి=) విశిష్టమైన అవస్థానము (స్థితి) కలవాడు. (దేవతల ననుగ్రహింపబూనువాడు.)

## 392 సంస్థానః

సంస్థా+అనః; "సంస్థా"="సమ్=" బాగుగా; తిష్ఠంతి=ఉండు వారు సంస్థాః; "అను" నకు సంబంధించిన వారు "ఆనులు."సంస్థులు ఎవనివలన ప్రాణమును కల్గియుందురో (ఆనాః) అతడు సంస్థానః (భక్తులకు ప్రాణభూతుడు.)

## 393 స్థానదః

1 స్థాన+దః భక్తులకు వైకుంఠాది స్థానముల నిచ్చువాడు.

2 స్థాన=అయోగ్యుల యొక్క స్థానమును; దః [ద్యతి]=ఖండించు వాడు అని భావము; "దో=అవఖండనే" అని ధాతువు.

## 394 ధ్రువః

1 ఉత్తానపాదుని కుమారుడును భక్తాగ్రేసరుడును అగు ధ్రువునికి స్థానభూతమైన ఆకాశమండలము నందు శింశుమార రూపమున ఉండి, ధ్రువునిచే ఉపాసింప బడుచుండుట వలన ధ్రువుడు. భాగ వతము నందలి, పంచమ స్కంధము నందలి ఇరువది మూడవ అధ్యాయము ఇందుకు ప్రమాణము.

2 స్థిరముగ, నిశ్చలముగ నుండుట వలన ధ్రువుడు.

## 395 పరర్ధిః

పర = ఇతరులకు; ఋద్ధిః = అభివృద్ధి ఎవని వలననో అతడు.

## 326 పరమః

పరమ్ = తనను (తన ఆత్మను)
"పరత్వేన" = జననమరణాది దోష రహితునిగ "మన్యతే ఇతి" = తలంచును గావున = పరముడు.
"మన = అవబోధనే" అను ధాతువు వలన ఈ అర్థము వచ్చినది.

## 397 స్పష్టః

పూర్వము అస్పష్టునిగ నుండినను, యజ్ఞ గృహములందు సోమ రసమును స్వీకరించుట కొరకు స్పష్టుడు అగుటవలన స్పష్టుడు.
శ్రీ సత్యసంధ తీర్థుల వారు ఈ నామమును తరువాతి నామముతో కలిపి "పరమ స్పష్టః" అని అర్థము చెప్పినారు.

## 397 పరమస్పష్టః (A)

1 పరమః = పరముడును; అస్పష్టః = అవ్యక్తుడును అగువాడు.
2 పరమేణ = తనచేతనే; స్పష్టః = స్పష్టమగువాడు (స్వయం వ్యక్తుడు అని భావము.)

## 398 తుష్టః

భక్తులు చేసిన సేవతో సంతోష పడువాడు.

## 399 పుష్టః

జీవులను పోషించువాడు. పుష = పుష్టౌ అని ధాతువు.

## 400 శుభేక్షణః

1 శుభ = శుభమైన; ఈక్షణః = చూపులు కలవాడు.

2 పనిచేయునప్పుడును, కర్మఫలమును అనుభవించునప్పుడు కూడ శుభమైన ఈక్షణములు కలవాడు.

శ్లో॥ రామో విరామో విరజో మార్గో నేయో నయోఽనయః।
వీరః శక్తిమతాం శ్రేష్ఠో ధర్మో ధర్మవిదుత్తమః॥ 43

## 401 రామః

1 రమ = లక్ష్మియొక్క భర్త కనుక-రాముడు.

2 యోగులు ఇతనియందు రమింతురు కనుక = రాముడు.

3 రః + అమః = రః = రమించువాడు. (ఆనందించువాడు.)

మా = మితిః = ప్రమాణము; న విద్యతే మా యస్య సః = "అమః" మితిలేనివాడు. (కొలత లేనివాడు.)

రశ్చాసౌ అమశ్చ = (ఆనందస్వరూపుడును, పరిమితి లేనివాడును కనుక — రాముడు.

4 ఆనందరూపుడును, పూర్ణుడును, లోకరమణుడును అగుటవలన రాముడు.

"ఆనంద రూపో నిష్పరిమాణ ఏష లోక శ్చైతస్మా ద్రమతే తేన రామః" ఇతి శాండిల్య శాఖాయామ్ అను గీతా భాష్యోక్తి ఇందుకు ప్రమాణము.

## 402 విరామః

1 వి = విశిష్టురాలైన; రామా = లక్ష్మి కలవాడు.

2 వి = వివిధములైన (అనేక సంఖ్యలో నున్న); రామాః = గోపికాది స్త్రీలు కలవాడు. (కృష్ణుడు.)

3 ప్రళయ కాలమునందు జనులను విరమింప జేయువాడు = చంపువాడు.

## 403 విరజః

1 రజోగుణమును, దానిద్వారా సూచితములగు సత్త్వ తమస్సులును లేనివాడు విరజుడు.

2 రజః = రజోగుణదోషము; "వి" = ఎవని నుండి తొలగి పోయినదో అతడు. (రజోగుణ రహితుడు.) "విరజానది" అను ప్రయోగమును; "రజంతు రజసా సహ" అను కోశమును, ; "విరజో బ్రహ్మలోకః" అను శ్రుతియును. "రజ" శబ్దము అకారాంతమనుటకు ప్రమాణములు.

## 404 మార్గః

మృగమునకు సంబంధించినది మార్గము = సింహ ముఖము. ఆ ముఖము కలవాడు మార్గుడు. (నరసింహుడు.)

## 405 నేయః

ఉపదేశరూపమున శిష్యులవద్దకు తీసికొని పోవుటకు తగినవాడు.

## 406 నయః

న + యః తానే ఉత్తము డగుట వలన మరియుక చోటికి పోవలసిన పని లేనివాడు.

## 407 అనయః

"అన" = వాయువును భూమిమీదికి; "యః" = ప్రాప్తింప జేయువాడు. (పొందించువాడు.) (వాయుసంచాలకుడు.)

## 408 వీరః

వీ+రః; "వీమ్" = జ్ఞానము చేత; "రః" = రమించువాడు. (ఆనందించువాడు.) "వీ = గతి వ్యాప్తి ప్రజనకాంతి అసన ఖాదనేషు" అను ధాతువ్యాఖ్యానము ఇందుకు ప్రమాణము.

వీరః = పరాక్రమవంతుడు.

అజ+రః = వీ+రః = విశేషముగా పరాక్రమించువాడు. (నడచువాడు లేక ఉంచువాడు.) వీరుడు, "అజ" ధాతువునకు "వీ" అనునది ఆదేశము కాగా దానిమీద "రక్" అను ప్రత్యయము చేరి ఈ రూప మేర్పడినది.

## 409 శక్తిమతాంశ్రేష్ఠః

మిక్కిలి శక్తిమంతుడు.

## 410 ధర్మః

ధరించువాడు.

ప్రాప్యుడు, (పొందదగినవాడు).
ధర్మగుణము కలవాడు.

## 410 (A) ధర్మవిత్

ధర్మ+విత్, ధర్మం = ధర్మమును; విత్ = పొందింపజేయువాడు.

## (410 B) ఉత్తమః

వరమైశ్వర్య సంపదచే మిక్కిలి ఉత్కృష్టుడగుట వలన = ఉత్తముడు.

## 411 ధర్మవిదుత్తమః

1 ధర్మమును తెలిసినవాడు = ధర్మవిత్; వారిలో ఉత్తముడు = ధర్మ విదుత్తముడు.

2 " ధర్మాః " = ధర్మము కలవారు; " విదుత్తమాః " = జ్ఞానులు (యస్మాత్ సః) = ధర్మము కలవారు, ఎవరివలన [ధర్మజ్ఞులు] జ్ఞానులగుదురో అతడు.

శ్లో॥ వైకుంఠః పురుషః ప్రాణః ప్రాణదః ప్రణవః పృథుః।
హిరణ్యగర్భ శ్శత్రుఘ్నో వ్యాప్తో వాయు రధోక్షజః॥ 44

## 412 వైకుంఠః

1 వికుంఠ యొక్క సంతానము.

2 వైకుంఠ లోకమునం దుండువాడు.

## 413 పురుషః

1 పుర + సః = "పురా" = అందరికన్న ముందుగనే; సః = సదనాత్ (అన్నిదోషములను) నశింపజేయుటవలన పురుషుడు. (సర్వదోష నాశకుడు.)

2 "పురి" = శరీరమునందు; శయనాత్ = పరుండి ఉండుట వలన = పురుషః. "సర్వాసు పూర్షు పురి శయః" అను శ్రుతివాక్యము, "పురుసంజ్ఞే శరీరేఽస్మిన్ శయనాత్ పురుషో హరిః। శకారస్య షకారోయం వ్యత్యయేన ప్రయుజ్యతే॥ భగవానితి శబ్దోఽయం తథా పురుష ఇత్యపి। నిరుపాధీ చ వర్తేతే వాసుదేవే సనాతనే॥" అను స్మృతి వాక్యమును, ఇందుకు ప్రమాణము. (శరీరమునందు పరుండి ఉండు వాడు.)

3 పూర్ణుడును, పాలకుడును అగువాడు పురుషుడు. "పూ = పాలన పూరణయోః" అను ధాతువునుండి ఈ అర్థము వచ్చును.)

## 414 ప్రాణః

1 ప్ర + ఆణః = "ఆణా" = సరస్వతి లేక జ్ఞానము కలవారు ఆణాః = ముక్తులు. వారికంటె "ప్ర" = ప్రకృష్టుడు [గొప్పవాడు] = ప్రాణుడు.

2 ప్ర + అణః = "ప్రి" = ప్రకృష్టమైన నామమునందు అణః = చేష్టించువాడు = ఉండువాడు. (దైవనామములకు శక్తి నిచ్చినవాడు లేక ప్రకృష్టమైన నామములు కలవాడు.)

3 ప్రకర్షేణ సర్వాన్నయతీతి = ప్రాణః = ప్రకర్షముగా అందఱను నడపువాడు. ఐతరేయోపనిషత్ నందు "ప్రాణోఽహమస్మి ఋషే" అని ('నేను ప్రాణుడనని' చెప్పుట చేత ప్రాణశబ్ద వాచ్యుడు హరి.)

## 415 ప్రాణదః

1 ప్ర + అణ + దః = "ణః" = సుఖము; అణః = సుఖము కానిది దుఃఖము. ఆ దుఃఖమును "ప్ర" = బాగుగా దః = ఖండించువాడు. "ప్రకృష్టానాం చ నాయకః, ప్రాణనామా ణ ఇత్యేవ హ్యానందః సముదీరితః। ఆణా సరస్వతీ ప్రోక్తా తత్ ప్రకృష్ట సుఖత్వతః॥" అను ఛాందోగ్య భాష్యోక్తి ఇందుకు ప్రమాణము.

2 ప్రాణమనగా వాయువు. భక్తులకు గురువుగా ప్రాణమ్ = వాయువును. దః = ఇచ్చువాడు.

## 416 ప్రణవః

1 ప్రకర్షముగా "నయతి" = స్తుతింప బడువాడు "ణు = స్తుతౌ" అను ధాతువునుండి ఈ అర్థము వచ్చినది..

2 తనను తానే "ప్రణౌతి" = స్తోత్రము చేసికొనువాడు. "వేదస్థః ప్రణవాఖ్యోఽసౌ వాత్మానం ప్రణవో హ్యాతః" అను గీతా తాత్పర్య వాక్యము ఇందుకు ప్రమాణము. (వేదము

తానే కనుక అందలి మంత్రములద్వారా తనను తానే స్తోత్రము చేసికొనువా డని భావము.)

3 ప్ర = మిక్కిలి; నవః = నూతనమైనవాడు.

4 ప్ర = మిక్కిలి; నవః = నమస్కరింపబడదగినవాడు "ప్రణమంతీహ యం వేదాః తస్మాత్ ప్రణవ ఉచ్యతే" అను సనత్కుమార వచనము ఇందుకు ప్రమాణము.

## 417 పృథుః

ప్రఖ్యాతమైనవాడు లేక ప్రసిద్ధి కన్నవాడు. "ప్రథ = ప్రఖ్యానే" అను ధాతువునుండి ఈ అర్థము వచ్చినది.

## 418 హిరణ్యగర్భః

హిరణ్యమ్ = హిరణ్య రూపమగు బ్రహ్మాండము గర్భః = గర్భము నందు కలవాడు.

## 419 శత్రుఘ్నః

శత్రువులను చంపువాడు.

## 420 వ్యాప్తః

1 వి + ఆప్తః = వి = విశిష్టులగు దేవతలకు బ్రహ్మాదులకును; ఆప్తః = అభిమతుడు.

2 వి = గరుడుడు. అతనిని; "ఆప్తః" = పొందినవాడు. (గరుడుని వాహనముగా గ్రహించినవాడు.)

## 421 వాయుః

1 వ+ఆయుః="వ" = బల వాచకమగు శబ్దము. "ఆయుః" = నడచు వాడు. బలవంతుడును; సర్వత్ర నడచు వాడును అగుటవలన వాయువు.

2 వ = నడచువాడును; ఆయుః = ప్రాణధారణకు కారణభూతుడైన వాడును = వాయువు.

3 గత్యర్థ ధాతువులు, జ్ఞానార్థకములు కూడ అగుట వలన "వాతి" = తెలిసికొనువాడు కనుక వాయువు.

4 "వృఞ = వరించుట" అను ధాతువునుండి వృణోతి = భక్తులను వరించువాడు; "వ్రియతే" = భక్తులచే వరింపబడు వాడు కనుక వాయువు.

5 వాంతి = జీవులు ఇతనియందు ప్రవర్తించుదురుగాన "వాయుః".

6 వయ+ఉ = శ్రేష్ఠుడు కావున వాయువు. (వయ = శ్రేష్ఠత్వే అని ధాతువు.)

7 బంధించువాడు వాయువు. "వయ = బంధనే" అను ధాతువునుండి ఈ అర్థము వచ్చినది.

8 సంసారమునుండి ఇతనిచేత జీవుడు "వ్యయతే" = నశింపజేయ బడు చున్నాడు. "బలత్వా దయ నాచ్చైవ వాయురిత్యభి ధీయతే, వాత్యాయురితి వా జ్ఞానాద్వరణా ద్వాశయ త్వతః॥ వయ బంధన ఇత్యస్మాత్ సంసారా దేర్వ్యయా దపి। వేత్యస్మి న్నితి వా వాయు ర్వాయుః శ్రేష్ఠత్వ ఇత్యపి॥" అను ఋగ్భాష్య వాక్యము ఇందుకు ప్రమాణము. (దుష్టులైన జీవులను నశింప జేయువాడు.)

## 422 అధోక్షజః

1 అధః+అక్ష+జః; "అక్ష" ...

అధః = క్రిందుగా కలవాడు (అక్ష కుమారుని చంపినవాడు) = హనుమంతుడు. అతనిచేత "జాయతే" = వ్యజ్యతే (ప్రకటింపబడు వాడు); తెలిసికొన దగిన వాడు. (హనుమంతునకు అంశ అయినవాడు.)

2 అధోక్ష = ఇంద్రియ నిగ్రహవంతులైన వసుదేవాదులు. వారి నుండి "జః" = పుట్టినవాడు.

3 ప్రత్యక్షమును అధః కరించినవాడు = అధోక్షజుడు. (ప్రత్యక్ష ప్రమాణమునకు అందనివాడు.)

శ్లో॥ ఋతు స్సుదర్శనః కాలః పరమేష్ఠీ పరిగ్రహః ।
ఉగ్ర స్సంవత్సరో దక్షో విశ్రామో విశ్వదక్షిణః॥ 45

## 423 ఋతుః

1 ఋ + తుః = మోక్షసాధకుడు. "ఋ = గతౌ" అను ధాతువునకు "తు" ప్రత్యయమును చేర్చుటచే ఈ రూపము ఏర్పడినది.

2 స్వస్వరూపమును అర్పించువాడు లేక తెలియ జేయువాడు.

## 424 సుదర్శనః

1 సుదర్శనము అను పేరుగల చక్రము కలవాడు.

2 ఎవని వలన "సు" = మంచి దర్శనము కల్గునో అతడు.

3 ఎవని దర్శనము "సు" = శోభన కరమైనదో అతడు.

4 సు = బాగుగా; దర్శనః = చూడబడువాడు.

## 425 కాలః

1 కాలః = కాలుడు.

2 జగత్తును బంధించుట వలన, ఛేదించుట వలన, జ్ఞానమువలన (తెలిసికొనుట వలన) = కాలః "కల = బంధనే, ఛేదనే, జ్ఞానే కామధేనౌ" అను ధాతువునుండి ఈ అర్థములు వచ్చును.

3 క+అలః; "క" = సుఖమును; అలయతి = వారివారి యోగ్యతకు తగిన విధముగా పర్యాప్తము చేయువాడు. (అధిక ఫలమును లేక చాలినంత ఫలమును భక్తుల అర్హతలనుబట్టి ఇచ్చువాడు.)

4 క+ఆ+లః; "క"=సుఖమును; "ఆ"=పూర్తిగా లేక బాగుగా; లాతి = తెచ్చువాడు. "అల=భూషణ పర్యాప్తి వారణేషు" అను ధాతువును బట్టి ఈ అర్థము వచ్చును.

## 426 పరమేష్ఠీ

పరమే + ష్ఠీ; "పరమే" = హృదయాకాశమునందు; తిష్ఠతి = ఉండువాడు.

## 427 పరిగ్రహః

పరి+గ్రహః; పరితః = హరి భక్తులను; గృహ్ణాతి = అనుగ్రహించువాడు.

## 428 ఉగ్రః

1 ఉ+గ్రః = "ఉం" = రుద్రుని; "గ్రః" (గ్రసతి) = మ్రింగువాడు.

2 ఉగ్ (ఉచ్చాన్) = బ్రహ్మ మొదలగు వారిని; రః = [రమయతి] = సంతస పరచువాడు.

3 "ఉచ = సమవాయే" అను ధాతువును బట్టి "ఉచతి" = సంపూర్ణుడు. (ఉగ్రః)

## 429 సంవత్సరః

1 సమ్ + వత్స + రః; "సమ్" = బాగుగా; "వత్స" = తనకు వత్సలైన బ్రహ్మ మొదలగు వారిని "రః" [రమయతి] = ఆనందపరచువాడు.

2 వత్స = దూడలయందు కృష్ణరూపముతో; సమ్ = బాగుగా; రమతే = క్రీడించువాడు.

3 సంవత్ + సరః; సంవత్ = మేలైన; సరః = స్వామి పుష్కరిణి మొదలగు స్థానములు కలవాడు. (పుష్కరిణులయం దుండువాడు.)

4 సంవత్సరమును ప్రవర్తింప జేయువాడు.

## 430 దక్షః

ద + క్షః; "ద" = జనులను బాగుగా ఖండించువారు రాక్షసులు. వారికి ఎవరివలన "క్షమ్" = క్షయము కలుగునో అతడు.

## 431 విశ్రామః

1 వి + శ్రామః = శ్రమ లేనివాడు.

2 శ్రమలయొక్క సమూహము "శ్రామము". (భక్తుల యొక్క శ్రామము ఎవనివలన) వి = తొలగునో అతడు. (భక్తుల శ్రమలను తొలగించువాడు.)

## 432 విశ్వదక్షిణః

1 విశ్వ + దక్షిణః, విశ్వ = జగత్సృష్టి మొదలగు కార్యములందు; దక్షిణః = కుశలుడైనవాడు.

2 విశ్వ = వాయువు ఎవని అనుగ్రహమువలన దక్షిణుడో = సముడో

అతడు. (వాయువునకు కూడ దక్షిణత్వమును (సమత్వమును) ప్రసాదించినవాడు.)

శ్లో॥ విస్తార స్థ్సావర స్థ్సాణుః ప్రమాణం బీజ మవ్యయమ్ ।
అర్థోఽ నర్థో మహాకోశో మహాభోగో మహాధనః ॥ 46

## 433 విస్తారః

లోకములు ఇతనిచేత విస్తరింపజేయబడు చున్నవి.

## 434 స్థావరః

1 స్థాః = సత్య లోకాదులందున్న దేవతలు ఎవనికంటె; అవరాః = తక్కువ వారో అతడు. (బ్రహ్మాదుల కంటె ఉత్తముడు; దేవదేవుడు.)

2 కదలక నిల్చియుండు వాడు. (స్థావరరూపుడు.)

## 435 స్థాణుః

రుద్రునికి అంతర్యామిగ నుండువాడు.

## 436 ప్రమాణమ్

1 ప్ర = ప్రకృష్టమైన; మానమ్ = వేదాది ప్రమాణము లెవని యందున్నవో అతడు. (వేదవేద్యుడు.)

2 త్రివిక్రమాది రూపముతో; ప్రి = ప్రకృష్టమైన; "మానమ్" = శరీరాది ప్రమాణము (శరీరముతో లోకములను కొలుచుట) కలవాడు. ("ఇంతింతై వటుడింతయై" అన్నట్లుగా తన శరీరముతోనే లోకముల నన్నింటెని కొలిచినవాడు.)

3 ప్ర = ప్రకృష్టములైన; మాణౌ = ఇహలోక పరలోక రూపము లైన రెండు సుఖములు కలవాడు.

## 437 బీజమ్

1 గత్యర్థమును సూచించు "వీ" అను ధాతువునుండి; "వీః" = జ్ఞానము; జమ్ = దీనినుండి పుట్టుచున్నది అను వ్యుత్పత్తి ద్వారా జ్ఞానమునకు మూలకారణుడని ఈ నామమునకు అర్థము.

2 వ్యంజనము వలన కూడ బీజుడు అని పేరు కలదు. వ్యంజన మనగా తనకు తాను వ్యక్తమగుట. "వ్యంజనాచ్చైవ బీజ ఇత్యుచ్యతే ప్రభుః" అను గీతా తాత్పర్యోక్తి ఇందుకు ప్రమాణము. (స్వయం వ్యక్తుడు.)

## 438 అవ్యయమ్

1 అవి + అయమ్; అవ = అర్థము చేసికొనుట అను ధాతువునుండి; అవి = జ్ఞానము కలవారు; వారిచేత అయ్యతే = సమీపింపబడు వాడు. (జ్ఞానగమ్యుడు.)

2 అ + వి + అయమ్; అయము = రాబడి. అదివి = కానిది = వ్యయమ్ (ఖర్చు, నాశనము.) వ్యయము అ = కానివాడు అవ్యయుడు. (నాశ రహితుడు- పరిణామ రహితుడు.)

## 439 అర్థః

1 భక్తులచేత అర్థ్యతే = తెలిసికొన బడువాడు.

2 అర + థః; అరమ్ = శీఘ్రముగా తనకు చేరు; "థ" = అన్నము కల వాడు. ఇందు "అర" లోని రేఫ మీద నున్న అకారము లోపించి నది. (సర్వఫల భోక్త. "భోక్తారం యజ్ఞ తపసామ్"-గీత-5-29.) అను గీతావాక్యము ఇందుకు ప్రమాణము.

## 440 అనర్థః

1 అన+అర్థః; "అన"=ముఖ్యప్రాణుడైన వాయువునకు; అర్థః = స్వామి అయినవాడు.

2 అన=ముఖ్య ప్రాణునిచేత; అర్థః=అర్థింప బడువాడు.

3 అయోగ్యులకు అనర్థములను=ఆపదలను, కీడును ఇచ్చువాడు.

## 441 మహాకోశః

1 మహా+క+ఉశః; "మహాత్=గొప్పదియైన కమ్=సుఖము కలది "మహాకా=లక్ష్మి"; ఆమెచేత "ఉశః" [ఉశ్యతే]= కామింపబడు వాడు. కనుక మహాకోశుడు. (లక్ష్మిచే ప్రేమింపబడు వాడు అని భావము.)

2 మహాత్+క+ఉ+శః; "క"=బ్రహ్మకు; "ఉ"= ఉత్కృష్టమైన [గొప్ప]; శ=శుభము లేక సుఖము ఎవని వలననో అతడు కోశుడు. మహాకోశుడు=బ్రహ్మకు ఎక్కువ సుఖము నిచ్చువాడు.

3 మహాత్=గొప్ప, కోశః=ధనము కలవాడు.

## 442 మహాభోగః

పూర్ణమైన ఆనందము కలవాడు.

## 443 మహాధనః

1 మహాత్=ఎక్కువైన; ధనః=ధనము కలవాడు.

2 మహాత్ = పూజాది లక్షణమైన ఉత్సవమునుండి "ఆధనమ్" =

సమంతాద్ధనమ్ = అన్ని వైపులనుండి ధనము ఎవనినుండి వచ్చునో అతడు. (ఉత్సవముల ద్వారా రాబడికలవాడు.)

శ్లో॥ అనిర్విణ్ణ స్స్థవిష్ఠోఽ భూ ర్ధర్మయూపో మహామఖః।
నక్షత్రనేమి ర్నక్షత్రీ క్షమః క్షామః సమీహనః॥ 47

## 444 అనిర్విణ్ణః

1 అ + నిర్విణ్ణః; నిర్విణ్ణః = గ్లాని = అలసట, శంకా = అనుమానము, లేనివాడు. "నిర్వేదో గ్లాని శంకయోః" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

2 న + నిర్విణ్ణః;(విణ్ణాభ్యామ్) విత్ + ణ = "విత్" = జ్ఞానము, "ణ" = ఆనందమునుండి, "నిష్క్రాంతః" = దూరమయినవాడు = నిర్విణ్ణః; నిర్విణ్ణుడు కానివాడు అనిర్విణ్ణుడు. (జ్ఞానము, ఆనందము కలవాడని భావము.)

## 445 స్థవిష్ఠః

మిక్కిలి పెద్దవాడు.

## 446 అభూః

1 భూః = ఆధారము ఎవనికి; న = లేదో అతడు (నిరాధారుడని భావము.)

2 భూః = పుట్టుక ఎవనికి; న = లేదో అతడు. (అజుడు.)

3 కొందరు ఇచట "భూః" అని విడదీయుదురు. అప్పుడు భూః = పూర్ణుడు, భావింప జేయువాడు, సర్వోత్పాదకుడు, సర్వులకు ఆశ్రయ మిచ్చువాడు అను అర్థములు వచ్చును.

4 కొందరీ నామమును "భూః" అని చదువుదురు. భూ = స్థిరముగ ఉండువాడు.

## 447 ధర్మయూపః

1 ధర్మ = ధరించువాడు; యూప = భక్తులు ఇతని యందు మన స్సును బంధించుదురు. ధర్ముడును, యూపుడును అయినవాడు (ధర్మ మును, లోకమును ధరించువాడును - భక్తుల మనస్సులో స్థిరముగ నుండువాడును అని అర్థము.)

2 ధర్మ = ధర్మ సాధనమైన; యూపః = (యజ్ఞములో బలి పశువును కట్టు) స్తంభమునకు హేతువగు వాడు. (ధర్మ సాధనమగు యూప మునకు మూలభూతుడు.)

## 448 మహామఖః

1 ఎవనిగురించి "మహాత్" = పెద్ద; మఖ = యజ్ఞములు జరుగునో అతడు.

2 మహాత్ + అమ + ఖః; మా = మితి లేక కొలత; "అమమ్" = మితికి చాలనిది లేక కొలతకు చాలని; మహాత్ = పెద్దదగు; ఖమ్ = ఆకా శము కలవాడు; (వామనుడుగా త్రిలోకములను కొలువదలచినపుడు ఈతని కొలతకు పెద్ద ఆకాశము కూడ చాలలేదు. కనుక మహా మఖుడు అనగా వామనమూర్తి అని భావము.)

## 449 నక్షత్రనేమిః

1 శింశుమార రూపముతో; నక్షత్ర = జ్యోతిశ్చక్రమునకు; నేమిః = ఆధారభూతుడు.

2 న + క్షత్ర + నేమిః; నక్షత్ర = క్షత్రియుల కంటె వేరైన (బ్రాహ్మ ణులు. వారికి నేమివంటివాడు = ఆధారభూతుడు. నేమి = చక్రము

విడిపోకుండ గట్టిగా పట్టి ఉంచు ఇనుప చట్రము. కనుక నేమి అనగా ఆధారము. (బ్రాహ్మణులకు ఆధారభూతుడు.)

## 450 నక్షత్రీ

1 క్షత్రీ=క్షత్రియుడు; నక్షత్రీ=క్షత్రియుడు కానివాడు [బ్రాహ్మణుడు]; విష్ణువు పరశురామావతారమున బ్రాహ్మణునిగా జన్మించెను అను గాథ ఇందుకు ప్రమాణము.

2 నక్షత్రములను నియమించువాడు.

## 451 క్షమః

క్ష+మః="క్షమ్"=నాశనమును; మః [మినాతి]=నాశనము చేయువాడు.

## 452 క్షామః

1 క్షా=నరకములు. వానిని; మః [మవతే]=బంధించువాడు."మవ= బంధనే" అను ధాతువునుండి ఈ అర్థము వచ్చును. (భక్తులకు రాబోవు నరకములను అరికట్టువాడు.)

2 సత్కార్యములయందు దక్షుడు.

3 క్షమాయాః=భూమిని వరాహాది రూపముతో, అయమ్ [ధారకః] = ధరించువాడు. (క్షమాయాః అయమ్ = క్షామః) (వరాహరూపుడు.)

4 వామనరూపముతో—క్షమా=భూమిని; ప్రతిగ్రహీతా=స్వీకరించినవాడు. కనుక ఇతనికి "క్షాముడు" అనుపేరు వచ్చినది.

## 453 సమీహనః

1 సమీః = సమానమైన రూపములు అంతటను కలవాడు. ఈహనః = చేష్టించువాడు. [కదలువాడు.] సమియును, ఈహనుడును అగువాడు. (సమరూపి–సర్వచైతన్యుడు.)

2 సమ్ + ఈహా + నః; సమ్ = సమీచీనమైన [మంచి] ఈహాః = భగవత్పూజాది రూపమగు కోరిక కలవారు = సమీహాః. వారిని; నః = వైకుంఠాది లోకములకు నడిపించువాడు.

శ్లో॥ యజ్ఞ ఇజ్యో మహేజ్యశ్చ క్రతు స్సత్రం సతాంగతిః।
సర్వదర్శీ విముక్తాత్మా సర్వజ్ఞో జ్ఞానముత్తమమ్॥ 48

## 454 యజ్ఞఇజ్యః

యజ్ఞే = యజ్ఞమునందు, ఇజ్యః = స్తుతింపబడువాడు. పూజార్హుడు. (శ్రీ) సత్యసంధ తీర్థులు ఈ నామమును యజ్ఞః + ఇజ్యః అని రెండుగా విభజించి వ్యాఖ్యానించినారు.

## 454 (A) యజ్ఞః

యజ్ఞః = యజ్ఞభోక్త.

## 454 (B) ఇజ్యః

1 కృష్ణ రూపముతో తన ఆత్మను యజతే = పూజించుకొనువాడు. "దధ్యౌ ప్రసన్నకర మాత్మానం తమసః పరమ్" అను భాగవతోక్తి ఇందుకు ప్రమాణము.

2 రామ రూపముతో అహల్యను గౌతమునితో కూర్చినవాడు.

"యజ = దేవపూజా సంగతికరణ దానేషు" అను ధాతువు ఇందుకు ప్రమాణము.

3 పూజింప దగినవాడు.

4 ఇజ్య = పూజకలవాడు. (పూజల నందుకొనువాడు.)

## 455 మహేజ్యః

1 మహః=ఉత్సవము లందు లేక యజ్ఞాదుల యందు, ఇజ్యః= పూజ కలవాడు. (భగవంతుడు.)

2 మహే=సీతా వివాహోత్సవము నందు ఆమెను పొందుటకై; జ్యా = వింటినారిని సంధించినవాడు. (రాముడు.)

3 మహా + ఈ + జ్యః; మహత్యౌ = గొప్పవారైన; ఈ = లక్ష్మీదేవి; జ్యా = భూదేవి భార్యలుగా కలవాడు.

## 456 క్రతుః

1 సృష్ట్యాదికమును; కరోతి = చేయువాడు.

2 "కృతి" అను (పేరుగల) స్వరూపము కలవాడు. "కృతిః స్వరూపత్వాత్" అను వాక్యము దీనికి ప్రమాణము.

3 జ్ఞానరూపము కలవాడు. "స క్రతుః జ్ఞానరూపత్వాత్" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

## 457 సత్రమ్

1 సత్ = మంచి వారిని; త్రమ్ = రక్షించువాడు.

2 సత్ = మంచివారిని; రమ్ (రమయతి) = ఆనంద పరచువాడు.

## 458 సతాంగతిః

1 సతామ్=అవసాదన యుక్తులకు, నిర్విణ్ణులకు, ఆర్తులకు; గతిః= ప్రాప్యుడు. (చేరదగినవాడు.)

2 సతామ్=నక్షత్రములకు; గతిః=గమనము ఎవనివలననో అతడు. (నక్షత్ర గ్రహములకు నిర్దేశకుడు.)

సతామ్ = సత్పురుషులకు, గతిః = ప్రాప్యుడు.

## 459 సర్వదర్శీ

1 సర్వదర్శ+ఇన్, దర్శము=అనగా అమావాస్య. దానిచే సూచితములైన యజ్ఞ విశేషములు కలవాడు.

2 సర్వ=అన్ని విషయములను; దర్శీ=చూచువాడు.

## 460 విముక్తాత్మా

1 విముక్త+ఆత్మా; ఎవనిచేత; ఆత్మానః=జీవులు, విముక్తాః= విముక్తి గావింపబడిరో అతడు.

2 వి=ఎక్కువగా; ముక్త=ముక్తులైనవారికి; ఆత్మా=స్వామి.

## 461 సర్వజ్ఞః

1 సర్వ=అన్ని విషయములను, జ్ఞః= తెలిసిన వాడు. "జ్ఞోఽతఏవ" అను బ్రహ్మ సూత్రము (2-3-18) ఇందుకు ప్రమాణము.

2 సర్వజ్ఞ=జీవులు ఇతనినుండి పుట్టుచున్నారు.

## 462 జ్ఞానమ్

జ్ఞానమ్=జానాతీతి=జ్ఞః=సర్వము తెలిసినవారు బ్రహ్మాదులు. వారిని, అనయతి=చేష్టింప చేయువాడు=జ్ఞానమ్.

## 463 ఉత్తమమ్

ఉత్తమమ్=ఉత్=ఉత్కృష్ట స్థితిని; తమ్యతి=పొందింప జేయు వాడు—ఉత్తముడు.

"తము=కాంక్షాయాం" అని ధాతువు. ధాతూనా మనేకార్థ త్వాత్ అత్ర గత్యర్థకః. ధాతువులకు అనేకార్థములు చెప్పుట వలన ఇక్కడ గత్యర్థము చెప్పబడినది.

శ్రీ సత్యసంధ తీర్థులవారు 462, 463 నామములను కలిపి "జ్ఞాన ముత్తమమ్" అని ఏక నామముగా వ్యాఖ్యానించిరి. అప్పుడు అర్థము—

## 463 [A] జ్ఞానముత్తమమ్

1 జ్ఞాన=జ్ఞానముచేత; ముత్=ఆనందము ఎవనివలన కలుగునో అతడు=జ్ఞానముత్. అతిశయముగా జ్ఞానముత్=జ్ఞానముత్తమమ్ (భక్తులు సాధించిన జ్ఞానమునకు అతిశయమగు ఆనందము నిచ్చువాడు.)

2 జ్ఞాన=జ్ఞానముచేత; ముత్=సంతోషముకలవారు=జ్ఞానముదః= దేవతలు. వారిచేత "తమః" [తమ్యతే]=కోరబడువాడు. "తము= అభికాంక్షాయామ్" అను ధాతువునుండి ఈ అర్థము వచ్చును. (దేవప్రార్థ్యుడు.)

3 జ్ఞానముదే=జ్ఞానమువలన కలుగు ఆనందము కొరకు, (ఎవడు) తమ్యతే=కోరబడుచున్నాడో అతడు. (జ్ఞానదాత.)

శ్లో॥ సువ్రతః సుముఖః సూక్ష్మః సుఘోషః సుఖదః సుహృత్ ।
మనోహరో జితక్రోధో వీరబాహు ర్విదారణః॥ 49

## 464 సువ్రతః

1 ఎవనిని గురించి; సు = శోభనమైన వ్రతము చేయబడునో అతడు.

2 జగత్తును రక్షించుట మొదలగు "సు" = శోభనమైన "వ్రతమ్" = వ్రతము కలవాడు.

## 465 సుముఖః

సు = శోభనమైన; ముఖః = ముఖము కలవాడు.

## 466 సూక్ష్మః

1 సూక్ష్మమైన రూపము కలవాడు. "సూక్ష్మం తు తదర్హత్వాత్" అను [బ్ర. సూ. 1-4-2] బ్రహ్మసూత్రము ఇందుకు ప్రమాణము.

2 సు = ఉత్కృష్టమైన; క్ష్మ = భూమి కలవాడు.

## 467 సుఘోషః

సు = శోభనమైన; ఘోషః = వేదాది రూపమైన శబ్దముకాని, "పాంచజన్య" మను శంఖముయొక్క మంచి ధ్వని గాని కలవాడు.

## 468 సుఖదః

1 సుఖ = మోక్ష సంబంధమైన ఆనందమును; దః = ఇచ్చువాడు.

2 అయోగ్యులయొక్క; సుఖ = ఆనందమును; దః = ఖండించు వాడు.

## 469 సుహృత్

1 సు+హృత్, = సు = శుభకరమైన; హృత్ = మనస్సు కలవాడు.

2 సు = భక్తులు చేసిన శుభమైన కర్మఫలమును; హృత్ = స్వీక రించువాడు.

3 సు+హృత్ = కారణము లేకుండగనే ఉపకారము చేయునట్టి మంచి హృదయము కలవాడు.

## 470 మనోహరః

1 మనః = గోపికల యొక్క మనస్సును; హారః = హరించువాడు.

2 మనః = మననము చేయబడువాడు. లేక తలచబడువాడు; యజ్ఞ ముల యందు హవిస్సు మొదలగు వానిని "హరః" = స్వీకరించు వాడు. మనుడును, హరుడును అగువాడు మనోహరుడు. (భక్తులచే ధ్యానింపబడు వాడు-యజ్ఞమునందలి హవిస్సులను స్వీకరించువాడు.)

3 భక్తులయొక్క మనః = మనస్సుతో; హారః = అపహరింపబడు వాడు. (భక్తుల మనస్సుచే ఆకర్షింపబడు వాడు.)

## 471 జితక్రోధః

1 జిత+క్రోధః; ఎవనిచేత; క్రోధః = కోపము; జితః = గెలువబడినదో అతడు.

2 ఎవనిచేత క్రోధః = క్రోధ రూపమున ఉన్న రాక్షసులు; జితాః = గెలువబడిరో అతడు. (అరిషడ్వర్గమును జయించిన వాడు.)

## 472 వీరబాహుః

వీర+బాహుః; ఎవనియొక్క "బాహుః" = చేతులనుండి; వీర =

వీరులైన (క్షత్రియులు) రాజులు ఉద్భవించిరో అతడు. "బాహూ రాజన్యః కృతః" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము. (విరాట్పురుషుని బాహువులనుండి రాజు లుద్భవించి రను శ్రుతి వాక్య మిందుకు ప్రమాణము.)

## 473 విదారణః

1 వి=విశేషముగా; దార=గోపికలకు; ణః=సుఖము ఎవనినుండి కలుగునో అతడు. (గోపికా రమణుడు.)

2 నరసింహ రూపముతో హిరణ్యకశిపుని విదారించినవాడు. (విదారణః=చీల్చినవాడు.)

3 విద్+ఆ+అరణః; విద్=జ్ఞానులచేత; ఆ=బాగుగా; అరణః= చేరబడువాడు. (జ్ఞానగమ్యుడు.)

4 విద్+ఆ+రణః; విద్=తెలిసినవాడు; ఆ=అన్నివైపులనుండి; జరాసంధుడు మొదలగు వారితో; రణః=యుద్ధము కలవాడు. విదుడును, ఆరణుడును. (విదారణః) (సర్వజ్ఞుడు - జరాసంధాదులతో పలుమార్లు యుద్ధము చేసినవాడు.)

5 విద్=తెలిసికొన్నవాడు. అంతర్గతమైన అగ్నిరూపమున అరణికి సంబంధించినవాడు=ఆరణః (అరణి+అ) విదుడును; ఆరణుడును (విదారణ.)

6 వి+దారణః, దారకః=తనను చీల్చువాడు; వి=లేనివాడు. (సర్వవిజేత.)

7 విద్+ఆ+రః; "విద్"=తెలివిచేత లేక జ్ఞానముచేత,ఆ=బాగుగా రమయతి = సంతోష పెట్టువాడు. (తన తత్త్వ జ్ఞానముచే భక్తులను ఆనందపరచువాడు.)

8 విదార=భార్య లేని వారగు సన్న్యాసులకు; ణః=సుఖము ఎవరినుండి వచ్చునో అతడు. (యతులకు ఆనందము నిచ్చువాడు.)

శ్లో॥ స్వాపనః స్వవశో వ్యాపీ నైకాత్మా నైకకర్మకృత్ ।
వత్సరో వత్సలో వత్సీ రత్నగర్భో ధనేశ్వరః ॥ 50

## 474 స్వాపనః

1 అజ్ఞానులను నిద్ర పోగొట్టు వాడు.

2 స్వాప+నః సుప్తం జీవం, స్వసమీపం నయతీతి = అజ్ఞానముతో నిద్రించు జీవుని తనవద్దకు నడిపించువాడు (జ్ఞానదాత. "తమసో మా జ్యోతిర్గమయ" అను శ్రుతివాక్యమును, "దదామి బుద్ధి యోగం తం యేన మా ముపయాంతి తే" (గీత–10–10) అను గీతావాక్యమును ఇందుకు ప్రమాణము.)

3 సు+ఆప+నః; ఆప+జల సమూహము వద్దకు; సు=బాగుగా; నః=తీసికొనిపోవువాడు (హరి, తీర్థ నిలయుడు కనుక భక్తులను జల సమూహము వద్దకు తీసికొనిపోవును. లేదా ప్రళయకాలమునందు సముద్రజలముల వద్దకు తీసికొనిపోవును అని భావము.)

## 475 స్వవశః

1 స్వ=ధనము; వశః=తన వశమునందు కలవాడు.

2 స్వ=తనకు తానే; వశః=వశమం దుండువాడు.

3 స్వవ=తమ ఆత్మను స్తోత్రము చేయువారు, "దానిని చేరువారు, తెలిసికొనువారు, అడుగువారు, ఆలింగనము చేసికొనువారు లేక ప్రళయమునందు ప్రాజ్ఞరూపమగు ఉదరము లోనికి ప్రవేశించు వారు [జీవులు]" వారికి [ఆ జీవులకు] "శ" = సుఖము ఎవరివలననో అతడు. (జీవుల కానందదాయకుడు.)

## 476 వ్యాపి

వ్యాపించి ఉండువాడు.

## 477 నైకాత్మా

1 న + ఏక + ఆత్మా; నైక = అనేకములైన; ఆత్మా = శరీరములు కలవాడు.

2 నైక = చాలమందికి; ఆత్మా = స్వామి లేక యజమానుడు.

## 478 నైకకర్మకృత్

సృష్టి, స్థితి మొదలగు నైక = అనేకములైన కర్మ = వ్యాపారములను; "కృత్" = చేయువాడు. కొందరు అనేక కర్మకృత్ అని చెప్పుదురు.

1 అనేక కర్మకృత్ = భక్త సంబధులగు పితృ(భ్రాతా)దుల సుఖవాసమునకై చాల ఏర్పాట్లను చేయుట చేత అనేక కర్మకృత్.

## 479 వత్సరః

వత్స = ఆవుదూడలతో కృష్ణావతారమునందు, రః = ఆడుకొన్నవాడు.

1 వత్స = వత్సాసురుని; రః [రేపయతి] = నశింప జేసినవాడు. "రీజ్ = క్షయే" అను ధాతువునుండి ఈ అర్థము వచ్చును.

## 480 వత్సలః

భక్తులయందు దయ కలవాడు.

## 481 వత్సీ

"శ్రీవత్స"మను పుట్టుమచ్చ కలవాడు.

## 482 రత్నగర్భః

రత్నములు గర్భమునందు కలవాడు.

## 483 ధనేశ్వరః

ధనమునకు ఈశ్వరుడు.

శ్లో॥ ధర్మకృ ద్ధర్మగు బ్ధర్మీ సదసత్క్షర మక్షరమ్।
అవిజ్ఞాతా సహస్రాంశు ర్విధాతా కృతలక్షణః॥ 51

## 484 ధర్మకృత్

1 ధర్మ = ధర్మమును; కృత్ = చేయువాడు.

2 అభక్తులచేత చేయబడిన; ధర్మ = ధర్మమును; కృత్ = ఛేదించువాడు.

## 485 ధర్మగుప్

1 ధర్మ = భీముని అన్నయగు ధర్మరాజును లేక పుణ్యమును; ("గుపూ = రక్షణే" అను ధాతువునుండి) గుప్ = దాచువాడు లేక రక్షించువాడు.

2 ధర్మ = ధర్మమునకు సాధనములైన వేదరూపమున ఉన్న "గుః" = వాక్కులు కలవాడు = ధర్మగుః. వానిని "ప" = రక్షించువాడు = ధర్మగుప్. (వేద వాక్యములను రక్షించువాడు.)

## 486 ధర్మీ

ధర్మః = నియమించు వాడు (యముడు.) అతడే తనవాడుగా కల వాడు (యముని తన వశమునం దుంచుకొనినవాడు. అజామిళో పాఖ్యాన మిందు కుదాహరణము.)

## 487 సదసత్ క్షరమ్

1 యజ్ఞశాలల యందు సోమపానముచే ఆనందించువాడు.

2 భక్తులచే చేయబడు స్తోత్రాదులచే సంప్రీతు డగువాడు.
(శ్రీ) సత్యసంధ తీర్థులు ఈ 487 వ నామమగు "సదసత్ క్షరమ్" అనుదానిని, రెండు నామములుగా విభజించి వాఖ్యానించిరి.

## 488 సదసత్

సత్ = నశింప జేయువాడు; అసత్ = నశింపనివాడు "షద్ ౡ = విశరణ గత్యవసాదనేషు" అను ధాతువు నుండి ఈ అర్థము వచ్చినది.

## 488 (A) క్షరమ్

1 ఎల్లప్పుడు దానము చేయువాడు.

2 జగత్తును నశింపజేయువాడు. "క్షర = వినాశ సంతత దానయోః" అను ధాతువునుండి ఈ అర్థములు వచ్చును.

## 489 అక్షరమ్

1 అక్షరములయందు (నాశము లేని వస్తువులయందు.) రమ్ = రమించువాడు లేక నాశరహితుడు.

2 "అక్షూ = వ్యాప్తౌ" అను ధాతువును బట్టి; అక్షరమ్ = వ్యాపించి ఉండువాడు.

## 490 అవిజ్ఞాతా

1 ఎవనికంటె-విజ్ఞాతా = తెలిసినవాడు న = లేడో అతడు. (సర్వజ్ఞుడు.)

## 491 సహస్రాంశుః

సూర్యాంతర్గతుడైన-ఎవనికి "సహస్ర" = వెయ్యి, అంశుః = కిరణములు కలవో అతడు.

## 492 విధాతా

1 వి = విశేషముగా; ధాతా = పోషించువాడు.

2 వి = గరుత్మంతుడు ఎవనికి "ధాతా" = వాహకుడో అతడు. (గరుడ వాహనుడు.)

## 493 కృత లక్షణః

1 కృత + లక్షణః = "కృత" = పరిపూర్ణములైన లక్షణః = లక్షణములు కలవాడు.

2 కృత + ల + క్షణః = కృత = భక్తులచేత చేయబడిన కర్మను; "ల = (ఆదానే)" = స్వీకరించుట యందు "క్షణః" = ఉత్సవము కలవాడు. (భక్తుల ననుగ్రహించుట యందే ఆనందము కలవాడు, శబరి, విభీషణుడు మొదలగువారిందు కుదాహరణములు.)

3 కృత + లక్ష + ణః; "కృత" = పూర్ణములైన; లక్ష = అనంతములైన; ణః = సుఖములు కలవాడు. (అఖండానంద స్వరూపుడు.)

4 కొందరు "అకృత లక్షణః" అని ఈ నామమును విడదీయుదురు. "అకృత" = చేయబడని (సహజమైన) లక్షణః=లక్షణములు కల వాడు. (స్వవశుడు.)

శ్లో॥ గభస్తినేమిః సత్త్వస్థః సింహో భూతమహేశ్వరః।
ఆదిదేవో మహాదేవో దేవేశో దేవభృద్గురుః॥ 52

## 494 గభస్తినేమిః

గభస్తి=కిరణములు; నేమిః=చక్రపు అంచువలె కలవాడు.

## 495 సత్త్వస్థః

1 సత్త్వ+స్థః; "సత్త్వ"=జీవునియందు అంతర్యామిగా "స్థః"= ఉండువాడు. "సత్త్వం జీవః క్వచిత్ ప్రోక్తః" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

2 సత్త్వ=జీవుడు; స్థః=ఇతని యందు ఉండును.

3 సత్త్వ=బలముతో; స్థః=ఉండువాడు.

## 496 సింహః

శ్రేష్ఠుడు.

## 497 భూత మహేశ్వరః

భూత+మహ+ఈ+శ్వ+రః; భూత ప్రభూతమైన [ఎక్కువైన); మహ= ఉత్సవము కలవాడు భూతమహః; ఈ=లక్ష్మి; శ్వ=వాయువు. "శ్వా వై వాయుః శ్వసనాత్" అను ఋగ్భాష్య వాక్యము ఇందుకు ప్రమాణము.

"ఈ, శ్వా"లతో, రః=రమించువాడు ఈశ్వరః, భూతమహు డును, ఈశ్వరుడును అగువాడు. (ఎక్కువగా ఉత్సవమును చేయించుకొనువాడు-లక్ష్మీ దేవి, వాయు దేవులతో ఆనందించు వాడు.)

2 భూత = ప్రాణులకు; మహేశ్వరః = మహేశ్వరుడు.

## 498 ఆదిదేవః

ఆది + దేవః; ఆదిః = భక్తులచేత "ఆదీయతే = స్వీకరింపబడువాడు. [ఆరాధ్యుడు] దేవ=క్రీడాది గుణ విశిష్టత్వము కలిగి ఉండువాడు. ఆదియును, దేవుడును అగువాడు = ఆదిదేవః (భక్తులచే ఆరాధింప బడువాడు-లీలావిశిష్టుడు.)

## 499 మహాదేవః

మహాత్ + ఆద + ఈ + వః; "ఆదః" = తినువాడు. మహాత్ + ఆదః =గొప్పవాడైన (ఎక్కువగా) తినువాడు; ఈ=లక్ష్మిని; వః=వర్తింప జేయువాడు. మహాదుడును, ఈవుడును = మహాదేవః (ప్రళయ కాలమునందు జగత్తు నంతను ఎక్కువ ఆహారముగా తినువాడును, లక్ష్మిని తన భక్తుల గృహములందు ప్రవర్తింప జేయువాడును.)

## 500 దేవేశః

1 దేవ + ఈ + శః; దేవ=దేవతలకు; ఈ=లక్ష్మికి; శమ్=శుభము [సుఖము] ఎవరివలననో అతడు (దేవతలకును లక్ష్మికిని శుభముల నిచ్చువాడు.)

2 దేవ + ఈశః; దేవ= దేవతలకు; ఈశః = ఈశ్వరుడు [లేక శాసించు వాడు.]

## 501 దేవభృత్

దేవ = తేజస్సు, బలము మొదలగునవి. భృత్ = కలవాడు. (తేజో వంతుడు—బలవంతుడు.)

## 502 గురుః

1 శిష్యులకు ఉపదేశము చేయువాడు. "గౄ = శబ్దే" అని ధాతువు.

2 భక్తకృతములైన స్తోత్రవిశేషములను గృణాతి = గ్రహించువాడు. శ్రీ సత్యసంధ తీర్థులవారు 501, 502 నామములను కలిపి "దేవ భృద్గురుః" అని ఏకనామముగా వ్యాఖ్యానించినారు.

## 502 (A) దేవభృద్గురుః

దేవ = దేవతలను; భృత్ = భరించువాడు. [చతుర్ముఖుడగు బ్రహ్మ. గురుః = ఆ బ్రహ్మకు ఉపదేశము చేసినవాడు.

శ్లో॥ ఉత్తరో గోపతి ర్గోప్తా జ్ఞానగమ్యః పురాతనః।
శరీరభూతభృ ద్భోక్తా కపీంద్రో భూరిదక్షిణః॥ 53

## 503 ఉత్తరః

1 ఉత్ + తరః = మిక్కిలి ఉత్కృష్టుడు. (అందరను మించినవాడు.)

2 ఉత్ = ఉత్కృష్టులైన యోగ్యులను; తరః = సంసారము నుండి దాటింప జేయువాడు. (లేక తరింప జేయువాడు.)

## 504 గోపతిః

గో + పతిః; గో = 1) భూమియొక్క 2) ఆవులయొక్క 3) వేద వాక్యముల యొక్క; పతిః = పాలకుడు.

## 505 గోప్తా

రక్షకుడు.

## 506 జ్ఞానగమ్యః

జ్ఞాన = జ్ఞానముచేత లేక జ్ఞానులచేత; గమ్యః = చేరదగినవాడు.

## 507 పురాతనః

1 పుర = దేహముల యందు, వైకుంఠాది లోకముల యందును; "అతనః" = నడచువాడు.

2 మిక్కిలి ప్రాచీనుడు.

## 508 శరీరమ్

శరీ + రమ్; 'శరీర' శబ్దమునకు సకల భువనములు అని అర్థము. అవి ఇతనియందు క్రీడించుట వలన శరీరుడు. "శీర్యతే నిత్యమేవాస్మాత్ విష్ణోస్తు జగదీదృశమ్" అను వాక్యము ఇందుకు ప్రమాణము. "శ్రీఞ్" = సేవాయామ్ అను ధాతువు వలన ఈ అర్థము వచ్చినది.

## 509 భూతభృత్

భూత + భృత్; "భూతమ్" = అతీతమైన అనాది జ్ఞానము; "భృత్" = దానిని అభివ్యక్తము చేయువాడు (ప్రకాశింప చేయు వాడు). (జ్ఞాన ప్రకాశకుడు.) "భూతకృత్" అని కూడ పాఠాంతరము కలదు. ఆ పదమునకు కూడా ఇదే అర్థము.
శ్రీ సత్యసంధ తీర్థుల వారు 508, 509 నామములను కలిపి ఏక నామముగా వ్యాఖ్యానించినారు.

## 509 (A) శరీర భూతభృత్

1 శరీర = శరీరములను; భూత = పుట్టిన ప్రాణులను; "భృత్" = భరించువాడు. (జగద్భర్త.)

2 కొందరు ఈ నామమును "శరీర భూతభృత్" అని చదువుదురు. అప్పుడు "శరీర" = శరీరము కలవాడు; భూతభృత్ = భూతములను, ప్రాణులను = పుట్టిన వానిని భరించు వాడు.

3 ప్రళయ కాలమునందు, తన శరీరమునందు భూతములను భరించు వాడు.

4 "యస్య పృథివీ శరీరమ్" అను అంతర్యామి బ్రాహ్మణోక్త రీతిగా పృథివ్యాది శబ్దములచే సూచితమైన గరుడాదులను భరించువాడు.

## 510 భోక్తా

అన్నిటిని తినువాడు.

## 511 కపీంద్రః

1 కపి = వానరుడైన వాలియొక్క; ఈమ్ = సంపదను "ద్రః" = పరుగెత్తింపచేయువాడు (తొలగించువాడు.) "ద్రు = గతౌ" అను ధాతువునుండి ఈ అర్థము వచ్చినది. (వాలిని చంపినవాడు.)

2 క = సుఖమును; పి = త్రాగువారు = కపి (ముక్తులు.) వారికి "ఇంద్రః" = నాయకుడు లేక రాజు (శ్రేష్ఠుడు.) (ముక్తులకు నాయకుడు.)

3 కపి = హనుమంతుడు ఎవనిచేత; ఇంద్రః = సమర్థుడయ్యెనో అతడు. (హనుమంతునకు స్వామి.)

## 512 భూరిదక్షిణః

1 భూరి = బంగారము; దక్షిణః = దక్షిణగా కలవాడు.
"భూర్నా వాసుదేవే చ హరే చ పరమేష్ఠిని।
నపుంసకం సువర్ణే చ ప్రాజ్యే స్యా ద్వాచ్య లింగకః॥"

అను మేదినీ కోశ వాక్యము ఇందుకు ప్రమాణము (బంగారమును దక్షిణగా, కానుకగా స్వీకరించువాడు.)

2 భూరి = ఎక్కువయిన; దక్షిణః = దక్షిణ కలవాడు (మహోద్ధ్యుడు.)

3 ఎక్కువగా దానము చేయువాడు.

4 మిక్కిలి కుశలుడు.

5 భూరి = ధనాభిమానము గల లక్ష్మి; దక్షిణః = దక్షిణ భాగము నందు కలవాడు.

6 "భూరి" = ఎక్కువయిన; "దక్ష" = యజమానులు ఎక్కడ ఉందురో అది "భూరిదక్షి" అనగా సత్రియాగము. దానిచేత "ణః" = సుఖము కలవాడు. సత్రయాగమునందు అందరు యజమానులుగా ఉందురు. "సత్రయాగే సర్వే యజమానాః" (సత్ర యాగము వలన ఆనందించువాడు.)

శ్లో॥ సోమపోఽ మృతపః సోమః పురు జిత్పురుసత్తమః।
విని యోజ్యః (వినయో జయః) సత్యసంధో దాశార్హః సాత్వతాం పతిః॥ 52

## 513 సోమపః

1 సోమ = సోమరసమును; పః = త్రాగువాడు.

2 స + ఉమ + పః = "ఉమ" = పార్వతితో; స = కూడినవాడు సోమః = రుద్రుడు. (శివుడు.) అతనిని; పః = రక్షించువాడు. (భస్మాసురాదుల బారినుండి శివుని రక్షించినవాడు.)

3 సోమపః = రాహు కేతువులనుండి గ్రహణ సమయములందు చంద్రుని రక్షించినవాడు.

## 514 అమృతపః

1 అమృత = అమృతమును; పః = త్రాగువాడు.

2 అమృత = అమృతమును రాక్షసులనుండి; పః = రక్షించువాడు. (మోహిని అవతారమును ధరించినవాడు.)

## 515 సోమః

1 స + ఉ + మః; "ఉ" = రుద్రుడు (శివుడు); "మా" = లక్ష్మి; ఇద్దరితో "స" = కూడినవాడు (శివునితోను, లక్ష్మితోను కూడి యుండువాడు.)

2 స + ఉమః; ఉమ = భూతములతో; స = కలసి ఉండువాడు. భూతానివై విశ్వ ఉమా" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము.

3 సౌమ్య గుణము కలవాడు.

4 సః + అమః; "మా" = పరిమితి; అ = లేనివాడు = అమః; సారము కలవాడు = సః (కొలత లేక సారముకలిగి యుండుట వలన- "సోమః" అనిపిలువబడుచున్నాడు.

"సోమః సౌమ్యత్వాత్ హరిః"

"ఉ" నామయాచ యుక్తత్వా దుమై ద్యుక్తత్వాతో ఉధవా" అను ఋగ్భాష్య వాక్యములు ఇందుకు ప్రమాణములు.

5 స + ఉ + మః; ఉ = క్లేశము; మా = కానిది = ఉమ. అనగా సౌఖ్యము. దానితో కూడి యున్నవాడు. (ఆనందస్వరూపుడు.)

6 స + ఉమః; ఉ = ఉత్కృష్టమైన; మః = ఆనందానుభవముతో; స = కలసి ఉండువాడు. (కూడియుండువాడు.) "ఆనందాను భవ

స్తూమః ఉత్కృష్టానుభవాత్ స్మృతః "అను ఏకాదశ తాత్పర్య వాక్యము ఇందుకు ప్రమాణము. (ఉత్కృష్టమైన లేక పరమమైన ఆనందము కలవాడు.)

## 516 పురుజిత్

1 పురు = చాలమంది శత్రువులను; జిత్ = జయించువాడు.

2 పురు = పదార్థములను కాని, గుణములను కాని, జిత్ = పొందు వాడు, "ధనజితే స్వర్జితే సత్రాజితే" అను ప్రయోగము ఇందుకు ప్రమాణము.

## 517 పురుసత్తమః

1 పురు = పరిపూర్ణుడును; సత్ = బ్రహ్మ మొదలగు వారిచేత; తమః (తమ్యతే) = కోరబడువాడు.

2 పురు = పూర్ణుడును; సత్ = నాశనమును; తమః (తమయతి) = పోగొట్టువాడు = సత్తమః పురుడును, సత్తముడును = పురుసత్తముడు. పరిపూర్ణుడును, నాశరహితుడును అగువాడు.

3 పురు = బ్రహ్మాదుల యందు అంతర్యామిగా "సత్" (సీదతి) = ఉండువాడు = పురుసద్; "తమః" = శ్రేష్ఠుడు.

4 పురు = బ్రహ్మాదుల కంటె అధికమైన; సత్తా = దేశకాలముల యందు స్థితి = పురుసత్తా. ఆ పురుసత్తయే ఎవనికి; "మా" = లక్ష్మియో, అతడు పురుసత్తమః (దేశకాలాతీతుడగుటవలన శోభించువాడు.)

## 518 వినియోజ్యః

1 వి + నియోజ్యః; "నియోజ్యః" = నియోగింపదగినవాడు; వి = కాదు. ఇచ్చట "వి" అను ఉపసర్గ విప్రియము అను పదము

నందువలె వ్యతిరేకార్థమును సూచించును. (ఎవరి చేతను నియోగింపదగినవాడు కాడు.)

2 వి=వివిధమైన జగత్తు ఎవనికి; నియోజ్యమ్=వినియోగింపదగినదో అతడు. (జగన్నియామకుడు.)

కొందరు వినియోజ్య పదమునకు బదులుగా "వినయః; జయః" అను పాఠమును అంగీకరింతురు. ఈ పాఠము నంగీకరించినచో పాదమునకు తొమ్మిది అక్షరములు వచ్చును. అయినను "నవా ఏకేన అక్షరేణ చ్ఛందాంసి వియంతి న ద్వాభ్యామ్" అను బహ్వృచ బ్రాహ్మణ వాక్యము ఇందుకు ప్రమాణమును చేసి తప్పులేదని భావించి ఈ పాఠమును సమర్థింతురు. ఈ నామముల కర్థ మిది. వినయః=దండించువాడు; జయః=గెలుపొందువాడు. (విజయము కలవాడు.)

## 519 సత్యసంధః

1 సత్య+సంధః; సత్య=నిజమైన; సంధా=ప్రతిజ్ఞ కలవాడు.

2 సత్య=సత్యమును; సంధః=సాధింపచేయువాడు లేక సత్యమును సాధించువాడు లేక పాలించువాడు.

## 520 దాశార్హః

1 దాశ=సుఖాది దానమునకు; "అర్హః" [అర్హతి]=తగినవాడు. "దాశృ=దానే" అను ధాతువు నుండి ఈ అర్థము వచ్చును. (సుఖము నిచ్చువాడు.)

2 "దాశార్హులయొక్క" కులమునందు ఉద్భవించిన వాడు. దాశార్హ కులము యాదవ వంశములలో ఒకటి.

3 దాశరాజు యొక్క కుమార్తె (దాశా) = సత్యవతి; పుత్రుడుగా అయెను "అర్హః"= గౌరవించిన వాడు. (వ్యాసుడు.) "వ్యాసో నారాయణో హరిః" అను వాక్యమును "ద్విబాహు రపరో హరిః" అను వాక్యమును ఈ అర్థమునకు ప్రమాణ వాక్యములు.

## 521 సాత్వతాం పతిః

1 సాత్వత్ + పతిః; సాత్ = పరమాత్మ; సాత్వన్తః = పరమాత్మ కలడను వారు (భక్తులు.) వారికి పతిః = పాలకుడు. (భక్తులకు నాయకుడు.)

2 సాత్వతామ్ = పాంచరాత్రిక దేవతలైన శ్రీ దేవి మొదలగు తొమ్మిది మూర్తులకు; పతిః = ఆదిమూర్తి.

"సాత్వతాం నవమూర్తీనాం ఆదిమూర్తి రహం పురా" అను భాగవతము నందలి ఏకాదశ స్కంధపు వాక్యమును, "విష్ణోః శ్రియః బ్రహ్మణశ్చ వాయోః సంకర్షణస్య చ। సుపర్ణస్య చ సంప్రోక్తాః ప్రత్యేకం నవ మూర్తయః॥ పూజ్యాఃసాత్వత తంత్రేషు తత్తాద్యాః మూర్తయో హరేః। ప్రధానాః తా హి సర్వాసాం మూర్తీనాం హరి మూర్తయః॥ అభేదా దేవ మూర్తీనాం ఏక మూర్తిశ్చ సా స్మృతా స్వరూపతశ్చ గుణతో న విశేషః కథం చన॥ విష్ణోస్తు నవమూర్తీనాం పూజా చ నవధేష్యతే॥ నారాయణః పరబ్రహ్మ వాసుదేవాదికా స్తథా। నారసింహ వరాహౌ చ పరంజ్యోతి ర్హరే ర్నవ॥ ఇందిరా చ రమా లక్ష్మీ హిరణ్యా గగనా తథా। రక్తా రక్తతరా భూతి ర్విభూతిశ్చ శ్రియో నవ॥ బ్రహ్మా చతుర్ముఖో ధాతా విధాతా విధిరేవ చ। కర్తా విరించో భూతేశః శతానందశ్చ తా నవ॥ ధనంజయమృతే చైవ వాయోశ్చ నవ మూర్తయః। శేషోఽనంతో సరశ్చైవ లక్ష్మణో బల ఏ వచ॥ సంకర్షణో నీలవాసా జగద్భక్షో జలేశయః। సుపర్ణో గరుడశ్చైవ వైన

తేజో మహాశనః॥ నవవర్ణః పంచవర్ణః పన్నగాశో౽మృతాకరః॥ తత్రైవ సర్వవేదాత్మా సుపర్ణో నవధా స్మృతః॥ అను భాగవత తాత్ప ర్యోక్తి ఇందుకు ప్రమాణము.

శ్లో॥ జీవో వినయితా సాక్షీ ముకుందో౽మిత విక్రమః।
అంభోనిధి రనంతాత్మా మహోదధి శయోంతకః॥ 55

## 522 జీవః

జనులను జీవింపజేయువాడు.

## 523 వినయితా

వి+నయితా; "వి" = విశేషముగ, నయితా = తన భక్తులను తన వద్దకు రప్పించు కొనువాడు. "ణీఞ్ = ప్రాపణే" అను ధాతువు వలన ఈ అర్థము వచ్చును.

## 524 సాక్షీ

1 సాక్షీ = బలవంతుడు.

2 సాక్షాత్ ద్రష్టా (సకల లోకముల యందలి జీవులు సర్వదా చేయుచుండునట్టి సర్వ కార్యములను ప్రత్యక్షముగా చూచువాడు.) శ్రీ సత్యసంధ తీర్థులవారు 523, 524 నామములను కలిపి "వినయితా సాక్షీ" అని ఏక నామముగా వ్యాఖ్యానించినారు. అప్పుడు అర్థము.

## 524 (A) వినయితాసాక్షి

వినయితా = వినయము కలిగియుండుటకు, సాక్షీ = ద్రష్ట (చూచు వాడు.) (వినయము కలిగియుండుటకు సాక్షి యగువాడు.)

## 525 ముకుందః

ముకుమ్ = మోక్షమును; దః (దదాతి) — ఇచ్చువాడు

## 526 అమితవిక్రమః

1 అమిత = మితములేని, మిక్కిలి; విక్రమః = పరాక్రమము కలవాడు.

2 అమిత = పూర్తిగా తెలిసికొనుటకు వీలుపడని వాడు; వి = గరుడుని ద్వారా; క్రమః = నడచువాడు. అమితుడును, విక్రముడును = అమిత విక్రముడు. (అవ్యక్తుడు—గరుడవాహనుడు.)

## 527 అంభోనిధిః

1 అంభః = నీటికి; నిధిః = తరగని స్థానమైన సముద్రము వంటివాడు. (గంభీరుడు.)

2 అంభః = గాంభీర్య గుణము కలిగి యుండుట వలన దేవతలకు "అంభః" అని పేరు వారికి నిధి = అంభోనిధిః. (దేవదేవుడు.)

3 అమ్ = విష్ణువును; భః = (బిభర్తి) = భరించునది (అంభః) = విష్ణులోకము; ని (నితరామ్) = మిక్కిలి; ధిః = ఇతని యందుండును. కనుక నిధిః. అంభః + నిధిః = విష్ణులోకాదులు తనయందు కలవాడు. "దేవాశ్చ దివ్యానిచ, లోకాశ్చ, లోకినశ్చ, అలోకాశ్చ, అలోకినశ్చ, విష్ణా వోతాశ్చ ప్రోతాశ్చ తస్మి న్నపో మాతరిశ్వా దధాతి" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము.

## 528 అనంతాత్మా

1 అనంత = అపరిమితమైన; ఆత్మా = దేహములు కలవాడు.

2 న + అంత + ఆత్మా; "అంత" = "అతి = బంధనే" అను ధాతువు నుండి "బంధము" అని అర్థము. న = లేనివాడు. అనంతః = బంధము లేనివాడు. అనంతుడైన "ఆత్మా" = స్వామి—(బంధరహితుడైన స్వామి.)

3 అనంత = అనంతమైన సంఖ్యలో నున్న లేక బద్ధస్థితి లేని ముక్తులకు; ఆత్మా = స్వామి.

4 అనంత = అనంతుడను మాను వేయిపడగల శేషునియందు; ఆత్మా = శరీరము కలవాడు. (శేషశాయి.)

## 529 మహోదధిశయః

1 మహా + ఉ + దధిశయః; దధి = పెరుగును. శయ = చేతియందు, వామన కృష్ణాది రూపములతో ధరించినవాడు. [కలవాడు.] మహా = మహాత్ముడును, ఉ = ఉత్కృష్టుడును అగు దధిశయుడు = మహోదధిశయః (మహాత్ముడును, ఉత్కృష్టుడును, వామన కృష్ణాది రూపములను ధరించిన వాడును అగు విష్ణువు.)

2 మహోదధి = పెద్ద సముద్రము నందు; శయః = పడుకొన్న వాడు. (క్షీరసాగరమందుగాని, ప్రళయ సముద్రమునందుగాని పరుండు వాడు.)

3 ఉత్ = ఉత్కృష్టులైన; అధి = అధికులైన చతుర్ముఖాదులు; శయ = చేతియందు గలవాడు "స్వాధీనుడు" అని అర్థము [ఉదధి శయః] మహాన్ = గొప్పవాడు. మహాత్ముడును, ఉదధిశయను డును = మహోదధిశయః (మహాత్ముడును, బ్రహ్మాదులను స్వాధీనమునం దుంచుకొనిన వాడును.)

## 530 అంతకః

1 అంత = బంధము కలవాడు, జరాసంధుడు మొదలగు వారిచేత బంధము కలిగిన రాజులకు; క = సుఖము ఎవనిచేత వచ్చెనో అతడు (జరాసంధునిచే బద్ధులైన రాజులను కారాగార ముక్తులుగా చేసిన వాడు.)

2 అంత + కః = క = సముద్రములోని నీటిని, రామరూపముతో అంత = బంధించినవాడు. (సేతువును నిర్మించిన వాడు.)

3 సర్వమును అంత (అంతయతి) = నశింపజేయువాడు. (ప్రళయ కారకుడు.)

శ్లో॥ అజో మహార్హః స్వాభావ్యో జితామిత్రః ప్రమోదనః।
ఆనందో నందనో నందః సత్యధర్మా త్రివిక్రమః ॥ 56

## 531 అజః

అ = బ్రహ్మకు; జః = జన్మనిచ్చిన జనకుడు. "కార్య కారణయోః ఏకశబ్ద వ్యవహృతిః భవేత్" అను వాక్యము ఇందుకు ప్రమాణము. (బ్రహ్మకు తండ్రి.)

## 532 మహార్హః

మహాత్ = పూజాది రూపమైన ఉత్సవమునకు; అర్హః = తగినవాడు.

## 533 స్వాభావ్యః

1 స్వ + అభావ్యః = సంకల్పించిన ప్రతికార్యమునకు నిత్యము ఫలసిద్ధి ప్రాప్తించుటచే; భావ్యం = జరుగవలసినది; న = ఎవనికి లేదో అతడు అభావ్యుడు; స్వ = స్వతంత్రుడును, అభావ్యుడును అగువాడు = స్వాభావ్యుడు. (స్వతంత్రుడును, జరుగవలసినదనుచు తనకు ప్రత్యేకముగా ఏదియు లేనివాడును. (సంకల్పసిద్ధుడు.)

2 స్వ + ఆభ + అవ్యః; స్వ = తనకాంతి వంటి; ఆభ = కాంతి కలవారు [స్వాభాః] = జ్ఞానము, ఆనందము మొదలగు గుణములను కలిగియుండుట చేత తనతో సదృశులైన, యోగ్యులైన జీవులు. ఆ జీవులు ఎవరికి "అవ్యాః" = రక్షింప దిగినవారో అతడు. (జ్ఞానము ఆనందము కల జీవులను రక్షించువాడు.)

3 స్వ+ఆ భావ్యః=భావ్యమ్=మంగళ సమూహము; ఆ=అన్నివై పుల నుండి (భావ్యము) కలవాడు=ఆభావ్యః; స్వ=స్వతంత్రుడు; స్వ+ఆభావ్యః=స్వతంత్రుడును, అన్ని వైపులనుండి శుభముల సమూహము కలవాడును=స్వాభావ్యః.

## 534 జితామిత్రః

జిత=గెలువబడిన. "అమిత్రం=శత్రువులు, కలవాడు. (శత్రువులను గెలుచువాడు.)

## 535 ప్రమోదనః

1 ప్రమోద+నః=ప్రమోద=[స్వయముగా సంతోషమును నః=పొందువాడు. [ఆనందము ననుభవించువాడు.]

2 జనులను ప్రమోదింప జేయువాడు.

3 "ప్రమోద"=సంతోషమును గూర్చి; నః (నయతి)=కొనిపోవు వాడు [తీసికొనిపోవువాడు.] (జీవుల కానందదాత.)

4 ప్ర=ప్రకృష్టమైన; మా=రమ [లక్ష్మి] లేక జ్ఞానము కలవాడు ప్రమః; ఉత్=ఉత్కృష్టమైన; అనః=వాయువు కలవాడు=ఉదనః; ప్రముఖుడును, ఉదనుడును=ప్రమోదనః [ఉత్కృష్టములైన జ్ఞానము, లక్ష్మియును కలవాడు-ఉత్కృష్టుడైన వాయువునకు స్వామి.]

## 536 ఆనందః

ఆనందమే స్వరూపముగా కలవాడు. లేక ఆనందము కలవాడు.

## 537 నందనః

ఆనందింప జేయువాడు.

## 538 నందః

సమృద్ధి కలవాడు.

## 539 సత్యధర్మా

1 సత్య=జ్ఞానాదులు; ధర్మా=తన ధర్మములుగా కలవాడు.

2 సత్యమ్=జగత్తును; ధర్మా=ధరించువాడు.

## 540 త్రివిక్రమః

1 త్రి=మూడు; విక్రమః=అడుగులు కలవాడు. (వామనుడు.)

2 త్రి=మూడు; లోకములయందు; వి=గరుడుని ద్వారా; క్రమః=నడక కలవాడు. (గరుడవాహనుడు.)

3 త్రి=మూడు సంఖ్యగల వానిని; విక్రమః=ఆక్రమించువాడు, మూడు కాలములు, మూడు వేదములు, మూడు గుణములు, మూడు లోకములు, దేవ మానుష దానవులు,-వీనిని, చేతనా చేతనసాత్మక దేహములతో మిశ్రితములైన వానిని ఆక్రమించినవాడు. "వేదాన్ కాలాన్ గుణాన్ లోకాన్ దేవమానుష దానవాన్ చేతనా చేతనాన్ మిశ్రాన్ త్రీణి పదా వి చక్రమే" అను ఋగ్భాష్యోక్తి ఇందుకు ప్రమాణము.

కొందరు ఈ నామమును "అత్రి విక్రమః" అని చెప్పుదురు. అత్రి+విక్రమః=అత్రి అను మహర్షి యొక్క విక్రమః = పరాక్రమము దత్తాత్రేయాది రూపములతో కలవాడు.

శ్లో॥ మహర్షిః కపిలాచార్యః కృతజ్ఞో మేదినీపతిః ।
త్రిపద స్త్రిదశాధ్యక్షో మహాశృఙ్గః కృతాన్తకృత్ ॥ 57

## 541 మహర్షిః

మహత్ + ఋషిః = మహాత్ముడైన ఋషి.

## 542 కపిలాచార్యః

1 సంసారమును పోగొట్టుటచేత కపిలుడు. కపిలుడును, ఆచార్యుడును = కపిలాచార్యుడు.

2 కమ్ = సుఖమును; పిః [పిబతి] = త్రాగువాడు, (ఆనందానుభవమును) లః = అన్నిటినుండి గ్రహించువాడు "లా = ఆదానే" అను ధాతువునుండి ఈరూపము వచ్చును. (అన్నిటి నుండి ఆనందమునే గ్రహించువాడు.)

3 క + పి + లః ; క = బ్రహ్మను ; పి = పినాకపాణియైన రుద్రుని, లః (లాలయతి) = లాలించువాడు.

4 కొందరు సంప్రదాయ వేత్తలు "మహర్షి కపిలాచార్యః" అని ఏక పదముగా చెప్పుదురు (సమస్త పదముగ) (కర్దముడు – దేవహూతి అను దంపతులకు పుత్రుడుగా కపిల మహర్షి నామముతో పుట్టినవాడు.)

## 543 కృతజ్ఞః

కృత = చేసినదానిని; జ్ఞః = తెలిసికొనువాడు.

## 544 మేదినీపతిః

భూపతి.

## 545 త్రిపదః

1 త్రి = మూడు సంఖ్యగల; పద = వైకుంఠాది స్థానములు కలవాడు.

2 త్రి=మూడుసంఖ్య గల; పద = గాయత్రి పాదములు తనను ప్రతి పాదించునవిగా కలవాడు. (గాయత్రియొక్క మూడు పాదము లచే ప్రతిపాదింపబడు వాడు.)

3 త్రి=మూడుసంఖ్యగల పాదముల ద్వారా; ప (పాతి) = రక్షించు నది; త్రిపమ్ = జ్ఞానము; ఆ జ్ఞానమును దః = ఇచ్చువాడు.

## 546 త్రిదశాధ్యక్షః

1 త్రి + దశా + అధ్యక్షః; త్రి = మూడు సంఖ్యగల; దశా = జన్మ, సత్త, వినాశము అను పేరుగల మూడు దశలకు; అధ్యక్షః = అధ్య క్షుడు.

2 త్రి = మూడవదియైన; దశా = యౌవనరూప దశ (అవస్థ) ఎల్లప్పుడు ఎవరికి ఉండునో వారు = త్రిదశాః, వారికి అధ్యక్షః = నాయకుడు. (దేవనాయకుడు.)

## 547 మహాశృంగః

1 మహత్ = గొప్ప; శృంగః = ప్రాధాన్యము కలవాడు. "శృంగం ప్రాధాన్య సాన్వోశ్చ" అను కోశోక్తి ఇందుకు ప్రమాణము.(సర్వో త్తముడు.)

2 మహత్ = గొప్ప; శృంగమ్ = జ్ఞానము కలవాడు. "శృంగం జ్ఞానం తద్వత శ్చైవ నిత్యమ్" అను ఋగ్ భాష్యోక్తి ఇందుకు ప్రమా ణము.

3 మత్స్యావతారము నందు - మహత్ = పెద్ద;
శృగమ్ = కొమ్ము కలవాడు.

## 548 కృతాంతకృత్

1 కృత + అంతకృత్ = "కృత" = చేయబడిన దుష్కర్మను
అంతకృత్ = నాశనము చేయువాడు.

2 కృత=చేయబడిన పౌరుషేయమునకు ( మానవప్రయత్నమునకు ) అంతమ్ = నిర్ణయమును; కృత్ = చేయువాడు. (మానవప్రయత్న మునకు తన అనుగ్రహమును జోడించి ఫలమునిచ్చువాడు.
"యత్ర యోగీశ్వరః కృష్ణో యత్రపార్థో ధనుర్ధరః ।
తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ" ॥ గీత-18-78
అను వాక్యమిందులకు ప్రమాణము.

3 కృత=చేయబడిన కర్మతో; అంత=బంధమును; కృత్ =కలిగించు వాడు.

4 కృతాంత=బ్రహ్మసూత్రాది నిర్మాణము చేత సిద్ధాంతమును; కృత్ =చేయువాడు.

5 కృతాంత=మృత్యువును; కృత్ [కృణోతి]=నశింపజేయువాడు.

శ్లో॥ మహావరాహో గోవిందః సుషేణః కనకాంగదీ।
గుహ్యో గభీరో గహనో గుప్తశ్చక్రగదాధరః॥ 58

## 549 మహావరాహః

1 మహాత్ +వర +ఆహః;(వరాహః) మహావర = రాక్షస శ్రేష్ఠులను; ఆహః=చంపువాడు.

2 రుక్మిణీ స్వయంవర కాలమునందు; వర =వరుడుగా వచ్చిన శిశు పాలుని; ఆహః=కొట్టువాడు. మహాత్ =గొప్పవాడును, వరాహు డును అగువాడు మహావరాహః ( గొప్పవాడును-శిశుపాలుని జయించిన వాడును. )

3 మహాత్ +అవర + హః;
మహాత్ +అవర = అతినీచులైన కలి మొదలగు వారిని "ఆహః" (ఆహంతి)=తమోగుణములో పడద్రోయుటచేత నశింప జేయువాడు.

## 550 గోవిందః

1 గో=సముద్రమును; జలమును; విందః=పొందువాడు. (నారాయణుడు.)

2 గో= నేత్రమును (ధృతరాష్ట్రునికి); విందః=లభింపజేసినవాడు.

## 551 సుషేణః

1 సు=మంచి; సేనః=సైన్యము కలవాడు.

2 "షిఞ=దానే" అను ధాతువునుండి—సేనః=దాత; సు=మంచి; సేనః=దాత; (మంచిదాత.)

## 552 కనకాంగదీ

కనక =బంగారముతో చేసిన; అంగదీ=అంగదములు అను భరణములు బాహువులయందు కలవాడు.

## 553 గుహ్యః

1 దాచదగిన, రహస్యమైన తత్త్వము కలవాడు.

2 "గుహుడు" అను పేరుగల వానిచేత పూజింప బడినవాడు. (రాముడు.)

## 554 గభీరః

1 గభీరః=గంభీరుడు.

2 "గమ్=గతౌ; భా=దీప్తౌ" అను ధాతువుల నుండి "గ"=నడచువాడు; "భ"=కాంతి కలవాడు గభీ; "ఈ"=లక్ష్మిచేత; రః=రమించువాడు=ఈ రః; గభియును, ఈరుడును అగువాడు గభీరుడు, (సర్వత్ర అవ్యాహతమగు నడక కలవాడును, తేజోమయుడును, లక్ష్మితో రమించువాడును కనుక గభీరుడు.)

కొందరు ఈ నామమును "అగభీరః" అని పఠింతురు. దానికి అర్థము—

1 "అగ" = నడువని వారు, తెలియనివారు = అజ్ఞానులగు దైత్యులు. వారి కొఱకు "భీ" = భయమును; రః = ఇచ్చువాడు (రాక్షస భయంకరుడు.)

2 "అగ" = గోవర్థన పర్వతముచేత; భీ = వానవలన కలుగు భయమును; రః = [రేపయతి] = నాశనము చేయువాడు. [గోవర్థనధారి.]

## 555 గహనః

తెలిసికొనుటకు వీలుపడనివాడు. కొందరు ఈ నామమును "అగహానః" అని పఠింతురు. అప్పుడు అర్థము—

అగ + హా + నః = అగహానః; "అగ" = పర్వతములను (పక్షచ్ఛేదనముతో) "హాః" (హంతి) = కొట్టువాడు = అగహాః [ఇంద్రుడు.] వానిని "నః" నడిపించువాడు. (ఇంద్రునకు మార్గదర్శి.)

## 556 గుప్తః

అయోగ్యులైన జనులను గురించి గుప్తముగా ఉండువాడు లేక దాగి ఉండువాడు. (హిరణ్యకశిపునకు కనబడక ఆతని హృదయమునందు దాగి యున్నవాడు.)

## 557 చక్రగదాధరః

1 చక్ర + గదా + ధరః = "చక్ర" = చక్రమును; గదా = గదను; ధరః = ధరించువాడు.

2 చక్రి + గ + ద + అధరః; చక్ర = సైన్యమునందు; గ = ఉండు,

వాడు = చక్రిగ=నరకాసురుడు మొదలగు వారు. వారిని "దః" = ఖండించువాడు = చక్రగదః; అధరః=ఎవనికి ధారకుడు (పోషించు వాడు), (ధరించువాడు) లేడో అతడు = అధరః.—లేక ఆధరః = బాగుగా ధరించువాడు. చక్రగదుడును, అధరుడు లేక ఆధరుడును= చక్రగదా ధరః. (నరకాంతకుడు – సర్వపోషకుడు.)

శ్లో॥ వేధాః స్వాంగోఽజితః కృష్ణో దృఢః సంకర్షణోఽచ్యుతః।
వరుణో వారుణో వృక్షః పుష్కరాక్షో మహామనాః॥ 59

## 558 వేధాః

వి = విశేషముగా; ధాః = ధారణ పోషణములను చేయువాడు.

## 559 స్వాంగః

1 స్వరూప భూతములైన అంగములు కలవాడు. (ప్రపంచ మంతయు తనరూపమే అయినవాడు.)

2 స్వ = స్వతంత్రములైన; అంగః=అవయవములు కలవాడు. (చైతన్యస్వరూపి.)

3 సృష్ట్యాది యందు తనంతట తానుగనే స్వరూపమును ధరించువాడు.

## 560 అజితః

న + జితః=ఎవనిచేతను గెలువబడనివాడు.

## 561 కృష్ణః

1 కృష్ణుని రూపమును ధరించినవాడు.

2 పాప మూలమునకు అగ్ని రూపుడైనవాడు. (పాపదాహకుడు.) "కృష్ణః సీసాది లోహేషు కృష్ణో నీలే కలే కలా శూద్రే కాకే పికే

వ్యాసే ధ్వాంక్షే పక్షేఽర్జునే హరిః" అను కోశములోని వాక్యము ఇందుకు ప్రమాణము.

## 562 దృఢః

దార్ఢ్యము కలవాడు.

## 563 సంకర్షణః

భక్తుల పాపములను అపహరించుట వలన సంకర్షణుడు. "కృష = విలేఖనే" అను ధాతువు వలన ఈ అర్థము వచ్చినది.

## 564 అచ్యుతః

చ్యుతిలేని జగత్తనెడి ఐశ్వర్యము కలవాడు అచ్యుతుడు.
శ్రీ సత్యసంధ తీర్థుల వారు **563, 564** నామములను కలిపి "సంకర్షణోఽచ్యుతః" అని ఏకనామముగా వ్యాఖ్యానించినారు. అప్పుడు అర్థము-

## 564 (A) సంకర్షణోఽచ్యుతః

ఈ రెండు నామములను ఒకటిగా సంప్రదాయ వేత్తలు పఠింతురు.
1 సమ్ = బాగుగా; "కర్షణః" = దేవకి గర్భము నుండి రోహిణి గర్భములోనికి లాగబడినవాడు.

శ్లో॥ విష్ణువు యోగమాయతో—
"దేవక్యాజఠరేగర్భం శేషాఖ్యంధామమామకమ్
తత్సన్నికృష్య రోహిణ్యా ఉదరేసన్నివేశయ. భాగ–10–2–9
"గర్భేప్రణీతే దేవక్యా రోహిణ్యాం యోగనిద్రయా
అహో విస్రంసితోగర్భ ఇతిపౌరా విచుక్రుశుః– భాగ–10–16,
అను వాక్యము లిందుకు ప్రమాణము.

న + చ్యుతః = చ్యుతి = నాశము; న = లేనివాడు.

## 565 వరుణః

1 ఆవరించి ఉండువాడు.

2 వర్ + ఉత్ + నః; వర = ఉత్తముడైన జీవుని; ఉత్ = పైకి; నః = తీసికొనిపోవువాడు. (జీవోద్ధారకుడు.)

3 వర = ఉత్తమమైన; ణః = ఆనందము కలవాడు. "వర ఉత్తమో ణో హి నిర్వృతి వాచకః" అను వాక్యము ఇందుకు ప్రమాణము. (బ్రహ్మానందము ననుభవించువాడు.)

"ఆవృణోతీతి వరణ స్తమసాఽజ్ఞానతోఽపివా
వర మున్నయ తీత్యస్మా ద్వారానంద త్వతోపివా"
అను ఋగ్భాష్యోక్తి ఇందుకు ప్రమాణము.

4 భక్తుల చేత "వ్రియతే" = కోరబడువాడు.

5 భక్తులను "వృణుతే" = వరించువాడు.

6 వః + అరుణః; జనులను "వాతి" = తెలిసికొనువాడు = వః; అరుణమైన (ఎఱ్ఱని) రూపము కలుగుట వలన అరుణుడు. వః + అరుణః = వరుణః "రక్తం రౌగ్మం" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము. (జనులయందలి భక్తి శ్రద్ధలను తెలిసికొనువాడు—అరుణ వర్ణుడు.)

## 566 వారుణః

1 వరుణునకు సంబంధించినవాడు.

2 కొందరు ఈ నామమును "వారణః" అని చదువుదురు. భక్తుల యొక్క అనిష్టములను (ఆపదలను) "వారణః" = నివారించువాడు.

3 వార + ణః = "వార" = నీటియొక్క సమూహము = సముద్రుడు.

దానికి "ణః"=ఎవనివలన సుఖము కలుగునో అతడు. (లక్ష్మీ పతియై సముద్రుని ఆనందపరచినవాడు.)

4 వారుణః = శ్రేష్ఠుడు.

## 567 వృక్షః

1 భక్తుల కోర్కెలను తీర్చుటయందు కల్పవృక్షముతో సమానుడు.

2 "వృక్ష=వరణే" అను ధాతువు నుండి "వృక్షః" (వృణోతి)= భక్తులను వరించువాడు.

3 కొందరు ఈ నామమును "అవృక్షః" అని పఠింతురు. "ఓవ్రశ్చూ= ఛేదనే" అను ధాతువునుండి న+వృక్షః=ఛేదించువాడు లేనివాడు అను అర్థము వచ్చును. (అచ్ఛేద్యుడు.)

## 568 పుష్కరాక్షః

పుష్కర+అక్షః = "పుష్కర" = తామర పువ్వుల వంటి; "అక్షః"=కన్నులు కలవాడు.

## 569 మహామనాః

మహా+మనాః; "మహత్"=గొప్ప; మనాః= (1)=చిత్తము (2) జ్ఞానము కలవాడు.

శ్లో॥ భగవాన్ భగహాఽఽనందీ వనమాలీ హలాయుధః।
ఆదిత్యో జ్యోతి రాదిత్యః సహిష్ణుర్గతి సత్తమః॥ 60

## 570 భగవాన్

భగవంతుడు, ఐశ్వర్యాది షడ్గుణములు కలవాడు. (భగవాన్) "అన్యో ముకుందాత్ కోనామ లోకేభగవత్పదార్థః" అను భాగవతోక్తి ఇందుకు ప్రమాణము.

## 571 భగహా

1 "భగ" = రాక్షసుల యొక్క ఐశ్వర్యమును, "హా" (హంతి) = నాశనము చేయువాడు.

2 భ + గ + హా = "భ" = జ్యోతిః స్వరూపులైన సూర్య చంద్రులను గూర్చి "గ" (గచ్ఛతి) = వెళ్ళువాడు (భగః) = రాహువు. అతనిని "హా" (హంతి) = చంపువాడు. (రాహువినాశకుడు.)

## 572 ఆనందీ

1 ఆనందము కలవాడు.

2 ఆ + నందీ = అన్నివైపులనుండి సంతోషించువాడు.

## 573 వనమాలీ

1 పాదము వరకు వ్రేలాడుచున్న "వనమాలా" = తులసి మాలను ధరించినవాడు. "ఆ పాదపద్మం యా మాలా వనమాలేతి సా స్మృతా" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

2 వనా + మా + ఆలీ = "వనా" = సంభజకా = సేవించునట్టి; "మా" = లక్ష్మి = (వనమా); ఆమె "ఆలీ" = స్నేహితురాలిగా కలవాడు. (సా, అస్యా స్త్రీతివా.) (లక్ష్మి భార్యగా కలవాడు.)

3 వన + మాలీ; "వన" = నీటిని లేక భక్తుని "మాలీ" = ధరించు స్వభావము కలవాడు. "మల = ధారణే" అను ధాతువునుండి ఈ అర్థము వచ్చును. గంగను పాదమునందు ధరించినవాడు; భక్తులను హృదయమునందు ధరించినవాడు. "యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషుచా ప్యహమ్" (గీత–9–19) అను వాక్య మిందుకు ప్రమాణము.

## 574 హలాయుధః

1 హాల + ఆయుధః = "హాల" = నాగలి. "ఆయుధః" = ఆయుధముగా కలవాడు.

2 "రలయోః రభేదాత్" అను వాక్యము వలన "హాల" శబ్దము "హార" కాగా, "హార" = రుద్రునికి-త్రిపురాసుర సంహార కాలము నందు "ఆయుధః" = ఆయుధ రూపమును ధరించినవాడు.

## 575 ఆదిత్యః

1 ఆది + త్యః = "ఆది" = అనాది కాలమునుండి ఉన్న, "త్యః" = ఆనంద, జ్ఞానములు కలవాడు.

2 "అద = భక్షణే" అను ధాతువు నుండి, "ఆదీ" = ప్రజలను భక్షించుటయే స్వభావముగా గల రాక్షసులు; వారిని "త్యః" (త్యజతి) = దూరముగా విడుచువాడు. రాక్షస వర్గములోని దౌష్ట్యమును చూచి ఆ వర్గమును పరిహరించువాడు.

## 576 జ్యోతిరాదిత్యః

1 జ్యోతిః + ఆది + త్యః; "జ్యోతిః" = జ్యోతుసైన నక్షత్ర గ్రహాదులకు, "ఆది" = ముందు ఉండువాడు.

సూర్యుడు (జ్యోతిరాదిః.) ఆ సూర్యునియందు "త్యః" (తిష్ఠతి) = ఉండువాడు. (సూర్యమండల మధ్యవర్తి.)

## 577 సహిష్ణుః

ఓర్పు కలవాడు.

## 578 గతిసత్తమః

1 గతి + సత్ + తమః = "గతి" = జ్ఞానము చేత, "సత్" = సత్పురుషులు = గతిసత్; వారిచేత "తమః" (తమ్యతే) = కోరబడువాడు.

2 "గతి" = చేరబడువాడు; "సత్తమః" = మిక్కిలి మంచివాడు. గతియును, సత్తముడును = గతిసత్తమః (శరణ్యుడు-సత్తముడు.)

శ్లో॥ సుధన్వా ఖండపరశు ర్దారుణో ద్రవిణప్రదః।
దివస్పృ క్సర్వదృ గ్వ్యాసో వాచస్పతి రయోనిజః॥ 61

## 579 సుధన్వా

సు + ధన్వా; "సు" = శోభనమైన, "ధన్వా" = ధనస్సు కలవాడు. (శార్ఙ్గపాణి.)

## 580 ఖండపరశుః

ఖండ + పరశుః; "ఖండ" = ఖండింపబడిన "పరశుః" = గొడ్డలి కలవాడు. (శివునిచే ప్రయోగింపబడిన గొడ్డలిని విరుగగొట్టినవాడు.)

"అథ రుద్రవిద్ధ్యర్థం ఈషికా నర ఉద్ధరన్।
మంత్రం చ సంయుయోజాశు సోఽభవత్ పరశు ర్మహాన్॥
క్షిప్తశ్చ సహసా తేన ఖండనం ప్రాప్తవాం స్తదా।
తతోఽహం ఖండపరశుః స్మృతః పరశు ఖండనాత్॥"
అను మోక్ష ధర్మోక్తి ఇందుకు ప్రమాణము. కొందరు ఈ నామమును "అఖండ పరశుః" అనికూడా పఠింతురు. ఖండము కాని పరశు = గొడ్డలి కలవాడని దీని అర్థము. (పరశురాముడు.)

## 581 దారుణః

1 దారు + నః = లోకమును "దారు" = కొయ్యబొమ్మనువలె "నయతి" = నడిపించువాడు. (జగన్నాటక సూత్రధారి.)

2 శత్రువులను—"దారుణః" = విదారించువాడు = చీల్చి చెండాడు వాడు.

## 582 ద్రవిణప్రదః

1 ద్రవిణ + ప్రదః = "ద్రవిణ" = విద్య, ధనము మొదలగు రూపములో ఉన్న విత్తమును, "ప్రదః" = ఇచ్చువాడు.

2 ద్రవి + ణ + ప్రదః = "ద్రవి" = చిత్తమునకు ద్రవత్వము కల వారు (మెత్తని మనసు కల హరి భక్తులు.) వారికి "ణ" = సుఖమును "ప్రదః" = ఇచ్చువాడు.

## 583 దివస్స్పృక్

దివః + స్పృక్; "దివః" = శ్వేత ద్వీపము, అనంతాసనము, వైకుంఠములను, "స్పృక్" = స్పృశించువాడు. (తాకువాడు.) (శ్వేత ద్వీపాదులయందు వసించువాడు.)

## 584 సర్వదృక్

"సర్వ" = అంతటిని, "దృక్" = చూచువాడు.

## 585 వ్యాసః

వి + ఆ + సః = "వి" = అన్నిటికంటె విశిష్టుడు. "ఆ" = అన్నివైపుల నుండి, "సః" = నడచువాడు. "సృ = గతౌ", "సస్తృ = గతౌ" అను

ధాతువులనుండి ఈ అర్థము వచ్చును. [సర్వోత్తముడు - అన్ని వైపులకు నడచు సామర్థ్యము కలవాడు.)

"స వ్యాసో వీతి తమ వైహి సోఽధస్తాత్స
ఉత్తరతః స పశ్చాత్స పూర్వస్మాత్స దక్షిణతః స ఉత్తరతః"

అను ఆగ్నేయ శాఖోక్తి ఇందుకు ప్రమాణము. కొందరు 584, 585 నామములను కలిపి "సర్వదృగ్వ్యాసః అని ఒకే నామముగా పఠింతురు.

## 585 A సర్వదృగ్వ్యాసః

అన్నివైపులకు చూచువాడు, అన్ని వైపులకు నడచువాడు అని అర్థము.

## 586 వాచస్పతిః

వాచః + పతిః = వాక్ = సకల వాక్కులకు, మనస్సులకు, దేవతలకు "పతిః" = నాయకుడు. వాక్కులకు నాయకుడైనవాడు.

## 587 అయోనిజః

1 న + యోనిజః = "యోనిజః" = మాతృగర్భమునుండి పుట్టినవాడు "న" = కానివాడు. "న చ గర్భేఽవసద్దేవ్యా న చాపి వసుదేవతః" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

2 "అయోని" = స్త్రీ చిహ్నరహితమైన స్తంభాదులనుండి, "జః" = పుట్టినవాడు. (నరసింహుడు.)

3 అయోని = యోనికంటె వేరైన నాభియందు(బొడ్డునందు) బ్రహ్మను, "జః" = పుట్టించినవాడు.

4 అయః + అనిజః; "అనిజ" = అభక్తులకు, "అయః" = ఇనుముతో చేసిన సంకెల రూపమునందు ఉండు బంధము ఎవనివలననో అతడు. (అభక్తులను కర్మలచే బంధించువాడు. నరకాది లోకములందు బంధించువాడు.)

శ్లో॥ త్రిసామా సామగ స్సామ నిర్వాణం భేషజం భిషక్।
సంన్యాసకృ చ్ఛమ శ్శాన్తో నిష్ఠా శాన్తిః పరాయణమ్॥ 62

## 588 త్రిసామా

త్రి + సామా = త్రి = మూడుసంఖ్యగల; సామాని = (1) నిధన, (2) ఉద్గీథ, (3) ప్రతీహారములు అను పేరుగల సామములు కలవాడు.

## 589 సామగః

1 సా + మ + గః; "సా" = బ్రహ్మ భార్యయైన వాగ్దేవి; "మః" = వాయువు, "సామ" = సరస్వతి, వాయువులు. వారిని గూర్చి "గః" = వెళ్ళువాడు. (వారియం దధిష్ఠాన రూపమున ఉండువాడు.)

"సేతి భార్యా హి వాగ్దేవీ ప్రాణో మః పరి కీర్తితః
ఏవం తౌ సామ నామానౌ"
అను ఛాందోగ్యోక్తి ఇందుకుప్రమాణము.

2 'సామ' అను పేరుగల అగ్నియం దుండు వాడు.
"శుభా శుభానాం దాహోదా సామ్యాత్ సామాగ్ని రీరితః।
అగ్నిః సామాభిమానీ స్యాత్"॥
అను ఛాందోగ్య భాష్యోక్తి ఇందుకు ప్రమాణము.

3 సామ + గః +; "సామ" = "సామ వేదముచేత "గః"(గమ్యతే) = చేరబడువాడు. (వేద ప్రతిపాద్యుడు.)

## 590 సామ

సర్వ భూతములయందు సమత్వము కలవాడు.

## 591 నిర్వాణమ్

వాణ = ప్రాకృత శరీరమునుండి "నిర్" = వెలువడినవాడు. (ప్రాకృత శరీరము లేనివాడు.) (దివ్యుడు.)

2 నిర్ + బాణ = బాణములతో కొట్టుటకు వీలు లేని శరీరము కలవాడు. "కాయో వాణమ్ శరీరంచ" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

## 592 భేషజమ్

1 సంసారమను రోగమునకు ఔషధ రూపుడైన వాడు.

2 భేష + జమ్ = "భేష" = భయపెట్టునది (రోగము.) దానిని "జ" (జయతి) = గెలుచువాడు.

## 593 భిషక్

1 సంసార రోగమునకు వైద్యుడు. భిషజ్యతి = చికిత్స చేయువాడు = భిషక్. "భిష్ = చికిత్సాయామ్" అను ధాతువునుండి ఈ అర్థము వచ్చును.

## 594 సంన్యాసకృత్ శమః

"నాహం కర్తా హరిః కర్తా తత్పూజా కర్మ చాఖిలమ్।
తథాపి మత్కృతా పూజా తత్ప్రసాదేన నాన్యథా॥
తద్భక్తి స్తత్ఫలం మహ్యం తత్ప్రసాదః పునః పునః।
కర్మన్యాసో హరా వేదం విష్ణోస్తుష్టి కరస్సదా॥

ఇత్యాది ప్రార్థనలచేత కర్మ సంన్యాసమును (త్యాగమును) చేసి నటువంటి గోశర్య-మను-సావరణి ప్రభృతులకు "శమ"-శాంతి

మఱియు తదుప లక్షితములగు జ్ఞాన భక్త్యాదులు ఎవరి నుండి వచ్చునో అతడు.

కొందరీ నామమును సంన్యాసకృత్; శమః అని రెండు వేరు వేరు నామములుగా చదువుదురు. అప్పుడు అర్థము :

## 594 (A) సంన్యాసకృత్

1 సంన్యాస = కామ్య కర్మ త్యాగమును, "కృత్" = చేయించువాడు.

2 సమ్ + న్యాస + కృత్; "సమ్" = బాగుగా; "న్యాస" = దోషములను విడుచుపనిని; "కృత్" = చేయువాడు.

కొందరు ఈ నామమును అనుస్వారమును తీసివేసి "సన్న్యాస కృత్" అని చదువుదురు. అప్పుడు అర్థము.

సత్ + న్న్యాస + కృత్ = సత్ = సత్పురుషుల యొక్క ("అసు = క్షేపణే" అను ధాతువును బట్టి) "న్న్యాస" = ధనమును అపహరించువారు— సన్న్యాసులు = రాక్షసులు. వారిని "కృత్" [కృంతతి] = కోసివేయువాడు. (రాక్షస వినాశకుడు.)

## 594 (B) శమః

1 ఆనందరూపుడు.

"శమ ఆనందరూపః" అను మాండూక్యోక్తి ఇందుకు ప్రమాణము.

2 శమ్ + మ = "శమ్" = బ్రహ్మానందమును, "మా" (మాతి) = తెలిసికొనువాడు.

## 595 శాంతః

1 శ + అంతః = "శ" = సుఖమునకును– (జ్ఞానమునకును పూర్వము) "అంతః" = బంధము ఎవనివలన కలుగునో అతడు. [అజ్ఞాన స్థితిలో బంధనమును కలిగించువాడు.]

2 "శ" = దైత్య సుఖము యొక్క; "అంతః" = నాశము ఎవని వల ననో అతడు.

3 "శ" = సుఖములకు ; "అంతః" = అవధి అగువాడు. (పరమానందము ననుభవించువాడు.)

## 596 నిష్ఠా

ని + ష్ఠా = "ని" = మిక్కిలి; ష్ఠా(స్థితి) = స్థిరత్వము కలవాడు.

## 597 శాంతిః

1 ఉన్నతమైన సుఖస్వరూపుడు. "శాంతినామానుఖోన్నతే" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

2 శ + అంతిః; "శమ్" = సుఖము; "అంతి" = సమీపమునందు కల వాడు.

## 598 పరాయణం (మ్)

1 పర + అయనః; "పర" = ముక్తులకు; "అయనః" = ఆశ్రయమైన వాడు.

2 పర + అయనః = ఎవని వలన "పర" = గొప్పదియైన; "అయనమ్" = నడక లేక గతి కలుగునో అతడు. (మోక్షదాత.)

శ్లో॥ శుభాంగ శ్శాంతిద స్స్రష్టాకుముదః కువలేశయః ।
గోహితో గోపతిర్గోప్తా వృషభాక్షో వృషప్రియః॥ 63

## 599 శుభాంగః

1 శుభ + అంగః = శుభమైన అంగములు కలవాడు.

2 "శుభ" = శుభమునకు, "అంగ" = అంగభూతమైన జ్ఞానము ఎవని వలన కలుగునో అతడు.

## 600 శాంతిదః

"శాంతి" = మోక్షమును, "దః" = ఇచ్చువాడు.

## 601 స్రష్టా

జగత్తును సృష్టించినవాడు.

## 602 కుముదః

1 కు + ముదః; "కు" = భూమియందు, "ముద" (మోదతే) = సంతోషించువాడు.

2 భూ భారమును హరించుట వలన—"కు" = భూమిని; "ముదః" (మోదయతి) = సంతోషపరచువాడు.

## 603 కువలేశయః

1 కువలే + శయః; "కువలే" = బదరికాశ్రమమునందు; "శయః" [శేతే] = పరుండువాడు.

2 కు + బలే + శయః; "కు" = భూమియొక్క, "బలే" = బలము కొఱకు (శ్వేత ద్వీపమునందు) "శయః" (శేతే) = పరుండువాడు.

3 "కు" = భూమియొక్క; "బలే" = పరివర్తనమునందు, "శయః" = ఆశయము కలవాడు.

4 కు + బల + శయః; "కు" = భూమియును, "బలమ్" = బలమును = "కుబలే" అని ద్వివచన రూపమగును. ఆ కుబలములు "శయః" = చేతియందు కలవాడు.

5 కు + బలేశ + యః; "కు" = భూమియందు, "బలేశ" = బలదేవతా స్వరూపుడగు హనుమంతునిచేత, "యః" (యాయతే) = పొందబడు వాడు. (ఆంజనేయుని ఏలినవాడు.)

## 604 గోహితః

1 గో + హితః; "గో" = (1) ఆవులకు (2) వేదరూపమందున్న వాక్కులకు వరుసగా కృష్ణుడు, వ్యాసుడు మొదలగు రూపములతో; "హితః" = మేలు చేసినవాడు.

2 గో + హితః; "గో" = కన్నులయందు లేక నీటియందు, "హితః" = నిహితుడైనవాడు = ఉంచబడినవాడు. (నారాయణుడు.)

"య ఏషోఽన్త రక్షిణి పురుషో దృశ్యత" అను శ్రుతియును; "అయనం తస్య తాః పూర్వం తేన నారాయణః స్మృతః" అను స్మృతి వాక్యమును ఇందుకు ప్రమాణములు.

## 605 గోపతిః

గో + పతిః; "గో" = 1) ఆవులకు, 2) స్వర్గమునకు, 3) పశువులకు 4) వాక్కునను, 5) వజ్రమునకు, 6) దిక్కులకు, 7) నేత్రములకు 8) భూమికి, 9) జలములకు; "పతిః" = పాలకుడు.

## 606 గోప్తా

సర్వమును రక్షించువాడు.

## 607 వృషభాక్షః

1 వృష + భ + అక్షః; "వృష" = ధర్మము చేత, "భ" (భాంతి) = ప్రకాశించువారు (వృషభాః) = సజ్జనులు. వారియందు "అక్షః" = కృపాదృష్టి కలవాడు.

2 "వృషభ" = ఎద్దు కన్నులవంటి, "అక్షః" = కన్నులు కలవాడు.

3 వృషభ+అ+క్షః; "వృషభః" = భక్తుల అభిలషితములను వర్షించువాడు. "అ+క్షః" = నాశము లేనివాడు. వృషభుడును, అక్షుడును = వృషభాక్షః. (భక్తుల కోర్కెలను తీర్చువాడు—నాశరహితుడు.)

## 608 వృషప్రియః

వృష+ప్రియః; "వృష" = ధర్మమునందు "ప్రియః" = ఇష్టము కలవాడు.

శ్లో॥ అనివర్తీ నివృత్తాత్మా సంక్షేప్తా క్షేమకృచ్ఛివః।
శ్రీవత్సవక్షాః శ్రీవాసః శ్రీపతిః శ్రీమతాంవరః॥ 64

## 609 అనివర్తీ

1 అని+వర్తీ; "అని" = ముఖ్య ప్రాణదాసుల యందు, "వర్తీ" (వర్తతే) = ఉండువాడు. (అంతర్యామి.)

2 న+నివర్తీ = ఎప్పుడును వెనుకకు మరలని వాడు.

## 610 నివృత్తాత్మా

1 నివృత్త+ఆత్మా = (ప్రళయకాలమునందు) "నివృత్త" ఆత్మా = వెనుకకు మరల్చబడిన జీవులు కలవాడు. (జీవులను తనయందు లీనము చేసికొనువాడు) "అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయస్తథా (గీత–7–6) అను వాక్య మిందుకు ప్రమాణము.

2 ఎవనినుండి "ఆత్మా" = మనస్సులు, "నివృత్త" = మరల్చ బడినవో అతడు. "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ; యన్మ

నసా న మనుతే'' అను శ్రుతి వాక్యములు ఇందుకు ప్రమాణము. (అనూహ్యుడు.)

## 611 సంక్షేప్తా

1 సమ్+క్షేప్తా; "సమ్" = బాగుగా; "క్షేప్తా" = బొటన వ్రేలితో దుందుభి శరీరమును విసిరినవాడు. లేక బాగుగా బాణములను విసరువాడు. (రాముడు.)

2 సృష్టియందు విస్తృతముగా ఉన్న జగత్తును ప్రళయముతో "సంక్షేప్తా'' = సంకోచింప జేయువాడు.

## 612 క్షేమకృత్

1 క్షేమ+కృత్; "క్షేమ" = క్షేమమును; "కృత్" కలిగించువాడు. "యోగక్షేమం వహామ్యహమ్" అను గీతావాక్యము ఇందుకు ప్రమాణము.

2 కొందరు ఈ నామమును "అక్షేమకృత్" అని పఠింతురు. అప్పుడు "అక్షేమ" = క్షేమముకాని దానిని (దుఃఖమును) "కృత్" (కృంతతి) = కోయువాడు అని అర్థము వచ్చును. "కృతీ = ఛేదనే" అని ధాతువు.

## 613 శివః

1 సుఖాత్మకుడు.

2 మంగళము కలవాడు.

3 శి+వః; "శి" = ముక్తులు. వారిని "వః" = వర్తింప జేయువాడు.

## 614 శ్రీవత్సవక్షాః

1 శ్రీ+వత్స+వక్షాః; "శ్రీ"=లక్ష్మితో కూడిన (అందమైన)

"వత్సః" = మహాత్వ లక్షణమును సూచించు తెల్లని రోమముల సుడి; వక్షాః = వక్షమునందు కలవాడు.

## 615 శ్రీవాసః

శ్రీ + వాసః; "శ్రీ" = లక్ష్మికి, వాసః = నివాసమైనవాడు.

## 616 శ్రీపతిః

శ్రీ + పతిః శ్రీ = లక్ష్మికి; పతిః = భర్త.

## 617 శ్రీమతాంవరః

1 శ్రీమతామ్ + వరః; "శ్రీమతామ్ = సరస్వతి మొదలగు దేవతలు కలవారు శ్రీమంతులు (బ్రహ్మాదులు.) వారిలో "వరః" శ్రేష్ఠుడు (దేవతా శ్రేష్ఠుడు.)

2 శ్రీ + మత + అవరః, శ్రీ = లక్ష్మియొక్క మతము = (ఇష్టము) ఎవనికి "అవరమ్" = తక్కువ అయినదో లేక శ్రేష్ఠము కాదో అతడు. (లక్ష్మిని వశమునం దుంచుకొనినవాడు.)

3 ఈ నామమునే "శ్రీమతాంబరః" అని కొందరు పఠింతురు. అప్పుడు "శ్రీ" = లక్ష్మికి; "మత" = అభిమతమైన, "అంబర" = ఆకాశము, ఎవనికి ఆధారమో అతడు. "యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్" అను శ్రుతివాక్యము ఇందుకు ప్రమాణము. (గుహాకాశ నివాసి.) సర్వస్యచాహం హృది సన్నివిష్టో అను గీతా వాక్య మిందుకు ప్రమాణము.

శ్లో॥ శ్రీద శ్శ్రీశ శ్శ్రీనివాసః శ్శ్రీనిధిః శ్శ్రీవిభావనః।
శ్రీధర శ్శ్రీకర శ్శ్రేయః శ్రీమాం ల్లోకత్రయాశ్రయః॥ 65

## 618 శ్రీదః

1 శ్రీ + దః; "శ్రీ" = సంపదను; "దః" = ఇచ్చువాడు.

2 "శ్రీ" = రుక్మిణి కొరకు ప్రద్యుమ్నుని; "దః" = కుమారునిగా ఇచ్చువాడు.

## 619 శ్రీశః

శ్రీ + శః; "శ్రీ" = లక్ష్మికి ఎవని వలన "శః" = సుఖము కలుగునో అతడు.

## 620 శ్రీనివాసః

1. శ్రీ + నివాసః; "శ్రీ" = లక్ష్మియందు అంతర్యామిగా నివాసః = (నివసతి) = నివసించువాడు.

2 శ్రీ + ని + వాసః; "శ్రీ" = సంపదను, "ని" = (నయతి) = తెచ్చువాడు = శ్రీనిః.

"వాసః" = జనులు ఇచ్చటనే [ఇతనియందు] వసింతురు. "శ్రీని" యును, "వాసు" డును అగువాడు = శ్రీనివాసః. లక్ష్మి ప్రదుడును-జనులకు మూలకారణుడును అగువాడు.]

## 621 శ్రీనిధిః

శ్రీ + నిధిః; "శ్రీ" కాంతులు; "నిధిః" [నిధీయంతే] ఉంచబడుచున్నవి కనుక శ్రీనిధిః = (కాంతులకు నిధి.)

## 622 శ్రీవిభావనః

1 శ్రీ + వి + భావ + నః; "శ్రీ" = లక్ష్మికి, "వి" = విశేషమైన, "భావ" భావములను, "నః" = తెచ్చువాడు.

2 శ్రీ+విభా+అవనః; "శ్రీ" = లక్ష్మియొక్క, "విభా"=కాంతులతో; "అవనః" (అవతి)=తృప్తి పొందువాడు. (లక్ష్మియొక్క తేజస్సుతో తృప్తిపడువాడు.)

3 శ్రీ+విభా+వనః; "శ్రీ"=లక్ష్మియొక్క, "వి"=విశిష్టమైన, "భా"= కాంతి గలది=శ్రీ విభా=సీత; ఆమె యొక్క "వనమ్"=[సంభజనమ్] సేవ కలవాడు- ("సీతాపతి" యని భావము.)

4 శ్రీ+వి+భావనః; "శ్రీ" = లక్ష్మియొక్క. "వి" = వివిధములైన విభూతులను, "భావనః"=ఆలోచించువాడు. "వ్యస్త సమస్త విశ్వ విభూతయే విష్ణవే లోక కర్త్రే" అను స్కాంద పురాణోక్తి ఇందుకు ప్రమాణము. (లక్ష్మియొక్క వివిధ విభూతులను [ఐశ్వర్యములను] భావన చేయువాడు.)

## 623 శ్రీధరః

శ్రీ+ధరః; "శ్రీ" = లక్ష్మిని, "ధరః" = ధరించినవాడు.

## 624 శ్రీకరః

1 శ్రీ+కరః; "శ్రీ" = లక్ష్మి; "కరః" = చేతియందు కలవాడు.

2 శ్రీ= సంపదను, "కరః" = కల్గించువాడు.

## 625 శ్రేయః

శ్రేయః = అతిశయముగా స్తుతింప దగినవాడు.

## 626 శ్రీమాన్

శ్రీ+మాన్; "శ్రీ" = లక్ష్మిని, "మాన్ = కొలుచువాడు. "మా = మానే" అను ధాతువునుండి ఈ అర్థము వచ్చినది.

## 627 లోకత్రియాశ్రయః

1 లోకత్ర+ఈ+ఆశ్రయః; "లోకత్రి" = లోకమును రక్షించువాడు, "ఈ" = లక్ష్మికి, "ఆశ్రయః" = ఆశ్రియమైనవాడు = (యాశ్రయః.)

(లోకత్ర+యాశ్రియః = లోకములను రక్షించువాడును. లక్ష్మికి ఆశ్రియ మైనవాడును.)

2 లోకత్రయ+ఆశ్రయః; "లోకత్రయ" = లోకత్రయమునకు, "ఆశ్రియః" = ఆశ్రయ మైనవాడు.

3 లోకత్రయ = లింగ, అనిరుద్ధ, స్థూలము లను పేరుకల దేహమునకు ఎవనివలన జీవులు ఆశ్రయు లగుదురో అతడు. (మూలకారణుడు.)

శ్లో॥ స్వక్షః స్వఙ్గ శ్శతానందో నన్ది ర్జ్యోతిర్గణేశ్వరః।
విజితాత్మా విధేయాత్మా సత్కీర్తి శ్ఛిన్నసంశయః॥ 66

## 628 స్వక్షః

1 సు+అక్షః; "సు" = మంచి, "అక్షః" = ఇంద్రియములు కలవాడు.

2 అర్జునునకు ఎవనివలన—"సు" = విశ్వరూపమును చూడగలిగిన భాగ్యము కల, "అక్ష" = కన్నులు వచ్చినవో అతడు.

"దివ్యం దదామి తే చక్షుః" అను గీతోక్తి ఇందుకు ప్రమాణము.

## 629 స్వంగః

1 సు+అంగః; "సు"=మంచి లేక శోభనములైన, "అంగః" = అవయవములు కలవాడు.

2 భక్తులను "స్వమ్" = తనవద్దకు, "గః" = నడిపింప జేయువాడు.

## 630 శతానందః

1 శత+ఆనందః; "శత" = అనంతమైన, ఆనందః = ఆనందము కల వాడు.

2 బ్రహ్మకు "శత" = వంద, ఆనందః = ఆనందములు, ఎవనినుండి కలుగునో అతడు. (బ్రహ్మకు కూడ బ్రహ్మానందమును కలిగించు వాడు.)

## 631 నందిః

1 ఆనందము కలవాడు.

2 నందిప చేయువాడు.

## 632 జ్యోతిర్గణేశ్వరః

1 జ్యోతిర్గణః = సూర్యాది జ్యోతి స్సముదాయమునకు, "ఈశ్వరః" = నాయకుడు.

1 జ్యోతిః + గణ + ఈశ్వరః = జ్యోతిః = విశ్వము నంతను తనయం దుంచుకొన్నవాడును, జాతమోతం హరా యస్మాత్ అను శృతి వాక్యము ఇందుకు ప్రమాణము. గణ = దేవతాసమూహానకు, ఈశ్వరః–నాయకుడు–జ్యోతియను, గణేశ్వరుడును = జ్యోతిర్గణేశ్వ రుడు. (విశ్వగర్భుడు–దేవనాయకుడు.)

## 633 విజితాత్మా

1 విజిత + ఆత్మా = ఎవని చేత "ఆత్మా" = జీవులు లేక మనస్సులు, "విజిత" = గెలువబడినవో అతడు. (జీవులను తన మాహాత్మ్య ముతో గెలిచినవాడు.)

2 వి+జిత+ఆత్మా; "వి" = గరుత్మంతుని చేత "జిత" = పొంద బడిన, "ఆత్మా" = శరీరము కలవాడు. (గరుడవాహనుడు.)

## 634 విధేయాత్మా

విధేయ+ఆత్మా = "విధేయ" = విధి విషయములైన స్నాన పానాదుల యందు. "ఆత్మా" = మనస్సు కలవాడు.

## 635 సత్కీర్తిః

1 సత్ +కీర్తిః; "సత్" = మంచి; "కీర్తిః" = కీర్తి కలవాడు.

2 "కీర్తి" అను పేరుగల భార్య వామన రూపమందు కలవాడు.
"ఉరుక్రమస్య దేవస్య మాయా వామనరూపిణః।
కీర్త్యాం పత్న్యాం బృహచ్ఛ్లోకా స్తస్యాసన్ సౌభగాదయః॥ 6-18-8
అను భాగవత షష్ఠస్కంధము నందలి వాక్యము, ఇందుకు ప్రమాణము.

## 636 ఛిన్న సంశయః

ఎవనిచేత సంశయము ఛిన్నమైనదో అతడు.
"భిద్యతే హృదయ గ్రంథిః ఛిద్యంతే సర్వసంశయాః।
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే"॥
అను శ్రుతివాక్యము ఇందుకు ప్రమాణము. (సర్వసంశయములను ఛేదించువాడు.)

శ్లో॥ ఉదీర్ణ స్సర్వతశ్చక్షు రనీశ శ్శాశ్వతస్థిరః।
భూశయో భూషణో భూతి ర్విశోక శ్శోకనాశనః॥ 67

## 637 ఉదీర్ణః

1 ఉ+దీర్ణః=ఎవని చేత, "ఉ"=శివుడు ప్రళయకాలములో,

"దీర్ణః"=లయము పొందింప బడునో అతడు. (శివునకు కూడ లయమును కల్గించువాడు.)

2 "ఉత్ + ఈర్ణః" = ఉత్కృష్టుడు అయినవాడు.

## 638 సర్వతశ్చక్షుః

సర్వతః = అన్నివైపుల, "చక్షుః" = కన్నులు కలవాడు.

## 639 అనీశః

1 న + ఈశః = ఎవనికి ఈశుడు లేడో అతడు. (సర్వేశ్వరుడు.)

2 అని + ఈశః; "అని" = ప్రాణులకు, "ఈశః" = ఈశుడు.

## 640 శాశ్వతః

శత్రువులచే విడువబడిన ఆయుధములను పరిహరించి భక్తులకు ప్రాణములను ఇచ్చుట చేత శాశ్వతుడు. "శ్వస = ప్రాణనే" అను ధాతువునుండి ఈ అర్థము వచ్చినది.

## 641 స్థిరః

శత్రువుల యొక్క గతిని (మార్గమును) నివారించుటచేత స్థిరుడు. (శ్రీ) సత్యసంధతీర్థులవారు 640, 641 నామములను కలిపి "శాశ్వత స్థిరః" అని చూపి అర్థము చెప్పినారు.

## 641 A శాశ్వతస్థిరః

శాశ్వత + స్థిరః; "శాశ్వత" = శశ్వత్ భవః = ఎల్లప్పుడు ఉండు వాడు. (నిత్యుడు.) "స్థిరః" = స్థిరమైనవాడు. (శాశ్వతుడును, స్థిరుడును అగువాడు.)

## 642 భూశయః

1 భూ+శయః; "భూ" = భూమి, "శయః" = చేతియందు కలవాడు "పాణిః శమః శయః హస్తః" అని అమరమాలా వాక్యము. "పంచశాఖశ్శయః పాణిః" అని అమరము. (వారాహ రూపమున, భూమిని కట్టుకొనినవాడు.)

2 "భూ" = భూమిరూపమున ఉండునట్టి లక్ష్మితో "శయః" = పరుండువాడు. (వరాహరూపమున భూ భర్త అయినవాడు.)

3 భూ = భూమియందు, "శయః" (శేతే) = పండుకొనువాడు. (శ్రీరంగాది క్షేత్రముల యందలి అర్చామూర్తి.)

## 643 భూషణః

1 అలంకరించువాడు.

2 భూ+షణః, "భూ" = పూర్ణములైన, "షణః" = 1) చేష్ట 2) ఆనందము 3) భూషణములు కలవాడు.

## 644 భూతిః

ఐశ్వర్య రూపుడు.

## 645 విశోకః

1 వి+శోకః=ఎవని నుండి, "శోకః" = దుఃఖము "వి" =విగతమైనదో (తొలగి పోయినదో) అతడు.

2 వి+శ+ఓకః; "వి"=విశేషముగా, "శ" = సుఖము ఎక్కడ కలదో అది = విశః = వైకుంఠాది లోకము. ఆ లోకము ఎవనికి "ఓకః" = నివాసమో అతడు. (వైకుంఠ వాసుడు.)

## 646 శోకనాశనః

1 శోక + నాశనః; "శోక" = శోకమును, "నాశనః" = నశింపజేయువాడు.

2 శోకనాశ + నః; "శోకనాశ" = ఎవరికి శోకము నశించినదో వారు. (ముక్తులు.) వారిని "నః" = నడిపించువాడు. (ముక్తులకు మార్గదర్శి.

శ్లో॥ అర్చిష్మా నర్చితః కుమ్భో విశుద్ధాత్మా విశోధనః।
అనిరుద్ధోఽ ప్రతిరథః ప్రద్యుమ్నోఽ మితవిక్రమః॥ 68

## 647 అర్చిష్మాన్

కాంతులు కలవాడు.

## 648 అర్చితః

బ్రహ్మాదులచేత అర్చింపబడినవాడు.

## 649 కుంభః

కుమ్ + భః; "కుమ్" = భూమిని; "భః" = (భాసయతి) = ప్రకాశింపజేయువాడు.

## 650 విశుద్ధాత్మా

విశుద్ధ + ఆత్మా = విశుద్ధమైన ఆత్మకలవాడు.

## 651 విశోధనః

వి + శోధనః; "వి" = విశేషముగా వేదములను "శోధనః" = శోధించువాడు. (పరిశీలించువాడు.)

## 652 అనిరుద్ధః

1 న+నిరుద్ధః; "నిరుద్ధః" = నిరుద్ధుడు. (ఆపదగినవాడు.) "న" = కాని వాడు. (ఎదురు లేనివాడు.)

2 అనిరుద్ధ+ధః; "అనిరుద్ధ" = సంసారము నుండి ముక్తులైన వారు. వారిని "ధః" = (దధాతి) = ధరించువాడు లేక పోషించువాడు. (ముక్తపోషకుడు.)

3 అనిః+ఉత్+ధః; "అనిః" = అనిరస్తమైన, = అప్రధృష్య మైన, దోషరహితమైన, "ఉత్" = ఉత్ అను పేరును, "ధః" = ధరించువాడు. "ఏత స్యోదేతి నామ" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము. (నిర్దోషి, అప్రధృష్యుడు, "ఉత్" అను గొప్ప పేరు కలవాడు.)

## 653 అప్రతిరథః

న+ప్రతిరథః; "ప్రతిరథః" = ప్రతిపక్షము "న" = లేనివాడు.

## 654 ప్రద్యుమ్నః

ప్ర+ద్యుమ్నః; "ప్ర"=మిక్కిలి, "ద్యుమ్నః"=కీర్తి కలవాడు. "ప్రద్యుమ్నో దివి స్నాయతే" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

## 655 అమితవిక్రమః

1 అమిత+విక్రమః; 'అమిత'=అమితమైన లేక కొలుచుటకు వీలు లేని, "విక్రమః"=పరాక్రమము కలవాడు.

2 కొందరు ఈ నామమును "మిత విక్రమః" అని చదువుదురు. అప్పుడు అర్థము:-

మిత + విక్రమః; "మిత" = వేదాది ప్రమాణములలో కొలువదగిన, "విక్రమః" = పరాక్రమము కలవాడు.

శ్లో॥ కాలనేమినిహా వీరః శ్శౌరి శ్శూరజనేశ్వరః।
త్రిలోకాత్మా త్రిలోకేశః కేశవః కేశిహా హరిః॥ 69

## 656 కాలనేమినిహా

కాలనేమి + ని + హా; "కాలనేమి" = కాలనేమి అను పేరుగల రాక్షసుని, "ని" = బాగుగా "హా" (హంతి) = చంపువాడు.

## 657 వీరః

వి + ఈరః; "వి" = 1 విశేషముగా 2 విశిష్టులను

"ఈరః" (ఈరయతి) = అభివృద్ధి వైపునకు, దైవసాన్నిధ్యమునకు నడిపించువాడు. (విశిష్టులను భగవత్సాన్నిధ్యమునకు చేర్చువాడు.)

## 658 శౌరిః

"శూర" కులమున ఉద్భవించినవాడు.

## 659 శూరజనేశ్వరః

1 శూర + జనేశ్వరః; "శూర" = శూరవంశము నందలి, "జనేశ్వరః" = రాజు.

2 శూరజ + న + ఈశ్వరః; "శూరజ" = శూరవంశమునందు జన్మించినవాడు; ఎవనికి "ఈశ్వరః" = ఈశ్వరుడు లేక నియామకుడు "న" = లేడో అతడు–నేశ్వరః = శూరజ + నేశ్వరః. (శూరజుడును, నియామకుడు లేనివాడును = శూరజనేశ్వరః.)

## 660 త్రిలోకాత్మా

త్రిలోక + ఆత్మా; "త్రిలోక" = మూడులోకములకు, "ఆత్మా" = ఆత్మ (శరీరము) అగువాడు.

## 661 త్రిలోకేశః

త్రిలోక + ఈశః; "త్రిలోక" = మూడులోకములకు "ఈశః" = నాయకుడు.

## 662 కేశవః

1 కేశ + వః; "కేశ" = శుక్ల, కృష్ణ కేశములను, కాంతి మార్గములను (ఉత్తరాయణ, దక్షిణాయనములను) భూమియందు "వః" (వర్తయతి) = వర్తింప జేయువాడు. (కాలస్వరూపుడు.)

2 కేశ = నల్లని కేశముతో రాక్షసులను "వః" (వాతి) = గంధయతి = గాయపరచువాడు.

సంప్రదాయం: వరాహ రూపమున కేశములతో రాక్షసులను హరించినాడనుట విదితమే.

3 క + ఈశ + వః; "క" = బ్రహ్మను, "ఈశ" = రుద్రుని, "వః" (వర్తయతి) = వారి వారి విధులయందు ప్రవర్తింప జేయువాడు.

## 663 కేశిహా

1 కేశి + హా = కేశి అను పేరుగల రాక్షసుని "హా" (హంతి) = చంపువాడు.

2 కేశి + హా = "కేశి" = ద్రౌపది యొక్క జుత్తును లాగిన దుశ్శాసనుని, "హా" (హంతి) = చంపువాడు. (భీముని ప్రోత్సహించినవాడు.)

## 664 హరిః

పాపమును హరించువాడు.

శ్లో॥ కామదేవః కామపాలః కామీ కాన్తః కృతాగమః।
అనిర్దేశ్యవపు ర్విష్ణుః వీరోఽనంతో ధనంజయః॥ 70

## 665 కామదేవః

కామ + దేవః; "కామ"=మన్మథునివలె "దేవః"=(ద్యోతతే)= ప్రకాశించువాడు. "దివు=క్రీడా విజిగీషా ద్యుతి స్తుతి" అను ధాతువునుండి ఈ అర్థము వచ్చును. (మన్మథసుందరుడు.)

## 666 కామపాలః

1 కామ + పాలః; "కామ"=కోరికలను, "పాలః" (పాలయతి)= పాలించువాడు.

2 కామ + పాలః; "కామ"="క"=బ్రహ్మచేత కాని, వాయువు చేత కాని, "ఆమ్యతే"=చేరబడువాడు=కామః. "పాలః"=జనులను పాలించువాడు. కాముడును, పాలుడును అగువాడు=కామపాలః. (బ్రహ్మాదులచే సేవ్యుడు-జీవరక్షకుడు.)

## 667 కామీ

జగత్తుయొక్క రక్షణ మొదలగు వానిని "కామయతే"=కోరు కొనువాడు.

## 668 కాంతః

మనోహరుడు.

## 669 కృతాగమః

1 కృత + ఆగమః = ఎవనిచేత, "ఆగమః" = పురాణాదులు, "కృత" = చేయబడినవో అతడు. (వ్యాసుడు.)

2 కృత + అగమః; "కృత" = కృ = హింసాయామ్ అను ధాతువునుండి "కృత" = కోయబడిన "అగమః" = విషవృక్షము లేక అర్జున వృక్షము కలవాడు. (కృష్ణుడు.)

3 కృత + అగ + మః = భూమియందు "కృత" = ఉంచబడిన, "అగ" = పారిజాతవృక్షము కల "మా" = సత్యభామ భార్యగా కలవాడు. (సత్యాపతి.)

4 కృత + అగమః; "కృత" = చేయబడిన కర్మతో "అగమః" = చేరుటకు వీలులేనివాడు.

## 670 అనిర్దేశ్యవపుః

అనిర్దేశ్య + వపుః = ఇంతది, ఇట్టిది అని నిర్దేశించి చెప్పుటకు వీలులేని శరీరము కలవాడు. "తదేతత్ ఇతి మన్యంతే అనిర్దేశ్యం పరమం సుఖమ్" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము.

## 671 విష్ణుః

వి + ష + ణ + ఉ; విష్ణు శబ్దమునకు పలువిధములైన వ్యాఖ్యానము లున్నవి. ఐతరేయ భాష్యములో విష్ణు శబ్దమున కిట్లు అర్థము చెప్ప బడినది. విష్ణు శబ్దములోని "ణ" కారము చేత విష్ణువుయొక్క బలము చెప్పబడినది.

విష్ణునామము నందలి "ష" కారము చేత రమా, బ్రహ్మ, ఈశ్వరులు మొదలగువారు సూచింప బడుదురు. "ష" కారముచే విష్ణువునకు

గల ఆతతత్వము (వ్యాపించి ఉండు శక్తి) సర్వగుణములతో సర్వ దేశ కాలముల యందు వ్యాపించి ఉండు శక్తి సూచింప బడినది. "ష" కారమే విష్ణువుయొక్క పూర్ణత్వమును కూడ సూచించును. విష్ణు శబ్దములోని "వి" అను ఉపసర్గ విశిష్టత్వమును సూచించును. విష్ణుపదమునకు చివరనున్న "ఉ" కారము పైన చెప్పిన గుణము లన్నియు (వి + ష + ణ అను పదములకున్న అర్థమంతయు) కల వాడు అను అర్థము నిచ్చును. ఈ విధముగా విశిష్టమైన ప్రాణము కలిగి ఉండుటను, అనంతత్వమును, విశిష్టత్వమును, బలమును విష్ణు శబ్దముచే సూచింపబడినవి. ఋగ్వేద సంహితను బట్టి ఈ అర్థము వచ్చినది. రెండక్షరముల కలయికతో ఏర్పడిన విష్ణు శబ్దమునకు "ప్రాణము కలిగియుండుట, ఆత్మ అయి ఉండుట, బలముకలిగి యుం డుట" అను అర్థములను ఎవడు తెలిసికొనునో అతడే సంసారము నుండి ముక్తుడై నిత్యాయుర్దాయము కలవాడగును.

## 672 వీరః

1 వి + ఈరః; "వి" = విశిష్టమైన (ఇచ్ఛాను రూపమైన) "ఈరః" = సుఖము కలవాడు.

"ఇచ్ఛాను రూపంతు సుఖం ఈరా ఇత్యనేన ప్రకీర్తితమ్" అను ఐతరేయ భాష్యోక్తి ఇందుకు ప్రమాణము.

2 వీరః = సమర్థుడు.

## 673 అనంతః

అంతః = నాశము, "న" = లేనివాడు.

## 674 ధనంజయః

ధనం జయతీతి = ధనంజయః;
"ధనమ్" = ధనమును, ధర్మరాజుయొక్క రాజసూయ యాగము నకై, "జయః" = గెలిచి తెచ్చినవాడు.

ధనమును జయించి తెచ్చువాడు. "పాండవానాం ధనంజయః (గీత–10–37) అను గీతావాక్యము వలన కృష్ణుడే అర్జును డని నిర్ణయమైనది.)

శ్లో॥ బ్రహ్మణ్యో బ్రహ్మకృద్బ్రహ్మా బ్రహ్మ బ్రహ్మవివర్ధనః।
బ్రహ్మవిద్బ్రాహ్మణో బ్రహ్మీ బ్రహ్మజ్ఞో బ్రాహ్మణప్రియః॥ 71

## 675 బ్రహ్మణ్యః

1 బ్రాహ్మణులకు ప్రియుడైనవాడు.

2 ముక్తులను ఆనందముతో "బ్రహ్మయతి"=అభివృద్ధి చేయువాడు.

3 "బ్రహ్మ" అను పేరుగల సుధా సముద్రము ఎవనినుండి ఉద్భవించినదో అతడు బ్రహ్మణ్యుడు.

## 676 బ్రహ్మకృద్బ్రహ్మ

బ్రహ్మకృతమైన స్తోత్రమును పఠించు యజమానుని వృద్ధిపొందించువాడు.

"బృహ, బృహి=వృద్ధౌ" అను ధాతువువలన ఈ అర్థము వచ్చినది. శ్రీ సత్యసంధ తీర్థులవారు "బ్రహ్మ కృద్బ్రహ్మ" అను నామమును రెండు నామములుగా విడదీసి అర్థము చెప్పిరి.

## 676 (A) బ్రహ్మకృత్

బ్రహ్మ+కృత్; "బ్రహ్మ"=(వేదములు, తపస్సు, తత్వము అను అర్థములు) ఆలోచనాత్మకమైన తపస్సును "కృత్" = చేయువాడు. కొందరు ఈ నామమును "అబ్రహ్మకృత్" అని పఠింతురు. అప్పుడు అర్థము:–

అబ్రహ్మ+కృత్; "అబ్రహ్మ"=బ్రహ్మకంటె భిన్నులైన దుష్ట క్షత్రియులను పరశురాముడు అను రూపముతో "కృత్"= ఖండించినవాడు.

"అవతారే మే షోడశతమే యచ్ఛ బ్రహ్మద్రుహో నృపాన్ ।
త్రిః సప్తకృత్వః కుపితోనిఃక్షత్రా మకరోన్మహీమ్ ॥
అను వాక్యము ఇందుకు ప్రమాణము.

2 అబ్రహ్మ=నిరీశ్వర వాదులను, "కృత్" (కృణోతి)= విమర్శించువాడు. వారి వారి వాదములను ఖండించువాడు.

## 676 (B) బ్రహ్మ

భక్తులను "బృంహయతి" అభివృద్ధి పొందించువాడు.

## 677 బ్రహ్మ

1 జగత్తును సృష్టించినవాడు "యతోవా ఇమాని భూతాని జాయంతే... తం బ్రహ్మేతి" అను తైత్తిరీయ వాక్యము ప్రమాణము.

2 జగత్తంతయు నిండి ఉండుటచే దానిని బృంహయతి=పెద్దదిగా చేయువాడు. "అథ కస్మా దుచ్యతే పరం బ్రహ్మ బృంహయతిచ" అను శ్రుతివాక్యము ఇందుకు ప్రమాణము.

## 678 బ్రహ్మవివర్ధనః

బ్రహ్మ+వివర్ధనః; "బ్రహ్మ"= వేదము. దానిని "వివర్ధనః"= వ్యాస రూపముతో వర్ధింప జేయువాడు.

## 679 బ్రహ్మవిత్

1 బ్రహ్మ+విత్; "బ్రహ్మ" వేదమును, "విత్"= తెలిసికొన్నవాడు.

2 మమ యోనిర్మహద్ బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్" అను ప్రమాణమును బట్టి బ్రహ్మ శబ్దము లక్ష్మిని బోధింపగా లక్ష్మిని "విత్" (విందతే)=పొందువాడు=బ్రహ్మవిత్.

3 బ్రహ్మ=స్వస్వరూపమును, "విత్"=తెలిసినవాడు. "తదాత్మాన మేవ అవేత్" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము.

## 680 బ్రాహ్మణః

బ్రహ్మణా=బ్రహ్మచేత,=వేదముచేత, "గమ్యతే"=చేరబడువాడు.

## 681 బ్రహ్మీ

జీవములు తన (బ్రహ్మ) యందు కలవాడు.

## 682 బ్రహ్మజ్ఞః

బ్రహ్మ+జ్ఞః; "బ్రహ్మ"=చతుర్ముఖుడు ఎవరిని "జ్ఞః"=తెలిసికొనినాడో అతడు.

## 683 బ్రాహ్మణ ప్రియః

1 బ్రాహ్మణ+ప్రియః; "బ్రాహ్మణ"=బ్రహ్మ+అణతి=బ్రహ్మను స్తుతించువాడు (జ్ఞాని). ఆ జ్ఞానియే "ప్రియః"=ఎవనికి ఇష్టుడో అతడు. (జ్ఞానులను అభిమానించువాడు.)

"ప్రియో హి జ్ఞాని నోఽత్యర్థం అహం స చ మమ ప్రియః" (గీత : 7–17) అను గీతా వాక్యము ఇందుకు ప్రమాణము.

2 బ్రాహ్మణ=ముక్తులకు, "ప్రియః"=ఇష్టమైన వాడు=బ్రాహ్మణప్రియః=(బ్రాహ్మణులనగా ముక్తులని, బృహదారణ్యక భాష్యమందు గలదు.)

శ్లో॥ మహాక్రమో మహాకర్మా మహాతేజా మహోరగః।
మహాక్రతు ర్మహాయజ్వా మహాయజ్ఞో మహాహవిః॥ 72

## 684 మహాక్రమః

మహత్ + క్రమః = మహాక్రమము = "అగ్ని మీాళే" మొదలగు వేద క్రమము ఎవని బుద్ధియందు ఉండునో అతడు. (వేదభావనుడు.)

"వేదాన్తే నిత్య విన్నత్వాత్ శ్రుతయ శ్చాఖిలై శ్రుతేః।
ఆమ్నాయో౽ నన్యథా పాఠాత్। ఈశ బుద్ధిస్థితా స్సదా॥"

అను స్మృతి వాక్యము ఇందుకు ప్రమాణము.

## 685 మహాకర్మా

1 మహా (మహత్) + కర్మా = జగత్తును సృష్టించుట మొదలగు రూపమునఉండు కర్మ కలవాడు.

2 ఈ నామమునే కొందరు (మహా + మహత్ + అకర్మా అని పఠింతురు. అప్పుడు అర్థము "మహాన్ = మహాత్ముడును, "అకర్మా" = కర్మలు చేయుటయందు ఎట్టి క్లేశమును పొందని వాడును మహాకర్మా అగును.

## 686 మహాతేజాః

మహత్ + తేజాః; "మహత్" = సూర్యాది తేజస్సులను నియమించునట్టి తేజస్సు కలవాడు.

## 687 మహోరగః

మహత్ + ఉరగః; "మహత్" = గొప్పవియగు, "ఉరగః" = శేషుడు, కాళియుడు మొదలగు సర్పములు దాసులుగా కలవాడు.

## 688 మహాక్రతుః

"స క్రతుః జ్ఞాన రూపత్వాత్" అను వాక్యము వలన "క్రతుః" = అనగా జ్ఞానరూపుడు. మహాత్ + క్రతుః = గొప్ప జ్ఞానరూపమున ఉండువాడు.

## 689 మహాయజ్వా

మహాత్ = గొప్పవారైన బ్రహ్మ మొదలగువారు ఎవని కొఱకు, "యజ్వా" = యజ్ఞములను చేయుదురో అతడు.

## 690 మహాయజ్ఞః

1 ఎవనినిగురించి "మహాత్ = అశ్వమేధము మొదలగు గొప్ప "యజ్ఞః" = యజ్ఞములు చేయబడునో అతడు.

2 మహాత్ + అయ + జ్ఞః; "అయ" = శుభావహమైన విధి, దానిని "జ్ఞః" = తెలిసినవాడు = అయజ్ఞః, మహాత్ + అయజ్ఞః = మహాత్ముడును, అయజ్ఞుడును అగువాడు. (గొప్పవాడు = శుభప్రదములగు విధులను నిర్వహించుటయును, నిర్వహింప జేయుటయును తెలిసిన వాడు.)

3 కొందరు ఈ నామమును "అమహాయజ్ఞః" అని పఠింతురు. అప్పాను అర్థము.

అమ + హా + అయ + జ్ఞః; "అమ" = రోగమును "హా" (హంతి) = నశింప జేయువాడును (అమహః) "అయ" = శుభావహ విధిని, "జ్ఞః" = తెలిసిన వాడును = అమహాయజ్ఞః, (రోగనాశకుడు-శుభ విధులను తెలిసినవాడు.)

## 691 మహాహవిః

1 మహాత్ + అహ + విః; "మహాత్" = ఉత్సవమునకు సంబంధించిన

"అహ" = దినముల యందు, "విః" = గరుడుడు వాహనముగా కలవాడు. (ఉత్సవముల యందు గరుడవాహనుడై ఊరేగువాడు.)

2 మహాత్ + హావిః; మహాత్ = మహాత్ముడును, "హావిః" = (ఆహూయతే) యజ్ఞములయందు హవిస్సును అందుకొనుటకు, భక్తుల కష్టములను తొలగించుటకును పిలువబడువాడు.

శ్లో॥ స్తవ్యః స్తవప్రియః స్తోత్రం స్తుతిః స్తోతా రణప్రియః।
పూర్ణః పూరయితా పుణ్యః పుణ్యకీర్తి రనామయః॥ 73

## 692 స్తవ్యః

స్తోత్రము చేయుటకు తగినవాడు.

## 693 స్తవప్రియః

స్తోత్రములనిన ఇష్టము కలవాడు.

## 694 స్తోత్రమ్

స్తుతింపబడువాడు.

## 695 స్తుతి స్తోతా

స్తుతేః + స్తోతా = స్తుతిస్తోతా = భక్తులచే చేయబడు స్తోత్రాదులను అభినందించువాడు.

(శ్రీ) సత్యసంధ తీర్థుల వారు ఈ నామమును రెండు నామములుగా విడదీసి అర్థము చెప్పిరి.

## 695 (A) స్తుతిః

స్తుతిః = జనులచే రచింపబడిన స్తుతులను నియమించువాడు.

## 695 (B) స్తోతా

స్తోత్రము చేయువాడు. "న ఋతే త్వత్ క్రియతే" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

## 696 రణప్రియః

1 రణ = యుద్ధము అనిన, "ప్రియః" = ఇష్టమైనవాడు.

2 రణ = వేదాత్మకమైన శబ్దము అనిన "ప్రియః" = ఇష్టము కలవాడు. (వేద ప్రియుడు.)

## 697 పూర్ణః

గుణములచేత నిండినవాడు.

## 698 పూరయితా

భక్తులకు వారి వారి యోగ్యతను బట్టి కోర్కెలను తీర్చువాడు.

## 699 పుణ్యః

పవిత్రము చేయువాడు.

## 700 పుణ్యకీర్తిః

పుణ్యమైన కీర్తి కలవాడు.

## 701 అనామయః

1 రోగములు లేనివాడు.

2 అన + అమ + యః; "అన" = ముఖ్యప్రాణునితో "అమ" = ప్రాప్య స్థానమునకు, "యః" = తీసికొని పోవువాడు లేక నడిపించువాడు. (మోక్షదాత.)

శ్లో॥ మనోజవ స్తీర్థకరో వసురేతా వసుప్రదః।
వసుప్రదో వాసుదేవో వసు ర్వసుమనా హవిః॥ 74

## 702 మనోజవః

1 మనః+జవః; "మనః" = మనస్సుయొక్క, "జవ" = వేగమువంటి వేగము కలవాడు.

2 మనః = మనస్సునకు, "జవః" = వేగము ఎవనినుండి వచ్చునో అతడు.

## 703 తీర్థకరః

1 తీర్థ+కరః = "తీర్థ" = శాస్త్రము, "కరః" = చేతియందు కల వాడు. "శంఖ అక్ష పుస్తక సుబోధ యుక్తాబ్జ బాహుమ్" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

2 శాస్త్రములను నిర్మించినవాడు = రచించినవాడు.

## 704 వసురేతాః

1 వసు+రేతాః; వసు శబ్దమునకు "నీరు, ధనము, మణి" అను అర్థములు కలవు. దీని వలన "వసు" = నీటి యందు, "రేతాః" = వీర్యము కలవాడు. "అప ఏవస సర్జాదౌ తాసు వీర్యమ వాసృజత్" అను వాక్యము ఇందుకు ప్రమాణము. (సృష్టి కర్త.)

## 705 వసుప్రదః

వసు+ప్ర+దః; "వసు" = ధనములను, రత్నములను "ప్ర" = ఎక్కువగా, "దః" [దదాతి] = భక్తులకు ఇచ్చువాడు.

## 706 వసుప్రదః

వసు + ప్ర + దః; "వసు" = వసువు యొక్క అవతారమైన భీష్ముని, (అర్జునుని కొఱకు), "ప్ర" = ఎక్కువగా లేక బలముగా, "దః" = ఖండించినవాడు.

## 707 వాసుదేవః

1 వాసు + దేవః = వసుదేవః = వసువులకు దేవుడు (శ్రేష్ఠుడు) అయిన భీష్ముడు. అతనికి స్వామి అగుట వలన వాసుదేవుడు.

2 వసు + దేవః; "వసు" = వసువులు అను దేవతలచే లేక జ్ఞానాది రూపములగు ఆంతర ద్రవ్యముల చేత "దేవః" (దీవ్యతి) = ప్రకాశించునది = 'వసుదేవ' అను పేరుగల బ్రహ్మ శరీరము. అక్కడ తెలియబడువాడు వాసుదేవుడు. లేదా వసుదేవ శబ్దితమగు బ్రహ్మ శరీరమునకు ఆధారమైన వాడు.

"సత్త్వం శుద్ధం వసుదేవ శబ్దితం యదీయతే తత్ర పుమానపావృతః।
సత్త్వం చ యస్మిన్ భగవాన్ వాసుదేవో హ్యధోక్షజో మే మనసా విధీయతే"॥

అను భాగవతపు చతుర్థ స్కంధపు శ్లోకము ఇందుకు ప్రమాణము.

## 708 వసుః

వసుః (వసతి) = నివసించువాడు.

## 709 వసుమనాః

1 వసు + మనాః; "వసు" = వసువు అను పేరుగల రాజుయొక్క గానీ లేక అష్టవసువుల యొక్క, "మనాః" = మనస్సు ఎవని యందు ఉండునో అతడు.

2 వసు=శ్యమంతక మణియందు లేక భక్తులు ఇచ్చిన నీటియందు, "మనాః" = మనస్సు కలవాడు.

## 710 హవిః

"హూయతే"=ఆహ్వానింపబడువాడు=పిలువ బడువాడు.

శ్లో॥ సద్గతి స్సత్కృతి స్సత్తా సద్భూతి స్సత్పరాయణః।
శూరసేనో యదుశ్రేష్ఠ స్సన్నివాస స్సుయామునః॥ 75

## 711 సద్గతిః

1 సత్+గతిః; "సత్"=సత్పురుషులకు, "గతిః" = "సత్తా" మొదలగు వానిని ఇచ్చువాడు.

"యదధీనా యస్య సత్తా తత్తదిత్యేవ భణ్యతే" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

2 సత్+గతిః; "సత్"=నక్షత్రములకు ఎవనివలన "గతిః"=నడక కలుగునో అతడు.

## 712 సత్కృతిః

1 సత్+కృతిః; "సత్"=మంచి, "కృతిః"=ప్రయత్నము కలవాడు.

2 ప్రద్యుమ్నాది రూపములలో ఉన్నప్పుడు "సత్" = మంచి "కృతిః"="కృతి" అను భార్య కలవాడు.

## 713 సత్తా

1 సత్తా [సీదతి]=ఎల్లప్పుడు ఉండునట్టిది. అట్టివాడు. [శాశ్వతుడు.]

2 సత్తా=ఆనందమునకు ఆశ్రయుడు లేక ఆనందమును కలిగించువాడు.

"అథ కస్మా దుచ్యతే సత్తేతి-నందయ తీతి" అను భాగవత ప్రథమ తాత్పర్యోదాహృతమైన పైంగి శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము.

## 714 సద్భూతిః

1 సత్ + భూతిః; "సత్" = సత్పురుషులకు, "భూతిః" = ఎవనివలన ఐశ్వర్యము కలుగునో అతడు.

2 "సత్" = మంచిదైన, "భూతిః" = ఐశ్వర్యము కలవాడు.

## 715 సత్పరాయణః

1 "సత్ + పరాయణ; "సత్" = సత్పురుషులకు లేక యోగ్యులకు, "పరాయణః" = ముఖ్యాశ్రయుడు.

2 సత్పర + అయనః; "సత్" = వాయువునందు, "పర" = ఇష్టము కలిగినవారు = సత్పరులు. "ప్రాణం వావ మహాన్ సహ ఓజో బల మిత్యాచక్షతే" అను శ్రుతియును, "తతో వయం సత్ప్రముఖా యదర్థే" అను భాగవత ప్రయోగ వాక్యమును ఇందుకు ప్రమాణము. వారికి "అయనః" = ఆశ్రయమైనవాడు. (వాయురతులకు ఆశ్రయుడు.)

## 716 శూరసేనః

1 శూర + స + ఇనః; "ఇన" = స్వామితో, "స" = సహితులు (కూడిన వారు) = సేనులు. ఎవనిచేత సేనులు. "శూర" = శూరులైరో అతడు శూర సేనః (నాయకులకు కూడ శౌర్యము నిచ్చువాడు.)

2 శూర = శూరులైన జరాసంధాదులకు "సేనః" = బంధనము ఎవని వలననో అతడు. (జరాసంధాదులను నిగ్రహించినవాడు.) "షిఞ్ = బంధనే" అను ధాతువువలన ఈ అర్థము వచ్చును.

## 717 యదుశ్రేష్ఠః

1 యత్ + ఉ + శ్రేష్ఠః; "యత్" = ఏది ఉన్నదో దానికంటె "ఉ" = ఉచ్చ్రైమైనది = "యదు" అను పేరుగల రమాదులు. వారికి "శ్రేష్ఠః" = శ్రేష్ఠుడు. (లక్ష్మీపతి.)

2 యదు = యాదవ వంశము వారిలో "శ్రేష్ఠః" = శ్రేష్ఠుడు.

## 718 సన్నివాసః

సత్ + నివాసః; "సత్" = సజ్జనులు లేక సద్గుణములు ఇతనియందు నివసించు చున్నవి కనుక సన్నివాసః.

## 719 సుయామునః

సు + యామునః; "యామునః" = కాళియుని వెడలగొట్టుట చేత ఎవని వలన యమునానదిలోని నీరు "సు" = నిర్మలముగా చేయబడి నదో అతడు. (కాళియమర్దనము చేసినవాడు.)

శ్లో॥ భూతావాసో వాసుదేవ స్సర్వాసు నిలయోఽనలః।
దర్పహా దర్పదో దృప్తో దుర్ధరోఽథాఽపరాజితః॥ 76

## 720 భూతావాసః

1 భూత + అవ + ఆసః; "భూత" = ప్రాణులను, "అవ" (అవతి) = రక్షించువాడు = భూతావః; ఆసరతి = అన్నివైపుల కదలువాడు = ఆసః; భూతావః + ఆసః = భూతావాసః. (ప్రాణి రక్షకుడు— సర్వతోగామి.)

2 భూత + ఆవాసః = భూతములకు; "ఆవాసః" = నిలయమైనవాడు.

## 721 వాసుదేవః

1 వాసు = నివసించువాడు. (వాయువు.) అతనికి "దేవః" = దేవుడు= వాసుదేవః.

2 వా + అసుదేవః; "వా" = జ్ఞానము కొఱకు జన్మించిన, "అసుదేవః" = ప్రాణదేవుడు ఎవని నుండి ఉద్భవించెనో అతడు. (వాయుజనకుడు.)

కొందరు ఈ నామమునే "అవాసుదేవః" అని పఠింతురు. అప్పుడు అర్థము ఎవనికంటె వేరైన "వాసుదేవః" = సృగాల వాసుదేవుడు లేడో అతడు. (సృగాల వాసుదేవుని సంహరించిన వాడు.)

## 722 సర్వాసునిలయః

సర్వాసు + నిలయః; "సర్వ" = సమస్తమైన, "అసు" = ప్రాణులకు, "నిలయః" = ఆశ్రయుడైన వాడు.

## 723 అనలః

న + అలః = భక్తుల అభీష్టములను (కోరికలను) ఇచ్చుటయందు, "అలమ్" = చాలును అను బుద్ధి "న" లేనివాడు. (భక్తాభీష్టముల నధికముగా తీర్చువాడు.)

## 724 దర్పహా

దర్ప + హా = రాక్షసులయొక్క, "దర్ప" = గర్వమును, "హా" = (హంతి) = నశింపజేయువాడు.

## 725 దర్పదః

1 దర్ప+దః=అయోగ్యులకు "దర్ప" = గర్వమును, "దః"= ఇచ్చువాడు.

2 దర్ప=గర్వము కలిగిన వారిని, "దః" (ద్యతి) = ఖడించువాడు.

## 726 దృప్తః

గర్వించిన వాడు.

## 727 దుర్ధరః

ధరించుటకు వీలు కానివాడు.

## 728 అపరాజితః

1 అపర+ఆజితః="అపర" = విష్ణువునందు ఆసక్తి కలవారిచేత, "ఆజితః" = చేరబడువాడు. (భక్త శరణ్యుడు.)

2 అపరాజితః=ఓడింప బడినవాడు.

శ్లో॥ విశ్వమూర్తి ర్మహామూర్తి ర్దీప్తమూర్తి రమూర్తిమాన్।
అనేకమూర్తి రవ్యక్త శ్శతమూర్తి శ్శతాననః॥ 77

## 729 విశ్వమూర్తిః

1 విశ్వ+మూర్తిః; "విశ్వ" = వాయువు, "మూర్తిః" = శరీరముగా కలవాడు.

"ఉద్గీతాఖ్యస్య విష్ణోః విశిష్ట ప్రతిమా వాయుః" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

2 విశ్వ=జగత్తే; "మూర్తిః" = రూపముగా కలవాడు.

3 అనంతమైన రూపము కలవాడు.

"స విశ్వరూపోఽనూనరూపో యతోఽయం సోఽనంతో నహి నాశోఽస్తి తస్య" అను శాండిల్య శాఖోక్తి ఇందుకు ప్రమాణము.

## 730 మహామూర్తిః

విరాట్ రూపమైన పెద్ద ఆకారము కలవాడు.

## 731 దీప్తమూర్తిః

దీప్త=దీప్తమైన=ప్రకాశవంతమైన; "మూర్తిః" = ఆకారము కలవాడు.

## 732 అమూర్తిమాన్

ప్రాకృతమైన రూపము లేనివాడు.

"ఆనంద జ్ఞాన శక్త్యాది దేహం విష్ణుం తు యే జనాః,
అదేహం భూత దేహం వా విదుస్తే చాధరన్ తమః,
తథా ప్రాకృత దేహజ్ఞాః కర్మదేహా విదోఽపి వా"
అను వాక్యము ఇందుకు ప్రమాణము.

## 733 అనేకమూర్తిః

అనేక = బహువిధములైన (మత్స్య కూర్మాది అవతారముల యందలి) "మూర్తిః" = వివిధ రూపములు కలవాడు.

## 734 అవ్యక్తః

1 రూప పరిమాణాదుల యందు పూర్తిగా తెలిసికొనుటకు వీలులేని వాడు.

2 దోషముల చేత తెలియశక్యము కానివాడు.

3 ఆయన అనుగ్రహము లేనిదే ఎవరికిని దర్శన మీయనివాడు. "తద వ్యక్త మాహ హి" అను బ్రహ్మసూత్రము (3-2-23) ఇందుకు ప్రమాణము.

## 735 శతమూర్తిః

శత = అసంఖ్యాకములగు, "మూర్తిః" = ఆకారములు గలవాడు.

## 736 శతాననః

1 శత + అననః; "శత" = అనంతములైన ప్రాణులకు, "అననః" = ఎవని వలన చేష్ట కలుగునో అతడు. (చైతన్యదాత.)

2 శత = అసంఖ్యాకములగు "ఆననః" = ముఖములు కలవాడు."అనేక వక్త్రనయనమ్" అను గీతా వాక్యము ఇందుకు ప్రమాణము.

శ్లో॥ ఏకో నైక స్సవః కః కిం య త్తత్పద మను త్తమమ్।
లోకబంధు ర్లోకనాథో మాధవో భ క్తవత్సలః॥ 78

## 737 ఏకః

1 ఒంటరి వాడు.

2 ఏక కర్త అగువాడు. "త్వమేవ కారయితా నాన్యోఽస్తి" అను గీతా భాష్యోక్తి ఇందుకు ప్రమాణము.

3 ఏకః = ప్రధానుడు, అసమానుడు, జగత్తు కంటె భిన్నుడు, అసహాయుడు, ప్రథముడు, కేవలుడు, ఏక సంఖ్య కలవాడు.

"కించ న తావదేక శబ్దేన మిథ్యాత్వసిద్ధిః,
తస్య మానాంతరావిరో ధ్యనేకార్థత్వాత్"
అను న్యాయామృత వాక్యమును, "ఏకే ముఖ్యాన్య కేవలాః"
అను అమరకోశ వాక్యమును ఇందుకు ప్రమాణములు.

## 738 నైకః [అనేకః]

1 న+ఏకః= పెక్కు రూపములు గలవాడు.

2 న+ఏకః; "ఏకః"=కేవలము తానొక్కడే, "న"=పూజకాది రహితుడు కానివాడు. "సర్వదా జీవ సంఘైర్యుక్త ఏవ। న కదాచి దనీదృశం జగత్" అను వాక్యము వలన స్వసమ సత్తాకమైన ప్రపంచముతో కూడినవాడు. (విశ్వగర్భుడు.)

## 739 సవః

1 యజ్ఞముల యందు "సూయతే"= సోమరసము తీయుట ఎవనిని ఉద్దేశించి జరుగునో అతడు. (యజ్ఞపురుషుడు.)

2 "వా = గతి గంధనయోః" అను ధాత్వర్థమును బట్టి. "వా"= జ్ఞానము అను అర్థము వచ్చును. ఆ జ్ఞానముతో "స"= (సహితః) = కూడినవాడు = సవః (జ్ఞాన స్వరూపుడు.)

## 740 కః

"కన = దీప్తౌ" అను ధాతువునుండి "కః" = ప్రకాశించువాడు అని అర్థము వచ్చును.

## 741 కిమ్

1 పురాణాది రూప శబ్దకర్త.

2 సర్వవేద విచార విషయుడు.

## 742 యత్

యత్ (ఏతి = జానాతి) = తెలిసికొనువాడు.

"యచ్చ జ్ఞానం స్వరూపతః" అను ఐతరేయ భాష్యోక్తి ఇందుకు ప్రమాణము.

## 743 తత్

కనబడనందున "అది" లేక "అతడు" మొదలగు శబ్దముతో పిలువబడు వాడు.

పరోక్షమైన తచ్ఛబ్ద వాచ్యమైన వస్తువు.
"హరిస్తు ప్రత్యక్షా ద్యవేద్యత్వేన, ముఖ్యతో వేదైక
గమ్య త్వాద్వా, గుణై స్తతత్వాద్వా త దిత్యుచ్యతే।
ఓం త జ్జగ ద్వ్యత స్వయం చ పూర్ణో।
వేదోక్త రూపోఽ నుపచారతశ్చ॥
సర్వైః శుభై శ్చాభియుతో న చాన్యైః।
ఓం తత్పది త్యేన మతో వదంతి॥"
అను వాక్యములు ఇందుకు ప్రమాణములు.

## 744 పదమ్

పదమ్ (పద్యతే) = పోబడునది కనుక పదము.
(చేరబడునది, గమ్యస్థానము.)

## 745 అనుత్తమమ్

ఎవనికంటె, "ఉత్తమమ్" = శ్రేష్ఠుడు, "న" = ఉండడో అతడు.

## 746 లోకబంధుః

లోకములకు బంధువు.

## 747 లోకనాథః

1 లోకములకు నాథుడు.

2 లోక+నాథః; "లుక్=ప్రకాశనే" అను ధాతువుయొక్క అర్థమును బట్టి "లోకః"=జ్ఞానరూపుడు. "నాథః"=నాథ్యతే= అడుగబడువాడు. ప్రార్థింప బడువాడు. లోకుడును, నాథుడును అగువాడు. (జ్ఞానరూపుడు — ప్రార్థ్యుడు.)

## 748 మాధవః

1 మధువునకు (తేనెకు) సంబంధించినవాడు "మధు ద్యౌ రస్తు నః పితా" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము.

2 "మధ్వీతి ఆనంద ఉద్దిష్టః" అను స్మృతి వాక్యము వలన "మధు"= సుఖము. మధువునకు సంబంధించినవాడు లేక మధువు నిచ్చువాడు. (ఆనందదాత, ఆనంద స్వరూపుడు.)

## 749 భక్తవత్సలః

1 భక్త+వత్+సలః; "భక్త"= అన్నము, "వత్"=కలవారు= భక్తవత్=యజ్ఞ కర్తలైన బ్రాహ్మణులు, వారినిగూర్చి "సలః" [గచ్ఛతి]= వెళ్ళువాడు = భక్తవత్సలః. యజ్ఞకర్తలైన బ్రాహ్మణులను అనుగ్రహించుటకై వారి వద్దకు వెళ్ళువాడు.)

2 భక్త=భక్తులయందు, "వత్సలః" = వాత్సల్యము కలవాడు.

3 భక్త+వత్స+లః; "భక్త"=భక్తులే, "వత్సాః=బిడ్డలు, వారిని "లః"(లాతి) = దగ్గరకు తెచ్చువాడు.

శ్లో॥ సువర్ణవర్ణో హేమాంగో వరాంగ శ్చందనాంగదీ।
వీరహా విషమ శ్శూన్యో ఘృతాశీ రచల శ్చలః॥ 79

## 750 సువర్ణవర్ణః

సువర్ణ = బంగారపు వర్ణము వంటి "వర్ణః" = రంగు కలవాడు. "యదా పశ్యః పశ్యతే రుక్మ వర్ణమ్ అను శృతి వాక్యము ఇందుకు ప్రమాణము.

## 751 హేమాంగః

హేమ + అంగః; "హేమ" = బంగరు మయములైన, "అంగః" = అవయవములు కలవాడు. "హిరణ్యకేశ ఆ ప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః" అను శృతి వాక్యమును. "హిరణ్యపాణి మూర్తయః" అను వాక్యమును ఇందుకు ప్రమాణములు. (హిరణ్యకేశుడు—హిరణ్యనాభుడు.)

## 752 వరాంగః

1 వర + అంగః; "వర" = ఉత్తమమైన, "అంగ" = అవయవములు కలవాడు.

2 కొందరు ఈ నామమును "అవరాంగః" అని పఠింతురు, అప్పుడు అర్థము: అవ + రాంగః = "అవ" (అవతి) = రక్షించువాడు, "రాంగః" = శ్రీరంగ క్షేత్రమునకు సంబంధించినవాడు. (అవ) రక్షించువాడును, రాంగుడును అయినవాడు = అవరాంగః. (భక్తరక్షణకై శ్రీరంగ క్షేత్రమునందు నివసించువాడు.)

## 753 చందనాంగదీ

1 చందన + అంగద + ఈ; "చందన" = చందనము మొదలగు పూజా యోగ్య ద్రవ్యములు కలవాడు. ఆ చందన ద్రవ్యముకల, "అంగదః" = వాలి పుత్రుడైన అంగదుడు = "చందనాంగదః"; ఆ చందనాంగదుడు భక్తుడుగా కలవాడు = చందనాంగదీ.

2 "చందన" = చందనమును, "అంగద" = బాహు భూషణమును కల వాడు = చందనాంగదీ,

## 754 వీరహా

1 వీర = వీరులను, "హా" (హంతి) = చంపువాడు.

2 వి = విగతమైన, "ఈర" = ముఖ్య ప్రాణము కలవారు = వీరాః (అసురులు) వారిని "హా" (హంతి) = చంపువాడు. (దైత్యాంతకుడు.)

## 755 విషమః

1 విష + మః; "విష" = రుద్రుడు త్రాగిన విషమును, "మః" (మినాతి) = తన నామస్మరణము చేత నశింపజేయువాడు. "మీఙ్ = హింసాయామ్" అను ధాతువు వలన ఈ అర్థము వచ్చినది.

2 వి + సమః = సమ రహితుడు. (సాటిలేనివాడు.)

2 కొందరు ఈ నామమును "అవిషమః" అని చదువుదురు. అప్పుడు అర్థము విషముడు కానివాడు, అందఱను సమానముగా చూచు వాడు అని అర్థము వచ్చును. "వైషమ్య నైర్ఘృణ్యేన సాపేక్షత్వాత్ తథా హి దర్శయతి" అను వాక్యము ఇందుకు ప్రమాణము.
బ్రహ్మసూత్రము : 2-1-35

## 756 శూన్యః

1 ప్రళయ కాలమునందు సర్వ పదార్థ శూన్యత్వము వలన = శూన్యః. (ప్రళయమున తాను తప్ప ఇతర మేదియును లేనివాడు.)

2 శ + ఊన + యః = దుర్జనుల యొక్క "శ" = సుఖమునకు, "ఊన" = తక్కువ దనమును, "యః" = పొందించువాడు శూన్యుడు. "శమూనం కురుతే విష్ణుః" అను స్మృతి వాక్యము ఇందుకు ప్రమాణము. (దుష్టులకు దుఃఖమును కలిగించువాడు.)

## 757 ఘృతాశీః

ఘృత + ఆశీః = "ఘృత" = నేయి మొదలగు హోమము చేయబడు వస్తువులయందు "ఆశీః" = కోరిక కలవాడు.

## 758 అచలః

స్థావర రూపుడు = కదలని వాడు.

## 759 చలః

కదలువాడు.

శ్లో॥ అమానీ మానదో మాన్యో లోకస్వామీ త్రిలోక ధృత్ (క్)।
సుమేధా మేధజో ధన్య స్సత్యమేధా ధరాధరః॥ 80

## 760 అమానీ

విషయములయందు అభిమానము లేనివాడు.

## 761 మానదః

1 మా + అన + దః; "మా" = లక్ష్మీకొఱకు, "అన" = వాయువును, "దః" = పుత్రరూపముగా ఇచ్చువాడు.

2 మాన + దః = మర్యాదను ప్రవర్తింపజేయువాడు. "యదిహ్యాహం న వర్తేయమ్" అను గీతా వాక్యము ఇందుకు ప్రమాణము. "మానం జ్ఞానం లయశ్చైవ మర్యాదా చాపి కథ్యతే" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

## 762 మాన్యః

1 మా + అనితుమ్ (యోగ్యః) = తనను చేష్టింప జేయుటకు తగిన ఇతరుడు లేనివాడు. (స్వయంప్రేరకుడు.)

2 మా+అన్యః; "మా"=లక్ష్మికి, "అన్య"=చైతన్యమును, లేక ప్రాణశక్తిని ఇచ్చువాడు. "అన=ప్రాణనే" అను ధాతువునుండి ఈ అర్థము వచ్చును.

3 మా=లక్ష్మిదేవి చేత ఉపలక్షితమైన, (సూచింపబడిన,) జీవరాశి కంటె, "అన్యః"=భిన్నుడు. జీవునికంటె భిన్నుడు అని భావము.

## 763 లోకస్వామీ

లోక = వైకుంఠాది లోకములకు, అచ్చటనున్న జనులకును, "స్వామీ"=యజమాని.

## 764 త్రిలోకధృత్ (క్)

త్రిలోక+ధృక్; "త్రిలోక"=పృథివి, అంతరిక్షము, ఆకాశము అను ముల్లోకములను, "ధృక్" = ధరించువాడు.

## 765 సుమేధాః

"సు"=మంచి, "మేధాః"=మేధ కలవాడు.

## 766 మేధజః

"మేధ"=యజ్ఞమునందు, "జః"=జన్మించువాడు.

## 767 ధన్యః

1 ధన్యః=సుకృతులు కలవాడు.

2 ధన+యః=ధనమును. "యః" (యాపయతి)=పొందింప జేయు వాడు.

## 768 సత్యమేధాః

1 సత్య+మేధాః; "సత్య"= జగద్విషయమునందు, "మేధాః"= జ్ఞానము కలవాడు.

2 సత్యమైన మేధ కలవాడు.

## 769 ధరాధరః

1 ధరా + ధరః; "ధరా" = భూమి యొక్క, "ధరః" = ధారకుడు. (ధరించువాడు.)

2 ధరా + ఆధరః; "ధరా" = మేరు మందరాది పర్వతములు ఎవని వలన, "ఆధరః" = బాగుగా ధరించబడు చున్నవో అతడు.

శ్లో॥ తేజోవృషో ద్యుతిధర స్సర్వశస్త్రభృతాంవరః।
ప్రగ్రహో నిగ్రహో వ్యగ్రో నైకశృంగో గదాగ్రజః॥ 81

## 770 తేజోవృషః

1 తేజః + వృషః; "తేజః" = తేజోరూపమున ఉండు సూర్యాదులకు, "వృషః" = ఉరుక్రమ రూపముతో (వామన రూపముతో) శ్రేష్ఠుడు.

2 తేజః = సూర్యుని యందున్న తేజస్సుతో "వృషః" = నీటిని వర్షించు వాడు. "ఆదిత్యాజ్జాయతే వృష్టిః" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము.

## 771 ద్యుతిధరః

ద్యుతి + ధరః; "ద్యుతి" = కాంతిని, "ధరః" = ధరించిన వాడు.

## 772 సర్వశస్త్రభృతాంవరః

1 "శస్త్ర" = శస్త్రములను = ఆయుధములను, "భృతామ్" = ధరించిన, "సర్వ" = అందరిలో, "వరః" = శ్రేష్ఠుడు. "రామః శస్త్ర భృతా మహమ్" అను గీతావాక్యము ఇందుకు ప్రమాణము.

2 "సర్వశస్త్ర"=సర్వశస్త్రముల వలె తాను ఆచరించువాడు. ఎవని చేత, "అంబరః"= ఆకాశము, "భృత" = భరింపబడుచున్నదో అతడు=భృతాంబరః (సర్వ శస్త్రముల వలె ఆచరించువాడును, ఆకాశమును భరించినవాడును.) "వబయోః అభేదః" అను ప్రమాణముచే ఈ అర్థము వచ్చును. "ఓం అక్షర మంబరాంత ధృతేః ఓం" (1-3-10); "ఏ తస్మిన్ ఖలు అక్షరే గార్గ్యాకాశ ఓతః పోతశ్చ" అను బ్రహ్మసూత్ర వాక్యము ఇందుకు ప్రమాణము.

## 773 ప్రగ్రహః

1 ప్ర+గ్రహః=ఎవనిచేత, "గ్రహః"= నవగ్రహములు, "ప్ర"= ప్రకృష్టములు (గొప్పవిగా, శక్తిమంతములుగా) చేయబడినవో అతడు.

2 ఎవనినుండి "ప్ర"= ప్రకృష్టమైన, "గ్రహః"=సోమపాత్రి విశేష ములు కలవో అతడు. "గ్రహాన్ సోమస్య మిమతే ద్వాదశ" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము. (సోమపాత్ర విశేషములను సృష్టించినవాడు) "బ్రహ్మార్పణం బ్రహ్మహవిః" అను గీతా వాక్యము గీత.........ఇందుకు ప్రమాణము.

3 "ప్ర" = ప్రకృష్టులైన వారిని, "గ్రహః" (గృహ్ణాతి) = తన భక్తులుగా స్వీకరించు వాడు.

## 774 నిగ్రహః

రాక్షసులను, "నిగ్రహః" (నిగృహ్ణాతి)=అణచివేయువాడు.

## 775 అవ్యగ్రః

వ్యగ్రుడు కానివాడు. (మనసు చెదరని వాడు.)

2 కొందరు ఈ నామమును "వ్యగ్రః" అని పఠింతురు. అప్పుడు అర్థము "వి+అగ్రః"="వి"=గరుత్మంతుడు, "అగ్రః"=ఎవనికి ముందుగా ఉండునో అతడు.

3 వ్యగ్రః=తనను స్తుతించువారికి సుఖమిచ్చుట యందు ఆసక్తుడై ఆ భక్తులకై వెదకును కనుక వ్యగ్రుడు.

## 776 నైకశృంగః

1 వృష రూపమున ఉన్న ఎవనికి "నైక"=అనేకములైన, "శృంగః"= కొమ్ములు కలవో అతడు. వృషభరూపి అయిన అగ్నికికల నాలుగు కొమ్ములు ఇందుద్దేశింప బడినవి.

"చత్వారి శృంగా" అను శ్రుతి వాక్యమును, "వేదః ప్రణవ ఏవాగ్రే ధర్మోహం వృషరూప ధృక్" అను ఏకాదశ భాగవత వచనము ఇందుకు ప్రమాణము.

2 నా+ఏకశృంగః="నా"=పరమ పురుషుడు.

"ఏక శృంగః"=ఒకే శృంగము (కొమ్ము) కలవాడు "ఏక శృంగః పురా భూత్వా వరాహో నంది వర్ధనః ఇమాం చోద్ధృతవాన్ భూమి మేక శృంగ స్తతోహ్యాయమ్" అను మోక్ష ధర్మోక్త వాక్యము ఇందుకు ప్రమాణము. (పరమ పురుషుడును-వరాహ రూపియును అగువాడు.)

## 777 గదాగ్రజః

1 కృష్ణావతారమునందు, "గద"=గదుడు అనువాడు "అగ్రజః"= అన్నగా కలవాడు. (గదునికి సోదరుడు.)

2 కొందరు ఈ నామమును "అగదాగ్రజః" అని పఠింతురు. అప్పుడు అర్థము-ఎవని వలన "అగ్రజాః"=ఉత్తమ వర్ణమున పుట్టిన

బ్రాహ్మణులు, "అగదాః" = రోగ రహితులుగా చేయబడిరో అతడు. (బ్రాహ్మణులకు అజ్ఞాన రోగమును నశింపజేయువాడు.)

శ్లో॥ చతుర్మూర్తి శ్చతుర్బాహు శ్చతుర్వ్యూహ శ్చతుర్గతిః।
చతురాత్మా చతుర్భావ శ్చతుర్వేదవి దేకపాత్॥ 82

## 778 చతుర్మూర్తిః

చతుర్ + మూర్తిః; "చతుర్" = (1) విశ్వ, (2) తైజస, (3) ప్రాజ్ఞ, (4) తురీయ అను పేరు కల "మూర్తిః" = రూపములు కలవాడు.

## 779 చతుర్బాహుః

1 చతుర్ = నాలుగు, "బాహుః" = చేతులు కలవాడు.

2 ఎవని వలన ముక్తులకు చతుర్ = నాలుగు, "బాహు" = చేతులు వచ్చినవో అతడు. "సర్వే చతుర్బాహవ ఉన్మిషన్మణి ప్రవేక నిష్కాభరణాః" అను భాగవతోక్తి ఇందుకు ప్రమాణము. (సారూప్య ముక్తియందు శ్వేత ద్వీపవాసు లందరకు 4 చేతుల నిచ్చువాడు.)

## 780 చతుర్వ్యూహః

చతుర్ + వ్యూహః = "చతుర్" = కేశవాది చతుర్వింశతి రూపము లందు (1) కేశవాది షట్కము, (2) త్రివిక్రమాది షట్కము, (3) సంకర్షణాది షట్కము, (4) నారసింహాది షట్కము అను నాలుగు; "వ్యూహ" = వ్యూహములు (భాగములు, రూపములు) కలవాడు. "చతుర్బాహు శ్చతుర్వ్యూహః" అనునది ఒకే నామమని సంప్రదాయ విదులందురు.

చత్వారి ఆయుధాని చక్ర శంఖ గదా పద్మాని
క్రమ వ్యుత్క్రమ పద్మాది గదాది వ్యుత్క్రమ స్తథా

అర్థక్రమః సాంతరశ్చ షట్ షట్ స్వరి పూర్వ్యాణామ్"
అను తంత్ర సారోక్తి ఇందుకు ప్రమాణము.

## 781 చతుర్గతిః

చతుర్ = (1) ఆర్తుడు, (2) జిజ్ఞాసువు, (3) అర్థార్థి, (4) జ్ఞాని అను నలుగురు భక్తులకు, "గతిః" = గతియగు వాడు.

"ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ" అను గీతోక్తి ఇందుకు ప్రమాణము.

## 782 చతురాత్మా

చతుర్ + ఆత్మా; "చతుర్" = ధర్మార్థ కామ మోక్షములను నాలుగు పురుషార్థముల యందు జనులయొక్క యోగ్యతాను సారముగా, "ఆత్మా" = మనస్సు ఎవని వలన లగ్నము చేయబడు చున్నదో అతడు. (జీవులను పురుషార్థనమునందు దీక్షితులను చేయు వాడు.)

## 783 చతుర్భావః

చతుర్ = 1) బ్రాహ్మణ, 2) క్షత్రియ, 3) వైశ్య, 4) శూద్రులు అను వర్ణముల వారిని, "భావః" = (భావయతి) = ఉత్పాదింప చేయువాడు.

"విష్ణో ర్బ్రాహ్మణ జాతిః సన్ బ్రహ్మే జజ్ఞే చతుర్ముఖః" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

## 784 చతుర్వేద విదేకపాత్

నాలుగు వేదములచేత తెలిసికొనబడ దగిన వాడు = చతుర్వేద విత్, "ఏకః" = ప్రధానమైన, "పాత్" = పాదము = స్వరూ

పము ఎవనికి కలదో అతడు = ఏకపాత్. (చతుర్వేద వేద్యుడును, ప్రధాన స్వరూపుడును అగువాడు.)

శ్రీ సత్యసంధ తీర్థులవారు ఈ నామమును రెండు నామములుగా విడదీసి అర్థము చెప్పిరి.

## 784 (A) చతుర్వేదవిత్

చతుర్ = నాలుగు సంఖ్యగల ఋక్, యజుస్, సామ, అథర్వణము లను పేరుగల, "వేద" = వేదములను, "విత్" = తెలిసినవాడు.

## 784 (B) ఏకపాత్

1 ఏకప + అత్; "ఏకప" = ఒకే ఒక ముఖ్యపాలకుడు అగుచు, "అత్" (అతతి) = తిరుగువాడు. "అత = సాతత్యగమనే" అను ధాతువునుండి ఈ అర్థము వచ్చినది. పాదోఽస్య విశ్వా భూతాని అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము.

2 ఏక = సర్వ భూతములు ఒకే ఒక "పాత్" = పాదముగా కల వాడు.

శ్లో॥ సమావర్తోఽనివృత్తాత్మా దుర్జయో దురతిక్రమః।
దుర్లభో దుర్గమో దుర్గో దురావాసో దురారిహా॥ 83

## 785 సమావర్తః

సమ + ఆ + వర్తః; "సమ" = సమభావముతో, "ఆ" = అన్ని వైపుల, "వర్తః" (వర్తతే) = ఉండువాడు.

## 786 అనివృత్తాత్మా

1 అనివృత్త + ఆత్మా; "అనివృత్త" = తిరిగిరాని, "ఆత్మా" = దేహము కలవాడు.

కొందరు ఈ నామమును "నివృత్తాత్మా" అని పఠింతురు. అప్పుడు అర్థము; ని+వృత్త+ఆత్మా="ని"= మిక్కిలి, "వృత్త"=సకల విషయములయందు ప్రవృత్తమైన, "ఆత్మా"=మనస్సు కలవాడు.

2 అయోగ్యులు చేసిన యజ్ఞాదుల నుండి, "నివృత్త" = మరలిన, "ఆత్మా"=మనస్సు కలవాడు.

## 787 దుర్జయః

1 గెలుచుటకు శక్యము కానివాడు.

2 గీతా తాత్పర్యము నందలి "దుఃఖం దురితి సంప్రోక్తం" అను వాక్యమును బట్టి "దుర్"=దుఃఖముయొక్క; "జయః"=గెలుపు ఎవని వలననో అతడు. (అనగా దుఃఖమును గెలిచినవాడని, దుఃఖమును పోగొట్టువాడని దీని భావము.)

## 788 దురతిక్రమః

దుర్ +అతిక్రమః; "దుర్"=దుఃఖమును, "అతిక్రమః"=దాటిన వాడు.

## 789 దుర్లభః

దొరకుటకు కష్టమైనవాడు.

## 790 దుర్గమః

1 సమీపించుటకు వీలులేనివాడు.

2 కొందరు ఈ నామమును "అదుర్గమః" అని పఠింతురు. అప్పుడు అర్థము =అ+దుర్గ+మః="దుర్గ" తమోగుణము; అది లేనివారు అదుర్గ=చతుర్ముఖుడు, ఆదిత్యాదు మొదలగువారు, అట్టివారిచేత,

"మః" (మీయతే)=కొలవబడువాడు.(సత్త్వ గుణవంతుల చేతనే కొలువబడు వాడు.)

## 791 దుర్గః

దుర్ + గః=రాక్షసులను, "దుర్"=దుఃఖస్థితి లోనికి, "గః"= నడిపించువాడు. [రాక్షసులకు దుఃఖమును కలిగించువాడు.]

## 792 దురావాసః

దుర్ + రావ + అసః; "దుర్" = దుష్టమైన, "రావ" [నైర్గుణ్యాది ప్రతిపాదకమైన]=ధ్వని కలవారు=దురావాః; ఆ దురావులను, "అసః" (అస్యతి) = తమస్సులోనికి విసరువాడు. (భగవంతుడు నిర్గుణుడని వాదించు వారిని నరకాదులలో పడవేయువాడు.)

"తా నహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ।
క్షిపామన జస్ర మశుభా నాసురీ ష్వేవ యోనిషు"॥ గీత 16-19శ్లో.
అను వాక్యమిందుకు ప్రమాణము.

## 793 దురారిహా

దుర్ + ఆ + అరి + హా; "దుర్" = దుష్టులైన, "ఆ" = ఎక్కువ (మిక్కిలి) అయిన, "అరి" = శత్రువులు = దురారి; వారిని "హా" [హంతి] = చంపువాడు.

శ్లో॥ శుభాంగో లోక సారంగ స్సుతంతు స్తంతు వర్ధనః।
ఇంద్ర కర్మా మహాకర్మా కృత కర్మా కృతాగమః ॥ 84

## 794 శుభాంగః

శుభ + అంగః; "శుభ"=శుభములైన, "అంగః" = అవయవములు కలవాడు.

## 795 లోకసారంగః

1 లోక సా + రంగః; "లోక" = వైకుంఠాది లోకములను, "సా" [సనోతి] = ఇచ్చువాడు = లోకసాః; "షణ్ = దానే" అను ధాతువు నుండి ఈ అర్థము వచ్చును. "రంగః" = జ్ఞానులు ఇతని వద్ద "రజ్యంతే" = ఇష్టము కలిగి ఉందురు కనుక "రంగః" = లోకసా + రంగః. (వైకుంఠాది లోకముల నిచ్చువాడు. జ్ఞానులను రంజింపజేయు వాడు.)

2 లోకసారమ్ + గః; "లోకసారమ్" = లోకమునందు సారభూతమైన వస్తువగు స్వాత్మను (తనను) "గః" = పొందింపచేయువాడు. [ఆత్మ జ్ఞానదాత.]

## 796 సుతంతుః

సు + తంతుః; "సు" = శోభనమైన, "తంతుః" = చతుర్ముఖాది సంతానము కలవాడు. "ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

## 797 తంతువర్ధనః

తంతు + వర్ధనః = ద్రౌపది కోఱకు; "తంతు" = దారముల రూపమున వరుసగా వచ్చు వస్త్రములను; "వర్ధనః" = పెంచువాడు. (ద్రౌపదీ మాన సంరక్షకుడు.)

## 798 ఇంద్రకర్మా

1 ఇంద్ర + కర్మా; "ఇంద్ర" = ఇంద్రునియొక్క, "కర్మా" = వృత్రాసుర సంహారము మొదలగు వ్యాపారము ఎవని వలన జరిగినదో అతడు.

2\. ఇంద్ర+కర్మా =ఇంద్రనామధారియగు విష్ణువును, జగత్కారణుడును. "ఇంద్ర మదర్శ మితి తస్మా దింద్రోనామ" అను ఆదిత్య ఖండ భాష్యము ఇందుకు ప్రమాణము.

"గుణ పూర్ణ స్వరూపస్య త్వాపరోక్ష్యేణ దర్శనాత్।
సర్వదైవ హ్యసౌ విష్ణు రింద్రో వై నామతో మతః॥
బ్రహ్మాదీనాం హి సర్వేషాం తత్ ప్రసాదేన జాయతే।
జానంతి న స్వతస్త్వేన తన్నేంద్రాస్తే ప్రకీర్తితాః॥
రమాపితత్ ప్రసాదేన జానాతి కిముతాపరే।
అల్ప జ్ఞానా అల్పగుణా అల్పానందాశ్చ తేఽఖిలాః॥
రమాఽజ శంకరేంద్రాద్యాస్తే నా నింద్రాః క్రమేణ తు।
పూర్వై రజ్ఞాత తాం దేవా మానయంతి సదాత్మనః॥
పూర్ణేణ తేన విష్ణుః స ఇంద్ర ఇతి శబ్ద్యతే।
తే నేంద్రతా సురా దీనాం జ్ఞాయతే తిస్రితిర్హరిమ్॥
ఇంద్ర ఇత్యేవ వదతి పారోక్ష్యేణో రు సద్గుణమ్।"
అను ఐతరేయ సంహితా వాక్యము ఇందుకు ప్రమాణము.
"కర్మా" = ప్రాదుర్భావాత్మకుడగు హరి (జగత్కారణుడని భావము.)
"ముఖ్యతః కర్మ నామా తు ప్రాదుర్భావాత్మకో హరిః।
అనిరుద్ధ తనుశ్చైవ తత్రి హ్యమిత చేష్టితః"॥
అను వాక్యము ఇందుకు ప్రమాణము. ఇంద్రుడును, కర్మయును అగువాడు=ఇంద్రకర్మా.

## 799 మహాకర్మా

1 మహాత్ =జగత్తును సృష్టించుట మొదలగు, "కర్మా"=కర్మలు కలవాడు.

2 "కరః అస్మిన్ మీయతే ఇతి కర్మా జీవ ఉదాహృతః
విధి శబ్దేన అమితత్వాత్ అకర్మా భగవాన్ హరిః"

అను వాక్యము వలన - జీవుడు = అకర్మ=విధి శబ్దముచేత కొలవ బడక పోవుట వలన (అమితత్వాత్) = భగవంతుడగు హరియే అకర్మ. లేక జీవుడు కానివాడు. అకర్మ, లేక విధికి అవిషయమగు వాడు అకర్మ. "మహాత్"= (గొప్పవాడును, అకర్మయును అగు వాడు=మహాకర్మా.)

## 800 కృతకర్మా

కృత+కర్మా; "కృత" = పూర్తి చేయబడిన, "కర్మా"=కర్మ కల వాడు.

## 801 కృతాగమః

కృత+ఆగమః=ఎవనిచేత, "ఆగమ"=వేదములు, "కృత"= నిర్మింప బడినవో అతడు.

శ్లో॥ ఉద్భవ స్సుందర స్సుందో రత్ననాభ స్సులోచనః।
అర్కో వాజసనః శృంగీ జయంత స్సర్వవి జ్జయీ॥ 85

## 802 ఉద్భవః

ఉత్+భవః; "భవ"=సంసారము నుండి లేక పుట్టుక నుండి, "ఉత్"=వెలుపల ఉండువాడు. (సంసారము, పుట్టుక లేనివాడని దీని భావము.)

## 803 సుందరః

1 సౌందర్య వంతుడు.

2 సుమ్+దరః, సుమ్=శోభనమైన, "దరః"=శంఖము కలవాడు. "సు" శబ్దము మీద ఉన్న బిందువు ఆధిక్యమును తెలియజేయును. కనుక "సుమ్"=మిక్కిలి శోభనమైన శంఖము కలవాడు.

3 సుంద+రః; "సుంద"=సుందుడను వానిని ఉపసుందుని ద్వారా, "రః" (రేపయతి)=నశింపజేయువాడు.

## 804 సుందః

సుమ్ + దః; "సుమ్" = సుఖమును, "దః" = ఇచ్చువాడు.

## 805 రత్ననాభః

1 రత్న + నాభః; "రత్న" = పుంరత్నమైన చతుర్ముఖుడు, "నాభః" = నాభియందు కలవాడు.

2 కొందరు ఈ నామమును "అరత్ననాభః" అని పఠింతురు. అప్పుడు అర్థము: అరత్న + నాభః; "అరత్న" = అరతి దైత్యులను, "నాభః" (నభతే) = హింసించువాడు. "నభ" = హింసాయామ్ అనుధాతువు నుండి ఈ అర్థము వచ్చినది.

## 806 సులోచనః

1 సు + లోచనః; "సు" = అందమైన, "లోచన" = కన్నులు కలవాడు.

2 సు (సుష్ఠు) = మంచి, "లోచనః" = లోచనము (జ్ఞానము) కలవాడు.

## 807 అర్కః

1 అతిశయమైన సుఖ స్వరూపుడు.

2 అర్చ్యతే (పూజ్యతే) = పూజింపబడువాడు "అర్చ = పూజాయామ్" అని ధాతువు.

3 అర్క్యతే = స్తుతింపబడువాడు. "అర్క = స్తవనే" అను ధాతువు నుండి ఈ అర్థము వచ్చినది.

## 808 వాజసనః

వాజ + సనః; "వాజ" = అన్నమును, "సనః" (సనతి) = సంభజించు

వాడు. (పొందువాడు.) "వన, షణ=సంభక్తౌ" అను ధాతువు నుండి ఈ అర్థము వచ్చినది.

## 809 శృంగీ

గోవర్థన శృంగములు కలవాడు.

## 810 జయంతః

గెలుచువాడు.

## 811 సర్వవిజ్జయీ

సర్వవిత్ + జయీ; "సర్వవిత్"=అన్నిటిని తెలిసికొన్నవాడు. సర్వవిదుల యొక్క జయప్రాప్తి కలవాడు.

శ్లో॥ సువర్ణబిందు రక్షోభ్య స్సర్వ వాగీశ్వరేశ్వరః।
మహాహ్రదో మహాగర్తో మహాభూతో మహానిధిః॥ 86

## 812 సువర్ణబిందుః

సు + వర్ణ + బిందుః; "సు"=శోభనములైన, "వర్ణ"=అక్షరములు దేనియందున్నవో అది=సువర్ణః = వేదము. దానిని, "బిందుః"= తెలుసుకున్నవాడు.

## 813 అక్షోభ్యః

1 క్షోభింప జేయుటకు వీలుకానివాడు.

2 కొందరు 812, 813 నామములను కలిపి "సువర్ణబిందు రక్షోభ్యః" అని ఒకే నామముగా చెప్పుదురు. అప్పుడు అర్థము:-సువర్ణ + బిందు + రక్షః + భ్యః="సువర్ణ" =బంగారపు రంగునందున్న, "బిందుః"= బిందువులు, మచ్చలు ఎవనికి కలవో అతడు "సువర్ణబిందుః", ఆ

బిందువులు కల "రక్షః" = రాక్షసుడు = "సువర్ణబిందు రక్షః" (మారీచుడు).

"మాయామృగాత్మా మారీచః రమ్యే రామాశ్రమేఽచరత్।
ముక్తా ప్రవాళప్రచ్ఛన్నో హేమబిందు శతాంచితః॥

అను సంగ్రహ రామాయణోక్తి ఇందుకు ప్రమాణము. అట్టి మారీచుని "భ్యః" (భ్యాసయతి) భయపెట్టువాడు. "భ్యస = భయే" అను ధాతువు నుండి ఈ అర్థము వచ్చినది.

## 814 సర్వవాగీశ్వరేశ్వరః

సర్వ + వాక్ + ఈశ్వర + ఈశ్వరః; "సర్వ"=సమస్తమైన, "వాక్"=మాటలకు, "ఈశ్వర" = నియామకుడైన రుద్రుడు; అతనికి "ఈశ్వరః"=యజమానుడు లేక ఈశ్వరుడు అగువాడు.

## 815 మహాహ్రదః

మహత్ + హ్రదః; "మహత్"=పెద్దదియైన, "హ్రదః"=కాళీయమర్దన కాలమందును లేక సముద్రశయన కాలమందును, "హ్రద"= జలస్థానము కలవాడు.

## 816 మహాగర్తః

1 మహత్ + అగ + ఋతః; "మహత్"=పెద్దవియైన "అగ"=శేషాచలము మొదలగు కొండలు= మహాగాః, అక్కడకు "ఋతః" (ఋచ్ఛతి)=వెళ్ళువాడు. "ఋ=గతౌ" అను ధాతువు నుండి ఈ అర్థము వచ్చినది. (ఏడుకొండలవాడు.)

2 మహాగర్తః = హృదయమను పెద్ద గుహ కలవాడు.

## 817 మహాభూతః

మహాభూతములైన పృథివ్యప్ తేజో వాయ్వాకాశములు ఎవని నుండి వచ్చినవో అతడు.

## 818 మహానిధిః

తన ప్రాప్తిచేత నిధి దొరికినట్లుగా సంతోషమును కలిగించువాడు.

శ్లో॥ కుముదః కుందరః కుందః పర్జన్యః పావనోఽ నిలః।
అమృతాంశోఽ మృతవపుః సర్వజ్ఞ స్సర్వతో ముఖః॥ 87

## 819 కుముదః

కు+ముదః; "కు" = భూమియందు, "ముదః" (మోదతే)=సంతోషించువాడు.

## 820 కుందరః

కుంద+రః; "కుంద" = భక్తులు సమర్పించిన మల్లెపూలతో, "రః" (రమతే) = రమించువాడు = సంతోషపడువాడు.

## 821 కుందః

1 కుమ్+దః; "కుమ్" = శబ్దమును, "దః" = చేయువాడు. "కుఙ్ = శబ్దే" అను ధాతువు ఇందుకు ప్రమాణము. (శబ్దబ్రహ్మ.)

2 "కుమ్" = భూమిని, ఇంద్రుని కొఱకు, "దః" (దదాతి) ఇచ్చువాడు. (వామనుడు.)

3 "కుమ్" = కుత్సితమును, "దః" (ద్యతి) = ఖండించువాడు.

## 822 పర్జన్యః

పరమ్ = గొప్పదియైన, "జన్యమ్" = యుద్ధము ఎవనివలననో అతడు.

## 823 పావనః

1 పవిత్రము చేయువాడు.

2 పా+అవనః; "పా" (పాన్తి) = రక్షించువారు = రాజులు. వారి

యొక్క "అవనమ్" = రక్షణము ఎవని వలననో అతడు. [రాజులను రక్షించువాడు.]

3 పవన రూపుడైన వాయువునకు తండ్రి పావనః.

## 824 అనిలః

అన + లః; "అని" = ముఖ్యప్రాణుడు కలవారు. (వాయు భక్తులు). వారిని; "లః" [లాతి] = గ్రహించువాడు.

## 825 అమృతాంశః

1 అమృత + ఆ + శః; "అమృత" = వాయువు యొక్క; "అతిరోహి విజ్ఞానాత్ వాయురప్యమృతః స్మృతః" అను వాక్యము ఇందుకు ప్రమాణము; "ఆ" = బాగుగా; "శమ్" = సుఖము లేక "ఆశ" అను పేరుగల భారతి ఎవనినుండి ఉద్భవించెనో అతడు అమృతాంశ (వాయువునకు బాగుగా సుఖమును, లేక భారతి అను భార్యను ఇచ్చువాడు.)

"ప్రద్యుమ్నతః కృతౌ యజ్ఞే కన్యానాంతు చతుష్టయమ్।
గాయత్రీ చైవ సావిత్రీ శ్రద్ధాచైవ సరస్వతీ॥
శ్రద్ధా సూత్రస్య భార్యాఽభూత్ తి్రస్తు పురుష ప్రియః"
అను వరాహ పురాణోక్తి ఇందుకు ప్రమాణము.

2 అమృత + ఆశః; "అమృత" = ముక్తులకు ఎవనిని గూర్చి, "ఆశా": కోరిక ఉండునో అతడు. (ముక్తులచే కోరబడువాడు.)

కొందరీ నామమును "అమృతాంశః" అని పఠింతురు. అప్పుడు అర్థము "అమృత" = మరణ రహితములైన "అంశ" = మత్స్యాద్యంశములు కలవాడు.

## 826 అమృతవపుః

అమృత + వపుః; "అమృత" = అమృతము కొఱకు నారాయణి, అజిత, ధన్వంతరి అను; వపుః = రూపములు కలవాడు. (ధరించిన వాడు.)

## 827 సర్వజ్ఞః

సర్వ + జ్ఞః = సర్వ విషయముల యొక్క జ్ఞానము కలవాడు.

## 828 సర్వతోముఖః

1 సర్వతః = సమస్తమైన దిక్కులయందు "ముఖః" = ముఖములు కలవాడు. "విశ్వత శ్చక్షుః" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము.

2 ఆశ్రయ భూతమైన - (ఆధారముగా) సర్వతోముఖమ్=జలము, అన్నివైపుల కలవాడు. (నారాయణుడు.)

శ్లో॥ సులభ స్సువ్రత స్సిద్ధ శ్శత్రుజి చ్ఛత్రు తాపనః।
న్యగ్రోధో దుంబరోఽ శ్వత్థ శ్చాణూరాంధనిషూదనః॥ 88

## 829 సులభః

1 సుల + భః = "రల యోరభేదః" అను వాక్యము ద్వారా 'ల' కారము రేఫముగా మారి, "సుర" = దేవతలయందు, "భః" (భాతి) = ప్రకాశించువాడు.

2 సు + లభః = "సు" = సుఖముగా, "లభః" (లభతే) దొరకువాడు.

## 830 సువ్రతః

"సు" = శోభనమైన, "వ్రతః" = వ్రతము ఎవనిని గూర్చి చేయబడునో అతడు.

## 831 సిద్ధః

సిధ్ + ధః; "సిధ్" =(1) మంగళమును (2) శాస్త్రమును; "ధః" (ధత్తే) = ధరించువాడు.

## 832 శత్రుజిత్

శత్రు + జిత్; "శత్రు" = శత్రువులను, "జిత్" = గెలుచువాడు.

## 833 శత్రుతాపనః

1 శత్రు + తాపనః; శత్రు = శత్రువులను, తాపనః = బాధించువాడు; పరితపింప జేయువాడు.

2 శత్రుః = రాక్షసులను చంపువాడును, తాపనః = తపింప జేయువాడు అనగా సూర్యుడు అని భావము. శత్రువును తాపనుడును అగు వాడు; సూర్యునికి అంతర్యామి కావున విష్ణువునకు తాపనః అను నామము సార్థము. "ధ్యేయః సదా సవితృ మండల మధ్యవర్తీ" అను వాక్య మిందుకు ప్రమాణము.(రాక్షస నాశకుడు, సూర్యాంత ర్వర్తి.)

## 834 న్యగ్రోధోదుంబరః

న్యక్ = తలక్రిందులుగా నుండి నటువంటి, దేహమను పురమును, 'రోహతి' = ఉద్ధరించువాడును; "ఉత్" = ప్రబలమైన, 'ద' = క్షత్రియుల యొక్క, "బ" = మదమును, "ర" = నశింపజేయు వాడు = ఉదుంబరుడు. న్యగ్రోధః + ఉదుంబరః = ఉత్కృష్ట క్షత్రియ మదమును నశింపజేసినవాడు. న్యగ్రోధుడును, ఉదుంబరుడును = న్యగ్రోధోదుంబరుడు.

శ్రీ సత్యసంధ తీర్థులవారు ఈ నామమును రెండు నామములుగా విడదీసి అర్థము చెప్పిరి.

## 834 (A) న్యగ్రోధః

సర్వ భూతములను, న్యక్కృత్య = ఖండించి లేక తిరస్కరించి, "రోధః" = పెరుగువాడు.

## 834 (B) ఉదుంబరః

1 ఉత్ + అంబరః; "అంబర" = ఆకాశమునుండి; "ఉత్" = పైకి లేచినవాడు.

2 కొందరు ఈ నామమును "ఔదుంబర" అని పఠింతురు. అప్పుడు అర్థము = "ఉదుమ్" = జీవుని "వరః" = భక్తునిగా (వరయతి) స్వీకరించునది = ఉదుంబరా (లక్ష్మి). ఆమెకు స్వామి ఔదుంబరః.

3 ఔందుబర = ఉదుంబరముతో (మేడిపండుతో) సమానమైన జీవులకు "ప్రాప్యః" = చేరదగిన వాడు.

"ఆమ్రం బాల్యే పిపతతి పరిణామే హ్యుదుంబరమ్।
సమ్యక్ పాకేత ధాశ్వత్థం ఫలం జీవమ్మృతి స్తథా॥
కలౌ వామో్ౖపమా జీవాః త్రేతాస్వౌదుంబరోపమాః।
కృతేఽశ్వత్థ సమాశ్చైవ యాంతి బ్రహ్మ వశాః సదా॥"
అను బృహద్భాష్యోక్తి ఇందుకు ప్రమాణము.

## 835 అశ్వత్థః

అశ్వ + స్థః = "అశ్వ" = గుఱ్ఱమువలె; "స్థః" = ఉండువాడు (హయగ్రీవుడు.)

## 836 చాణూరాంధనిషూదనః

చాణూర + అంధ + నిషూదనః; "చాణూర" = చాణూరుడు అను పేరుగల కంసుని ఆస్థానమందలి మల్లుని, "అంధ" = అంధునకు

చెందిన (ధృతరాష్ట్రునకు చెందిన) దుర్యోధనాదులను "నిషూదనః" = చంపినవాడు.

"మయా హతాన్ త్వం జహిమా వ్యథిష్ఠా" అను గీతా వాక్యము ఇందుకు ప్రమాణము.

శ్లో॥ సహస్రార్చిః స్సప్త జిహ్వః స్సప్తైధా స్సప్త వాహనః।
అమూర్తి రనఘోఽ చింత్యో భయకృ ద్భయ నాశనః॥ 89

## 837 సహస్రార్చిః

సహస్ర + అర్చిః; "సహస్ర" = అనేక "అర్చిః" = కిరణములు కలవాడు.

## 838 సప్తజిహ్వః

1 అగ్నిలో ఉండు రూపముతో "సప్త" = ఏడు సంఖ్యగల, "జిహ్వః" = నాలుకలు గలవాడు.

యదాదిత్యగతం తేజః జగద్భాసయతేఽ ఖిలమ్।
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ (గీత–15–12) అను వాక్యము ప్రమాణము.

2 ఏడు జడలతో కూడిన సప్తఋషులే (సప్త) జిహ్వలుగా కలవాడు. "నాహం తథాఽద్మి యజమాన హవిః" అను భాగవతోక్తి ఇందుకు ప్రమాణము.

## 839 సప్తైధాః

1 "సప్త" = సప్త ఋషులను, "ఏధాః" (ఏధయతి) = పెంపొందింప జేయువాడు. "ఏధ = వృద్ధౌ" అను ధాతువు నుండి ఈ అర్థము వచ్చును.

2 అగ్నిలో ఉండు రూపముతో "సప్త" = ఏడు సంఖ్యగల "ఏధాః" = అగ్నిని పెంచు సమిధలు కలవాడు.

"సప్తతే అగ్నే సమిధః" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము.

## 840 సప్తవాహనః

"సప్త" = ఏడు సంఖ్యగల, "వాహ" = గుఱ్ఱములు కలవాడు = సప్తవాహః (సూర్యుడు). అతనిని "నః" (నయతి) = తీసికొని పోవు వాడు లేక నడిపించు వాడు.

## 841 అమూర్తిః

ప్రాకృతమైన దేహము లేనివాడు.

## 842 అనఘః

పాపము లేనివాడు.

## 843 అచింత్యః

చింతించుటకు వీలుకానివాడు.

## 844 భయకృద్భయనాశనః

"భయకృత్" = జీవులకు శరీరేంద్రియాది భయమును కలుగ జేయువాడును; "భయమ్" = శరీరాభిమానాదులచే కలుగు భయ మును, నాశయతి = నశింపజేయు వాడును = భయకృద్భయనాశ నుడు.

"స్వయమేవ భక్తానాం వివిధ సాంసారిక దుఃఖానుభవ సిద్ధ్యర్థం, బ్రాహ్మణాది శరీరాదికముత్పాద్య, తత్రచ వైరాగ్యాదిక ముత్పాద్య జ్ఞానద్వారా దుఃఖహేతుం వినాశయ తీతి భావః"

"తనకు తానుగనే భక్తులకు బహువిధములైన సాంసారిక దుఃఖాను భవ సిద్ధి కొఱకై, బ్రాహ్మణాది శరీరములను కల్పించి, అచ్చట వైరాగ్యాదులను కల్పించి జ్ఞానము ద్వారా దుఃఖ హేతువును నశింపజేయు చున్నాడు" అని ముఖ్య తాత్పర్యము.

శ్రీ సత్యసంధ తీర్థులవారు ఈ నామమును రెండు నామములుగా విడదీసి అర్థము చెప్పిరి.

### 844 (A) అభయకృత్

భక్తులకు అభయము నిచ్చువాడు.

### 844 (B) భయనాశనః

భయమును నశింపజేయువాడు, తొలగించువాడు.

శ్లో॥ అణు ర్బృహ త్కృశ స్థూలో గుణభృ న్నిర్గుణో మహాన్।
అధృతః స్వధృతః స్వాస్యః ప్రాగ్వంశో వంశవర్ధనః॥ 90

### 845 అణుర్బృహత్

అణువుగను, మహత్తుగను ఉండెడి రూపము కలవాడు. "అణోర ణీయాన్ మహతో మహీయాన్" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము.

శ్రీ సత్యసంధ తీర్థులవారు ఈ నామమునే రెండు నామములుగా విడదీసి అర్థము చెప్పిరి.

### 845 (A) అణుః

అణుత్వ విశ్రాంతికి [చిన్న కొలతలో అణువువద్ద ఆగుటకు] అధి కరణ మగువాడు = ఆధారభూతుడు. "అణోరణీయాన్" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

## 845 (B) బృహత్

గుణముల చేత వృద్ధుడు.

## 846 కృశస్థూలః

కృశుడును, స్థూలుడును = కృశస్థూలుడు.

శ్రీ సత్యసంధ తీర్థులవారీ నామమును రెండు నామములుగా అర్థము చెప్పిరి.

## 846 (A) కృశః

రాక్షసులను, "కర్శయతి" = కృశింపజేయువాడు.

## 846 (B) స్థూలః

మహాపరిమాణము కలవాడు.

## 847 గుణభృన్నిర్గుణః

గుణాః = ప్రాణములు; భ్రియంతే అస్మిన్నితి = భరించుట వలన = గుణభృత్; గుణాః = దేహాదులు, నిర్గచ్ఛంత్యస్మాదితి = వెళ్ళిపోవుట చేత = నిర్గుణుడు; గుణభృత్ + నిర్గుణః = గుణభృన్నిర్గుణః (ప్రాణములను భరించువాడు—దేహాదులను వదలిపోవువాడు—ఆత్మరూపి.)

శ్రీ సత్యసంధ తీర్థులవారీ నామమును రెండు నామములుగా విడదీసి అర్థము చెప్పిరి.

## 847 (A) గుణభృత్

1 గుణ + భృత్ = "గుణ" = ఆనందాది గుణములను "భృత్" (బిభర్తి) = భరించువాడు.

2 "గుణాన్" = అప్రధానభూతులైన జీవులను, "భృత్" (బిభర్తి) = భరించువాడు.

## 847 (B) నిర్గుణః

సత్త్వాది గుణములు లేనివాడు.

## 848 మహాన్

మహాన్ = శ్రేష్ఠుడు.

## 849 అధృతః

ఎవనిచేతను ధరింపబడని వాడు.

## 850 స్వధృతః

1 స్వ + ధృతః; "స్వ" = తనచేతనే తాను "ధృతః" = ధరింపబడు వాడు.

2 స్వ + ధృతః = ఎవనిచేత "స్వ" = ధనము, 'ధృతః" = ధరింపబడినదో అతడు.

## 851 స్వాస్యః

1 స్వ + ఆస్యః; "స్వ" = స్వరూప భూతమైన, "ఆస్యమ్" = ముఖము కలవాడు.

2 సు + ఆస్యః; "సు" = శోభనములైన వేదములు "ఆస్యః" = ఎవనికి నోటియందు (కంఠస్థములై) ఉన్నవో అతడు.

## 852 ప్రాగ్వంశః

ప్రాక్ + వంశః; "ప్రాక్" = అనాదికాలము నుండియు, "వంశః" = వెదురు గడవలె ఆధారమైనవాడు.

## 853 వంశవర్ధనః

వంశ + వర్ధనః = పరీక్షిత్తును సంరక్షించుటచేత "వంశ" = పాండు కులమును "వర్ధనః" = అభివృద్ధి పరచినవాడు.

"జుగోప కుక్షిం గత ఆత్త చక్రో। మాతుశ్చ మే యః శరణం గతాయాః" అను భాగవతోక్తి ఇందుకు ప్రమాణము.

శ్లో॥ భారభృత్ కథితో యోగీ యోగీశ స్సర్వకామదః।
ఆశ్రమ శ్శ్రమణః క్షామః సుపర్ణో వాయువాహనః॥ 91

## 854 భారభృత్

భార + భృత్; "భార" = భారం భూతమైన బ్రహ్మాండమును (కూర్మ రూపముతో) "భృత్" = భరించినవాడు. "బిభర్త్యండం **హరిః కూర్మ స్త్వండే చాప్యుదకం మహత్" అను బృహద్వ్యాఖ్యోక్తి** ఇందుకు ప్రమాణము.

## 855 కథితః

సదాగమముల చేత ప్రతిపాదింప బడినవాడు.

## 856 యోగీ

ఉపాయము కలవాడు.

## 857 యోగీశః

1 యోగులకు ఈశుడు.

2 యోగి + ఈ + శః; "యోగి" = యోగులయొక్క "ఈ" = లక్ష్మికి, "శ" = సుఖము ఎవని వలన వచ్చునో అతడు.

## 858 సర్వకామదః

1 సర్వ = భక్తులందరి యొక్క "కామ" = అన్ని కోర్కెలను "దః" = ఇచ్చువాడు.

2 సర్వ+కామదః; "సర్వ"=శివుడు, "కామ"=మన్మథుని "దః" (ద్యతి)=ఎవని శక్తిచే ఖండించినాడో అతడు. (శివునకు మన్మథ దహన శక్తిని ఇచ్చినవాడు).

## 859 ఆశ్రమః

శ్రమలేనివారు అశ్రములు = ముక్తులు. వారి యొక్క స్వామి = ఆశ్రమః.

## 860 శ్రమణః

1 శ్రమణ=సన్యాసులు ఇతనికి దాసులైయున్నారు. కనుక శ్రమణః.

2 శ్రమ+ణః; "శ్రమ"=కృచ్ఛ్ర చాంద్రాయణాది శ్రమముల చేత, "ణః"=సుఖము ఎవరినుండి వచ్చునో అతడు.

3 శ్రమ+నః; "శ్రమ"=అలసటను, "నః" (అపనయతి)=తొలగించువాడు.

## 861 క్షామః

1 సహన శక్తికి ఆధారుడైనవాడు.

2 ప్రళయకాలము నందు జనములను—"క్షామః" (క్షామయతి)= నశింపజేయువాడు.

## 862 సుపర్ణః

1 సు+పర్ణః; "సు"=శోభనమైన, "పర్ణః"=మఱ్ఱి ఆకు శయనముగా కలవాడు. (వటపత్రశాయి.)

2 సుపర్ణుని (గరుత్మంతుని) రూపమున ఉండువాడు.
"ద్వా సుపర్ణా సయుజా" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము.

## 863 వాయువాహనః

1 వాయు + వ + అహనః; "వాయు" = వాయువును, "వ" (వర్త యతి) = ప్రవర్తింప జేయువాడు = వాయువాః; "వృతు = వర్తనే" అను ధాతువునుండి ఈ రూపము వచ్చును.

"అహ = వ్యాప్తౌ" అను ధాతువునుండి "అహ" (అహ్నుతే) వ్యాపించువాడు. (వాయువ + అహనః = వాయువును ప్రవర్తింప జేయువాడును, అంతటను వ్యాపించి ఉండువాడును.

2 జీవుల శరీరమునుండి ఉత్క్రమించు కాలమునందు వాయువే వాహనముగా కలవాడు.

శ్లో॥ ధనుర్ధరో ధనుర్వేదో దండో దమయితా దమః।
అపరాజిత స్సర్వసహో నియంతా నియమో యమః॥ 92

## 864 ధనుర్ధరః

ధనుస్సును ధరించినవాడు.

## 865 ధనుర్వేదః

ధనుః + వేదః; "ధనుః" = ఇంద్రుని ధనస్సును అగస్త్యుని ద్వారా "వేదః" (విదంతే) = పొందినవాడు.

## 866 దండః

1 దైత్యులను దండించువాడు.
2 కొందరు ఈ నామమును "అదండః" అని పఠింతురు. అప్పుడు అర్థము "ఇతరులు వేసిన శిక్ష తనకు లేనివాడు" అని వచ్చును. (తనకు శిక్షకుడు లేనివాడని భావము.)

## 867 దమయితా

దైత్యులను దమింపజేయువాడు. (అణగద్రొక్కు వాడు.)

## 868 ఆదమః

ఆ+ద+మః; "ఆ"=బాగుగా, "దాః"=ఇచ్చువారు=ఆదాః; వారికి ఎవరి వలన "మా"=సంపద కలుగునో అతడు=ఆదమః.

## 869 అపరాజితః

1 అపర+అజితః; "అపరః"=ఎవనికంటె "పర"=ఉత్తముడు "న"= లేడో అతడు. "అజితః"=గెలువబడని వాడు. అపరుడును, అజితుడును – అపరాజితుడు. (సర్వోత్తముడును, ఓటమిలేనివాడును.)

2 అప+రాజితః; "అపః"=పాలకుడు లేనివాడు. "రాజితః"=ప్రకాశించువాడు. అపుడును, రాజితుడును అగువాడు అపరాజితః.

## 870 సర్వసహోనియంతా

అందరి ప్రాణశక్తిని ప్రకాశాదులను నియమించువాడు.
శ్రీ సత్యసంధ తీర్థులవారు ఈ నామమును రెండు నామములుగా విడదీసి అర్థము చెప్పిరి.

## 870 (A) సర్వసహః

సర్వ+సహః; "సర్వ"=అన్నిటిని, "సహః"=ఓర్చుకొనువాడు.

## 870 (B) నియంతా

నియామకుడు.

## 871 నియమః

ని+యమః; "ని"=మిక్కిలి; "యమః"=శాసించువాడు.

## 872 యమః

యమ = ఉపరమే" అను ధాతువునుండి "యమయతి" ప్రళయ కాలము నందు సర్వమును ఉపరమింప జేయువాడు. (నాశనము చేయువాడు.)

శ్లో॥ సత్త్వవాన్ సాత్త్వికస్సత్య స్సత్యధర్మపరాయణః।
అభిప్రాయః ప్రియార్హోఽర్హః ప్రియకృత్ ప్రీతివర్ధనః॥ 93

## 873 సత్త్వవాన్

"సత్త్వమ్" = 1 జీవుడు 2 బలము 3 సాధుత్వము [మంచి తనము] కలవాడు. "సత్త్వ మస్త్రీ తు జంతుషు" అను నామ లింగాను శాసన వాక్యమును; "సత్త్వం జీవః క్వచిత్ ప్రోక్తః క్వచిత్ సత్త్వం జనార్దనః".

"సత్త్వం నామగుణః క్వచిత్, క్వచిత్ సాధుత్వ ముచ్యతే" అను స్మృతి వాక్యమును ఇందుకు ప్రమాణములు.

## 874 సాత్త్వికః

శుద్ధ సత్త్వ ప్రధానుడైన చతుర్ముఖుడు దాసుడుగా కలవాడు. "సత్త్వ సత్త్వమహా సత్త్వ సూక్ష్మ సత్త్వ శ్చతుర్ముఖః" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

## 875 సత్యః

1 స్వతంత్రుడు.

2 నిత్యము సాధుగుణ వ్యాప్తికి యంత్ర రూపమున (నియామకుడుగా) ఉండువాడు.

"సంతతేర్వ్యాత నాచ్చైవ హ్యా ప్తివ్యత్వాచ్చ దుర్జనైః।
నిత్య సాధుగుణ వ్యాప్తి యంతృ రూపత్వతః సదా॥

జగద్గతేన రూపేణ బ్రహ్మైవహి తథోచ్యతే।"
అను అనువ్యాఖ్యానోక్తి ఇందుకు ప్రమాణము.

## 876 సత్య ధర్మ పరాయణః

సత్యధర్మ + పరాయణః; "సత్య" = సత్య విషయమైన, "ధర్మ" = ధర్మము కలవారు = సత్యధర్మాః; వారికి "పరాయణః = ముఖ్యాశ్రయ మైనవాడు.

## 877 అభిప్రాయః

"అభి" = అన్నివైపుల, "ప్ర" (పూరయతి) = పూరించునది = అభిప్రా = లక్ష్మి. "ప్రా = పూరణే" అను ధాతువునుండి ఈ అర్థము వచ్చును. ఆమెను ప్రాపయతి = తోషయతి = సంతోషపరచు వాడు = అభిప్రాయః.

## 878 ప్రియార్హః

ప్రియ + అర్హః; "ప్రియ" = సుఖవిశేషమునకు, "అర్హః" (అర్హతి) = తగినవాడు.

## 879 అర్హప్రియకృత్

అర్హులగు భక్తులకు అభీష్టముల నిచ్చి రక్షించువాడు.
(శ్రీ) సత్యసంధ తీర్థులవారు ఈ నామమును రెండు నామములుగా విడదీసి అర్థము చెప్పిరి.

## 879 (A) అర్హః

అర్హః = పూజ్యుడు. "అర్హ = పూజాయామ్" అని ధాతువు.

## 879 (B) ప్రియకృత్

ప్రియ + కృత్; "ప్రియ" = సుఖవిశేషమును "కృత్" = కలిగించువాడు.

"పరేయం ప్రియనామకమ్" అను తైత్తిరీయ భాష్యోక్తి ఇందుకు ప్రమాణము.

## 880 ప్రీతివర్ధనః

1 ప్రీతి = భక్తులయందు ప్రీతిని [ఇష్టమును] వర్ధనః [వర్ధయతి] = పెంపొందింప జేయువాడు.

2 "ప్రీతి" = ప్రీతితో భక్తులను "వర్ధనః" = వర్ధింప జేయువాడు.

శ్లో॥ విహాయసగతి ర్జ్యోతి స్సురుచి ర్హుతభు గ్విభుః।
రవి ర్విరోచన స్సూర్య స్సవితా రవిలోచనః॥ 94

## 881 విహాయసగతిః

విహాయస + గతిః; "విహాయస" = గరుడుని ద్వారా "గతిః" = నడక గలవాడు.

## 882 జ్యోతిః

తేజోవంతుడు "జాతమోతం హా యస్మాత్ జ్యోతిరిత్యుక్తమ్" అను అనువ్యాఖ్యానోక్తి ఇందుకు ప్రమాణము.

## 883 సురుచిః

సు + రుచిః "సు" = మంచి, "రుచిః" = కాంతి కలవాడు.

## 884 హుతభుక్

"హుత" = హోమము చేసిన ఆహుతులను "భుక్" (భుంక్తే) = భుజించువాడు.

## 885 విభుః

ఇతనివలన "వి" = విశిష్టులుగా, "భుః" = అగు చున్నారు.

## 886 రవిః

అవిజ్ఞేయుడగుట వలన "రవి".
"స్వాజ్ఞేయ త్వాత్ రవిః" అను గీతా తాత్పర్యోక్తి ఇందుకు ప్రమాణము. "సర్వే వేదాః సర్వేఘోషాః ఏకైక వ్యాహృతిః ప్రాణ ఏవ ప్రాణ ఋచ ఇత్యేవ విద్యాత్" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము

## 887 విరోచనః

1 వి + లోచనః = "రలయోరభేదః" అను వాక్యముచే రేఫమునకు 'ల' కారము రాగా వి + లోచనః = "వి" = విశిష్టమైన, లోచన = కన్ను [దివ్యదృష్టి] అర్జునునకు ఎవనివలన వచ్చెనో అతడు. "దివ్యం దదామి తే చక్షుః" అను గీతా వాక్యము ఇందుకు ప్రమాణము.

2 వి + రోచనః; "వి" = విశిష్టములైన, "రోచన" = సూర్యాది ప్రకాశములు ఎవనివలన కలిగినవో అతడు. "రోచంతే రోచనాదివి" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము. (జ్యోతుల కన్నిటికి జ్యోతి నిచ్చినవాడు.) "యదాదిత్యగతం తేజః యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధిమామకమ్–గీత-15...అను వాక్యమిందుకు ప్రమాణము.

## 888 సూర్యః

1 సరతి = ముందుకు సాగువాడు. "సృ = గతౌ" అను ధాతువునుండి ఈ అర్థము వచ్చును.

2 "షూ = ప్రేరణే" అను ధాతువు నుండి "సువతి" = లోకములను వాని వాని కర్మల యందు ప్రేరేపించువాడు.

3 సూరుల చేత చేరదగినవాడు. "సూర్యః స సూరి గమ్యత్వాత్" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

## 889 సవితా

సృష్టించువాడు. "సవితృత్వాత్ సవితా విష్ణుః" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

## 890 రవిలోచనః

1 రవి + లోచనః; "రవి" = సూర్యుడు, "లోచనః" = ఎవని కంటి యందు కలడో అతడు, (సూర్యుడు కుడికన్నుగా కలవాడు.)

2 కొందరు ఈ నామమును "అరవిలోచనః" అని పఠింతురు. అర + విల + ఓచనః; "అర" = మిక్కుటముగా, "విల" = బిల = గుహా దుల యందు "ఓచనః" = నృసింహాది రూపముతో నివసించువాడు. "ఉచ = సమవాయే" అను ధాతువు నుండి ఈ అర్థము వచ్చును.

"కక్షుశ్చభ్రే నృసింహస్య సదావస్థితి కారణాత్।
ద్రవంతి కక్షుశ్చభ్రాభ్యాం త దజ్ఞానే విరక్షణాత్॥
మృగాభీతాః యతస్తేషాం నృసింహః స్వాశ్రయ" స్సదా।
అను ఛాందోగ్య భాష్యోక్తి ఇందుకు ప్రమాణము.

శ్లో॥ అనంతోహుతభుగ్భోక్తా సుఖదో నైకజోఽగ్రజః।
అనిర్విణ్ణ స్సదామర్షీ లోకాధిష్ఠాన మద్భుతః॥ 95

## 891 అనంతః

1 న + అంతః; "అంతః" = బంధనము "న" = లేనివాడు. "అతి = బంధనే" అను ధాతువు నుండి ఈ అర్థము వచ్చును.

2 న + అంతః; "అంతః" = నాశము "న" = లేనివాడు.

## 892 హుతభుగ్భోక్తా

తనను స్తుతించువారిని రక్షించువాడు.

శ్రీసత్యసంధ తీర్థులవారు ఈ నామమును రెండు నామములుగా విడదీసి అర్థము చెప్పిరి.

## 892 (A) హుతభుక్

హుత + భుక్ = "హుత" = ఆహుతులు ఇవ్వబడినవాడై "భుక్" = భుజించువాడు.

## 892 (B) భోక్తా

"భోక్తా" = అభ్యవహార్తా = హవిర్భాగములను తినువాడు.

## 893 సుఖదః

1 సుఖమును ఇచ్చువాడు.

2 "సుఖ" = శోభనమైన ఇంద్రియములను, "దః" = ఇచ్చువాడు.

## 894 నైకజః

1 ని + క + జః; "ని" = ఎక్కువగా, "క" = నీటియందు, "జ" = పుట్టినవి = కమలములు. అవికలది = నికజా = లక్ష్మి, ఆమెకు స్వామి = నైకజః.

ని + కజః = పద్మములు ఏ వనము నందున్నవో అక్కడ నివసించువాడు = నైకజః.

"తులసీ కాననం యత్ర యత్ర పద్మవనానిచ।
వసంతి వైష్ణవా యత్ర తత్ర సన్నిహితో హరిః॥"
అను వాక్యము ఇందుకు ప్రమాణము.

3 ఏకస్మాదపి న జాతః=ఎవరి నుండి కూడ పుట్టుక లేనివాడు.

4 అనేకదః అనునది పాఠాంతరము. అనేకదః=భక్తులకు అనేక అభీష్టములను ఇచ్చువాడు.

## 895 అగ్రజః

అగ్ర+జః; "అగ్ర"=సృష్టికి ముందుగా, "జః"=(జాయతే)=వ్యక్తమగువాడు.

## 896 అనిర్విణ్ణః

1 న+నిర్విణ్ణః="నిర్విణ్ణః"=శ్రమ చెందినవాడు, "న"=కానివాడు. (శ్రమలేనివాడు.)

2 జగత్ సృష్ట్యాది కార్యములందు విరక్తుడు కానివాడు.

## 897 సదాఽమర్షీ

1 సదా+అమర్షీ; "సదా"=ఎల్లప్పుడు; "అమర్షీ"=దైత్యాదులందు కోపము కలవాడు.

2 సత్+ఆ+మర్షీ="సత్"=సజ్జనుల విషయమునందు "ఆ"=బాగుగా, "మర్షీ" (మృష్యతే)=క్షమించువాడు.

3 సదామ+అర్షీ;"సదామ"=పాశమును ఆయుధముగాకల వరుణదేవుడు. అతనివద్దకు తండ్రియగు నందగోపుని రక్షించుటకై, "అర్షీ" (ఋషతి)=వెళ్ళువాడు. "ఋషీ=గతౌ" అను ధాతువు నుండి ఈ అర్థము వచ్చును.

## 898 లోకాధిష్ఠానమ్

లోక + అధిష్ఠానమ్; "లోక" = లోకమునకు, "అధిష్ఠానమ్ = ఆశ్రయమైన వాడు.

## 899 అద్భుతః

ఆశ్చర్యమైన రూపము కలవాడు.

శ్లో॥ సనాత్ సనాతనతమః కపిలః కపి రవ్యయః॥
స్వస్తిదః స్వస్తికృత్ స్వస్తి స్వస్తిభు క్స్వస్తిదక్షిణః॥ 96

## 900 సనాత్సనాతన తమః

సనాత్సనాతన తమః = వేదవాక్య ప్రతిపాద్యుడు. వేదవాక్య ప్రతిపాద్య విషయానుభవ శీలుడును, నిర్వికారుడును, సనాత్సనాతనతముడు.

శ్రీ సత్యసంధతీర్థులవారు ఈ నామమును రెండు నామములుగా విడదీసి అర్థము చెప్పిరి.

## 900 (A) సనాత్

"సన" = లాభమును, "ఆతయతి" = పొందించువాడు.

## 900 (B) సనాతన తమః

1 సన + ఆతన + తమః; "సన" లాభమును, "ఆతన" = (ఆతయతి) పొందించువాడు = సనాతనః; "తమః" = మిక్కిలి సనాతనుడు = సనాతన తమః.

2 సనాత + వతమః; "సన" = లాభమును, "అత" = పొందువాడు = సనాతాః; "మా" = లక్ష్మీదేవి, ఎవరిచేత "నత" = నమస్కరింప

బడినదో వారు "సతమాః" = ఎవని వలన సనాతనులు సతములైనారో అతడు = సనాత నతమః. (భక్తులకు లక్ష్మిని వశురాలుగా చేయువాడు.)

## 901 కపిలః

1 కపి + లః; "కపి" = హనుమంతుని, "లః" (లాతి) = దాసునిగా స్వీకరించిన వాడు.

2 క + పి + లః = "క" = సుఖరూపుడు; "పి" = ప్రపంచము ఇతని చేత పాలింపబడుచున్నది.; "లః" = ప్రపంచము ఇతనిచేత లీనము చేయుబడు చున్నది. కనుక కపిలః. "ప్రీతిం సుఖం కమానంద ఇత్యభిధానాత్, ప్రాణో బ్రహ్మ, కం బ్రహ్మ, ఖం బ్రహ్మ "అని యును,

"ఋషిం ప్రసూతం కపిలం యస్తమగ్రే జ్ఞానైర్బిభర్తి జాయమానం చ పశ్యేత్, సుఖాదనంతా త్పాలనాచ్చ, యం వై దేవం కపిల ముదాహరంతి" అను బాభ్రవ్య శిఖా వచనము ఇందుకు ప్రమాణము. (ఆనంద స్వరూపుడు—జగద్రక్షకుడు—జగల్లయకర్త.)

3 లీలగా ఆనందము ననుభవించువాడు. "సుఖం పిబన్ లీలయైవ కపిలః" అని గీతా తాత్పర్యమునందు చెప్పబడినది.

## 902 కపిః

క + పిః; "క" = సుఖమును, "పిః" (పిబతి) = త్రాగువాడు, (అనుభవించువాడు.)

## 903 అప్యయః

1 జగత్తు ప్రళయమునందు "అప్యేతి" = ఇతనియందు లీన మగును,

2 అపి+అయః; "అప్యయః అని కూడ పాఠాంతరము కలదు. అప్పుడ "అపి" శబ్దము సముచ్చయార్థకము. స్వర్గాదులను కూడ, అయః = పొందింప జేయువాడు.

కొందరు ఈ నామమును "అవ్యయః" అని పఠింతురు. అప్పుడ అర్థము అవ్య+యః; "అవ్య"=రక్షింపదగిన వారు. వారిని గూర్చి "యః"=వెళ్ళువాడు. (భక్తరక్షకుడు.)

3 అ+వి+అయః=స్వర్గాది ప్రాపకుడు.
"అయ, పయ=గతౌ" అను ధాతువునుండి ఈ అర్థము వచ్చినది

## 904 స్వస్తిదః

భక్తుల కొఱకు "స్వస్తి"=మంగళమును, "దః"=ఇచ్చువాడు.

## 905 స్వస్తికృత్

సు+అస్తి+కృత్; "సు" = శోభనమైన, "అస్తి" = సత్తను "కృత్"= చేయువాడు.

## 906 స్వస్తి

1 సు+అస్తి; "సు" = మిక్కిలిగా "అస్తి" = సకల దేశ కాలములయందు ఉన్నవాడు.

2 స్వస్తి = సుఖరూపుడు.
"సద్భావ వాచినః శబ్దాః సర్వే తే సుఖ వాచకాః" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

## 907 స్వస్తిభుక్

"స్వస్తి" = సుఖమును, "భుక్" = భుజింపజేయువాడు.

## 908 స్వస్తిదక్షిణః

1 సు+అస్తి+దక్షిణః="అస్తిక్షీరా గాః" అను ప్రయోగమువలెనే, "అస్తి దక్షిణః" అను పదమును గ్రహించి, "సు"=బాగుగా

"దక్షిణ"="దక్షిణ" అను పేరుగల లక్ష్మి, "అస్తి"=ఇతనికి కలదు. అని చెప్పుటచే "స్వస్తి దక్షిణః" అను నామ మేర్పడినది.
"దక్షభాగస్థితత్వాచ్చ దక్షిణా నామ చోచ్యతే"
తస్యా అయనో హి విష్ణుః స దక్ష భాగస్థితః' అను ఐతరేయ భాష్యోక్తి ఇందుకు ప్రమాణము. (లక్ష్మీవంతుడు.)

2 స్వస్తి=మంగళ ప్రదానము నందు, "దక్షిణః"=కుశలుడు.

శ్లో॥ అరౌద్రః కుండలీ చక్రీ విక్రమ్యూర్జిత శాసనః।
శబ్దాతిగ శ్శబ్దసహ శ్శిశిర శ్శర్వరీకరః॥ 97

### 909 అరౌద్రః

కోపము లేనివాడు.

### 910 కుడలీ

మకర కుండలములు కలవాడు.

### 911 చక్రీ

సుదర్శన చక్రము కలవాడు.

### 912 విక్రమీ

పరాక్రమశాలి.

### 913 ఊర్జిత శాసనః

స్థిరమైన శాసనము కలవాడు. "ఏకః శాస్తేతి ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము

## 914 శబ్దాతిగః

శబ్దము నతిక్రమించి ఉండువాడు. "యతో వాచో నివర్తంతే" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము. "అద్భుతత్వా దవాచ్యం తత్" అను వాక్యము కూడ ఇందుకు ప్రమాణము.

## 915 శబ్దసహః

శబ్ద+సహః = భృగుమహర్షి మొదలగు భక్తుల చేత చేయబడిన బెదిరింపుల రూపమున ఉన్న శబ్దమును, తదుపలక్షితమైన తాడనాదికమును "సహః" (సహతే) = సహించువాడు.

## 916 శిశిరః

1 శిశి+రః; "శిశి" = అత్యంత సుఖము కలవారు. వారివద్ద, "రః" (రమతే) = రమించువాడు.

2 ఇతనిని గూర్చి "శశంతి" = గంతులు వేయుచు భక్తులు పరుగెత్తుదురు కనుక శిశిరుడు.

3 కొందరీ నామమును "శశిరః" అని పఠింతురు. అప్పుడు అర్థము "శశి" = చంద్రునియందు, "రః" = రమించువాడు అనవచ్చును.

4 శృణాతి = దైత్యులను హింసించువాడు, "శౄ = హింసాయాం" అను ధాతువువలన ఈ అర్థము వచ్చును.

## 917 శర్వరీకరః

1 శర్వరీ+కరః "శర్వరీ" = రాత్రియందు, "కరః" = చంద్రాంతర్గత రూపముతో, "కరః" = కిరణములు కలవాడు (చంద్రుని యందు

2 "శర్వరీ" = రాత్రిని, "కరః" = సృష్టించువాడు "సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషా దధి" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము.

శ్లో॥ అక్రూరః పేశలో దక్షో దక్షిణః క్షమిణాంవరః।
విద్వత్తమో వీతభయః పుణ్యశ్రవణకీర్తనః॥ 98

## 918 అక్రూరః

1 క్రూరుడు కానివాడు.

2 అక్రూరున కిష్టమైనవాడు. అక్రూరుని యందు ప్రీతి కలవాడు.

## 919 పేశలః

1 మనోహరుడు.

2 ప+ఈశ+లః; "ప" (పాతి) = రక్షించువాడు. "ఈశ" = రుద్రుని భక్తుడుగా, "లః" (లాతి) = తెచ్చువాడు. ప+ఈశలః = పేశలః. (జగద్రక్షకుడు-శివుని భక్తునిగా చేసికొన్నవాడు.)

## 920 దక్షః

1 సమర్థుడు.

2 "దక్ష = గతి హింసయోః" అను ధాత్వర్థము వలన 1) వెళ్ళువాడు, 2) శత్రువులను హింసించువాడు.

## 921 దక్షిణః

1 దక్షిణః = కుశలుడు.

2 ఉదారుడు, "దక్షిణే సరలోదారా" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

3. అభివృద్ధుడైన వాడు "దక్ష=వృద్ధౌ శీఘ్రార్థేచ" అను ధాతువు ఇందుకు ప్రమాణము.

## 922 క్షమిణాంవరః

"క్షమిణామ్" = క్షమ కలవారిలో, "వరః" = శ్రేష్ఠుడు.

## 923 విద్వత్తమః

అత్యంత జ్ఞాని.

## 924 వీతభయః

భయము లేనివాడు.

## 925 పుణ్యశ్రవణకీర్తనః

ఎవని విషయమునందు శ్రవణమును, కీర్తనమును పుణ్యమైనవో అతడు. "నామ సంకీర్తనం యస్య సర్వపాప ప్రణాశనమ్।
ప్రణామో దుఃఖశమన స్తం నమామి హరిం పరమ్॥
(భాగ-12-13-23) అను వాక్య మిందుకు ప్రమాణము.

శ్లో॥ ఉత్తారణో దుష్కృతిహా పుణ్యో దుస్స్వప్ననాశనః।
వీరహా రక్షణ స్సంతో జీవనః పర్యవస్థితః॥ 99

## 926 ఉత్తారణః

1 సంసార సముద్రము నుండి "ఉత్తారణః" = ఉత్తరింప జేయువాడు (దాటించువాడు.)

2 ఉత్ + తార + ణః; "ఉత్" = ఉత్కృష్టమైన, "తార" = ప్రణవము (ఓంకారము) కలవారు = ఉత్తారాః = సన్న్యాసులు. వారికి "ణః" = ఎవనివలన సుఖము వచ్చునో అతడు.

## 927 దుష్కృతిహా

దుష్కృతము కలవారు దుష్కృతులు = పాపులు. వారిని "హా" (హంతి) = చంపువాడు.

## 928 పుణ్యః

పుణ్యమును (ధర్మాదులను) చెప్పువాడు.

## 929 దుస్వప్ననాశనః

దుఃస్వప్న = దుఃస్వప్నములను, "నాశనః" = నశింపజేయువాడు.

## 930 వీరహా

వి + ఇర + హా = "వి" = విశేషముగా, "ఇర" = మద్యమును త్రాగువారు = వీరాః; వారిని "హా" (హంతి) = చంపువాడు. (మైద్యాది మత్తులను నశింప జేయువాడు.)

## 931 రక్షణః

1 రక్షించువాడు.
2 "అరక్షణః" అని పదచ్ఛేదము చేసినచో, "అరమ్" = అత్యంతము; "క్షణః" = ఉత్సవము ఎవనికి కలదో అతడు. (ఎక్కువగా ఉత్సవాదుల ననుభవించువాడు.)

## 932 సన్తః

1 నిర్దుష్టుడు. (దోషరహితుడు.)

2 అన్నిచోట్ల ఉండువాడు. (వ్యాప్తుడు.)

## 933 జీవనః

జీవనః (జీవయతి) = బ్రతికించువాడు.

## 934 పర్యవస్థితః

పరి + అవ + స్థితః; "పరి" = అన్నివైపుల, "అవ"=రక్షించుట కొఱకు, "స్థితః" = ఉండువాడు. (అన్నివైపులనుండి సర్వాలను రక్షించువాడు.)

శ్లో॥ అనంతరూపో౽ నంతశ్రీ ర్జితమన్యు ర్భయాపహః।
చతురశ్రో గభీరాత్మా విదిశో వ్యాదిశో దిశః॥ 100

## 935 అనంతరూపః

అనంత + రూపః; "అనంత" = 1) అపరిమితములైన, 2) నాశము లేని, "రూపః" = రూపములు కలవాడు.

## 936 అనంతశ్రీః

అనంత + శ్రీః; "అనంత" = నాశరహితమైన, "శ్రీః" = స్వరూప సౌందర్యము కలవాడు. "స్వరూప శ్రీస్తథా భార్యా ద్వేధా శ్రీస్తు హరే ర్మతా" అను భాగవత తృతీయ తాత్పర్యోక్తి ఇందుకు ప్రమాణము.

## 937 జితమన్యుః

1 జిత + మన్యుః = దైత్యుల విషయము నందు ఎవనిచేత "మన్యుః" = కోపము, "జిత" = గెలువబడినదో అతడు. (రాక్షసులను కూడ అనుగ్రహించిన వాడు.)

2 ఎవని జ్ఞానము చేత "మన్యుః" = కోపము "జిత" = జయింపబడినదో అతడు.

## 938 భయాపహః

భయ + అపహః; "భయ" = భయమును, "అపహః" = తొలగించువాడు.

## 939 చతురస్రః

చతుర + స్రః; "చతుర" = నేర్పరినియును, "స్రః" = కదలువాడును = చతురస్రః; "సృ = గతౌ" అను ధాతువు వలన ఈ అర్థము వచ్చినది.

## 940 గభీరాత్మా

1 గభీర = లోతైన, గభీరమైన, "ఆత్మా" = మనస్సు కలవాడు.

2 కొందరు ఈ నామమును "అగభీర" అని పఠింతురు. అప్పుడు అర్థము అగ + భీ + ర = "అగ" = గోవర్ధన పర్వతము చేత, "భీ" = వృష్టి భయమును, "రః" (రేపయతి) = నాశనము చేయువాడు.

3 "అగ" = అర్జున వృక్షములకు, "భీ" = పెల్లగించు భయమును, "రః" (రాతి) ఇచ్చువాడు = అగభీరః + ఆత్మా = అగభీరుడును, ఆత్మ స్వరూపుడును.

## 941 విదిశః

1 విది + శః; "విది" = జ్ఞానియందు, "శః" = ఎవని వలన సుఖము వచ్చునో అతడు. (జ్ఞానుల కానందము నిచ్చువాడు.)

2 విద్ + ఈశః; "విద్" = తెలిసిన వారికి ఎవని వలన "ఈశ" = విస్మయము, సుఖమును కలుగునో అతడు.

## 942 వ్యాదిశః

1 వి + ఆది + శః = "వి" = గరుత్మంతుడే ఎవరికి, "ఆది" = ప్రథముడో వారు వ్యాదయః. వారికి ఎవని వలన "శమ్" = సుఖము కలుగునో అతడు. (గరుడాది సేవకులకు, దాసులకు ఆనందము నిచ్చువాడు.)

2 వి + ఆదిశః; "వి" = విశేషముగా, "ఆదిశః" = ఆజ్ఞాపించువాడు.

## 943 దిశః

దిశః = ధర్మాది దాతలు (తత్స్వరూపుడు) "దిశ = అతిసర్జనే" అను ధాతువును, "దిశో దిజ్ఞామాన శ్చేహ ప్రోక్తా ధర్మ జ్ఞానాతి దేశ నాత్" అను ఛాందోగ్య భాష్యోక్తియును, ఇందుకు ప్రమాణము. (ధర్మ స్వరూపుడు.)

శ్లో॥ అనాది ర్భూర్భువో లక్ష్మీ స్సువీరో రుచిరాంగదః।
జననో జనజన్మాది ర్భీమో భీమపరాక్రమః॥ 101

## 944 అనాదిః

ఎవని చేత "అనః" = ముఖ్యప్రాణుడు భక్తోత్తముడుగా, "ఆదిః" = స్వీకరించబడెనో అతడు. "ఆఙ్ పూర్వకమైన దా = దానే" అను ధాతువునుండి ఈ అర్థము వచ్చినది. (వాయువునకు ప్రభువు.)

## 945 భూర్భువో లక్ష్మీః

1 భూః + భువో + లక్ష్మీః = భూః = యజ్ఞ గృహములందు అభివ్యక్తుడగువాడు; భువః = సకలేష్ట ప్రదుడు; లక్ష్మీః = "లక్ష దర్శనాంకనయోః" అను ధాతువు వలన లక్షయతి = ప్రకాశింప జేయువాడు. భూశ్చాసౌ భువశ్చాసౌ లక్ష్మీశ్చ = భూర్భువో లక్ష్మీః (యజ్ఞ గృహముల యందుండు వాడు—భక్తులకు సకలేష్టప్రదుడు, జ్ఞానము ద్వారా తనను ప్రకాశింప జేయువాడు.)

2 భూః = భూమిః; (సంసారసాగర తారకస్థాన భూమిః) = భగవత్స్వరూపము; భువో=భూమికి 'లక్ష్మీః' = ప్రకాశకుడు. భువో లక్ష్మీః = షష్ఠికి అలుక్. భూశ్చాసౌ భువో లక్ష్మీశ్చ = భూర్భువో లక్ష్మీః (సంసార తారకుడగు భగవంతుడు–భూమికి వెలుగునిచ్చువాడు.) (శ్రీ) సత్యసంధ తీర్థులవారు ఈ నామమును మూడు నామములుగా విడదీసి అర్థము చెప్పిరి.

## 945 (A) భూః

పరిపూర్ణుడు.

## 945 (B) భువః

జగత్తునకు కారణుడు. "భూమా పూర్ణత్వం తతో భూః భావనాత్ జగదుత్పాదనాత్ భువః" అను సుధా వాక్యములు ఇందుకు ప్రమాణములు.

## 945 (C) లక్ష్మీః

పుణ్యము చేసినవారిని 'లక్షయతి' = చూచువాడు.

పుణ్యము చేసిన వారిచేత దర్శింపబడువాడు. "లక్ష = దర్శనాంకయోః" అను ధాతువునుండి ఈ అర్థము వచ్చినది.

## 946 సువీరః

సు + వి + ఈరః; "ఈరః" = ముఖ్యప్రాణుడు, ఎవనిచేత 'సు' = బాగుగా, "వి" = దేవతా శ్రేష్ఠునిగా చేయబడెనో అతడు (వాయువునకు దేవత్వమును కల్పించినవాడు.)

## 947 రుచిరాంగదః

రుచిర + అంగదః; "రుచిర" = మనోహరమైన "అంగ" = స్వరూపమును, దేహమును, "దః" = ఇచ్చువాడు.

2 "రుచిర" = మనోహరమైన, "అంగదః" = బాహుభూషణము కలవాడు.

3 కొందరు ఈ నామమును "అరుచిరాంగదః" అని పఠింతురు. అప్పుడు అర్థము "అరుచిర" = మనోహరముకాని "అంగ" = లింగ దేహమును "దః" = (ద్యతి) = ఖండించువాడు.

## 948 జననః

1 జన + నః = "జన" = జనులను, "నః" (నయతి) నడిపించువాడు.

2 జనయతి = పుట్టించువాడు.

## 949 జనజన్మాదిః

"జన" = జనుల యొక్క, "జన్మాది" = జన్మించుట మొదలగు దశలు ఎవని వలననో అతడు. (సృష్టికర్త.)

## 950 భీమః

1 భయంకరుడు 2 ప్రాణధారకుడు. "భృతమో భీమః" అను వాక్యము ఇందుకు ప్రమాణము.

## 951 భీమ పరాక్రమః

"భీమ" = 1 ద్రౌపది భర్తయగు భీమునకును 2 రుద్రునకును, ఎవనినుండి "పరాక్రమః" = పరాక్రమము వచ్చినదో అతడు.

శ్లో॥ ఆధారనిలయో ధాతా పుష్పహాసః ప్రజాగరః।
ఊర్ధ్వగ స్సత్పథాచారః ప్రాణదః ప్రణవః పణః॥ 102

## 952 ఆధారనిలయః

1 ఆధార + నిలయః = "అధార" = ధారకులు లేనివారు (రాక్షసులు)

వారి సమూహము, "ఆధారమ్"=ఆధారమునకు "నిరయః"= నరకమైనవాడు. "నిలయో నరక భేదః" అని చెప్పుటచే నిలయ= నిరయ అయినది. (రాక్షసులకు నరకమైనవాడు-అనగా వారిని అంతమొందించువాడు.)

2 ఆ+ధార+నిలయః="ఆ"=అన్నివైపులనుండి "ధార"=దేవేంద్రుని చే సృష్టింపబడిన వానధారలు కల గోపాలురు=ఆధారాః; వారికి "నిలయః"=ఆశ్రయమైనవాడు. (గోవర్ధనధారి.)

## 953 ధాతా

ధారణమును, పోషణమును చేయువాడు.

## 954 పుష్పహాసః

పుష్ప=మల్లెపూవువంటి, "హాసః"=నవ్వు కలవాడు.

## 955 ప్రజాగరః

1 ప్ర+జాగరః; "ప్ర"=ప్రకర్షముగ (ఎక్కువగా) "జాగరః"= మేలుకొని ఉండువాడు. (సంవత్సరములో ఎనిమిది నెలలు మేల్కొని యుండువాడు.)

2 "ప్రజా"=ప్రజలను సృష్టికాలమునందు, "గిరతి"=తననుండి బహిర్గతము చేయువాడు. 'గౄ=నిగరణే' అను ధాతువు వలన ఈ అర్థము వచ్చినది. (సృష్టికర్త)

3 ప్రజ+అగరః; "ప్ర"=ప్రకర్షముగా లోకములను "జః"=జనింప జేయువాడు=ప్రజః; అగ=వెంకటాద్రి మొదలగు పర్వతముల యందు "రః"=రమించువాడు=అగరః; ప్రజ+అగరః=ప్రజాగరః. (సృష్టికర్త-ఏడుకొండలవాడు.)

## 956 ఊర్ధ్వగః

1 ఊర్ధ్వ+గః; ఊర్ధ్వ=వైకుంఠాది లోకములందు "గః"=ఉండు వాడు.

2 "ఊర్ధ్వ" = వైకుంఠాది ఉత్తమ లోకములకు, 'గః' = చేర్చువాడు.

## 957 సత్పథాచారః

1 సత్పథ+ఆ+చారః; 'సత్పథ'=నక్షత్రాదుల యందు. 'ఆ'= పూర్తిగా, 'చారః' (చరతి) = చంద్రాంతర్గత రూపముతో చరించువాడు.

2 సత్పథ + ఆచారః; "సత్పథ" = మంచిమార్గము నందు, 'ఆచారః' = యోగ్యులను ఆచరింప జేయువాడు.

## 958 ప్రాణదః

1 ప్ర = ప్రకర్షముగా, "అణ" = గతిని, 'దః'= ఇచ్చువాడు. (మోక్షదుడు.)

2 ప్ర+అణ+దః; "ప్ర"=ప్రకర్షముగా, 'అణ'= తేజస్సు మొదలగు రూపము లందుండు శబ్దమును, బ్రహ్మకు దః = ఇచ్చువాడు. "అణ రణ బణ భణ మణ కణ క్వణ వ్రణ భ్రణ ధ్వణ శబ్దార్థాః" అను ధాతు వ్యాఖ్యానోక్తి ఇందుకు ప్రమాణము. (వేదప్రవర్తకుడు.)

## 959 ప్రణవః

1 నాలుగు రూపములయం దుండు విష్ణువు యొక్క నామము.

2 జాగ్రదాద్యవస్థలను, "ప్రణయతి"=నడిపించు వాడు "ణీఙ్ = ప్రాపణే" అను ధాతువునుండి ఈ అర్థము వచ్చినది.

3 ప్ర+ణ+వః; 'ప్ర'=ప్రకర్షముగా; "ణః"=సుఖము కలవారు=ప్రణాః [ముక్తులు] వారిని "వః"=వర్తింప జేయువాడు.

## 960 పణః

1 జనులచేత 'పణ్యతే'= స్తుతింపబడువాడు.

2 జనులచేత 'పణ్యతే' (వ్యవహారతి)=పిలువబడు వాడు. "పణ=వ్యవహారే, స్తుతౌ చ" అను ధాతువునుండి ఈ అర్థము వచ్చినది. [ప్రహ్లాదుడు, గజేంద్రుడు, మొదలగు భక్తులచే పిలువబడువాడు.]

శ్లో॥ ప్రమాణం ప్రాణనిలయః ప్రాణభృత్ ప్రాణజీవనః।
తత్త్వం తత్త్వవి దేకాత్మా జన్మ మృత్యు జరాతిగః॥ 103

## 961 ప్రమాణమ్

1 ప్ర + మాణమ్; "ప్ర"=ప్రకృష్టమైన, "మానమ్"=జ్ఞానము ఎవనికో అతడు. (మిక్కిలి జ్ఞాని.)

2 ప్రమాణమ్=విజ్ఞానానందములకు కొలత అగువాడు. "ప్రమితిః ప్రమాణం, విజ్ఞాన మానందం బ్రహ్మ" అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము.

3 చక్షురాద్యంతర్గతమైన జగత్తు ఇతనిచేత కొలువబడు చున్నది. కనుక "ప్రమాణమ్."

"యశ్చక్షురంతరో యమయతి,
యః శ్రోత్రమంతరో యమయతి" అను
శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము.

## 962 ప్రాణనిలయః

1 ప్రాణనిలయః, ప్రాణ = ప్రాణములకు, "నిలయః" = ఆశ్రియుడు.

2 ప్రాణ = వాయుదేవునకు, 'నిలయః' = ఆశ్రయమైన వాడు.

## 963 ప్రాణభృత్

ప్రాణ + భృత్ = "ప్రాణ" = ప్రాణములను, "భృత్" (బిభర్తి = భరించువాడు.

## 964 ప్రాణజీవనః

ప్రాణ + జీవనః; "ప్రాణ" = ప్రాణములతో జనులను "జీవనః" (జీవయతి) = బ్రతికించువాడు.

## 965 తత్త్వమ్

1 అద్వయ జ్ఞానస్వరూపుడు. "(పరమాత్మ ఒక్కడే" అను జ్ఞానమే రూపముగా కలవాడు.)

వదంతి తత్ తత్త్వవిద స్తత్త్వం యద్ జ్ఞాన మద్వయమ్।
బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి శబ్ద్యతే॥
అను భాగవతోక్తి ఇందుకు ప్రమాణము.

2 "తత్" అనియు, త్ + వమ్ అనియు, కలిసి "తత్త్వమ్", 'తత్' = గుణములతో వ్యాపించిన వాడును, త్ + వమ్ = స్వ స్వరూపుడుగా చెప్పబడు వాడును = తత్ త్వమ్.

3 తత్త్వమ్ = 1) సర్వ సత్తా ప్రమపకుట వలనను, 2) సర్వత్ర తెలియబడుట వలనను—తత్త్వమ్ అనగా హరి. "నరేంద్ర జగతా మథతస్థుషాంచ" అను చతుర్థ భాగవత శ్లోక వ్యాఖ్యాన వాక్యము

ఇందుకు ప్రమాణము. లేక తత్ = సర్వ సత్తా ప్రద సూచకమగు స్వ స్వరూపముతో "వమ్" = తెలిసికొనువాడు.

4 అన్నిచోట్ల ప్రసిద్ధికెక్కిన వాడు.

## 966 తత్త్వవిదేకాత్మా

తత్త్వం వేత్తీతి = తత్త్వవిత్ = తత్త్వ విదుడు. అతని కొఱకు, ఏకమ్ = ముఖ్యమైన, బలాదులను, ఆత్మా = కలిగింపజేయువాడు.

(శ్రీ) సత్యసంధ తీర్థులవారు. ఈ నామమును రెండు నామములుగా విడదీసి అర్థము చెప్పిరి.

## 966 (A) తత్త్వవిత్

తత్త్వ + విత్ = "తత్త్వ = స్వ స్వరూపమును, "విత్" = తెలిసికొన్నవాడు.

## 966 (B) ఏకాత్మా

ఏక + ఆత్మా = "ఏక" = ముఖ్యమైన, "ఆత్మా" = స్వామి.

## 967 జన్మమృత్యు జరాతిగః

జననము, మరణము, ముసలితనము, వాని వలన కలుగు సమస్త దోషములను దాటి ఉండువాడు.

శ్లో॥ భూర్భువస్స్వస్తరు స్తారః సవితా ప్రపితామహః।
యజ్ఞో యజ్ఞపతి ర్యజ్వా యజ్ఞాంగో యజ్ఞవాహనః॥ 104

## 968 భూర్భువస్స్వస్తరుః

భూర్భువస్స్వః + తరుః; "భూర్భువస్స్వః" = భూలోకము, భువ

ర్లోకము, స్వర్గలోకము అను లోకత్రయము నందుండు జనులను, తరుః = తరింపజేయువాడు.

(శ్రీ) సత్యసంధ తీర్థులవారు ఈ నామమును రెండు నామములుగా విడదీసి అర్థము చెప్పిరి.

## 968 (A) భూర్భువస్స్వః

భూః + భువః + స్వః; "భూః" = పూర్ణమైనవాడు, "భువః" = ఐశ్వర్యము చేత శ్రేష్ఠమైన వాడు "స్వః"= అనంత సుఖ రూపుడు. "పూర్ణో భూతివరోఽనంత సుఖో యద్ వ్యాహృతీః" అను ఋగ్భాష్య వాక్యమును, "యద్యస్మా దేవ మేకార్థ స్తస్మా ద్వ్యాహృతి రీరితః। స ఏవ ప్రణవార్థే వ్యాహృతయః" అను టీకా వచనమును ఇందుకు ప్రమాణములు.

'స్వః' = సు + వః = "సు" = శోభనమైన "వః" = సుఖము కలవాడు, 'సువః' అనుచోట ఉకారమునకు లోపము చెప్పుటవలన "స్వః" అను రూప మేర్పడినది.

## 968 (B) తరుః

"తరుః" (తరతి) = దాటువాడు "తౄ = ప్లవన తరణయోః" అను ధాతువునుండి ఈ అర్థము వచ్చును. కొందరు "స్వస్తరుః" అని ఏకపదముగా చదువుదురు. అప్పుడు అర్థము = కల్పవృక్షముతో సమానుడు అని వచ్చును.

## 969 తారః

ఓంకార వాచ్యుడు.

## 970 సవితా

సృష్టించుట వలన సవితా. "గుణైః స్తుతః ప్రసవితా" అను

వాక్యము ఇందుకు ప్రమాణము. (కొందరు ఇదే నామమును "పితా" అని పఠింతురు. లోకపితరులైన మరీచ్యాదులకు "పితా"= తండ్రియగు వాడు.)

## 971 ప్రపితామహః

పితామహు డనగా బ్రహ్మ. అతనికి తండ్రి అగుట వలన ప్రపితామహః. "పతిత్వేన శ్రియోపాస్య బ్రహ్మణా మత్పితేతి చ" [ భాగవతము 10-26 అ ] అను భాగవత దశమ తాత్పర్యపు వాక్యమును, "పితామహ స్తథాఽన్యేషాం త్రిదశానాం జనార్దనః, ప్రపితామహో మే భగవా నిహ సర్వజనస్య తు॥" అను వరాహ పురాణ వాక్యములును, ఇందుకు ప్రమాణములు.

## 972 యజ్ఞః

1 యజ్ఞ భోక్త అగువాడు.

2 యాజ్యత్వాత్ =యజ్ఞమునకు యోగ్యుడు అగుట వలన యజ్ఞుడు. యజ్ఞశ్చేజ్యాం తపోయాజ్య ఏవ చ" అను గీతా తాత్పర్యోక్తి ఇందుకు ప్రమాణము.

## 973 యజ్ఞపతిః

1 యజ్ఞములను పాలించువాడు.

2 యజ్ఞములకు స్వామి అగువాడు.

## 974 యజ్వా

యజ్ఞము చేయువాడు.

## 975 యజ్ఞాంగః

యజ్ఞమునకు ఉద్దేశ్యమైనవాడు.

## 976 యజ్ఞ వాహనః

యజ్ఞ వాహ + నః = యజ్ఞమును వహించువారు = యజ్ఞ వాహులు. వారిని నడిపించువాడు.

శ్లో॥ యజ్ఞభృత్ యజ్ఞకృత్ యజ్ఞీ యజ్ఞభుక్ యజ్ఞ సాధనః।
యజ్ఞాంతకృత్ యజ్ఞగుహ్య మన్న మన్నాద ఏవచ॥ 105

## 977 యజ్ఞకృద్యజ్ఞభృత్

యజ్ఞకృత్ + యజ్ఞ + భృత్ = యజ్ఞము చేయు యజమానుని కొఱకు యజ్ఞమ్ = అన్నాది దానమును ఎవరు ఇచ్చునో అతనిని "భృత్" పోషించి రక్షించు వాడు. (యజ్ఞమందలి యజమానికి ఆహారాదుల నిచ్చి పోషించుదాతలను పోషించువాడు.)

(శ్రీ) సత్య సంధ తీర్థులవారు ఈ నామమును రెండు నామములుగా విడదీసి అర్థము చెప్పిరి

## 977 యజ్ఞ భృత్

"యజ్ఞ" = యజ్ఞమును, "భృత్" = భరించువాడు.

## 977 యజ్ఞ కృత్

యజ్ఞ + కృత్ ; "యజ్ఞ" = యజ్ఞమును, "కృత్" = (కరోతి) చేయువాడు. విజ్ఞానం యజ్ఞం తనుతే కర్మాణి తనుతేఽపి చ" అను శృతి వాక్యము ఇందుకు ప్రమాణము. "నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన నానవాప్త మవాప్తవ్యం వర్తఏవచ కర్మణి [గీత–3–22] అను వాక్య మిందుకు ప్రమాణము.

## 978 యజ్ఞీ

యజ్ఞము కలవాడు.

## 979 యజ్ఞభుక్

1 యజ్ఞ = యజ్ఞ ఫలమును, "భుక్" = భుజించువాడు, అనుభవించువాడు.

2 యజ్ఞ ఫలమును ఇతరులచే అనుభవింప జేయువాడు.

## 980 యజ్ఞసాధనః

యజ్ఞ + సాధనః; 'యజ్ఞ' = యజ్ఞమునకు కావలసిన 'సాధనః' = స్రుక్ స్రువాదికము గాని, మంత్రాదికములు గాని ఎవనినుండి వచ్చునో అతడు. 'బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్" (గీత 4–14) అను వాక్య మిందుల కుదాహరణము.

## 981 యజ్ఞాంతకృత్

1 యజ్ఞ = యజ్ఞము యొక్క; "అంత" = నిర్ణయమును, "కృత్" = చేయువాడు (యజ్ఞ ఫలప్రదాత)

2 యజ్ఞ + అంత + కృత్ = 'యజ్ఞ' = యజ్ఞము యొక్క "అంత" = నాశనము ఎవరివలననో వారు "యజ్ఞాంతాః" = సుబాహు, మారీచ్యాదులు వారిని 'కృత్' (కృంతతి) = హింసించు వాడు.

## 982 యజ్ఞగుహ్యమ్

"యజ్ఞము" అను రహస్యమైన పేరుగల విష్ణువు.
(యజ్ఞో గుహ్యాం విష్ణురితి నామ యుక్త్వా, 'విష్ణుం వా ఏషః యష్టవ్యః'
అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము.

## 983 అన్నమ్

అన్నము అయినవాడు.

సర్వులకు ఉపజీవ్యుడగుట వలనను, సర్వమును తినుటవలనను 'అన్నమ్' అను పేరు వచ్చినది. 'అద్యతే ఽత్తిచ' అను శ్రుతి వాక్యము ఇందుకు ప్రమాణము.

## 984 అన్నాదః

అన్న + అదః; "అన్న" = అన్నమును, "అదః" = భుజించువాడు. 'ద్విజ పత్న్యర్పిత మస్తి విభో అన్నమ్' అను వాక్యము ఇందుకు ప్రమాణము. (శ్రీ కృష్ణుడు.)

శ్లో॥ ఆత్మయోని స్స్వయంజాతో వైఖాన స్సామగాయనః ।
దేవకీనందన స్స్రష్టా క్షితీశః పాపనాశనః ॥ 106

## 985 ఆత్మయోనిః

1 ఆత్మ + యోనిః = 'ఆత్మ' = బ్రహ్మకు గాని, జీవులకు గాని, 'యోనిః' = కారణమైనవాడు.
'ఆత్మా విరించః సుమనాః సుధాతశ్చేతి కథ్యతే' అను బృహద్వ్యాఖ్యోక్తి ఇందుకు ప్రమాణము.

2 స్వరమణత్వము వలన, లేక ఆత్మారాము డగుట వలన, 'ఆత్మ' = తనకు తానే, "యోనిః" భార్య అయిన వాడు. స్వరమణు డనగా లక్ష్మీదేవి యందుండు స్వ స్త్రీరూపముతో రమించువాడు అని తాత్పర్యము.

'రమయా రమమాణోపి తస్య నైవ స్త్రియాత్మనా ।
రమతే నాన్యతః క్వాపి రతి ర్విష్ణోః సుఖాత్మనః ॥

రమయా రమణం తస్మా ద్రమయా రతిపాత్రితా ।
నైవాస్యా రతి దాతృత్వం విష్ణోః న హ్యన్యతో రతిః ॥

అను ఐతరేయ భాష్యము లోని బృహతీ సహస్రిబుక్ ప్రతిపాద్య భగవద్ రూప కథన ప్రస్తావము నందలి వాక్యము ఇందుకు ప్రమాణము. ('ఏకమే వాద్వితీయం బ్రహ్మ' అనువాక్యము ప్రకారము లక్ష్మి కూడ తానే అయి ఆ స్త్రీ రూపముతో రమించువాడు.)

3 "ఆత్మా" = చతుర్ముఖుడు ఎవనికి, యోని = భార్యయో ఆతడు. భామోపాసన యోగ్యుడగు, స్త్రీ రూపుడగు చతుర్ముఖునితో రమించువా డని తాత్పర్యము.

"భామోపాసన యోగ్యస్తు సాక్షాత్ బ్రహ్మైవ ముఖ్యతః,
స తద్విద్యా జత్నైవ విష్ణునారతి మాప్నుయాత్,
తేనైవ క్రీడతే సత్యాం స్త్రీ రూపో మిథునీ భవత్.
అను ఛాందోగ్య భాష్యోక్తి ఇందుకు ప్రమాణము.

## 986 స్వయం జాతః

స్వయమ్ + జాతః; "స్వయమ్ = తనంట తానుగా లేక తననుండియే, "జాతః" = పుట్టినవాడు.

"భూత భూతాభిమానీ చ తద్దేహోఽన్తర్నియామకః,
హరిశ్చాకాశశబ్దోక్తో ముఖ్యతో హరిరేవ చ." అను అనువ్యాఖ్యానోక్తి ఇందుకు ప్రమాణము. (అనాది యగువాడు.)

## 987 వైఖానః

1 వై + ఖ + అనః = "ఖ" ఇంద్రియములు, "అన" = ప్రాణములు, "వి" = విశిష్టమైన; ఖ + అన = ఇంద్రియ ప్రాణములు కలవారు = విఖానాః = ముక్తులు. ఆ విఖానులకు స్వామి = వైఖానః.

2 విఖానాః = దేహ త్యాగానంతరము ఖననము లేనివారు = ముక్తులు. వారికి సంబంధించిన వాడు = వైఖానః.

3 "వి" = విశేషముగా, "భూమః" = భూమిని త్రవ్వుటకు సంబంధించిన పనిని, వరాహ రూపముతో చేసినవాడు.

## 988 సామగాయనః

1 సామ = సామ వేదమును, "గాయనః" = పాడువాడు.

2 సామగ + అయనః; "సామగ" = సామవేదమును గానము చేయువారికి, "అయనః" = ఆశ్రయము నైనవాడు.

## 989 దేవకీనందన

1 దేవకీ = దేవకీదేవి యొక్క "నందనః" = కుమారుడు.

2 దేవ + కీ + నందనః = "దేవ" = దేవతలకు, "క" = ఎవని వలన సుఖము కలుగునో అతడు దేవకః = వరుణుడు. అతని భార్యయగు గంగ = దేవకీ, ఆ దేవకి ఎవనికి "నందన" = సంతోషము కలిగించునదో. లేక పుత్రునైనదియో అతడు. (గంగోత్పత్తికి కారణుడు.)

3 దేవకః = నారాయణుడు. అతని పుత్రుడు గంగ = దేవకీ. ఆమెను "నందనః" (నందయతి) = సంతోషపరచువాడు.

4 దేవకి అనగా లక్ష్మి. ఆమెను సంతోషపరచువాడు, ఈ అంశము భాగవత టీక యందున్నది.

## 990 స్రష్టా

సృష్టి చేయువాడు.

## 991 క్షితీశః

భూపతి లేక రాజు.

## 992 పాపనాశనః

1 "పాప" = పాపమును, "నాశనః" [నాశయతి] = నశింపచేయు

2 పాపస + అశనః; 'పాప' = పాపమును గూర్చి 'న' (నయతి) = తీసికొని పోవువారు = పాపనాః = తత్త్వాభిమానులగు రాక్షసులు. వారిని 'అశనః' = (అశ్నాతి) = సంహరించువాడు. (రాక్షసాంతకుడు.)

శ్లో॥ శంఖభృత్ న్నందకీ చక్రీ శార్ఙ్గధన్వా గదాధరః ।
రథాంగపాణి రక్షోభ్య స్సర్వప్రహరణాయుధః ॥ 107

## 993 శంఖ భృత్

1) శంఖ + భృత్; "శంఖ" = పాంచజన్యము అను పేరుగల శంఖమును. 2) శంఖ ప్రసూనము అను కుబేరుని నవ నిధులలో ఒక దానిని, "భృత్" = భరించువాడు.

## 994 నందకీ

నందకమను పేరుగల ఖడ్గము కలవాడు.

## 995 చక్రీ

రామ కృష్ణాది రూపములతో, "చక్రి" 1) సైన్య చక్రము (సమూహము) కలవాడు. 2) ప్రపంచము కలవాడు. 3) సుదర్శన చక్రము కలవాడు.

## 996 శార్ఙ్గధన్వా

శార్ఙ్గము అను పేరుగల ధనుస్సు కలవాడు.

## 997 గదాధరః

కౌమోదకి అను పేరుగల 'గదా' = గదను, 'ధరః' = ధరించినవాడు.

## 998 రథాంగ పాణిః

రథాంగ + పాణిః; "రథాంగ" = చక్రము, 'పాణిః' = చేతియందు కలవాడు.

## 999 అక్షోభ్యః

క్షోభింప చేయుటకు వీలు కానివాడు.

## 1000 సర్వ ప్రహరణాయుధః

"సర్వ" = శత్రువులందరిని 'ప్రహరణ' = కొట్టుటకు కావలసిన "ఆయుధః" = ఆయుధములు కలవాడు.

## 1001 సర్వ ప్రహరణాయుధః

మొత్తముగా గ్రంథము నందలి అర్థమును అవధారణము చేయుట కొఱకు (గుర్తుంచు కొనుటకు) ఈ నామము ద్విరుక్తము చేయ బడినది. (రెండుసార్లు చెప్పబడినది.)

"అధ్యాయాంతే ద్విరుక్తిః స్యాత్ వేదే వా వైదికేపి వా ।
వికారో యత్ర సజ్జేత పూర్వోక్తస్య అవధారణే ॥

అనుక్తానాం ప్రమాణానాం స్వీకారశ్చ కృతో భవేత్ ।
వినింద్య చేతరాన్ మార్గాన్ సంపూర్ణ ఫలతా తథా" ॥
అను గారుడోక్తి ఇందుకు ప్రమాణము.

విష్ణు సహస్రనామమని [వెయ్యి పేర్లు గల స్తోత్రము అని] చెప్పినను పరిశీలనగా లెక్కించినచో, కొన్ని నామములు ఎక్కువే ఉండును. "శతధాఽహం సహస్రఽధాహమ్" అను శ్రుతి వ్యాఖ్యావసరము నందు "వంద" అనగా 'నూట ఎనిమిదిగా' దగ్గరి అధిక సంఖ్యను చెప్పుటను సంప్రదాయ విదులు అంగీకరించినదే!

శ్లో॥ శ్రీ సర్వప్రహరణాయుధ ఓం నమ ఇతి
వనమాలీ గదీ శార్ఙ్గీ శంఖీ చక్రీ చ నందకీ।
శ్రీమాన్నారాయణో విష్ణుర్వాసుదేవోఽభిరక్షతు॥ 108

( ఈ శ్లోకమును మూడు సార్లు చదువ వలెను. )

## 1002 ఓం నమః

1 ఓమ్ = 1) జగత్తును రక్షించుట మొదలగు పనులను చేయువాడు. 2) జగత్తు నందలి గుణముల లోనికి ప్రవేశించువాడు. 3) గుణముల చేత "ఈయతే" = సమీపింప బడువాడు.. 4) ప్రళయాదుల యందు జగత్తుచేత ప్రవేశింప బడువాడు.

"ఓతం జగత్త్రియం స్వయం చ పూర్ణో వేదోక్త రూపో ఽ నుపచారతశ్చ,
సర్వైః శుభైశ్చా భియుతో న చాన్యై,
రోంత త్సదిత్యేన మతో వదంతి"
అను వాక్యములు ఇందుకు ప్రమాణములు.

2 "ఓమ్ = బ్రహ్మ.

అధికమైన ఉత్తమ గుణములు కలిగి ఉండుట వలన భగవంతుడైన విష్ణువునకు "ఓమ్" అను పేరు కలదు.

"ఓం" నామా భగవా న్విష్ణుః
అధికోచ్చ గుణత్వతః॥

ఓత మస్మిన్ జగ త్సర్వం
అత్యుచ్చాఖిలై ర్గుణైః॥

అకారస్య వికారో ఽ యం
ఓంకార ఇతి కథ్యతే॥

అధికోచ్చత్వ మానం హి
తస్యార్థ స్సముదీరితః॥
అకారేణైవ తత్సర్వ

ముక్త మాధిక్యత స్త్వతః॥
అధికోచ్చ స్వరూపో ఽసౌ
మత శ్చాధిక ఏవహి"॥ ఇతి.
"తస్మా దకార బీజేయం
విష్ణో ర్నారాయణాభిధా॥
ప్రణవశ్చ యతో జ్కారః
ప్రధానం నామ చక్రిణః"॥ అను శ్రుతి, స్మృతుల చేత గుణ
పూర్ణుడగు పరమాత్మ ఓంకార శబ్ద వాచ్యుడని చెప్పబడినది.

ఓమ్=గుణపూర్ణుడగు భగవంతునకు.
నమః=నమస్కారము.

4 'అ' కారము యొక్క వికారరూపము "ఓం" కారము. "ప్రణవశ్చ యతో జ్కారః ప్రధానం నామ చక్రిణః" అను శ్రుతి, స్మృతి వాక్యములు ఇందుకు ప్రమాణములు. శాస్త్రములు, మంగళాదులును, మంగళ మధ్యములును, మంగళాంతములును కావలెనని ఆర్ష సంప్రదాయము. అందువలననే ఈ స్తోత్రము "హరిః ఓమ్" అను మంగళమగు ఓంకారముతో ప్రారంభింపబడి మంగళప్రదములైన సహస్రనామములను మధ్యన కలిగియుండి "ఓం నమః" అను మంగళాంతముతో పూర్తి అయినది. ఇట్టి పవిత్ర శాస్త్రములను, స్తోత్రములను చదివినవారు వీరపురుషులు, దీర్ఘాయుష్మంతులు చక్కని అధ్యేతలు (శాస్త్రపాఠకులు) అగుదు రనుటకు ఈ మంగళార్థ సూచనమే ఇందుకు ప్రమాణము.

"ఓంకార శ్చాథ శబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా,
కంఠం భిత్వా వినిర్యాతౌ తస్మా న్మాంగళికా వుభౌ".

అని చెప్పుటచే "ఓం నమః" అని అంతమునందు మంగళార్థ విశిష్టముగా చెప్పబడినది.

ఇతి శ్రీమత్సత్యసంధాభిధ సర్వతంత్ర స్వతంత్ర పదవాక్య ప్రమాణ పారావారపారీణ శ్రీ సత్యసంధ యతి వర్యకృతం శ్రీమద్విష్ణు సహస్రనామ భాష్యమ్.

ఇది సర్వతంత్ర స్వతంత్ర, పదవాక్య ప్రమాణ పారావార పారీణ, శ్రీ సత్యసంధ యతిరాజ కృతమైన శ్రీ మద్విష్ణు సహస్రనామ స్తోత్ర భాష్యమునకు గోళ్ళమూడి వెంకట శ్రీహరి సుబ్రహ్మణ్య శర్మ వెలయించిన ఆంధ్రానువాదము.



# ఫలస్తుతిః॥

భీష్మ ఉవాచ: భీష్ముడు చెప్పెను.

1) శ్లో॥ ఇతీదం కీర్తనీయస్య కేశవస్య మహాత్మనః ।
నామ్నాం సహస్రం దివ్యానా మశేషేణ ప్రకీర్తితమ్ ॥

తాత్పర్యము: ఇట్లు మహాత్ముడైన కేశవుని యొక్క దివ్యములైన సహస్ర నామములు సమగ్రముగా చెప్పబడినవి.

2) శ్లో॥ య ఇదం శృణుయాన్నిత్యం యశ్చాపి పరికీర్తయేత్ ।
నాశుభం ప్రాప్నుయాత్ కించిత్ సోఽముత్రేహ చ మానవః ॥

తాత్పర్యము: ఏ మానవుడు నిత్యము ఈ స్తోత్రమును వినునో, కీర్తించునో అతడు ఈ లోకము నందును, పరలోకము నందును కూడ ఏ కొలది అశుభము నైనను పొందడు.

3) శ్లో॥ వేదాంతగో బ్రాహ్మణః స్యాత్ క్షత్రియో విజయీ భవేత్ ।
వైశ్యో ధన సమృద్ధః స్యాత్ శూద్ర స్సుఖ మవాప్నుయాత్ ॥

తాత్పర్యము: ఈ స్తోత్రమును బ్రాహ్మణుడు చదివినచో వేదాంతాది జ్ఞానమును పొందును. క్షత్రియుడు చదివినచో విజయము నందును. వైశ్యుడు చదివినచో ధనసమృద్ధి కలవాడగును. శూద్రుడు చదివినచో సుఖమును పొందును.

4) శ్లో॥ ధర్మార్థీ ప్రాప్నుయాత్ ధర్మ మర్థార్థీ చార్థ మాప్నుయాత్ ।
కామా నవాప్నుయాత్ కామీ ప్రజార్థీ ప్రాప్నుయాత్ ప్రజామ్॥

తాత్పర్యము : ధర్మమును కోరువాడు ధర్మమును పొందును. అర్థమును కోరువాడు అర్థము నందును. కామి కామములను పొందును. సంతానమును కోరువాడు సంతానమును పొందును.

5) శ్లో॥ భక్తిమాన్ యస్సదోత్థాయ శుచి స్తద్గత మానసః।
సహస్రం వాసుదేవస్య నామ్నా మేత త్ప్రకీర్తయేత్॥

తాత్పర్యము : భక్తికలవాడు నిత్యము వేకువనే నిదుర మేల్కొని శుచియై, విష్ణువుమీాద మనస్సునిల్పి వాసుదేవుని యొక్క ఈ వెయ్యి నామములను పఠింప వలెను.

6) శ్లో॥ యశః ప్రాప్నోతి విపులం యాతి ప్రాధాన్య మేవచ।
అచలాం శ్రియ మాప్నోతి శ్రేయ శ్చాప్నో త్యనుత్తమమ్॥

తాత్పర్యము : అట్టి భక్తుడు విపులమైన కీర్తిని పొందును. ప్రాధాన్యమును వహించును. అచలమైన సంపదను పొందును. అనుత్తమమైన శ్రేయస్సును పొందును.

7) శ్లో॥ న భయం క్వచి దాప్నోతి వీర్యం తేజశ్చ విందతి।
భవ త్యరోగో ద్యుతిమాన్ బలరూప గుణాన్వితః॥

తాత్పర్యము : ఎచ్చటను భయమును పొందడు. వీర్యమును, తేజస్సును పొందును. రోగములు లేనివా డగును. తేజోవంతు డగును. బలము, రూపము, గుణములతో కూడిన వాడగును.

8) శ్లో॥ రోగార్తో ముచ్యతే రోగాత్ బద్ధో ముచ్యేత బంధనాత్ ।
భయాన్ ముచ్యేత భీతస్తు ముచ్యేతాపన్న ఆపదః ॥

తాత్పర్యము : రోగార్తుడు రోగమునుండియు, బద్ధుడు బంధనము నుండియు, భయపడిన వాడు భయమునుండియు, ఆపదలోనున్న వాడు ఆపదనుండియు ముక్తుడగును.

9) శ్లో॥ దుర్గా ణ్యతితరత్యాశు పురుషః పురుషోత్తమమ్ ।
స్తువ న్నామసహస్రేణ నిత్యం భక్తి సమన్వితః ॥

తాత్పర్యము : విష్ణునామ సహస్రమును భక్తి సమన్వితుడై నిత్యము స్తోత్రము చేయు పురుషుడు వెంటనే దుర్గములను [కష్టములను] దాటును.

10) శ్లో॥ వాసుదేవాశ్రయో మర్త్యో వాసు దేవపరాయణః ।
సర్వ పాప విశుద్ధాత్మా యాతి బ్రహ్మ సనాతనమ్॥

తాత్పర్యము : వాసుదేవుని ఆశ్రయించిన, వాసుదేవునే పరాయణునిగా, (సర్వ శ్రేష్ఠునిగా) భావించిన, మానవుడు సర్వ పాపముల నుండి విశుద్ధమైన ఆత్మ కలవాడై సనాతనమైన ధర్మపథమును చేరును.

11) శ్లో॥ న వాసుదేవభక్తానా మశుభం విద్యతే క్వచిత్ ।
జన్మ మృత్యు జరావ్యాధి భయం నైవోపజాయతే ॥

తాత్పర్యము : వాసుదేవుని భక్తులకు ఎక్కడను అశుభము కలుగదు. జన్మ, మృత్యువు, జర [ముసలితనము] వ్యాధుల వలన వచ్చు భయము కలుగనే కలుగదు.

12) శ్లో॥ ఇమం స్తవ మధీయానః శ్రద్ధాభక్తి సమన్వితః ।
యుజ్యేతాత్మా సుఖక్షాంతి శ్రీ ధృతి స్మృతి కీర్తిభిః ॥

తాత్పర్యము : శ్రద్ధాభక్తులతో కూడినవాడై ఈ స్తవమును చదివిన వాడు సుఖము, క్షాంతి, సంపద, స్మృతి, కీర్తులతో కూడిన వాడగును.

13) శ్లో॥ న క్రోధో నచ మాత్సర్యం నలోభో నా శుభామతిః ।
భవంతి కృతపుణ్యానాం భక్తానాం పురుషోత్తమే ॥

తాత్పర్యము : పుణ్యము చేసిన భక్తులకు పురుషోత్తముని యందు కోపము, మాత్సర్యము, లోభము, అశుభమైన మతి కలుగవు (లేక-విష్ణుభక్తులకు కోపాది దుర్గుణములు కలుగవు.)

14) శ్లో॥ ద్యౌః సచంద్రార్క నక్షత్రం ఖం దిశో భూర్మహోదధిః।
వాసుదేవస్య వీర్యేణ విధృతాని మహాత్మనః ॥

తాత్పర్యము : మహాత్ముడైన వాసుదేవుని యొక్క వీర్యము చేత ఆకాశము, చంద్రుడు, సూర్యుడు, నక్షత్రములు, స్వర్గము, దిక్కులు, భూమి, సముద్రము ధరింపబడుచున్నవి.

15) శ్లో॥ ససురాసుర గంధర్వం సయక్షోరగ రాక్షసమ్।
జగద్వశే వర్తతేదం కృష్ణస్య సచరాచరమ్ ॥

తాత్పర్యము : దేవతలు, అసురులు, గంధర్వులు, యక్షులు, ఉరగులు, రాక్షసులతో కూడిన చరాచరమైన ఈ జగత్తంతయు కృష్ణుని యొక్క వశమునం దుండును.

16) శ్లో॥ ఇంద్రియాణి మనోబుద్ధిః సత్త్వం తేజో బలం ధృతిః।
వాసుదేవాత్మకా న్యాహుః క్షేత్రం క్షేత్రజ్ఞ ఏవచ ॥

తాత్పర్యము : ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, సత్త్వము, తేజస్సు, బలము, ధృతి [ధైర్యము] క్షేత్రము, క్షేత్రజ్ఞుడు అనునవి వాసుదేవాత్మకములు అని పెద్ద లందురు.

17) శ్లో॥ సర్వాగమానా మాచారః ప్రథమం పరికల్ప్యతే।
ఆచారః ప్రథమో ధర్మో ధర్మస్య ప్రభు రచ్యుతః ॥

తాత్పర్యము : అన్ని ఆగములకు (వేదములకు, శాస్త్రములకు) ముందుగా ఆచారము పరికల్పింపబడినది. (అన్నిటికంటె ముఖ్యమైనదిగా నిర్ణయింపబడినది). కనుక ఆచారమే ప్రధానమైన ధర్మము. అట్టి ధర్మమునకు ప్రభువు అచ్యుతుడు.

18) శ్లో॥ ఋషయః పితరో దేవాః మహాభూతాని ధాతవః।
జంగమాజంగమం చేదం జగ న్నారాయణోద్భవమ్॥

తాత్పర్యము : ఋషులు, పితృదేవతలు, దేవతలు, పృథివ్యాది మహాభూతములు, సప్తధాతువులు మొదలగునవియును, జంగమ స్థావరాత్మకమును అగు ఈ జగత్తు నారాయణునినుండి ఉద్భవించినది

19) శ్లో॥ యోగో జ్ఞానం తథా సాంఖ్యం విద్యాః శిల్పాది కర్మచ।
వేదా శ్శాస్త్రాణి విజ్ఞాన మేతత్సర్వం జనార్దనాత్॥

తాత్పర్యము : యోగము, జ్ఞానము, సాంఖ్యము, విద్యలు శిల్పాదికళలు, వేదములు, శాస్త్రములు, విజ్ఞానము అను ఇవన్నియును జనార్దనుని నుండియే వచ్చును.

20) శ్లో॥ ఏకో విష్ణుః మహాద్ భూతం పృథక్ భూతా న్యనేకశః।
త్రీన్ లోకాన్ వ్యాప్య భూతాత్మా భుఙ్క్తే విశ్వ భుగవ్యయః

తాత్పర్యము : విష్ణువు ఒకడే మహాద్భూతము. అతడే పెక్కు పృథక్ భూతములుగా [వేరు వేరు జీవులుగా] మారి, ముల్లోకముల యందు వ్యాపించి, భూతాత్మ అయి, వ్యయము లేనివాడై విశ్వమును భుజించుచు, అనుభవించుచు ఉండును.

21) శ్లో॥ ఇమం స్తవం భగవతో విష్ణో ర్వ్యాసేన కీర్తితమ్।
పఠేద్య ఇచ్ఛేత్ పురుషః శ్రేయః ప్రాప్తుం సుఖానిచ॥

తాత్పర్యము : ఏ పురుషుడు శ్రేయస్సును, సుఖమును, పొం గోరునో అతడు వ్యాసమహర్షిచే కీర్తింపబడిన భగవంతుడగు విష్ణు యొక్క ఈ స్తోత్రమును పఠింపవలెను.

22) శ్లో॥ విశ్వేశ్వర మజం దేవం జగతః ప్రభవాప్యయమ్।
భజంతి యే పుష్కరాక్షం న తే యాంతి పరాభవమ్॥

తాత్పర్యము : విశ్వేశ్వరుడును, పుట్టుక లేనివాడును దేవుడును, జగత్తు యొక్క సృష్టికి, సంహారమునకు కారణుడును, పుష్కరాక్షుడును. (తామర పువ్వుల వంటి కన్నులు కలవాడు), అగు విష్ణువును ఎవరు భజింతురో (సేవింతురో) వారు పరాభవమును పొందరు.

అర్జున ఉవాచ :

23) శ్లో॥ పద్మపత్ర విశాలాక్ష! పద్మనాభ సురోత్తమ।
భక్తానా మనురక్తానాం త్రాతా భవజనార్దన॥

తాత్పర్యము : పద్మ పత్రముల వలె విశాలమైన కన్నులు కలవాడా! పద్మము నాభియందు కలవాడా! సురోత్తముడా! ఓ జనార్దనుడా! నీమీద అనురాగము కలిగిన భక్తులకు నీవు రక్షకుడవు కమ్ము.

శ్రీ భగవా నువాచ:

24) శ్లో॥ యో మాం నామ సహస్రేణ స్తోతు మిచ్ఛతి పాండవ।
సో౽హ మేకేన శ్లోకేన స్తుత ఏవ న సంశయః॥

" స్తుత ఏవ న సంశయ ఓం నమ ఇతి "

తాత్పర్యము : ఓ పాండవుడా! (అర్జునా!) ఎవడు నన్ను ఈ సహస్రనామ స్తోత్రముతో స్తుతింప గోరునో అతనిచేత నేను ఒకే ఒక శ్లోకమును చదువుట చేతనే స్తుతింపబడిన వాడను అగుదును. ఇందుకు సందేహ పడనక్కర లేదు.

వ్యాస ఉవాచ :

25) శ్లో॥ వాసనా ద్వాసుదేవస్య వాసితం తే జగత్త్రయమ్।
సర్వభూతనివాసో౽సి వాసుదేవ నమో౽స్తు తే॥

" శ్రీ వాసుదేవ నమో౽స్తుత ఓం నమ ఇతి "

తాత్పర్యము: మూడు లోకములు వాసుదేవునియొక్క వాసన [ సంబంధము ] వలన వాసిగాంచు చున్నవి. ఓ వాసుదేవుడా! నీవు సర్వ భూతములకు నివాస స్థానమవు. నీకు నమస్కారము.

పార్వత్యువాచ :

26) శ్లో॥ కేనోపాయేన లఘునా విష్ణోర్నామ సహస్రకమ్।
పఠ్యతే పండితైర్నిత్యం శ్రోతుమిచ్ఛామ్యహం ప్రభో॥

తాత్పర్యము : విష్ణు సహస్రనామము తేలికగా పండితులచేత నిత్యము ఏ ఉపాయముచే పఠింపబడునో దానిని నేను వినగోరుచున్నాను. ఓ ప్రభువా! చెప్పుము.

ఈశ్వర ఉవాచ :

27) శ్లో॥ శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే।
సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే॥

" శ్రీ రామనామ వరానన ఓంనమ ఇతి "

తాత్పర్యము : ఓ సుముఖీ! " శ్రీరామ రామ రామ " అను మంత్రమును జపించినచో అది సహస్రనామ పారాయణముతో సమానమైన ఫలము నిచ్చును.

బ్రహ్మోవాచ :

28) శ్లో॥ నమోఽస్త్వనంతాయ సహస్రమూర్తయే
సహస్రపాదాక్షి శిరోరు బాహవే।
సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే
సహస్రకోటీ యుగ ధారిణే నమః॥

తాత్పర్యము :- సహస్ర మూర్తులు కలవాడును, సహస్ర పాదములు, సహస్రాక్షులు, సహస్ర శిరస్సులు, సహస్ర బాహువులు

సహస్ర నామములు కలవాడును, సహస్రకోటి యుగములను [కాలమును] ధరించిన వాడును, శాశ్వతుడైన పురుషుడగు వాడును అగు అనంతునకు నమస్కారము.

సంజయ ఉవాచ:

శ్లో॥ యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।
తత్ర శ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ ॥

తాత్పర్యము :— ఎచ్చట యోగేశ్వరుడైన కృష్ణుడును, ధనుర్ధారియైన అర్జునుడును ఉందురో అచ్చట శ్రీ (లక్ష్మి) యును, విజయమును, భూతియును (భగవదైశ్వర్యమును), నీతియును తప్పక ఉండును అని నా ఉద్దేశ్యము.

శ్రీ భగవానువాచ:

శ్లో॥ అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహా మ్యహమ్ ॥

తాత్పర్యము :— ఇతర విషయములను విడిచిపెట్టి, ఎవరు నన్నే నిత్యయుక్తులై (ఏకాగ్రముగా) ధ్యానించుదురో అట్టివారికొరకు యోగక్షేమములను నేను వహింతును.

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మ సంస్థాప నార్థాయ సంభవామి యుగే యుగే ॥

తాత్పర్యము :— సాధువులను రక్షించుటకును, దుష్కార్యములు చేయువారిని నశింపజేయుటకును ధర్మమును స్థాపించుటకును యుగ యుగములందును నే నవతరించు చుందును.

శ్లో॥ ఆర్తా విషణ్ణాః శిథిలాశ్చ భీతాః
ఘోరేషు చ వ్యాధిషు వర్తమానాః ।
సంకీర్త్య నారాయణ శబ్దమాత్రం
విముక్త దుఃఖాః సుఖినో భవంతి ॥

తాత్పర్యము :- ఆర్తులును (కష్టములో ఉన్నవారు) విషణ్ణులు (దుఃఖముతో ఉన్నవారు) శిథిలురు (శారీరికముగా మానసికముగాను చితికిపోయినవారును), భయపడినవారు, ఘోరమైన వ్యాధులచే పీడింపబడు వారును, నారాయణుని పేరును తలచినంత మాత్రమున నే వారు వారివారి దుఃఖముల నుండి విముక్తులై సుఖము నందుదురు.

శ్లో॥ యదక్షర పదభ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్ ।
తత్సర్వం క్షమ్యతాం దేవ నారాయణ నమోస్తు తే॥

తాత్పర్యము :- నేను చేసిన ఈ పారాయణములో అక్షరముల యందు, పదములయందు, మాత్రలయందు, ఏ దోషమున్నను నీవు క్షమింపవలెను. ఓ నారాయణుడా! నీకు నమస్కారములు.

శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః ।
గో బ్రాహ్మణేభ్యః శుభ మస్తు నిత్యం
లోకాః సమస్తాః సుఖినో భవంతు ॥

తాత్పర్యము :- ప్రజల కందరకు మేలు కలుగుగాక ! రాజులు న్యాయమార్గమున రాజ్యమును పాలించుదురు గాక! ఆవులకు, బ్రాహ్మణులకు నిత్యము శుభము కలుగుగాక! లోకములన్నియు సుఖము నందును గాక!

శ్లో॥ కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ ।
దేశోఽయం క్షోభరహితః మా కశ్చిత్ దుఃఖ భాక్ భవేత్

తాత్పర్యము :- వాన సకాలములో పడుగాక ! భూమి పంట పండి ప్రకాశించు గాక ! ఈ దేశము క్షోభములు లేకుండ సుఖశాంతలతో వర్ధిల్లుగాక ! ఏ ఒకరును దుఃఖమును పొందకుందురుగాక !

శ్లో॥ అపుత్రాః పుత్రిణ స్సంతు పుత్రిణ స్సంతు పౌత్రిణః।
అధనాః సధనా స్సంతు సర్వే సంతు నిరామయాః॥

తాత్పర్యము:- పుత్రులు లేనివారు పుత్రవంతు లగుదురుగాక! పుత్రవంతులు పౌత్రులు కలవారగుదురు గాక! ధనము లేనివారు ధనవంతు లగుదురు గాక! అందరును రోగరహితు లగుదురు గాక!

మంగళమ్

1) మంగళమ్ కోసలేంద్రాయ మహనీయ గుణాత్మనే।
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళమ్॥

2) నీలాచల నివాసాయ నిత్యాయ పరమాత్మనే।
సుభద్రా ప్రాణనాథాయ జగన్నాథాయ మంగళమ్॥

4) కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనా వా ప్రకృతేః స్వభావాత్
కరోమి యద్యత్ సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి॥

తాత్పర్యము :- శరీరము చేత, మాటచేత, మనస్సుచేత, ఇంద్రియముల చేత, బుద్ధి చేత, ఆత్మ చేత, ప్రకృతి సిద్ధమైన స్వభావము చేత ఏ యే పనులను నేను చేయుచున్నానో వాని ఫలము నంతటిని పరుడగు నారాయణునకే సమర్పించుచున్నాను.

ఇతి శ్రీమన్మహాభారతే శతసాహస్రికాయాం సంహితాయాం, వైయాసిక్యాం, మానుశాసనికే పర్వణి, మోక్షధర్మే భీష్మ యుధిష్ఠిర సంవాదే, శ్రీ విష్ణోర్దివ్య సహస్రనామ స్తోత్రం నామైకోనపంచా శదధిక శతతమోఽధ్యాయః సంపూర్ణమ్.

ఇది శ్రీమన్మహా భారతములోని ఆనుశాసనిక పర్వమునందలి భీష్మయుధిష్ఠిర సంవాదములో 'విష్ణు సహస్రనామ స్తోత్రము' అను నూట నలుబది తొమ్మిదవ [ 149 ] అధ్యాయము సంపూర్ణమైనది. శ్రీ సత్యసంధయతి రాజకృతమైన శ్రీమద్విష్ణు సహస్రనామస్తోత్ర భాష్యమునకు భగవద్భక్తుడగు గోళ్ళమూడి వెంకట శ్రీహరి సుబ్రహ్మణ్య శర్మ వెలయించిన ఆంధ్రానువాదము సర్వము సంపూర్ణమైనది.

హరిః ఓం తత్సత్

శ్రీ కృష్ణార్పణమస్తు.

# శ్రీ విష్ణు సహస్రనామమునకు పూజాకుసుమముల నర్పించిన దాతలు :

విశాఖపట్టణం : శ్రీ సత్యసాయి సేవా సమితి—పెదవాల్తేర
శ్రీ వినాయక భక్తమండలి; శ్రీ శ్రీ శ్రీ సువర్ణరేఖా పట్టమహాదే
టి. కె. రాధ; చావలి సత్యవతమ్మ; మహాజనం వాసుదేవరావు
డాక్టర్. సి. వి. రమణి; డి. ఆర్. వాసుదేవరావు; మధ్వసంఘమ
రాఘవేంద్ర స్వామి బృందావనము; అట్లూరి సత్యమోహన్.

నరసన్నపేట :— శ్రీ మారుతి భక్తబృందము.

విజయవాడ :— శ్రీమతి కె. మణి; శ్రీ సత్యసాయి సేవాసమితి;
బెజవాడ రామశేషయ్య.

చీపురుపల్లి :— జి. యల్. రావు.

పుట్టపర్తి :— ఎమ్. రామకృష్ణ. B. Com. వైశ్యాబ్యాంకు మేనేజ

చిత్తూరు :— డాక్టర్. ఎమ్. యస్. రామకృష్ణారావు

గుంటూరు :— చేగు కృష్ణమూర్తి.

రాజమండ్రి :— పరిగె నాగుబాయమ్మ, యాతగిరి వెంకట నరసింహారా
నిడమర్తి అన్నపూర్ణమ్మ; కీ. శే. జి. వి. ఎమ్. వి. జి. కృ
మూర్తిగారి జ్ఞాపకార్థం. భార్య జి. విజయ; న్యా
రాఘవరావు, దాట్ల బలరామరాజు; ప్రకాశ్ నగ
కమ్యూనిటీహాలు సభ్యులు.

తాటిపాక :— రామూరు వెంకటనరసింహారావు.

కొవ్వూరు :— దోర్బల ప్రభాకర శర్మ.

కడప :— పుట్టా వెంకటేశం; కృష్ణం సుబ్బరాయశ్రేష్ఠి; వర
టీచర్ ట్రస్టు; డా. సి. విశ్వనాథం; పుట్టా కృష్ణమూ
సి. హెచ్. వెంకటేశ్వరరావు; సాంబశివరావు;

# అకారాది - నామసూచిక

# శ్రీ లక్ష్మీ అష్టోత్తర శతనామ స్తోత్రమ్

## ధ్యానం

వందే పద్మకరాం ప్రసన్నవదనాం సౌభాగ్యదాం భాగ్యదామ్,
హస్తాభ్యా మభయ ప్రదాం మణిగణై ర్నానావిధై ర్భూషితామ్.
భక్తాభీష్టవర ప్రదాం హరిహర బ్రహ్మాదిభి స్సేవితామ్,
పార్శ్వే పఙ్కజ శఙ్ఖపద్మనిధిభి ర్యుక్తాం సదా శక్తిభిః.
సరసిజనయనే సరోజహస్తే ధవళతరాంశుక గంధమాల్యశోభే.
భగవతిః హరివల్లభేః మనోజ్ఞేః త్రిభువన భూతకరి ప్రసీద మహ్యమ్.

ప్రకృతిం వికృతిం విద్యాం సర్వభూత హితప్రదామ్,
శ్రద్ధాం విభూతిం సురభిం నమామి పరమాత్మికామ్. 1

వాచం పద్మాలయాం పద్మాం శుచిం స్వాహాం స్వధాం సుధామ్,
ధన్యాం హిరణ్మయీం లక్ష్మీం నిత్యపుష్టాం విభావరీమ్. 2

అదితిం చ దితిం దీప్తాం వసుధాం వసుధారిణీమ్,
నమామి కమలాం కాంతాం కామాక్షీం క్రోధసంభవామ్. 3

అనుగ్రహపరాం బుద్ధి మనఘాం హరివల్లభామ్,
అశోకా మమృతాం దీప్తాం లోకశోక వినాశినీమ్. 4

నమామి ధర్మనిలయాం కరుణాం లోకమాతరమ్,
పద్మప్రియాం పద్మహస్తాం పద్మాక్షీం పద్మసుందరీమ్. 5

పద్మోద్భవాం పద్మముఖీం పద్మనాభ ప్రియాం రమామ్,
పద్మమాలాధరాం దేవీం పద్మినీం పద్మగంధినీమ్. 6

పుణ్యగంధాం సుప్రసన్నాం ప్రసాదాభిముఖీం ప్రభామ్,
నమామి చంద్రవదనాం చంద్రాం చంద్రసహోదరీమ్. 7

చతుర్భుజాం చంద్రరూపా మిందిరా మిందుశీతలామ్,
ఆహ్లాదజననీం పుష్టిం శివాం శివకరీం సతీమ్. 8

విమలాం విశ్వజననీం తుష్టిం దారిద్ర్యనాశినీమ్,
ప్రీతిపుష్కరిణీం శాంతాం శుక్లమాల్యాంబరాం శ్రియమ్. 9

భాస్కరీం బిల్వనిలయాం వరారోహాం యశస్వినీమ్,
వసుంధరా ముదారాంగాం హరిణీం హేమమాలినీమ్, 10

ధనధాన్యకరీం సిద్ధిం స్త్రైణసౌమ్యాం శుభప్రదామ్,
నృపవేశ్మగతానందాం వరలక్ష్మీం వసుప్రదామ్. 11

శుభాం హిరణ్యప్రాకారాం సముద్రతనయాం జయామ్,
నమామి మంగళాం దేవీం విష్ణువక్షఃస్థలస్థితామ్. 12

విష్ణుపత్నీం ప్రసన్నాక్షీం నారాయణ సమాశ్రితామ్,
దారిద్ర్యధ్వంసినీం దేవీం సర్వోపద్రవవారిణీమ్. 13

నవదుర్గాం మహాకాళీం బ్రహ్మవిష్ణు శివాత్మికామ్,
త్రికాలజ్ఞాన సంపన్నాం నమామి భువనేశ్వరీమ్ 14

లక్ష్మీం క్షీరసముద్రరాజతనయాం శ్రీరంగధామేశ్వరీం
దాసీభూతసమస్త దేవవనితాం లోకైక దీపాఙ్కురామ్
శ్రీమన్మంద కటాక్షలబ్ధవిభవ బ్రహ్మేంద్రగంగాధరాం,
త్వాం త్రైలోక్యకుటుంబినీం సరసిజాం వందే ముకుందప్రియామ్ 15

మాత ర్నమామి కమలే కమలాయతాక్షి !
శ్రీవిష్ణుహృత్కమలవాసిని! విశ్వమాతః
క్షీరోదజే ! కమలకోమలగర్భగౌరి ! లక్ష్మీప్రసీద సతతం నమతాం శరణ్యే, 16
త్రికాల యో జపే ద్విద్వాన్ షణ్మాసం విజితేంద్రియః,
దారిద్ర్యధ్వంసనం కృత్వా సర్వ మాప్నో త్యయత్నతః 17

దేవీనామసహస్రేషు పుణ్య మష్టోత్తరంశతమ్
యేన శ్రియ మవాప్నోతి కోటిజన్మదరిద్రతః. 18

భృగువారే శతం ధీమాన్ పఠే ద్వత్సరమాత్రకం
అష్టైశ్వర్య మావాప్నోతి కుబేర ఇవ భూతలే. 19

దారిద్ర్యమోచనం నామస్తోత్ర మంబా పరం శతమ్
యేన శ్రియ మవాప్నోతి కోటిజన్మదరిద్రతః. 20

భుక్త్వాతు విపులా న్భోగా నస్యా స్సాయుజ్య మాప్నుయాత్,
ప్రాతః కాలే పఠేన్నిత్యం సర్వదుఃఖోపశాంతయే. 21

పఠంస్తు చింతయేద్దేవీం సర్వాభరణ భూషితాం.

శ్రీ లక్ష్మ్యష్టోత్తర శతనామస్తోత్రమ్ సమాప్తమ్.

# సవరణ పట్టిక

| పుట | నామము | పంక్తి | తప్పు | సవరణము |
|---|---|---|---|---|
| i | | 18 | ప్రణాళిక | ప్రణాళక |
| ii | | 11 | ప్రార్థింప | ప్రార్థింఫ |
| iv | | 11 | నైవత్ | నైవతత్ |
| iv | | 22 | ఉచ్చతే | ఉచ్యతే |
| v | | 15 | కతా | కలౌ |
| v | | 15 | నాస్త్వేవ | నాస్త్యేవ |
| viii | | 12 | ఆరున్నవి | ఆరున్నవి |
| viii | | 22 | ఫీష్ముడు | భీష్ముడు |
| ix | | 20 | ధరజ్ఞుడు | ధర్మజ్ఞుడు |
| xii | | 14 | లోకనాధం | లోకనాథం |
| xiii | | 3 | ఫలితములు | ఫలితములను |
| xiii | | 18 | మోక్షము | మోక్షము అను |
| xiv | | 7 | భయములు | భయములను |
| xiv | | 21 | మేధా | మేధాః |
| xiv | | 21 | ఋతిః | ఋతుః |
| xv | | 11 | పరమేష్టి | పరమేష్ఠి |
| xv | | 12 | అనంతకః | అనంతః |
| xv | | 4 | విష్లు | విష్ణు |
| xv | | 22 | పర్థమానః | వర్ధమానః |
| xvii | | 6 | తీర్థులవారు | తీర్థులవారి |
| xix | | 26 | ప్రకియ | ప్రక్రియ |
| xx | | 10 | 1793 | 1783 |
| xxii | | 19 | తాళ్ళతో | తాళములతో |
| xxvi | | 22 | నవ్వుదా | నవ్వుచు |
| xxvii | | 15 | అభ్యదా | అభ్యధా |
| xxviii | | 4 | మతమునే | మతమునకే |
| xxviii | | 18 | నందుతో | నందు (తో పాటు) |

| | | | |
|---|---|---|---|
| xxviii | 20 | శ్రీమన్నాయ | శ్రీమన్నారాయ |
| xxix | 13 | కైం | కై |
| xxx | 3 | శ్రీసత్యసతధ | శ్రీసత్యసంధ |
| xxx | 6 | సంప్రదాచార్య | సంప్రదాయాచార్య |
| xxx | 13 | శీమధ్వ | శ్రీమధ్వ |
| xxx | 14 | ఎ.వి.ఎన్. | ఏ.వి.యన్. |
| xxxi | 18 | ప్రతీ | ప్రతి |
| xxxii | 14 | అప్పల | అప్పల్ల |
| xxxiii | 23 | రావుగారును | రావుగారు |
| xxxvi | 2 | భగవద్గీకిని | భగవద్గీతకును |
| xxxvi | 21 | యుధిషిరుని | యుధిష్ఠిరుని |
| xxxvi | 25 | ముక్షువులకు | ముముక్షువులకు |
| xxxvii | 6 | పరీవాహనకే | పరీవాహమునకే |
| xl | 5 | షఖ్యం | ప్రఖ్యం |
| xl | 5 | విగ్రహం | విగ్రహమ్ |
| xl | 10 | ప్రశసిని | ప్రశస్తిని |
| xl | 17 | సహస్రకం | సహస్రకమ్ |
| xli | 23 | సత్యభోధ | సత్యబోధ |
| xlii | 11 | వక్ష్యమితాన్యతః | వక్ష్య మితాన్యతః |
| xliii | 9 | విశ్వామిత్రులు | విశ్వామిత్రుడు |
| xliv | 8 | విశ్వామిత్రునితో | విశ్వామిత్రునకు |
| xlv | 9 | 3600 | 36000 |
| xlv | 10 | 3600 | 36000 |
| xlv | 12 | 3600 | 36000 |
| xlv | 12 | 3600 | 36000 |
| xlv | 27 | బ్రహతీ | బృహతీ |
| xlvi | 3 | రూపాణ్యేనం | రూపాణ్యేవం |
| xlvi | 3 | రమాసతేః | రమాపతేః |
| xlvi | 15 | ప్రప్రమాణము | ప్రమాణము |
| xlvii | 13 | ఒదగూర్చ | ఒనగూర్చ |
| xlviii | 5 | శుభానంస | శుభాశంస |

| | | | |
|---|---|---|---|
| xlviii | 16 | మద్వ | మధ్వ |
| xlviii | 18 | మద్వాచార్యుల | మధ్వాచార్యుల |
| xlviii | 22 | విస్తుత | విస్తృత |
| xlix | 3 | గాఢా | గాథా |
| xlix | 9 | గాఢ | గాథ |
| xlix | 10 | స్కందము | స్కంధము |
| 1 | 3 | మహా | మాహా |
| 4 | 6 | అపోన్న | ఆపోన్న |
| 7 | 14 | అపోహిష్ఠామ | ఆపోహిష్ఠామ |
| 14 | 2 | ప్రోక్ష్నన్ | ప్రోక్షన్ |
| 16 | 2 | సన్నమింధతే | సన్నమింథతే |
| 16 | 21 | శ్రీగురుపేనమః | శ్రీగురవేనమః |
| 17 | 15 | వ్రసన్న | ప్రసన్న |
| 18 | 8 | ఓన్నమో | ఓం నమో |
| 18 | 13 | నామ్నాం | నామ్నాం |
| 22 | 5 | శ్రేష్ఠ | శ్రేష్ఠః |
| 23 | 5 | సువర్ణో | సుపర్ణో |
| 23 | 19 | వృషాహిః | వృషాహీ |
| 24 | 12 | వద్మ | పద్మ |
| 24 | 14 | వృద్ధాత్మ | వృద్ధాత్మా |
| 25 | 2 | విశ్రిమో | విశ్రామో |
| 26 | 9 | భేషజో | భేషజం |
| 29 | 23 | భోన్నమ | భ ఓం నమః |
| 29 | 26 | త్వోన్నమ | త్వోం నమ |
| 32 | 4 | ఓన్నమ | ఓం నమ |
| 32 | 8 | ఓన్నమ | ఓం నమ |
| 32 | 15 | ఓన్నమ | ఓం నమ |
| 32 | 20 | ఓన్నమ | ఓం నమ |
| 32 | 22 | యత్రయోగీశ్వరః | యత్రయోగేశ్వరః |
| 33 | 6 | ఘెరేషు | ఘోరేషు |
| 40 | 3 | శక్తి-దేవః | శక్తి-దేవకి |

| | | | | |
|---|---|---|---|---|
| 41 | | 9 | కృతిమ్ | కృతమ్ |
| 46 | 10 | 1 | పూతః | పూతాః |
| 52 | శ్లోకము 4 | 2 | సంభవా | సంభవో |
| 58 | 45 | 1లో 2 | విరి | విః |
| 58 | 46 | 1లో 2 | రుమత్ | రుత్ |
| 58 | 46 | 1లో 3 | ధాతురుత్తముడు ? | ధాతురుత్తముడు |
| 59 | 47 | 3లో 3 | విష్ణులైన | విష్ణువైన |
| 61 | 49 | 4లో 3 | "అభ" | "ఆభా" |
| 63 | 57 | 4లో 1 | అహ్వ్య | ఆహ్వ్యః |
| 70 | 83 | 2లో 2 | అర్ధము | అర్థము |
| 73 | 93 | 2లో 2 | హేయుడు = | = హేయుడు. |
| 75 | 98 | 2లో 2 | వెళ్ళువాడు | భక్తుల వద్దకు వెళ్ళువాడు |
| 81 | 117 | 3లో 2 | "ర" | "రః" |
| 83 | 125 | 2లో 5 | ఇట | × |
| 108 | 217 | 9లో 3 | "యః ?" | యః |
| 117 | 251 | 0లో 4 | తస్యంతాః | తస్యతాః |
| 118 | 258 | 1లో 1 | అర్ధః | అర్థః |
| 119 | శ్లోకము 8 | 2 | శృతిసాగరః | శృతిసాగరః॥ 28, |
| 128 | 296 | 1 | వన | వన్ |
| 129 | 299 | 2లో 2 | అర్ధము | అర్థము |
| 137 | 339 | 3లో 1 | "వాసు" | "వా" |
| 137 | 339 | 3లో 1 | వలన | వలన సు = |
| 145 | శ్లోకము 40 | 2 | నమితాశనం: | నమిశతాశనః |
| 148 | 380 | 6 | అర్ధము | అర్థము |
| 149 | 383 | 2లో 2 | రక్షింమవాడు | × |
| 150 | 389 | 1 | సరూపమును | స్వరూపమును |
| 160 | 423 | 3 | జెయువాడు | జేయువాడు |
| 164 | 437 | 1లో 2 | దీని నుండి | ఇతని నుండి |
| 164 | 438 | 2లో 1 | వి | "వి" |
| 166 | 443 | 3 | ఎవనినుండి | ఎవనికి |
| 166 | 444 | 1లో 2 | లేనివాడు___ | అ = లేనివాడు |

| | | | | |
|---|---|---|---|---|
| 166 | 446 | 4లో1 | భూ | భూః |
| 176 | 474 | 3లో4 | తీసికొనిపోవును | జీవులను తీసికొని పోవును |
| 178 | 485 | 1లో2 | దాతువునుండి | ధాతువునుండి |
| 179 | 488 (A) | | 488 | 488 (A) |
| 179 | 488 (B) | | 488 | 488 (B) |
| 179 | 489 | 1లో1 | అక్షరములయందు | అక్షములయందు |
| 187 | 515 | 4లో5,6 | 4లో5,6 లైన్లు | 5లో3వ లైనుగా |
| 193 | 529 | 3లో3 | ఉదధిశయను | ఉదధిశయు |
| 199 | 548 | 2లో4 | యోగీశ్వరః | యోగేశ్వరః |
| 199 | 548 | 2లో4 | ధనుర్ధరంః | ధనుర్ధరః |
| 199 | 548 | 4లో1 | బ్రహ్మ- | కృత = బ్రహ్మ |
| 199 | 548 | 4లో1 | సిద్ధాంతమును_ | అంత = సిద్ధాంతమును |
| 200 | 551 | 2లో1 | క్షిజ | క్షిజ్ |
| 200 | 552 | 1 | భరణ | ఆభరణ |
| 201 | 554 | 2లో1 | గోవర్థన | గోవర్ధన |
| 201 | 554 | 2లో1 | పర్వతము చేత | పర్వతముతో |
| 201 | 554 | 2లో2 | గోవర్థనధారి | గోవర్ధనధారి |
| 201 | 557 | 2లో1 | సైన్యమునందుగ | సైన్యమునందు "గ" |
| 202 | 557 | 2లో2 | చక్రగ | చక్రగః |
| 203 | 563 | 2 | అర్ధము | అర్థము |
| 208 | 579 | 1 | ధనస్సు | ధనుస్సు |
| 208 | 579 | 2 | శార్జపాణి | శార్ఙ్గపాణి |
| 212 | 594 | 2 | తత్ప్రసాదేన | తత్త్రసాదేన |
| 212 | 594 | 5 | కర్త్ర– | సంన్యాసకృత్ = కర్తృ |
| 212 | 594 | 6 | "శమ" | "శమః" |
| 214 | 598 | | పరాయణం | పరాయణః |
| 217 | 608 | | వృపప్రియః | వృషప్రియః |
| 219 | 617 | | శ్రీమతాంపరః | శ్రీమతాంవరః |
| 219 | 617 | 3లో5 | సర్వస్యచాహం హృదిసన్నివిష్టో | "సర్వస్యచాహం హృదిసన్నివిష్టః" |

| | | | | |
|---|---|---|---|---|
| 225 | 641 (A) | | 641 A | 641 (A) |
| 226 | 642 | 1లో 4 | కట్టుకొనినవాడు | పట్టుకొనినవాడు |
| 231 | 666 | 2లో 2 | "అమృతే" | "అమృతే" |
| 237 | 684 | 3 | శ్చాఖిలై | శ్చాఖిలైః |
| 237 | 685 | 2లో 1 | (మహా | (మహా) |
| 239 | 695 | 3 | తీరుల | తీర్థుల |
| 244 | 715 | 1లో 1 | పరాయణః | పరాయణః |
| 245 | శ్లోకము 76 | 2 | దుర్ధరోఽథాఽ పరాజితః | దుర్ధరోఽథాఽ పరాజితః |
| 250 | 739 | 2లో 1 | "వా" | "వ" |
| 256 | 768 | 2లో 1 | 7 | 2 |
| 258 | 773 | 2లో 5 | గీత | (గీత-4- 4) |
| 261 | 781 | 3 | గీతోక్తి | గీతోక్తి (7- 6) |
| 261 | 782 | 4 | పురుషార్థనమునందు | పురుషార్థసాధనము నందు |
| 264 | 792 | 5 | కూరాన్ | కౄరాన్ |
| 264 | 792 | 6 | క్షిపామన | క్షిపామ్య |
| 265 | 797 | | తంతు వర్ధనః | తంతువర్ధనః |
| 265 | 797 | 1 | వర్థనః | వర్ధనః |
| 265 | 797 | 2 | వర్థన | వర్ధన |
| 267 | 799 | 2లో 6 | "మహాత్" | "మహత్" |
| 269 | 810 | | 8 0 | 810 |
| 269 | 812 | 3 | తెలుసుకున్నవాడు | తెలిసికొన్నవాడు |
| 269 | 813 | 2లో 3 | భిందుః | బిందు |
| 270 | 817 | 1 | పృధివ్యప్ | పృథివ్యప్ |
| 272 | 824 | 1 | అన + లః | అని + లః |
| 274 | 833 | 2లో 4 | సార్థము | సార్థకము |
| 274 | 834 | 3 | "ర" | "రః" |
| 275 | 834(B) | లో 4 | ధాశ్వత్థం | ధాశ్వత్థం |
| 276 | 836 | 3 | గీతావాక్యము | గీతావాక్యము ( -34) |
| 281 | 854 | 1 | ధాం | ధార |

| | | | | |
|---|---|---|---|---|
| 283 | 864 | 1 | ధనస్సును | ధనుస్సును |
| 283 | 865 | 1 | దనస్సును | ధనుస్సును |
| 284 | 871 | 1 | ఱ | ని |
| 288 | 887 | 2లో 4 | యదాధితన | యదాదిత్య |
| 293 | 901 | 2లో 3 | సుఖిం | సుఖం |
| 299 | | | శ్రి విష్ణు సహాస్రి నామ స్తోత్రమ్ | శ్రి విష్ణు సహాస్రి నామ స్తోత్రిమ్ |
| 299 | 929 | | దుస్వప్ననాశనః | దుస్స్వప్ననాశనః |
| 308 | 965 | 3లో 1 | 11 | 1) |
| 312 | 977 (A) | | 977 | 977 (A) |
| 312 | 977 (B) | | 977 | 977 (B) |
| 313 | 982 | 2 | పిష్ణు | విష్ణు |
| 316 | 989 | | దేవకీనందన | దేవకీనందనః |
| 317 | 993 | 4 | పాంచజన్యము | ) పాంచజన్యము |
| 318 | 1001 | 7 | చేతరాన్ | చేతరాన్ |
| 318 | 1001 | 11 | స్రఒధాహమ్ | స్రధాఒహమ్ |
| 321 | | 6 | భాప్యము | భాష్యము |
| 322 | 4 శ్లో॥ | 1 | చార్థ | చార్ద |
| 328 | 25 శ్లో॥ | 2 | సర | సర్వ |
| 336 | క్షమిణాం వరః | 4 | క్షమీణాంవరః | క్షమిణాంవరః |
| 336 | గహనః | 20 | గవానః | గహనః |
| 338 | దారుణః | 26 | దారుణ | దారుణః |
| 344 | వినయః | 29 | వినయః | వినయః |
| 345 | విరజః | 6 | విరడః | విరజః |
| 346 | శత్రుఘ్నః | 21 | శతఘ్నః | శత్రుఘ్నః |
| 346 | శత్రుతాపనః | 23 | శతు్రితాపనః | శత్రుతాపనః |
| 347 | సంక్షేప్తా | 1 | సంకేప్తా | సంక్షేప్తా |
| 347 | శూరజనేశ్వరః | | శూర, జనేశ్వరః | శూరజనేశ్వరః |
| 347 | శోకనాశనః | 5 | శోక, నాశనః | శోకనాశనః |
| 347 | సత్పథాచారః | 10 | సత్పధాచారః | సత్పథాచారః |

| | | | | |
|---|---|---|---|---|
| 347 | సత్యధర్మపరాక్రమ | 17 | సత్యధర్మ, పరాక్రమః | సత్యధర్మపరాక్రమః |
| 347 | సత్యధర్మపరాయణః | 18 | సత్యధర్మ పరాయణః | సత్యధర్మపరాయణ ః |
| 347 | శ్రీవత్సవక్షః | 21 | శ్రీవత్స, వక్షః | శ్రీవత్సవక్షః |
| 347 | సంకర్షణః | 28 | సంకర్షణం | సంకర్షణః |
| 347 | సంకర్షణోఽచ్యుతః | 29 | సంకర్షణోఽ అచ్యుతః | సంకర్షణోఽచ్యుతః |
| 348 | సర్వయోగ వినిః సృతః | 3 | సర్వయోగ, వినిః సృతః | సర్వయోగ వినిఃసృతః |
| 348 | సర్వలక్షణ లక్షణ్యః | 4 | సర్వలక్షణ, లక్షణ్యః- | సర్వలక్షణ లక్షణ్యః |
| 348 | సహస్రమూర్ధా | 20 | సహస్రమూర్ధా | సహస్రమూర్ధా |
| 349 | సామ గాయనః | 2 | సామ, గాయనః | సామగాయనః |
| 349 | సిద్ధ సంకల్పః | 5 | సిద్ధ, సంకల్పః | సిద్ధ సంకల్పః |
| 349 | సిద్ధి సాధనః | 9 | సిద్ధి, సాధనః | సిద్ధిసాధనః |



# సంపుటీకరణ మంత్రములు

శ్రీ విష్ణు సహస్రనామమును భక్తితో, నిష్ఠతో పారాయణము చేసిన వారికి ఇహపరలోక సౌఖ్యములన్నియు కరతలామలకములగునని భీష్ముడు యుధిష్ఠిరునకు చెప్పెను. ఆ ఫలము లన్నియు ఉత్తర పీఠికలో విస్తరముగా వివరింపబడినవి.

శ్రీ విష్ణు సహస్రనామమునందలి ప్రతి నామమును ఏదో ఒక ఫలము నిచ్చు శక్తిమంతమైన మహామంత్రమే అని పెద్దలందురు. భగవద్గీతతో సమాన ప్రతిపత్తి ఉండుట వలనను, భాగవత శేఖరుడగు భీష్ముడు తన కభిమత తమమైన దనుట వలనను, మహా భారత సారము కనుకను, వివిధ మహర్షులు తమతమ తపస్సమాధిలో దర్శించిన రూపముల ననుభవించి నిరంతరము గానము చేసినందు వలనను, వేదా చార్యులైన వ్యాస మహర్షి స్తోత్రరూపమున రూపొందించినందు వలనను, ఎందరో మహానుభావులు దీనిని పవిత్ర తరముగా భావించి, జపించి, తరించినందు వలనను, ఇహపర సాధక మగుట వలనను ఈ శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రము "మహామంత్ర రాజ" మైనది. అందువలననే :-

"ధర్మార్థీ ప్రాప్నుయాద్ధర్మ మర్థార్థీ చార్థ మాప్నుయాత్ ।
కామా నవాప్నుయాత్ ప్రజార్థీ ప్రాప్నుయాత్ ప్రజామ్
రోగార్తో ముచ్యతే రోగాత్ బద్ధో ముచ్యేత బంధనాత్ ।
భయాన్ముచ్యేత భీతస్తు ముచ్యేతాపన్న ఆపదః ॥"

(ఉత్తర పీఠిక-4, 8)

అను శ్లోకములు ఈ స్తోత్రము వలన మానవులకు కలుగు ప్రయోజనములు వివరింపబడినవి. నిష్కామ బుద్ధితో ఈ స్తోత్రమును పఠించిన వారికి కీర్తి ప్రతిష్ఠలును, ఆయురారోగ్యములును, భోగభాగ్యములును, తేజో ధైర్యములును కలుగును. సకాలములకు సర్వమనోరథములును ఈడేరును. ఈ నామములకు ఇట్టి శక్తి వచ్చుటకు కారణము దానిలో శక్తిమంతములైన దేవతా బీజాక్షరములు పొందు పరుపబడి ఉండుటయే అని అభిజ్ఞులందురు. ఇట్టి మహిమోపేతమైన స్తోత్రమగుట వలననే దీనికి శ్రీమచ్ఛంకర రామానుజులు విపులమైన వ్యాఖ్యను రచించిరి. మధ్వా చార్యులు కూడ వ్యాఖ్యానింపదొడంగిరి.

"దశా భుక్తి ఫలచంద్రిక" అను జ్యోతిష గ్రంథము మానవునకు వచ్చు దేహపీడ, గ్రహబాధ, జ్వరాది దోషనివృత్తికై శ్రీ విష్ణు సహస్రనామ జపమును చేయవలెనని పేర్కొన్నది. భయంకర వ్యాధులకు కూడ ఈ విష్ణునామములే భేషజములట। ఈ నామముల జపము ద్వారానే కార్యసిద్ధియును, మనశ్శాంతియును కలుగు ననుట నిశ్చయము. పైన పేర్కొన్న ఫలము నిచ్చునట్టి కొన్ని నామములు మంత్రరూపముగా ప్రకటింపబడినవి. ఆనామములకు ముందుగా "ఓం" ను చేర్చి దానిని చతుర్థీ విభక్తి రూపముతో బాటు చివరకు నమః అని చేర్చి పఠించినచో అది మంత్రమగును. ఉదాహరణము :-

"ఓం రామాయ నమః; ఓం నారాయణాయ నమః". ఇట్టి మంత్రములను విష్ణు సహస్రనామము నందలి 108 శ్లోకములలో ప్రతి శ్లోకమునకును ముందును, తరువాతను కలిపి చదివినచో సంపుటీకరణమగును. అట్టి సంపుటీకరణ మంత్రములలో కొన్ని ఈ క్రింద పేర్కొనబడినవి.

## ధర్మ బుద్ధి కొరకు మంత్రములు

1) అమృతవపుః
2) ఆదిదేవః
3) నారాయణః
4) పుణ్యశ్రవణ కీర్తనః

## ధనము కొరకు మంత్రములు

1) శ్రీదః
2) వసుదః
3) వసుప్రదః
4) ద్రవిణప్రదః

ధనము నందుటకే కొందరు పెద్దలు ఈ మొత్తము శ్లోకమును సంపుటీకరణ మంత్రముగా గ్రహించిరి.

శ్లో॥ శ్రీవత్స వక్షాః శ్రీవాసః శ్రీపతిః శ్రీమతాం వరః ।
శ్రీదః శ్రీశః శ్రీనివాసః శ్రీనిధిః శ్రీవిభావనః ।
శ్రీధరః శ్రీకరః శ్రేయః శ్రీమాన్ లోకత్రయాశ్రయః ॥

శ్లో॥ అర్థోనర్థో మహాకోశో మహాభోగో మహాధనః ॥ అను శ్లోకపాదముతో నలభై రోజులపాటు పారాయణము చేసినచో ఋణ విముక్తి, ధన సుఖప్రాప్తి కలుగును.

## కోర్కెలు నెరవేరు కొరకు మంత్రములు

1) కామప్రదః
2) వాసుదేవః
3) సర్వకామదః

## సంతానము కొరకు మంత్రములు

1) ప్రాగ్వంశః
2) వంశవర్ధనః
3) దేవకీనందనః

కొందరు "అణుర్బృహత్ కృశః స్థూలో ప్రాగ్వంశో వంశవర్ధనః" అను శ్లోకపాదమును సంపుటీకరణ మంత్రముగా గ్రహింతురు.

## శత్రు జయము కొరకు మంత్రములు

1) గదాధరః
2) జితామిత్రః
3) అపరాజితః
4) భీమ పరాక్రమః
5) సర్వప్రహరణాయుధః

## భయనివృత్తి కొరకు మంత్రములు

1) భయనాశనః
2) అమృతవపుః
3) జన్మ మృత్యు జరాతిగః

## రోగనివారణ కొరకు మంత్రములు

1) ఔషధం
2) భేషజం
3) భిషక్

ACC NO. 120
294.592
SAT

## దుఃఖనివృత్తికి మంత్రములు

84-50-00

1) శోకనాశనః
2) అశోకః

## విద్యాప్రాప్తి కొరకు మంత్రములు

1) సుమేధాః
2) వాగ్మీ
3) సర్వవాగీశ్వరేశ్వరః

ఈ విధముగా మానవుల కోర్కెలను సఫల మొనర్చుటకు ఈ స్తోత్ర రాజము నందు ఎన్నియో సంపుటీకరణ మంత్రములు నిక్షిప్తము చేయబడినవి. ఆ విధిని గ్రహించి మానవులు తమ జన్మను సఫలము చేసికొందురు గాక!

ఇతి శమ్